# బాల వ్యాకరణం

## ఎం.ఏ. - తెలుగు, మొదటి సంవత్సరం
## సెమిస్టర్ – 1, పేపరు 4


**రచయితలు**

**డా॥ అంబడిపూడి నాగభూషణం,** ఎం.ఏ., పి.హెచ్.డి.
రీడర్
డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాల
గుంటూరు

**ఆచార్య నేతి అనంతరామ శాస్త్రి,** ఎం.ఏ., పి.హెచ్.డి.
విశ్రాంత ఆచార్యులు
ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం
గుంటూరు

**డా॥ పుల్లాభట్ల వెఙకటేశ్వర్లు,** ఎం.ఏ., పి.హెచ్.డి.
రీడర్
డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాల
గుంటూరు

**సంపాదకులు**

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం,** ఎం.ఏ., పి.హెచ్.డి.
తెలుగు శాఖ
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్

**సమన్వయకర్త :**

**డా॥ ఇరపని మాధవి,** యం.ఏ., యం.ఫిల్., పిహెచ్.డి.
తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

**డైరెక్టర్ :**

**డా॥ బి. నాగరాజు**
దూరవిద్యా కేంద్రం
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జున నగర్ - 522 510.
Ph : 0863 - 2293299, 2293356 (08645) 211023, 2110204 (Study Material)
Cell : 9848285518
e_mail : info.anucde.ac.in
Website : www.anucde.ac.in (or) www.anucde.info

# ముందుమాట

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం 1976లో స్థాపించినది మొదలు నేటి వరకు ప్రగతిపథంలో పయనిస్తూ వివిధ కోర్సులు, పరిశోధనలు అందిస్తూ 2016 నాటికి NAAC చే A గ్రేడును సంపాదించుకొని దేశంలోనే ఒక ప్రముఖ విశ్వవిద్యాలయంగా గుర్తింపు సాధించుకొన్నదని తెలియజేయటానికి సంతోషిస్తున్నాను. ప్రస్తుతం గుంటూరు, ప్రకాశం జిల్లాలలోని 447 అనుబంధ కళాశాలల విద్యార్థులకు డిప్లమో, డిగ్రీ, పి.జి. స్థాయి విద్యాబోధనను ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం అందిస్తోంది.

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఉన్నత విద్యను అందరికి అందించాలన్న లక్ష్యంతో 2003-04లో దూరవిద్యా కేంద్రాన్ని స్థాపించింది. పూర్తి స్థాయిలో కళాశాలకు వెళ్ళి విద్యనభ్యసించలేని వారికి, వ్యయభరితమైన ఫీజులు చెల్లించలేని వారికి, ఉన్నత విద్య చదవాలన్న కోరిక ఉన్న గృహిణులకు ఈ దూర విద్యా కేంద్రం ఎంతో ఉపయోగపడుతుంది. ఇప్పటికే డిగ్రీ స్థాయిలో బి.ఏ., బి.కాం., బి.ఎస్.సి., మరియు పి.జి. స్థాయిలో ఎం.ఏ., ఎం.కాం., ఎం.ఎస్.సి., ఎం.బి.ఏ., కోర్సులను ప్రారంభించిన విశ్వవిద్యాలయం గత సంవత్సరం కొత్తగా 'జీవన నైపుణ్యాలు' అనే సర్టిఫికేట్ కోర్సును కూడా ప్రారంభించింది.

ఈ దూర విద్యా విధానం ద్వారా విద్యనభ్యసించే విద్యార్థుల కొరకు రూపొందించే పాఠ్యాంశాలు, సులభంగాను, సరళంగాను, విద్యార్థి తనంతట తానుగా అర్థం చేసుకొనేలా ఉండాలనే ఉద్దేశ్యంతో విశేష బోధనానుభవం కలిగి, రచనా వ్యాసంగంలో అనుభవం గల అధ్యాపకులతో పాఠ్యాంశాలను వ్రాయించడం జరిగింది. వీరు ఎంతో నేర్పుతో, నైపుణ్యంతో, నిర్ణీత సమయంలో పాఠ్యాంశాలను తయారు చేశారు. ఈ పాఠ్యాంశాల పై విద్యార్థినీ, విద్యార్థులు, ఉపాధ్యాయులు నిష్ణాతులైన వారు ఇచ్చే సలహాలు, సూచనలు సహృదయంతో స్వీకరించబడతాయి. నిర్మాణాత్మకమైన సూచనలను గ్రహించి మున్ముందు మరింత నిర్దిష్టంగా, అర్థమయ్యే రీతిలో ప్రచురణ చేయగలం. ఈ పాఠ్యాంశాల అవగాహన కోసం, సంశయాల నివృత్తి కోసం వారాంతపు తరగతులు, కాంటాక్టు క్లాసులు ఏర్పాటు చేయటం జరిగింది.

దూరవిద్యా కేంద్రం ద్వారా విజ్ఞాన సముపార్జన చేస్తున్న విద్యార్థులు, ఉన్నత విద్యార్హతలు సంపాదించి జీవనయాత్ర సుగమం చేసుకోవడమే గాక, చక్కటి ఉద్యోగావకాశాలు పొంది, ఉద్యోగాలలో ఉన్నత స్థాయికి చేరాలని, తద్వారా దేశ పురోగతికి దోహదపడాలని కోరుకుంటున్నాను. రాబోయే సంవత్సరాలలో దూర విద్యా కేంద్రం మరిన్ని కొత్త కోర్సులతో దినదినాభివృద్ధి చెంది, ప్రజలందరికి అందుబాటులో ఉండాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ ఆశయ సాధనకు సహకరిస్తున్న, సహకరించిన దూరవిద్యా కేంద్రం డైరెక్టర్లకు, సంపాదకులకు, రచయితలకు, అకడమిక్ కో-ఆర్డినేటర్లకు మరియు అధ్యాపకేతర సిబ్బందికి నా అభినందనలు.

**ప్రొఫెసర్ పి. రాజశేఖర్,** M.A., M.Phil., Ph.D.
కులపతి (FAC)
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

# బాలవ్యాకరణము -1

1. సంజ్ఞా పరిచ్ఛేదం- బాలవ్యాకరణం

2. సంధి పరిచ్ఛేదం- బాల వ్యాకరణం

3. తత్సమ పరిచ్ఛేదం- బాల వ్యాకరణం

అజంత ప్రకరణం-బాల వ్యాకరణం

4. తత్సమ పరిచ్ఛేదం -బాల వ్యాకరణం

హలంత ప్రకరణం – బాల వ్యాకరణం

5. ఆచ్ఛిక పరిచ్ఛేదం- బాల వ్యాకరణం

<u>ఆధార గ్రంథాలు</u>

1.పరవస్తు చిన్నయసూరి-బాల వ్యాకరణం ఘంటాపద వ్యాఖ్య – వంతరాం రామకృష్ణారావు

సుప్రభా వ్యాఖ్య- ఆచార్య పి. నరసింహారెడ్డి

బాలవ్యాకరణ వికాస వ్యాఖ్య- ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

బాల వ్యాకరణ సారస్య సర్వస్వ పేటిక -దూసి రామమూర్తి శాస్త్రి

బాలవ్యాకరణ వ్యాకరణోద్ద్యోతము -వజ్జల చిన్న సీతారామస్వామి శాస్త్రి

2. రమణీయము-దువ్వూరి వేంకట రమణ శాస్త్రి

# విషయ సూచిక

# సూత్రాలు

**1. సంజ్ఞా పరిచ్ఛేదంలోని సూత్రాలు**

1. సంస్కృతమునకు వర్ణము లేబది
2. ప్రాకృతమునకు వర్ణములు నలువది
3. తెనుగునకు వర్ణములు ముప్పదియాఱు.
4. ఋ ౠ ఌ ౡ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ షలు సంస్కృత సమంబులను గూడి తెలుగున వ్యవహరింపబడును.
5. కచటతపలు పరుషంబులని, గజడదబలు సరళంబులని చెప్పంబడును
6. ఇతరములగు హల్లులు స్థిరములు
7. దంత్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు
8. ఇ ఈ ఎ ఏలంగూడిన చజలు తాలవ్యంబులు
9. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లంగూడిన చజలు దంత్యంబులు
10. సంస్కృత సమంబులం దికారాంతములయిన యుపధాచజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యము లగును.
11. నకారంబు ద్రుతంబు
12. ద్రుతాంతము లయిన పదములు ద్రుత ప్రకృతికములు
13. ద్రుత ప్రకృతులుగాని శబ్దంబులు కళలనంబడు
14. హ్రస్వము మీద ఖండ బిందువునకు నిబూర్ణబిందువు వైకల్పికముగ నగును.
15. దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు.
16. సంస్కృత సమేతరములయిన తెలుగు శబ్దముల యందు బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది.
17. యకారంబును వుపూవొవోలును దెలుగు మాటలకు మొదట లేవు.
18. యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబులగు
19. సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు
20. సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు
21. త్రిలింగ దేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు
22. లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు
23. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు

**2. సంధి పరిచ్ఛేదంలోని సూత్రాలు**

1. ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు (సంధి.1)
2. ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికముగానగును (సంధి.2)
3. సంధి లేని చోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యగాడమంబగు (సంధి.3)
4. అత్తునకు సంధి బహుళముగానగు (సంధి.4)
5. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగును (సంధి.5)
6. క్రియా పదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు (సంధి.6)
7. మధ్యమ పురుష క్రియల యందిత్తునకు సంధియగు (సంధి.7)
8. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు (సంధి.8)
9. ఇఁకాదులకుఁ దప్పద్రుత ప్రకృతికములకు సంధిలేదు (సంధి.9)
10. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగనగు (సంధి.10)
11. అంద్వవ గాగమంబులం దప్ప న పదాది స్వరంబు పరంబగు నపుడచ్చునకు సంధియగు (సంధి.11)

**ఆదేశ సంధులకు సంబంధించిన సూత్రాలు:**

1. కుఱు, చిఱు, కఱు, నడు, నిడు శబ్దముల ఱ డ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు (సంధి. 12)
2. ప్రథమ మీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు (సంధి. 13)
3. తెనుగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు (సంధి. 14)
4. ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు (సంధి. 15)
5. ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు (సంధి. 16)
6. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు (సంధి. 17)
7. వర్ణయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతంబునకు బూర్ణ బిందువును గానంబడియెడి (సంధి. 19)
8. అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్పనుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు (సంధి. 22)
9. కర్మధారయంబులందు మువర్ణకంబున కుం బుంపులగు (సంధి. 32)
10. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు (సంధి. 40)
11. అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు (సంధి. 42)
12. పద్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణ బిందువులు విభాషనగు (సంధి. 46)

**ఆగమ సంధులకు సంబంధించిన సూత్రాలు:**

1. సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు (సంధి. 3)
2. సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు (సంధి. 25)
3. ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు (సంధి. 33)
4. షష్ఠీ సమాసమునందుకార ఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు (సంధి. 34)
5. ఉదంత స్త్రీ సమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు (సంధి. 35)
6. లుప్త శేషంబున కుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు (సంధి. 35)
7. క్రొత్తశబ్దము నాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు (సంధి. 38)
8. కెంధూళి కెంజడలని ప్రయోగంబులం గానంబడియెడి (సంధి. 38 వివరణ వాక్యం)
9. క్రీగడువు, క్రీగాలు, క్రీదొడ – ఇత్యాదులం గ్రింది శబ్దమునకు లుప్త శేషంబునకు దీర్ఘంబు బహుళ గ్రహణము చేతనని యెఱుంగునది (సంధి. 38 కింద వివరణ వాక్యం)
10. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచో గానంబడియెడి (సంధి. 39).

**ద్రుత సంధులకు సంబంధించిన సూత్రాలు:**

1. ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు (సంధి. 16)
2. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు (సంధి. 17)
3. ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషలు విభాషనగు (సంధి. 18)
4. వర్గ యుక్సరళములు పరములగునపుడొకా నొకచో ద్రుతమునకు బూర్ణ బిందువును గానంబడియెడి (సంధి. 19)
5. అవసానంబు నందు ద్రుత స్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు (సంధి. 20)
6. కొన్నియెడల ద్రుతంబు మీఁద నకారంబు గానంబడియెడి (సంధి. 21)

7. అుట యుక చుదు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు (సంధి. 22)
8. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబులేదు (సంధి. 23)
9. సమాసంబున యందు ద్రుతంబునకు లోపంబగు (సంధి. 24)
10. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు (సంధి. 26)
11. తలుబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు (సంధి. 27)

**ప్రాతాది సంధి సూత్రాలు:**

1. సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు (సంధి. 36)
2. లుప్త శేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు (సంధి. 37)
3. క్రొత్త శబ్దము నాద్యక్షర శేషంబునకు గొన్ని యెడల లోపనుగాగమంబులుం గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు (సంధి. 38)
4. కెంధూళి, కెంజడలని ప్రయోగంబులం గానంబడియెడి (సంధి. 38 – వివరణ)
5. బహుళ గ్రహణము చేత కొత్త కుండ లిత్యాదుల లోపంబు లేదు (సంధి. 38 – వివరణ)
6. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొక చోఁగానంబడియెడి (సంధి. 39)

**ఆమ్రేడిత సంధి సూత్రాలు:**

1. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగనగు (సంధి. 10)
2. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులు దొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు (సంధి. 40)
3. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు (సంధి. 41)
4. ఇంచుక నాఁడిత్యాదులందు బహుళ గ్రహణముచే నంతిమాక్షరలోపంబునగు (సంధి. 41 వివరణ)
5. అందుదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు (సంధి. 42)
6. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముదుజ్జులకు లోపంబు విభాషనగు (సంధి. 49).

**అలుక్సమాస సంధికి సంబంధించిన సూత్రం:**

1. చేత, తోడ, వలన ల కిత్వంబు సమాసంబులందగు (సంధి. 43)

**పరాచ్చులోప సంధికి సంబంధించిన సూత్రం:**

1. అది, యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు (సంధి. 45)

**పద్వాదుల సంధికి సంబంధించిన సూత్రం:**

1. పద్వాదుల పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణ బిందువులు విభాషనగు (సంధి. 46)

**మధ్యమ పురుష సంధికి సంబంధించిన సూత్రాలు:**

1. మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు (సంధి. 47)
2. వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు (సంధి. 48)
3. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముదుజ్జులకు లోపంబు విభాషనగు (సంధి. 49)

**అనుకరణ సంధులకు సంబంధించిన సూత్రాలు:**

1. విసర్గంబున కనుకరణంబున లోపంబగు (సంధి. 50)
2. అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వంబు విభాషనగు (సంధి. 51)

3. ఈ కార్యము లూతితో సహితము గానంబడియెడి (సంధి. 51–వివరణ)
4. అనుకరణంబు నందుది హల్లునకు ద్విర్వచనంబగు (సంధి. 52)
5. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు (సంధి. 53)
6. ఉదంత నామంబున కనుకరణంబు నందు వుగాగమంబగు (సంధి. 54)
7. అనుకృతిని నిడుదకుం గుఱుచ యగునని యొకండు వలికెనది నిరాకరంబు (సంధి. 54 కింది వివరణ)

**3. తత్సమ పరిచ్ఛేదానికి సంబంధించిన సూత్రాలు**

1. డు, ము, వు, లు : ప్రథమ
2. సువర్ణంబు : ద్వితీయ
3. చేత, తోడ : తృతీయ
4. కొఱకు – కయి : చతుర్థి
5. వలన, కంటె, పట్టి : పంచమి
6. కు, యొక్క, లోపల : షష్ఠి
7. అందు, న : సప్తమి
8. తృతీయాదులకు నుగాగమంబగు
9. కయి, పట్టి, యొక్కలకు నుగాగమంబు లేదు.
10. చేత, తోడ, లోపల వర్ణంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు.
11. డు,మువు, న లేక వచనంబులు
12. లు వర్ణంబు బహువచనంబు
13. తక్కినవి యుభయంబులు
14. ఓ యామంత్రణంబు నందగు
15. ఓ శబ్దంబునకుం బురుష, నీచ స్త్రీ పురుషా మంత్రణంబులందు యి, సి, రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు
16. ఓరి యోసి మైత్రియందుం గలవు.
17. స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు.
18. క్లీ బంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబులగు
19. ఔత్తు బిందు పూర్వంబగు
20. దుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతం బనంబడు.
21. పుం లింగంబయి మహద్వాచ కంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబుగు
22. పుంలింగమగు మహద్వాచకమునకు డుఙగు
23. డుమంతంబునకు ద్వితీయాద్యేక వచనంబు పరంబగునపుడు నిగాగమంబువిభాషనగు
24. అనుదంతమగు తెనుగు డుమంతమునకు నిగాగమము నిత్యముగానగును.
25. అనుదంతమగు తెనుగు డుమంతమునకు నిగాగమము నిత్యముగానగును.
26. ఇకారంబు మీది కునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు
27. ఈ ధాతు యుష్మర్థంబుల మీది వాని యుత్వంబున కిత్వంబు రాదు
28. కు వర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు
29. ఉకార ఋకారంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు.
30. ఆగమ ము వు వర్ణంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు విభాషనగు.
31. బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు

32. సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుదియుకారంబున కకారంబగు.

33. సంబోధనంబునందు బదంబుతుది యకారే కారంబులకు దీర్ఘంబు విభాషనగు.

34. కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధిదుజ్ఞునకు లోపంబు విభాషనగు.

35. ఉదంత సంస్కృతనామంబు సంబుద్ధిదుజ్ఞునకు లోపంబు విభాషనగు.

36. సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు.

37. మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు.

38. అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తు మీది విభక్తి లకారంబునకు రేఫంబగు.

39. అహమన్నపుంసకముల కదంతంబులకు ముపర్ణకంబగు.

40. వానికి ముపర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు.

41. ముపర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకునగు

42. ముపర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందు పూర్వక బుపర్ణంబేని విభాషనగు.

43. లులనలు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

44. ఇగ్లౌరా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు.

45. ఇత్తునకు బహువచనంబు పరంబగునపు దుత్వంబగు.

46. వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపుడు త్వంబగు.

47. రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబుగలుగదు.

48. ఉకారాంత గోశబ్దంబుల కంతట వుపర్ణకంబగు.

49. వుపర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా, వుగాగమంబగు

50. ఉకారాంతం బగు మహత్తునకు వుపర్ణకము బహుళముగానగు.

51. కద్రువ నాగమాత.

52. ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు.

53. విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీ వద్భావంబులు విభాషనగు.

54. నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు.

55. ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు.

56. వృద్ధాదుల దుజ్ఞునకు లోపము విభాషనగు.

57. స్త్రీ లింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు.

58. చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగానగు.

59. స్వర్గివాచి దేవ సుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం ప్రయోగింపబడు.

60. సురశబ్దంబు నిత్యంబుగా నసుర శబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు. సంస్కృత సమాసంబున గావు.

61. దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగనగు.

62. పృథ్వీవాచి భూ శబ్దంబునకు భువియగు.

63. నౌ శబ్దంబునకు నావయగు.

64. రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు.

65. ఐ కారం బీ తుల్యంబు

66. కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు.

67. హలంతంబు ప్రథమైక వచనాంత తుల్యంబిందు నామంబగు

68. ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు.

69. దీర్ఘంబుమీది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

70. మతుబాదికంబు ద్వితీయైక వచనాంత  తుల్యంబు నామంబగు.

71. దానియంతిమ మకారంబునకు లోపంబగు.

72. ముదాదులకు ప్రథమైకవచన లోపంబులేదు.

73. ఋత్విగాదుల ద్వితీయైకవచనాంత తుల్యంబులు విభాషనగు.

74. ఒకానొకచో మహత్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు.

75. విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు.

76. మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు  స్త్రీత్వంబగు.

77. ఆత్మేమనిజంతంబులకు నాంతములగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు.

78. మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాబడు.

79. జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు.

80. సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగానగు.

81. మహద్వాచకంబులగు సాంతంబుల కంత లోపం బేని ద్వితీయైక వచనాంత తుల్యత్వం బేనగు.

82. వేధ పురోధ పురోధసుడు.

83. మన్న ప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాషనగు.

84. ద్యు హృచ్ఛబ్దంబులకు దివి హృదియగు.

85. స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబులం గూడి యిందు బ్రవర్తిల్లు.

86. మహతీతరంబులగు స్త్రీ లింగంబుల విశేషణంబులకు గ్లీబత్వంబు విభాషనగు

87. భవచ్ఛత్రాదుల కిందు బ్రయోగంబు లేదు.

**4. ఆచ్ఛిక పరిచ్ఛేదమునకు సంబంధించిన బాలవ్యాకరణ సూత్రాలు:**

1. సంస్కృత సమేతరంబయిన యాభాష యచ్చ యనంబడు
2. ఆచ్ఛిక శబ్దంబులెల్లం దఱచుగా స్త్రీ సమంబులుం గ్లీబసమంబులు నయియుండు.
3. బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు.
4. మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్ఞగు నుత్వంబుగాదు.
5. పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు
6. కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణ బిందుపూర్వక డకారంబునగు.
7. కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వ లఘు రేఫంబులును, లఘు రేఫంబునకు ముందు బిందు పూర్వక డకారం బునగు.
8. ఱే ప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్ఞగు.
9. కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు.
10. చెయువు బహువచనలకారంబున కలఘు రేఫంబు విభాషనగు.
11. ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును, ముందఱి లు వర్ణంబునకు బిందు పూర్వక డకారంబునగు.
12. బహువచనంబు పరంబగునపుడు డ, ల, ట, ర, ల యత్వంబునకు లోపంబు బహుళంబుగానగు.
13. బహువచనము  పరమగునపుడసంయుక్తంబులయి  యుదంతంబులయిన  డ,ల,ర,ల  కలఘులకారంబు బహుళంబుగానగు.
14. బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకారలకారంబుల కలఘులకారంబు నిత్యంబుగనగు.
15. సమాన పదంబు నందు సంయోగంబు పరంబగునప్పుడెల్లచో ఖండ బిందువునకుం బూర్ణంబగు.

16. ఔపవిభక్తికంబుల లివర్ణసలలు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు.
17. ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు.
18. కలన్వాదుల సువర్ణంబు కుజ్జగు: బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు.
19. అట్లు రేనుగోను శబ్దంబుల నువర్ణంబు గుజ్జగు.
20. బహువచనంబు పరంబగునపుడు చేను, పేను, మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు.
21. బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుదియక్షరంబు లోపించు.
22. బహువచనంబు పరంబగునపుడావు ప్రభృతుల తుదియక్షరంబునకు లోపంబు విభాషనగు.
23. ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు
24. అన్ని ప్రభృతులు సర్వనామంబులు.
25. సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు.
26. సర్వనామ క్రియా పదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు.
27. అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు.
28. ఇ, టి, తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.
29. ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పరంబులగునపుడు నామంబులకుంగొన్నింటికిం బ్రాయికంబుగానగు.
30. ఊరు మొదలగు వాని కిత్వంబగు
31. టి వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికింబర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు.
32. హ్రస్వముమీది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు.
33. పదాద్యంబగు హ్రస్వంబు మీది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు.
34. అఱ్ఱు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును, రేఫంబున కొక్కటికి లోపంబునగు.
35. విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుదియక్షరంబు తివర్ణంబగు
36. టి తి వర్ణంబులు పరంబగునపు దుత్వంబున కిత్వంబగు
37. టి వర్ణంబు పరంబగునపుడు క్రిందు, మీదు, ముందు, వువర్ణంబుల కత్వంబగు.
38. ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగానగు.

# మాదిరి ప్రశ్నపత్రం-1

**సమయం: 3 గం॥లు** **మార్కులు: 70**

**అ) ఈ క్రిందివానిలో రెండింటికి సమాధానాలు వ్రాయండి.** **2 x 10 = 20**

1. వ్యాకరణమంటే ఏమిటో తెల్పి వ్యాకరణ అధ్యయన ప్రయోజనాలను వివరించండి.
2. బాలవ్యాకరణ రచనా ప్రణాళికను వివరించండి.
3. చిన్నయసూరి పేర్కొన్న దంత్య తాలవ్య చ జ లను గురించి వివరించండి.
4. అజంత శబ్ద తత్సమీకరణ విధానాన్ని వివరించండి.

**ఆ) ఈ క్రిందివానిలో నాలుగు సూత్రాలను వ్యాఖ్యానించండి** **4 x 5 = 20**

1) దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు
2) లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు
3) ఇఁకాదులకు దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు
4) అన్యంబులసహితమిక్కార్యంబు సహితం గానంబడియెడి
5) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బులింగ తుల్యంబులు
6) దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు
7) కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు
8) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబాగా నగు

**ఇ) ఈ క్రింది వానిలో రెండింటికి సందర్భ సహిత వ్యాఖ్యలను వ్రాయండి.** **2 x 5 = 10**

1) "ఇచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు"
2) "ఉపోత్తమేత్వంబునకనుటంజేసి జిగినిసి ఇత్యాదులం దుత్వంబులేదు"
3) "ఇచ్చట మధ్యమ పురుష యోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు"
4) "కెంధూళి, కెంజెడలని ప్రయోగంబులుగానంబడియెడి"

**ఈ) ఈ క్రింది వానిలో నాల్గింటికి రూపనిష్పత్తులను పేర్కొనండి.** **4 x 2½ = 10**

| | |
|---|---|
| 1) క్రీఁగాలు | 2) తల్లిదండ్రులు |
| 3) రాజునాజ్ఞ | 4) పందిరులు |
| 5) కొడవళ్లు | 6) కెందామర |
| 7) పొదరుటిల్లు | 8) కఱకంఠుఁడు |

**ఎ) ఈ క్రింది పారిభాషిక పదాలలో నాల్గింటిని వివరించండి.** **4 x 2½ = 10**

| | |
|---|---|
| 1) సాంస్కృతిక పరుషము | 2) విధాన సామర్థ్యము |
| 3) మధ్యమపురుష యోగము | 4) నిపాతము, |
| 5) ఉపధ | 6) ఇత్సంజ్ఞ |
| 7) అవ్యయము | 8) ఆకృతిగణము |

# మాదిరి ప్రశ్నపత్రం-2

**సమయం: 3 గంIIలు** **మార్కులు: 70**

**అ) ఈ క్రిందివానిలో రెండింటికి సమాధానాలు వ్రాయండి.** **2 x 10 = 20**

1. బాలవ్యాకరణంపై సంస్కృత వ్యాకరణాల ప్రభావాన్ని నిరూపించండి.
2. చిన్నయసూరి పేర్కొన్న యరలవల లఘుత్వాలఘుత్వాలను వివరించండి.
3. అనుకరణ సంధి కార్యాలను వివరించండి
4. బాలవ్యాకర్త పేర్కొన్న ఆమంత్రణ విధులను పేర్కొనండి.

**ఆ) ఈ క్రిందివానిలో నాలుగు సూత్రాలను వ్యాఖ్యానించండి** **4 x 5 = 20**

1) దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు

2) లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు

3) ఇఁకాదులకు దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు

4) అన్యంబులసహితమిక్కార్యంబు సహితం గానంబడియెడి

5) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బులింగ తుల్యంబులు

6) దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు

7) కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు

8) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబాగా నగు

**ఇ) ఈ క్రింది వానిలో రెండింటికి సందర్భ సహిత వ్యాఖ్యలను వ్రాయండి.** **2 x 5 = 10**

1) "అంతట ననుట స్త్రీలింగ ప్రథమైక వచన లోప బాధనార్థము"

2) 'సర్వత్ర యనుటనగాగమ బాధనార్థము"

3) "ఈ కార్యము లాఁతిచో సహితము గానంబడియెడి"

4) 'నలుగడాదులనీయాగమంబు లేదండ్రు'

**ఈ) ఈ క్రింది వానిలో నాల్గింటికి రూపనిష్పత్తులను పేర్కొనండి.** **4 x 2½ = 10**

1) గోగులు 2) కుట్టుసురు

3) పూచెంగలువలు 4) తలంబ్రాలు

5) ఇయంధేనువనె 6) క్రొత్తావి

7) గజము పడియె 8) నిగ్గుటద్దము

**ఎ) ఈ క్రింది పారిభాషిక పదాలలో నాల్గింటిని వివరించండి.** **4 x 2½ = 10**

1) సాంస్కృతిక పరుషము 2) విధాన సామర్థ్యము

3) మధ్యమపురుష యోగము 4) నిపాతము,

5) ఉపధ 6) ఇత్సంజ్ఞ

7) అవ్యయము 8) ఆకృతిగణము

# యూనిట్ - 1

ఈ పాఠ్యభాగంలో వ్యాకరణాన్ని అధ్యయనం చేయటంవల్ల కలిగే ప్రయోజనాలు – తెలుగు వ్యాకరణదీపపు వెలుగు ఏపాటిది – బాలవ్యాకరణం ఏ ప్రణాళికతో రచించబడింది – బాలవ్యాకరణంపై పాణినీయ వ్యాకరణ ప్రభావం – తెలుగులో ఉన్న వ్యాకరణాల చరిత్ర తెలుసుకుంటాము.

# 1. వ్యాసరూప ప్రశ్నలు

**1. వ్యాకరణమంటే ఏమిటో తెల్పి వ్యాకరణ అధ్యయన ప్రయోజనాలను వివరించండి.**

(ఈ వ్యాసంలో వ్యాకరణ శబ్ద వ్యుత్పత్తిని, వ్యాకరణానికి ఉన్న పర్యాయపదాలను, వ్యాకరణం చదవటం వల్ల కలిగే ప్రయోజనాలను, ప్రాచీన కాలపు వ్యాకర్తలు భావించిన తీరును, తెలుగు వ్యాకరణ అధ్యయనం వలన కలిగే ప్రయోజనాలను తెలుసుకుంటారు)

**1.1 వ్యాకరణ శబ్ద వ్యుత్పత్తి**

వి పూర్వక ఆఙ్ అనే ఉపసర్గతో కూడిన 'కృ' ధాతువుకు కరణార్థంలో 'ల్యుట్' ప్రత్యయం రాగా వ్యాకరణమ్ అనే శబ్దం ఏర్పడుతుంది. వ్యాకరణ శబ్దానికి 'వ్యాక్రియంతే శబ్దాః అనేనేతి వ్యాకరణమ్', 'నహి శబ్దేన కించిత్ వ్యాక్రియతే కేనతర్హి సూత్రేణ' అని పతంజలి మహాభాష్యంలో వ్యాకరణ శబ్ద వ్యుత్పత్తిని చెప్పాడు. 'వ్యాక్రియంతే శబ్దాః అనేన' అంటే ఈ శాస్త్రం చేత శబ్దాలు వ్యాకరించబడుతున్నాయి అని అర్థం. వ్యాకరించడమంటే – వాక్యాలను పదాలుగా, పదాలను శబ్దాలుగా, శబ్దాలను ప్రకృతి ప్రత్యయాలుగా, ప్రకృతి ప్రత్యయాలను వర్ణాలుగా, వర్ణాలను ధ్వనులుగా నిరూపించి చెప్పటం. అన్నభట్టు 'ప్రదీపోద్యోతము'లో 'ప్రకృతి ప్రత్యయాది విభాగేన వ్యుత్పాదనమ్, వ్యాకరణేన సాక్షాత్ క్రియతే' అని చెప్పాడు. అంటే ప్రకృతి ప్రత్యయ విభాగం చేసి, శబ్దాలకు వ్యుత్పత్తులు చెప్పడమే వ్యాకరించటం అని అర్థం.

**1.1.1** వ్యాకరణానికి శబ్దానుశాసనం, శబ్దశాస్త్రం అనే పేర్లున్నాయి. శబ్దాలకు సంబంధించిన శాస్త్రం కాబట్టి శబ్దశాస్త్రమని, కావ్యభాష ఇలా ఉన్నదని పూర్వ గ్రంథాలను ఆధారం చేసుకొని అందులోని లక్ష్యాలకు లక్షణం చెప్పటమే ఉద్దేశంగా సాగిన రచన కాబట్టి వీటికి శబ్దానుశాసనం అనే పేరు కలిగింది.

**1.1.2** వ్యాకరణం అంటే లక్ష్య, లక్షణ పరిజ్ఞానాన్ని కలిగించేది. లక్ష్యాలు భారతాది గ్రంథాల్లో ఉంటాయి. వీటి లక్షణాలు సూత్రాల్లో చెప్పబడతాయి. వాటిని వ్యాఖ్యానించి చెప్పేవి వ్యాఖ్యాన గ్రంథాలు.

**1.2** "నాన్నా! వ్యాకరణం ఎందుకు చదవాలి?" అని ప్రశ్నించిన కొడుకుకు తండ్రి ఇలా సమాధానం చెప్పాడు.

"యద్యపి బహునాధీషే తథాపి పఠ పుత్ర! వ్యాకరణమ్
స్వజనః శ్వజనో మాభూత్ సకలం శకలం సకృత్ శకృత్"

దీని తాత్పర్యమేమంటే స్వజనులను శ్వజనులని, సకలాన్ని శకలమని, సకృత్‌ని శకృత్ అని పలకకుండా ఉండటానికి వ్యాకరణాన్ని నేర్చుకోవాలని చెబుతాడు. అంటే స–శల ఉచ్చారణ భేదం పాటిస్తూ సుష్ఠు ఉచ్చారణ చేయాలని అందుకు వ్యాకరణాధ్యయనం దోహదం చేస్తుందని తండ్రి కొడుకుకు ఉపదేశం చేశాడు.

**1.2.1** రామాయణంలో హనుమంతుడు మారువేషంలో మొట్టమొదట శ్రీరాముని కలిసినపుడు చేసిన సంభాషణనుద్దేశించి శ్రీరాముడు ప్రశంసను గమనిస్తే వ్యాకరణ ప్రయోజనమేమిటో తెలుస్తుంది.

"నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్/ బహు వ్యాహరతానేన న కించిదపశబ్దితమ్"

"అవిస్తరమసందిగ్ధమవిలమ్బితమవ్యథమ్/ ఉరఃస్థం కణ్ఠగం వాక్యం వర్తతే మధ్యమస్వరమ్"

"సంస్కార క్రమ సంపన్నా మద్భుతామవిలమ్బితామ్/ ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్"

"అనయా చిత్రయా వాచా త్రిస్థాన వ్యఞ్జనస్థయా, / కస్య నారాధ్యతే చిత్తముద్య తాసే రరేరపి."

"నిశ్చయంగా ఇతడు వ్యాకరణం మొత్తాన్ని అనేకపర్యాయాలు విని (చదివి) ఉంటాడు. అందుచేతనే ఇన్నిమాటలు

మాట్లాడినా ఒక్క అపశబ్దం కూడ దొర్లలేదు. ఇతని మాటల్లో అనవసరంగా విస్తరించి చెప్పటం లేదు. సందేహానికి తావీయని, వ్యవధి లేని ఉచ్చారణను గమనించు. నాభినుండి పెల్లుబికి వచ్చే వాక్కు బిగ్గరగా గాని నెమ్మదిగా గాని కాక మధ్యమ స్వరంలో ఉంది. ఇతడు ఉచ్చరించిన మంగళప్రదమైన వాక్కు, వ్యాకరణ సంస్కార సంపన్నమై, క్రమం తప్పక ఆశ్చర్యకరంగా ఉంది. ఉచ్చారణలో తొందరపాటులేదు. మనోహరంగా ఉంది. వర్ణాలను ఉచ్చరించే వక్షస్థలం, కంఠం, శిరస్సు అనే మూడు స్థానాలలో చక్కగా నిలచిన అందమైన ఇటువంటి మాటలకు ఎవరి మనస్సు సంతోషపడదు? కత్తిని ఎత్తిన శత్రువు మనస్సు కూడ మారిపోతుంది.''

ఈ ప్రశంసను గమనిస్తే వాక్ సంస్కారాన్ని ఇచ్చేది వ్యాకరణమేనని తెలుస్తుంది.

**1.2.2** ప్రతి శాస్త్రానికి ఒక ప్రయోజనం ఉంటుంది. ప్రయోజనం లేకుండా ఏ మానవుడు ఏ పని చేయడు. భాషను బోధించే వ్యాకరణశాస్త్రం చదవటం వలన కలిగే ప్రయోజనాలేమిటో చూద్దాం. మహాభాష్యకారుడైన పతంజలి వ్యాకరణ ప్రయోజనాన్ని గురించి చెబుతూ – ''రక్షోహాగమలఘ్వసన్దేహాః ప్రయోజనమ్'' అని చెప్పాడు. వీటిలో 1) రక్ష, 2) ఊహ, 3) ఆగమం, 4) లఘువు, 5) అసందేహం అనే అయిదు ప్రయోజనాల్ని చెప్పాడు.

**1.2.2.1 రక్ష:** వ్యాకరణాన్ని అధ్యయనం చేయటం వలన పదాలకు జరిగే వర్ణ లోపాగమాది వికారాలను తెలిసికోవటం వలన ఉచ్చారణ దక్షుడు అవుతాడు. అర్థానికి భంగంలేకుండా పఠించి ఉద్దిష్టార్థాన్ని పొందుతాడు.

''ఇంద్ర శత్రుర్వర్ధస్వ'' అనే మంత్రాన్ని అంత్యోదాత్తానికి బదులు ఆద్యుదాత్తంగా ఉచ్చరించడం వలన అర్థభేదం కలిగి ఇంద్రుడే వజ్రతుల్యుడై వృత్రాసురుణ్ణి వధించాడు.

**1.2.2.2 ఊహ:** ఒక విభక్త్యంతమైన నామవాచకానికి బదులు మరో విభక్త్యంతమైన నామవాచకాన్ని కల్పించుకోవటాన్ని 'ఊహ' – అంటారు. 'అగ్నయేత్వాజుష్టం నిర్వపామి' – అనే వేదమంత్రంలోని 'అగ్నయే' – అని చతుర్థ్యేకవచనాంతంగా ప్రయోగించబడ్డ శబ్దం మాదిరిగా సూర్యదేవతాకమైనప్పుడు, 'సూర్యాయత్వాజుష్టం నిర్వపామి' – అని సూర్యశబ్దాన్ని చతుర్థ్యేకవచనాంతంగా మార్చుకొని పఠించాలి. వ్యాకరణం తెలియనివాడు ఈ రూపాన్ని ఊహించి ప్రయోగించలేడు.

**1.2.2.3 ఆగమం:** ఆగమమంటే వైదిక నియమాన్ని అనుసరించటం. వ్యాకరణం వేదాంగాలలో, ఒకటి మాత్రమే కాదు. ముఖ్యమైంది కూడ. కనుక వేదాంగాలతో పాటు వ్యాకరణాన్ని తప్పక అధ్యయనం చేయాలి. అలా విధిగా అధ్యయనం చేస్తూ వైదిక నియమాన్ని అనుసరించటం ఆగమం.

**1.2.2.4 లఘువు:** భాషను అధ్యయనం చేయాలంటే వ్యాకరణాన్ని అధ్యయనం చేయటమే సులభోపాయం. భాషలోని ప్రతి పదాన్ని ఏది సాధుపదమో ఏది కాదో తెలిసికొని నేర్చుకోవాలంటే, ఎంతకాలం పడుతుందో తెలియదు. అదే భాషను గురించి సూత్రబద్ధమైన వ్యాకరణం ద్వారా తప్పొప్పులను తక్కువ సమయంలో తెలిసికోవటం సాధ్యమవుతుంది. వ్యాకరణ నియమాన్ని తెలుసుకుంటే దాని సాయంతో భాషలో ఆ నియమాన్ని అనుసరించే వందల, వేల శబ్దాల స్వరూపాన్ని తెలుసుకోవటం సులభంగా వీలవుతుంది. దీనినే లాఘవమని అంటారు.

**1.2.2.5 అసందేహం:** వేదమంత్రాలు స్వరప్రధానాలు. బహుప్రీహి, తత్పురుష సమాసాలకు స్వరభేదం ఉంది. దానివలన సమాసం యొక్క అర్థమే మారిపోతుంది. కాబట్టి నిస్సందేహమైన భాషాజ్ఞానానికి వ్యాకరణ అధ్యయనం అవసరం.

ఇవే కాకుండా అపశబ్దోచ్చారణ లేకుండటానికి సాధుశబ్ద స్వరూపం తెలిసికోవటానికి వ్యాకరణ అధ్యయనం అత్యంత అవసరం. ఇటువంటి ప్రయోజనాలను వ్యాకరణాధ్యయనం వలన లభిస్తాయని ప్రాచీన వ్యాకర్తలు భావించారు.

**1.3** తెలుగు వ్యాకరణాన్ని చదవటం వలన తెలుగు భాషా సంస్కారం అలవడుతుంది. తెలుగు భాషలో అలీనంగా విలీనంగా ఒదిగిపోయిన సంస్కృత శబ్దాలు, సిద్ధ సమాస లక్షణాలు, తద్ధితాంతాది రూప నిష్పాదనలు మొదలైనవి తెలుసుకోవాలంటే సంస్కృత వ్యాకరణాన్ని చదవాల్సిందే. తెలుగు భాషకున్న పృథక్ లక్షణాల్ని అవగాహన చేసుకొని నిర్దుష్టమైన భాషను రచించాలంటే

తెలుగు వ్యాకరణ సంస్కారం అవసరం. బాలవ్యాకరణం వంటి వ్యాకరణాల్ని చదవటం ఎందుకంటే–

**1.3.1 కావ్యభాషను సమన్వయించుకొని గ్రహించటానికి**

వాడుసనుదెంచె (ప్రథమము మీది గసడదవలు)

వచ్చెంధాత్రీపతి (వచ్చెను + ధాత్రీపతి)

**1.3.2 కళాద్రుతప్రకృతికాలను తెలుగు పదాలలో గుర్తించటానికి**

'ఏలయనగా' – అనాలి కాని 'ఏల' అనే శబ్దంపై ద్రుతాన్ని చేర్చి 'ఏలననగా' – అని అనకూడదు. ఎందుకంటే 'ఏల' శబ్దం కళకాబట్టి. ద్రుతాంతాలకచ్చు పరమైతే యడాగమం చేయకూడదు. కళకు అచ్చు పరమైతే యడాగమం చేయకుండా కూడ ఉండకూడదు.

**1.3.3 తత్సమ తద్భవ దేశ్య పద జ్ఞానాన్ని పొందటానికి**

హరి, అగ్గి (తత్సమం), గోద, తామర (తద్భవం) కోట, పేట, కుండ (దేశ్యాలు)

**1.3.4 యకారాన్ని, వు, వూ, వోలను తెలుగు పదాల మొదట వ్రాయకుండా ఉండటానికి**

ఉదా॥ ఊరు (వూరు)

ఉదకం (వుదకం)

ఎప్పుడు (యెప్పుడు)

**1.3.5 సాధు శకట రేఫల మధ్యగల అర్థభేధాన్ని ల–ళ ల మధ్యగల ఉచ్చారణ భేదాన్ని, అర్థభేదాన్ని గమనించటానికి**

ఉదా॥ నీరు – నీఱు (బూడిద); కల–కళ

**1.3.6 తెలుగు భాషలో బిందువు ఎక్కడ వస్తుందో తెలుసుకోవటానికి**

తెలుగు భాషలో పరుష సరళాలకు ముందే బిందువు వస్తుంది

ఉదా॥ వంకర, కలఁకువ, మంచు, త్రాఁచు, దంట, దాఁటు

**1.3.7 దంత్యోచ్చారణాన్ని తెలిసికోవటానికి**

ఉదా॥ చాప, రోచులు, ధర్మరాజు

**1.3.8 ఔప విభక్తిక అనౌప విభక్తిక పరిజ్ఞానానికి**

ఉదా॥ త్రాటిని, గోటిని, కాలిని, గోరన్

పల్లు – (నిమ్నార్థం) అనౌప విభక్తికం – పంటిని (ఔపవిభక్తిక రూపం)

**1.3.9 పరరూప సంధిని, ఆగమాదేశ సంధులను గురించి తెలిసికోవటానికి**

ఉదా॥ ధీరురాలు, ధీరునాలు

చిగురాకు, చిగురుటాకు

చింతాకు

**1.3.10 విభక్తి రూపాలతో పాటు, ఒక విభక్తికి మారుగా మరో విభక్తి రూపం రావటాన్ని తెలిసికోవటానికి**

ఉదా॥ ఆమె సొమ్ములు దాల్చె (సొమ్ములను)

వాడామడ నడిచె (ఆమడ దూరం)

రామునకు కన్యనిచ్చె (రాముని కొఱకు)

**1.3.11 కృత్తద్ధిత పరిజ్ఞానార్థము**

తెలుగు పదాలలో ఏవి జన్య పదాలో, ఏవి అవిభాజ్య పదాలో గుర్తించాలన్నా, కృత్తద్ధితాలు ఏయే అర్థాల్లో ప్రవర్తిల్లుతాయో తెలుసుకోవాలన్న తెలుగు వ్యాకరణం అవసరమే.

ఉదా॥ తోడేలు వేటకాడు పొలతుక

కుందేలు మాయలాడి ఇల్లలికము

**1.3.12 ధాతుజ విశేషణాల విశేషోపయోగం తెలిసికోవటానికి**

ఉదా॥ రాముడు నివసించిన పర్ణశాల

రాముడు వేసిన బాణము

**1.3.13 కతిపయ బహువచన రూపాల పరిజ్ఞానార్థం కోసం**

ఉదా॥ తేది – తేదీలు

పందిరి – పందిరులు

తొమ్మిదులు – బాలురు.

ఇటువంటి ప్రయోజనాల్ని వ్యాకరణ అధ్యయనం వలన పొందవచ్చు.

**2. తెలుగు వ్యాకరణాల చరిత్రను వివరించండి.**

(ఈ వ్యాసంలో తెలుగులో వచ్చిన వ్యాకరణాలను, వాటి చరిత్రను గురించి తెలుసుకుంటారు, తెలుగులో వచ్చిన మొట్టమొదటి వ్యాకరణాలు, ఇప్పుడు లభ్యంకాని వ్యాకరణాలు వాటి పేర్లను తెలుసుకోవటంతోపాటు పద్యాల రూపంలో రాయబడిన వ్యాకరణాలు, శ్లోక పద్ధతిలో, సూత్ర పద్ధతిలో రచించబడిన వ్యాకరణాల గురించి వాటి విశిష్టతను గురించి తెలుసుకుంటారు)

"ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః
వ్యాకరణమూలత్వాత్ సర్వవిద్యానాం"

– అని కీర్తించబడే వ్యాకరణం వేదాంగాలలో ఒకటిగానే కాకుండా ముఖ్యమైందిగా కూడా భావించారు. "భాషను వ్యాకరించేవాడు, యజ్ఞవిధానాన్ని చర్చించేవాడు – వీళ్లిద్దరూ పుణ్యకర్మలు చేసినవాళ్లు. పవిత్రులలో పవిత్రులు" అని ప్రాచీన భారతీయ సమాజం వైయాకరణుల్ని, మీమాంసకుల్ని గౌరవించింది. యూరప్‌వాసుల గొప్పదనానికి భౌతికశాస్త్రం మూలకందమైనట్లే భారతీయుల గొప్పదనాన్ని ప్రపంచానికి చాటిన వాటిలో వ్యాకరణశాస్త్రం కూడా ఒకటి. పాణిని, పతంజలి, భర్తృహరి వంటి వాళ్లు వేసిన పునాదులతో భారతీయవ్యాకరణ శాస్త్రం వృద్ధిచెందింది. వ్యాకరణానికంటే ముందే శిక్షాప్రాతిశాఖ్యలు ధ్వనివిజ్ఞానాన్ని (Phonology) గురించి వివరించాయి. ప్రాచీనులు 'రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్' – అని చెప్పిన వ్యాకరణ ప్రయోజనాలు క్రమంగా విస్తరించాయి. వాక్ సంస్కారాన్ని కలిగించే దినుసుగా వ్యాకరణం ఖ్యాతికెక్కింది. ఈ ప్రయోజనాలు కూడా ఎప్పుడూ ఒకేరకంగా లేవు.

తెలుగు భాషకు సంబంధించి, పద్య వ్యాకరణాలు, సంస్కృతంలో శ్లోకరూపంలో – సూత్రరూపంలో వెలసిన వ్యాకరణాలు ఇబ్బడిముబ్బడిగా ఉన్నాయి. ఇవికాకుండా ఆంగ్లభాషలో వచ్చిన వ్యాకరణాలు కూడా అధికంగానే కనిపిస్తున్నాయి. భాషాశాస్త్రవేత్తలు ఈ ఆంగ్లభాషా వ్యాకరణాలను తప్ప మిగిలిన వాటినన్నిటినీ సంప్రదాయ వ్యాకరణాలనే పేర్కొన్నారు. అయితే సంప్రదాయమనే పదానికి అర్థం వేరు. 'సంప్రదీయతే అనేన ఇతి సంప్రదాయః' – ఒక తరం నుంచి మరోతరానికి అందిందే సంప్రదాయం. వ్యాకరణానికి సంబంధించి పూర్వులు తమకందించిన విజ్ఞానాన్ని పదిలపరచి, తమ కృషి ఫలితంగా జోడించిన కొత్త విజ్ఞానాన్ని విస్తరింపజేసి తరువాతి తరాలకు అందింపజేయటమే దీని ప్రధాన లక్ష్యంగా భావించాలి.

తెలుగు వ్యాకరణ సంప్రదాయాన్ని ఈ కింది విధంగా విభజించవచ్చు.

1. పద్యవ్యాకరణ సంప్రదాయం

2. సంస్కృతంలో రచించే సంప్రదాయం

అ. శ్లోకపద్ధతి

ఆ. సూత్ర పద్ధతి

3. తెలుగు సూత్రపద్ధతి

తెలుగు భాషకు ప్రాచీనమైన చరిత్ర ఉన్నట్లే తెలుగు వ్యాకరణాలకు కూడా ప్రాచీనమైన చరిత్ర ఉంది. 'ఆంధ్ర శబ్ద చింతామణిని నన్నయ కర్తృత్వంగా భావించి, లభిస్తున్న మొట్టమొదటి వ్యాకరణంగా దానిని భావించారు. అయితే అది నన్నయ కృతం కాదని పదిహేడవ శతాబ్దానికి చెందిన వ్యాకరణ గ్రంథమని సోపపత్తికంగా నిరూపించారు. ఆ తరువాత ఆంధ్రభాషాభూషణాన్ని ప్రప్రథమ వ్యాకరణ గ్రంథంగా భావించారు. అయితే తెలుగు భాషలో 'కాణ్వ వ్యాకరణం', 'బార్హస్పత్య వ్యాకరణం', వంటి పేర్ల ప్రస్తావన ఆయా గ్రంథాలలో కనిపిస్తున్నాయి. 'ఆంధ్రశబ్ద చింతామణి' ప్రస్తావించిన కవిభల్లటాదులవంటి నామ మాత్రావశిష్టులైన వ్యాకర్తల పేర్లు చాలా కనిపిస్తున్నాయి.

### 2.2 తొలి తెలుగు వ్యాకర్తలు – వ్యాకరణాలు

లభిస్తున్న సమాచారాన్ని బట్టి ప్రథమాంధ్ర వ్యాకర్త కణ్వుడని, 'కాణ్వ వ్యాకరణమే' ప్రథమాంధ్ర వ్యాకరణమని పరిశోధకులు తేల్చారు. 'త్రిలింగ శబ్దాను శాసనం', 'ఆంధ్రకౌముది', కాణ్వ వ్యాకరణాన్ని గురించి ప్రస్తావించాయి. కాని ఈ వ్యాకరణ గ్రంథం అలభ్యం.

వాల్మీకి రచించిన 'షడ్భాషా చంద్రిక' మరొక ప్రాచీన గ్రంథంగా కొన్ని లక్షణ గ్రంథాలు పేర్కొంటున్నాయి. మండ లక్ష్మీనరసింహకవి తన ఆంధ్ర కౌముదిలో "పూర్వమేవ ఆంధ్రభాషోత్పత్తిః భగవతా వాల్మీకినా ప్రోక్తా" అని వాల్మీకిని ఆంధ్ర వ్యాకర్తగా ప్రస్తావించాడు. 'బాల సరస్వతీయం', 'ఆంధ్రకౌముది' వంటి ప్రాచీన వ్యాకరణాలు వాల్మీకిని పురాతన వ్యాకర్తగానే పేర్కొంటున్నాయి.

పుష్పదంతుడు రచించిన సాహిత్య కౌముదితోపాటు, ఇతర వ్యాకర్తలు రచించిన హేమచంద్రవ్యాకరణం, రావణీయము, కవిభల్లటపక్కిక, సోమచంద్రవ్యాకరణం, వికృతివ్యాకరణం, వీరభద్రీయం, సర్వలక్షణ శిరోమణి వంటివి కొన్ని నామమాత్రంగా కొన్ని ప్రస్తావనామాత్రంగా కనిపిస్తున్న తెలుగు వ్యాకరణాలు.

### 2.3 పద్యాంధ్ర వ్యాకరణాలు

లభిస్తున్న తెలుగు వ్యాకరణాలలో పద్యాంధ్ర వ్యాకరణాలే మొదటివి. పద్యాలలో వ్యాకరణాన్ని రాయటం బహుశా సంప్రదాయంగా తెలుగు వ్యాకర్తలు ప్రారంభకాలంలో భావించారేమో! కేవలం 13,14 శతాబ్దాలలోనే కాకుండా చింతామణి, బాలసరస్వతీయం వంటి సంస్కృత గ్రంథాలు వెలిశాక కూడా ఈ సంప్రదాయం కొనసాగింది. చింతామణినే పద్యరూపంలోకి అనువాదం చేసిన అప్పకవీయాన్ని ఈ సందర్భంలో గమనించాలి. కూచిమంచి తిమ్మకవి, కస్తూరి రంగకవి, అడిదం సూరకవి వంటివాళ్ల వ్యాకరణాలు ఆ తరువాత వెలసినవే. ఆంధ్ర భాషా భూషణం దగ్గరి నుండి చిన్నయసూరి పద్యాంధ్ర వ్యాకరణం వరకు దాదాపు 16 వ్యాకరణాలు లభిస్తున్నాయి. చిత్రమేమిటంటే సంస్కృతంలో రచించబడిన ఆంధ్ర శబ్ద చింతామణి కూడ ఆర్యావృత్తాలలో రచించబడిందే!

వ్యాకరణమంటే భాషను వ్యాకరి ంచి లక్షణాన్ని సూత్రీకరించి చెప్పటం కదా! స్పష్టంగా, స్ఫుటంగా చెప్పవలసిన వ్యాకరణాన్ని పద్యాలలో చెప్పినప్పుడు కొంత స్పష్టత లోపించే ప్రమాదం లేకపోలేదు. ఛందోనిర్బంధం, యతిప్రాసలనియతి వల్ల కొన్ని పూరణ పదాలు అనవసరంగా చోటు చేసుకోకతప్పదు. "ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" –వంటి లాఘవ సందర్భాలకు ఈ పద్యరూప రచన కొంత ఇబ్బందికరమే. అయినప్పటికీ ఈ వ్యాకర్తలు పద్య రూపంలోనే రాయటానికి కారణం అప్పటి నిఘంటువులు, గణిత జ్యోతిషవేదాంతాది శాస్త్ర గ్రంథాలు సంస్కృతంలోనే కాదు, తెలుగులో కూడా ఛందోబద్ధంగా కనిపించటమే. ఛందస్సు ధారణకు అనుకూలంకావటం, పద్యరూపంలో ఉండటంవల్ల మార్పులకు పెద్ద అవకాశం లేకుండా పదికాలాలపాటు నిలచి ఉంటాయని భావించటం, ప్రధాన కారణం. అయితే పద్యంలోని గణయతిప్రాసల

నిర్బంధంవల్ల వ్యర్థపదాలు చేరి, సూత్రరచనకున్నంత బిగువు పద్య వ్యాకరణాలలోరాలేదు. ఈ పద్య వ్యాకరణాలలో కవి ప్రయోగాల్ని ఉదాహరణలుగా చూపటం అభినందనీయమైన విషయం. ఎందుకంటే ఆనాటి వ్యాకరణ ఉద్దేశం కవిత్వం రాసేవారికి శబ్దాల సాధుత్వాన్ని తెలియజెప్పటమే కాబట్టి.

ఇందులో రెండు రకాల గ్రంథాలున్నాయి.

1. వ్యాకరణాన్నే ప్రధానంగా బోధించేవి.

2. ఆనుషంగికంగా వ్యాకరణాన్ని బోధించేవి.

వ్యాకరణం కోసమే గ్రంథం మొత్తాన్ని రచించిన ఆంధ్ర భాషా భూషణంవంటివి మొదటి కోవలోకి వస్తాయి. ఛందోఽ లంకారాది విషయాలతోపాటు వ్యాకరణాన్ని గురించి చెప్పే కావ్యాలంకార చూడామణి వంటివి ఈ రెండవ కోవలోనికి వస్తాయి.

ఛందస్సు, వ్యాకరణం, అలంకారం అనే ఈ మూడు శాస్త్రాలలో వ్యాకరణం సరస్వతీనదిలాంటిది. ఛందస్సు-అలంకారం ఈ రెండు వ్యాకరణానికి మూలమైన భాషపైన ఆధారపడి ఉన్నాయి. ఛందోఽ లంకార పరిధుల్లోకి వ్యాకరణం ప్రవేశించటం పాణినీయంలోనే కనిపిస్తుంది. లాక్షణిక గ్రంథాలన్న పదం పైన పేర్కొన్న మూడు శాస్త్రాలకు వర్తించినప్పటికీ, ఛందోఽ లంకార శాస్త్రాలకే ఈ పదం రూఢమైంది.

ఛందస్సు – అలంకారము – వ్యాకరణము కవితారచనకు అవసరం కాబట్టి తొలి ఛందోగ్రంథాలలోనే వ్యాకరణాంశాల్ని గురించి అక్కడక్కడ చర్చించటం కనిపిస్తుంది. కవిజనాశ్రయంలోని దోషాధికారం అలాంటిదే. అక్కడక్కడా నిడుద, బొట్టు, జడ్డ, వ్రాయి వంటి వ్యాకరణ పదజాలం వాడటం కనిపిస్తుంది. కవిజనాశ్రయంలో చివరి అధికారమైన ఈ దోషాధికారాన్ని ప్రక్షిప్తమని వాదించేవాళ్లున్నారు. ఇంకా కనిపించే కొన్ని పద్యవాకరణాలు:

1. ఆంధ్ర భాషా భూషణం – కేతన (13వ శతాబ్దం)

2. కావ్యాలంకార చూడామణి – విన్నకోట పెద్దన (15వ శతాబ్దం)

3. ఛందోదర్పణము– అనంతామాత్యుడు (15వ శతాబ్దం)

4. కవిచింతామణి – వెల్లంకి తాతంభటు (15వ శతాబ్దం)

5. కవిజన సంజీవని – ముద్దురాజు రామభద్రకవి (16వ శతాబ్దం)

6. ఆంధ్రకౌముది – గణపవరపు వేంకటకవి (17వ శతాబ్దం)

7. సర్వ లక్షణ సారసంగ్రహం – కూచిమంచి తిమ్మకవి (17–18వ శతాబ్దం)

8. కవిసంశయ విచ్ఛేదము – అడిదం సూరకవి (18వ శతాబ్దం)

9. ఆనందరంగరాట్ఛందము – కస్తూరి రంగకవి (18వ శతాబ్దం)

10. పట్టాభి రామపండితీయము – వేదం పట్టాభిరామశాస్త్రి (1760–1820)

11. పద్యాంధ్ర వ్యాకరణము – చిన్నయసూరి (19వ శతాబ్దం)

ఇవి కాక వ్యాకర్తల పేర్లు తెలియనివి అంత ప్రముఖం కానివి చాలా ఉన్నాయి.

సంస్కృతంలో రచించిన తెలుగు వ్యాకరణాలపై పాణినీయ సిద్ధాంత కౌముదుల ప్రభావమున్నట్లే ఈ పద్యాంధ్రవ్యాకరణంపై ఆంధ్రభాషాభూషణం, కాతంత్రవ్యాకరణ ప్రభావం కనిపిస్తుంది. 19వ శతాబ్దంలో వెలసిన వ్యాకరణాలపై మాత్రం ఇంగ్లీషు భాషా వ్యాకరణ ప్రభావం కనిపిస్తుంది. ఛందోనిర్బంధంవల్ల వ్యర్థపదాలు తప్పనప్పటికీ, ఈ పద్య వ్యాకరణాలు ఆయా కాలాల

కావ్యభాషతో పాటు కొంత శిష్ట వ్యావహారికాన్ని వ్యాకరించే ప్రయత్నం చేసినట్లు కనిపిస్తుంది.

### 2.3 తెలుగు భాషకు సంస్కృతంలో రచించబడిన వ్యాకరణాలు

తెలుగు భాషకు సంస్కృతంలో వ్యాకరణాలు వెలయటానికి కారణం ఆ భాషపై గల మక్కువ మాత్రమేకాదు. ఆంగ్లవిద్యా పరిచయమేర్పడి, ఆంగ్ల విద్యాగవాక్షం ద్వారా ప్రపంచాన్ని చూడటం ప్రారంభించే వరకు మనకు చదువంటే సంస్కృతమే. షడ్విధప్రాకృతాలతోపాటు సంస్కృతము, చివరిగా దేశభాష అధ్యయనంచేసి అష్టభాషా విశారదులు కావాలన్న తహతహ ఆనాటి పండిత లోకంలో ఉండేది. 'జనని సంస్కృతంబె యెల్ల భాషలకును' – అన్నది ఆనాటి విద్వాంసుల మదిలో మెదలిన సిద్ధాంతం. అందుచేత మన విద్యావంతులందరూ సంస్కృత భాషా సాహిత్యాల పరిచయం, అధ్యయనం లేకుండా ఆనాటి సమాజంలో మన్నన పొందలేక పొయ్యారు. ఇక సంస్కృత పదజాలం అలీనంగా విలీనంగా తెలుగు భాషలో చేరి, సంస్కృతము – తెలుగు తల్లీ కూతుళ్లనే ప్రచారాన్ని మరింత బలపరచింది.

ప్రపంచ భాషా శాస్త్రాలలోనే పాణినీయంలాంటి వ్యాకరణ గ్రంథం లేదన్నది ఆధునిక భాషాశాస్త్రవేత్తల తీర్పు. అటువంటి పాణినీయం, సిద్ధాంత కౌముది, వాక్యపదీయం వంటి గ్రంథాలు తెలుగు విద్వాంసులకు సుపరిచిత గ్రంథాలు. వ్యాకరణ పరిభాష సంస్కృత వ్యాకరణ గ్రంథాల ద్వారా అవగతం చేసుకున్న మన తెలుగు విద్వాంసులకు, ఆ వ్యాకరణ రచనాపద్ధతి సులభమార్గంగాతోచి ఉండవచ్చు. శాస్త్ర పరిభాషా కల్పనకు ఆధునిక కాలంలోనైనా సంస్కృతాన్నిమించిన అనువైన భాష ప్రాంతీయ భాషలకు దొరకటంలేదు.

"అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్
అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః"

– వంటి లక్షణాలకు తెలుగు భాషలోకంటే సంస్కృతంలోనే న్యాయం చేయటానికి వీలవుతుంది. సూత్రలాఘవానికి, ప్రత్యాహారపద్ధతికి సంస్కృతమే అనువైన భాష.

మన తెలుగు వ్యాకరణాలన్నీ కావ్య భాషకే పరిమితం కావటానికి కారణం కూడా సంస్కృత వ్యాకరణాలే. సంస్కృత వ్యాకరణాలన్నీ కావ్య భాషనుద్దేశించినవే. ఆ మర్యాదనే తెలుగు వ్యాకరణాలు బహుళంగా పాటించాయి. సంస్కృత ప్రాకృతాల సంబంధం వల్ల, తత్సమ తద్భవాల రూపంలో ఈ భాషల ప్రభావం తెలుగుపై అధికంగా పడటమే కాకుండా, రచనలను రచనా సంప్రదాయాలను ప్రభావితం చేసి దిగుమతి చేసుకోవటాన్ని ప్రేరేపించాయి. అలాంటి వాటిలో వ్యాకరణ రచన కూడా ఒకటి. పండిత పరిషత్తుల గౌరవం, ఆమోదం సంస్కృత భాషలో రచించటంవల్లనే లభిస్తాయని భావించిన తెలుగు విద్వాంసులు ఆ భాషలోనే రచించారు.

ఇలా సంస్కృత ప్రాకృతాలను క్షుణ్ణంగా అభ్యసించి, ఆయా లక్షణ గ్రంథాలను ఆమూలచూడంగా అధ్యయనంచేసి, వాటి ఒరవడిలోనే ఆంధ్రభాషకు లక్షణ గ్రంథాలను వినిర్మించాలని భావించారు మనలాక్షణికులు. సంస్కృత వ్యాకరణ పరిభాషను తమ రచనలో వినియోగించుకున్నారు. వ్యాకరణాలలో మనం ప్రసిద్ధంగా వినే కళ – ద్రుతప్రకృతిక విభాగం – పరుష సరళ స్థిర నిర్ణయం – మహదమహద్భేదం – ఇత్తు – ఔత్తు వంటి పరిభాషా సముదాయమంతా సంస్కృత వ్యాకరణ సంసర్గ సంజనితమైందే. తెలుగు భాషకు సహజమా? అసహజమా? నప్పుతుందా? లేదా? అనే విచారణ లేకుండా ప్రక్రియా విధానంలో కూడా కొన్ని పద్ధతుల్ని సంస్కృత వ్యాకరణాల నుండి వర్తింపచేసుకున్నారు. అలభ్యమైనవి, నామమాత్రావశిష్టమైనవిపోగా మిగిలినవి కొన్ని మాత్రమే. సంస్కృతంలో రాయబడిన తెలుగు వ్యాకరణాలలో సంపూర్ణంగా లభిస్తున్న తొలి వ్యాకరణం ఆంధ్ర శబ్ద చింతామణే.

సంస్కృత భాషలో వ్యాకరణాన్ని రచించే పద్ధతిలో రెండు సంప్రదాయాలున్నాయి. అవి: 1. శ్లోకరూపమైనవి. 2. సూత్రబద్ధమైనవి.

1) ఆంధ్రశబ్ద చింతామణి (నన్నయ కృతమని కాదని వాదాలున్నాయి)

2) త్రిలింగ శబ్దానుశాసనమ్ – మండలక్ష్మీ నృసింహకవి (18వ శతాబ్దం)

3) ఆంధ్రకౌముది – మండలక్ష్మీ నృసింహకవి (18వ శతాబ్దం)

4) వైకృత చంద్రిక – మంచెళ్ల వాసుదేవకవి (18వ శతాబ్దం)

5) సూత్రాంధ్రవ్యాకరణం – పరవస్తు చిన్నయసూరి (19వ శతాబ్దం)

6) హరికారికావళి – శిష్టు కృష్ణమూర్తి (19వ శతాబ్దం)

7) హరికారికాశేష సర్వస్వం – భాగవతుల రామమూర్తి (క్రీ.శ.1917)

తెలుగు భాషకు రచించిన సంస్కృత వ్యాకరణాలలో ప్రత్యాహార పద్ధతి విషయంలో పాణినీయాన్ని, ప్రకరణ విషయంలో కాతంత్ర వ్యాకరణాన్ని అనుసరించినట్లు కనిపిస్తుంది. సిద్ధాంత కౌముది ప్రభావంతో త్రిలింగ శబ్దానుశాసనం, వైకృత చంద్రికల ప్రకరణ విభాగం కనిపిస్తుంది. ఈ వ్యాకర్తలు సూత్రలాఘవానికి అష్టాధ్యాయిని ఆదర్శంగా ఎంచుకున్నారు. చింతామణి ఆర్యావృత్తాలతో రచింపబడితే. వికృతి వివేకం, త్రివిక్రమ వ్యాకరణం వంటివి అనుష్టుప్పులతో సంతరించబడ్డాయి. చింతామణికి తొలుత తెలుగులో, తర్వాత సంస్కృతంలో వ్యాఖ్యానాలు వెలిశాయి. వికృతి వివేకానికి మొదట సంస్కృతంలో ఆ తర్వాత తెలుగులో వ్యాఖ్యానాలు వచ్చాయి. చింతామణి ప్రభావం కేవలం సంస్కృతంలో రచించిన తెలుగు వ్యాకరణాలపైనే కాకుండా తెలుగులో రచించిన వ్యాకరణాల పైన కూడా కనిపిస్తుంది. పాణినీయ ప్రత్యాహారాలతోపాటు సంజ్ఞలను, సుబంతాలు, తిఙంతాలు, క్వార్థం, సమాసం, కారకం, కృదంతం, తద్ధితం వంటి పారిభాషిక పదాలు ప్రాచీన వ్యాకరణాల నుండి గ్రహించబడ్డాయి. సంస్కృత, ప్రాకృతాలను ఆద్యప్రకృతులుగా పేర్కొని తెలుగును దానికి వికృతిగా భావించారు. ఔపవిభక్తికాలతోపాటు తద్భవ రూప నిష్పత్తిని కూడా కొన్ని వ్యాకరణాలు ప్రస్తావించాయి. సంస్కృతంలో హ్రస్వమైన ఎ,ఒలు లేనందున వాటి స్థానంలో దీర్ఘాలనే ఉపయోగించారు. సంస్కృతంలో వెలిసిన ఈ వ్యాకరణాలలో కొన్నింటికి వృత్తి ఉదాహరణలు లేవు. కేవలం సూత్రాలు మాత్రమే కనిపిస్తున్నాయి. కొందరు ప్రాచీన కవి ప్రయోగాలను పేర్కొంటే కొందరు స్వీయ లక్ష్యాలను పేర్కొన్నారు.

### 2.4 సూత్రాంధ్ర వ్యాకరణాలు

వ్యాకరణమన్న మాట విన్నంతనే వ్యాకరణధ్యయన శీలురకే కాకుండా, సాహితీవేత్తలకు కూడా సూత్రాలతో కూడిన గ్రంథమే స్ఫురిస్తుంది. శ్లోకాన్ని సైతం సూత్రాలుగా విభజించి చదువుకోవటమే ఆంధ్రశబ్ద చింతామణి వంటివ్యాకరణాలు అలవాటు చేశాయి. పద్య వ్యాకరణాలే పరోక్షంగా తెలుగులో సూత్రరచనకు ప్రేరకమయ్యాయి. మన దర్శన గ్రంథాలన్నీ సూత్ర పద్ధతిలోనే ఉన్నాయి. సంస్కృతంలోని సూత్ర వ్యాకరణాలు కలిగించిన స్ఫూర్తిని గురించి చెప్పవలసిన అవసరమే లేదు.

సంస్కృత వ్యాకర్తలు వ్యాకరణ సూత్రానికి లక్షణాన్ని నిర్దేశిస్తూ

"సంజ్ఞాచ పరిభాషాచ విధిర్నియమ ఏవచ।
అతిదేశ ఽధికారశ్చ షడ్విధం సూత్ర లక్షణమ్॥" – అని చెప్పారు.

ఈ లక్షణాలు సంస్కృత భాషలో రాసే సందర్భంలో బాగా నప్పుతాయి. మరి తెలుగు వ్యాకర్తలు, తెలుగులో రాయటానికి ఈ విషయంలో విశేష పరిశ్రమనే చేయవలసివచ్చింది. ఉదాహరణకు చిన్నయసూరి బాలవ్యాకరణానికి వెనుక నాలుగు వ్యాకరణాల పరిశ్రమ ఉంది. తొలిదశలో తెలుగు పండితులు తెలుగు వ్యాకరణాల్ని సంస్కృతంలోనే రాశారు. వాటిలో చాలా అలభ్యాలు. పద్యవ్యాకరణాలు ధారణకు ఉపకరించాయే తప్ప రూపసాధన ప్రక్రియకు దోహదపడలేక పోయాయి. అల్పాక్షరాలతో, సందిగ్ధ రహితంగా, సారవంతమై, వీలయినంతగా భాషలోని లక్ష్యాల్ని అవ్యాప్తి లేకుండా వ్యాకరించే లక్షణాన్ని చెప్పటానికి సూత్రవ్యాకరణాలే మేలన్న భావనను కలిగించాయి. రూపసాధనలో సోపాన క్రమాన్ని నిరూపించటానికి ఈ సూత్ర వ్యాకరణాలు కలిగించినంత స్పష్టతను పద్యవ్యాకరణాలు కలిగించలేక పోయాయి. అందుచేత సూత్రవ్యాకరణరచన వ్యాకరణరచనా పరిణామంలో

అనివార్యమైంది.

ఆంగ్ల విద్యా ప్రభావం, వ్యావహారిక భాషోద్యమం ఇవన్నీ కూడా సూత్ర వ్యాకరణాలనే బ్రతికించాయి. చిన్నయసూరికి ముందు, వెనుక చాలామంది తెలుగు వ్యాకరణాలను రచించారు. అయితే వీటిలో కొన్ని పండిత వ్యాకరణాలన్న ముద్రను, మరికొన్ని విద్యార్థి వ్యాకరణాలన్న ముద్రను సంపాదించుకున్నాయి. విద్యార్థి వ్యాకరణాలుగా పేరు తెచ్చుకున్నవి సైతం చాలావరకు కావ్యభాషను వ్యాకరించటానికే పరిమితమయ్యాయి. ఆంగ్ల భాషా ప్రభావం, వ్యావహారిక భాషోద్యమ ప్రభావం, వీటితోపాటు ఆధునిక అవసరాలు పెరిగే కొద్దీ వ్యాకరణ రచనలో కూడా క్రమంగా విశాల దృక్పథం చోటుచేసుకుంది. దాని ఫలితంగానే వ్యావహారిక భాషా వ్యాకరణం, ఆధునిక ప్రామాణికాంధ్ర వ్యాకరణం వంటివి వచ్చాయి. ఈ వ్యాకర్తలలో ఎక్కువమంది ఉపాధ్యాయులు కావటం చేత వాళ్ళ ప్రభ ఉన్నంతవరకు వాళ్ళ వ్యాకరణాలు ప్రచారంలో పఠన పాఠనాలలో వెలిగాయి. అయితే చిన్నయసూరి బాలవ్యాకరణం ముందు మరే వ్యాకరణాలు కాలంలో నిలవలేకపోయాయి. ఇప్పటికీ తెలుగు వాళ్ళకు వ్యాకరణమంటే బాలవ్యాకరణమే నంటే ఆశ్చర్యమే మరి!

తెలుగులో వచ్చిన సూత్ర వ్యాకరణాలను పరిశీలిద్దాం.

1. సూత్రాంధ్ర వ్యాకరణాలు
2. ఆంధ్రవ్యాకరణము – తాడినాడ వెంకయ్య
3. ఆంధ్ర వ్యాకరణ సర్వస్వము – నేలటూరు పార్థసారథి అయ్యంగార్
4. ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము – పుదూరు సీతారామశాస్త్రి
5. తెనుగు వ్యాకరణము – రావిపాటి గురుమూర్తిశాస్త్రి
6. లఘు వ్యాకరణము – వేదము వేంకటరమణశాస్త్రి
7. తెలుగు వ్యాకరణ సంగ్రహము – ఉదయగిరి శేషయ్య
8. ఆంధ్రశబ్దానుశాసనము – పరవస్తు చిన్నయసూరి
9. శబ్దలక్షణ సంగ్రహము – పరవస్తు చిన్నయసూరి
10. బాలవ్యాకరణము – పరవస్తు చిన్నయసూరి
11. ప్రౌఢ వ్యాకరణము – బహుజనపల్లి సీతారామాచార్యులు
12. సంగ్రహ వ్యాకరణము – కందుకూరి వీరేశలింగం
13. సులభవ్యాకరణము – వావిల కొలను సుబ్బారావు
14. ఆంధ్రభాషానుశాసనము – మల్లాది సూర్యనారాయణశాస్త్రి
15. వ్యావహారిక భాషావ్యాకరణము – వడ్లమూడి గోపాలకృష్ణయ్య
16. ఆధునిక ప్రామాణికాంధ్ర వ్యాకరణము –వజ్ఝల వేంకటేశ్వర్లు

– మొదలైనవి. వీటిలో ఎక్కువ భాగం 19వ శతాబ్దంలో, 20వ శతాబ్ది తొలినాళ్లలోను వెలిసినవే.

19వ శతాబ్దంలో ఆంగ్లవిద్య దేశంలో ప్రవేశించాక పాఠశాలల్లో విద్యార్థులకోసం ప్రత్యేకమైన పాఠ్యపుస్తకాలను తయారు చేయవలసిన అవసరం ఏర్పడింది. వ్యాకరణం బోధించవలసిన అవసరం క్రింది తరగతుల నుంచీ ఏర్పడింది. వ్యావహారిక భాషా ఉద్యమం కూడా సలక్షణమైన భాషను గురించి పరోక్షంగా ప్రస్తావించింది. అంటే గ్రాంథిక వాదులు సలక్షణమని భావించే భాషపై వ్యావహారిక భాషావాదులు చేసినదాడి, సలక్షణమైన భాష పట్ల పండితలోకంలో అభినివేశాన్ని పెంచింది. ఈ అభినివేశమే వాడుక భాషలో విద్యార్థి వ్యాకరణాలు రచించవలసిన అవసరాన్ని కలిగించింది. అయితే ఈ విద్యార్థి వ్యాకరణాలలో ఆంగ్ల వ్యాకరణ పద్ధతిలోని భాషాభాగాలు (Parts of Speech) శబ్ద లక్షణాలు, వాక్య ప్రకరణాలు, అభ్యాసాలు వంటివి ప్రవేశించాయి. అయినప్పటికీ వీటిలో బాలవ్యాకరణాన్ననుసరించి కొన్ని, ఆ సూత్రాలనే కుదించి,

విస్తరించి, సరళం చేసి అనేక విధాలుగా రాశారు. పట్టిక రూపంలో పదాలను, విభక్తులను, క్రియలను పేర్కొనటం ఈ విద్యార్థి వ్యాకరణాలలో కనిపిస్తుంది. విద్యార్థి వ్యాకరణాల ప్రభావం వలన ప్రాచీన వ్యాకరణాల ప్రభావం పండిత లోకానికే పరిమితమయ్యింది. ఏకదేశి వ్యాకరణాలలో ఎక్కువభాగం చిన్నపాటి గ్రంథాలే. వీటి ప్రయోజనం పరిమితం. రేఫ, శకటరేఫల వంటి విషయాల చర్చ ఆధునిక యుగంలో అప్రస్తుతం కావటంతో వీటి ప్రచారం తగ్గిపోయింది.

ఈ విధంగా పరిశీలిస్తే తెలుగులో వెలసిన వ్యాకరణాలు వందలాదిగా ఉన్నట్లు తెలుస్తుంది. ఇవి కాక పాశ్చాత్యులలో విలియం బ్రౌన్, సి.పి.బ్రౌన్, వంటివాళ్లు రాసిన వ్యాకరణాలు విశేషంగా ఉన్నాయి. తెలుగు వ్యాకరణాలు రాశిలోను వాసిలోను బలమైన సంప్రదాయాన్ని కలిగి ఉన్నాయని తెలుస్తుంది.

**3. బాలవ్యాకరణ రచనా ప్రణాళికను వివరించండి.**

(ఈ వ్యాసంలో పాణిని రచించిన అష్టాధ్యాయి నిర్మించబడ్డ తీరును, బాలవ్యాకరణ నిర్మాణ పద్ధతి ఎలా ఉందో తెలుసుకుంటారు)

**3.1** భారతదేశంలో అత్యంత శాస్త్రీయమైన, ప్రాచీనమైన వ్యాకరణం 'పాణిని' రచించిన అష్టాధ్యాయి. పేరును బట్టే ఇది ఎనిమిది అధ్యాయాలతో కూడినదని తెలుస్తుంది. ఇందులోని భాగాలకు ఆహ్నికము అని పేరు. అంటే ఒక పూటలో చదువుకో తగినదని అర్థం.

అష్టాధ్యాయిలోని ఎనిమిది అధ్యాయాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

1. ప్రథమాధ్యాయం – సంజ్ఞాపరిభాషాదికాల విభజన నిరూపణలు
2. ద్వితీయాధ్యాయం – సమాస విభక్త్యాదులు
3. తృతీయాధ్యాయం – కృత్, అజ్విభక్తులు
4. చతుర్థాధ్యాయం – స్త్రీ, తద్ధిత ప్రత్యయాదులు
5. పంచమాధ్యాయం – సుబ్విభక్తి విధానం
6. షష్ఠమాధ్యాయం – ఆగమామ్రేడిత ప్రత్యయాలు
7. సప్తమాధ్యాయం – ఆగమామ్రేడిత ప్రత్యయాలు
8. అష్టమాధ్యాయం – సంధి నియమాదికం

ఈ విధమైన విభజన తెలుగు వ్యాకరణాలలో ఆంధ్ర శబ్ద చింతామణిలో కూడ ఉందని చెప్పలేం. కాని చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని పది పరిచ్ఛేదాలతో రచించాడు. అందులో ఆచ్ఛిక, కారక, సమాస, తద్ధిత, కృదంత పరిచ్ఛేదాలను విశేషంగా ఏర్పాటు చేశాడు. ఇలా ఏర్పాటు చేయటంలో సూరికి సిద్ధాంత కౌముదిలోని ప్రణాళిక మార్గదర్శకమై ఉండవచ్చు.

**3.2 బాలవ్యాకరణంలో ఈ క్రింది పరిచ్ఛేదాలున్నాయి.**

**1. సంజ్ఞా పరిచ్ఛేదం:** తత్సమ తద్భవదేశ్యగ్రామ్యాదిపదవిభజనం, కళాద్రుతప్రకృతిక విభాగం, దంత తాలవ్యచజలు, లఘ్వలఘు యరలవలు మొదలైన వాటిని ఈ పరిచ్ఛేదంలో వివరించాడు.

**2. సంధి పరిచ్ఛేదం:** అచ్సంధితోపాటు ఆగమాదేశ, ఆమ్రేడితాది సంధులను పేర్కొన్నాడు.

**3. తత్సమ పరిచ్ఛేదం:** సంస్కృత సమశబ్ద నిరూపణాన్ని, అజంత, హలంత శబ్దాల్ని వేర్వేరు ప్రకరణాలలో నిరూపించాడు.

**4. ఆచ్ఛిక పరిచ్ఛేదం:** ఆచ్ఛిక శబ్ద నిరూపణం, ఆచ్ఛిక పద బహువచన రూప నిష్పత్తిని, ఔపవిభక్తికాల్ని ఇందులో వివరించాడు.

**5. కారక పరిచ్ఛేదం:** ఇందులో విభక్తి స్వరూపాన్ని, విభక్తి పల్లటాన్ని (ఒక విభక్తికి మారుగా మరో విభక్తి రావటం)

నిరూపించాడు.

6. సమాస పరిచ్ఛేదం: సమాస స్వరూపాన్ని, వివిధ సమాసాల నియమాల్ని వివరించాడు.

7. తద్ధిత పరిచ్ఛేదం: వివిధ తద్ధిత రూపాల్ని వివరించాడు.

8. క్రియా పరిచ్ఛేదం: అనేక క్రియల గురించి వివరించాడు.

9. కృదంత పరిచ్ఛేదం: కృదంతాల వివరణ ఇందులో ఉంది.

10. ప్రకీర్ణక పరిచ్ఛేదం: ఈ పై పరిచ్ఛేదాలలో చేరని విషయాలను ఇందులో వివరించాడు.

ఇటువంటి శాస్త్రీయ విభజనతో బాలవ్యాకరణం రచించబడింది.

### 4. బాలవ్యాకరణానికి ఉన్న వ్యాఖ్యానాలను గురించి వ్రాయండి.

శాస్త్రగ్రంథం ఏదైనా వ్యాఖ్యానాన్ని అపేక్షిస్తుంది. అందులోని విషయంతోపాటు, పాటించిన సాంకేతికత వ్యాఖ్యానం లేకుండా పఠితకు అంత సులభంగా అవగతంగాదు. అలంకారశాస్త్ర గ్రంథాలే వ్యాఖ్యానావశ్యకతతో తల్లడిల్లుతుంటే ఇక వ్యాకరణశాస్త్రం సంగతి చెప్పేదేముంటుంది?

ఆంధ్రపాణినీయంగా ప్రసిద్ధిచెందిన బాలవ్యాకరణానికి సమానమైన వ్యాకరణం ఆ తరువాత తెలుగు వ్యాకరణ లోకంలో అవతరించ లేదంటే ఆశ్చర్యమేమరి! సంస్కృతవ్యాకరణ మర్యాదలనన్నీ పుణికిపుచ్చుకున్న ఈ బాలవ్యాకరణం, వ్యాఖ్యాన సహాయం లేకుండా చదివి సంపూర్ణమైన అవగాహనను కలిగించుకోలేము. ముఖ్యంగా క్రియా పరిచ్ఛేదంలో ఈ క్లిష్టత అధికంగా కనిపిస్తుంది.

గాజుల నరసింహశెట్టిగారి ప్రోత్సాహంతో, వింజమూరి కృష్ణమాచార్యులవారు, బాలవ్యాకరణం వెలువడిన తొలినాళ్లలోనే వ్యాఖ్య రాయాలని సంకల్పించినప్పటికీ ఆదిలోనే హంసపాదు తగిలి అది కార్యరూపం ధరించలేదు.

#### 4.1 గుప్తార్థ ప్రకాశిక

బాలవ్యాకరణ వ్యాఖ్యలలో మొట్టమొదటిది గుప్తార్థప్రకాశిక. దీనికర్త కల్లూరి వేంకటరామశాస్త్రిగారు. 1908వ సం॥లో సుంకర రంగయ్యచే కారకపరిచ్ఛేదం వరకు సంపూర్ణంగా, సమాసపరిచ్ఛేదపు ఆరంభం ప్రచురించబడింది. తొలుత సుంకర రంగయ్య పేరుతోనే ఇది ప్రకటించబడినప్పటికీ, 1915 సం॥లో కల్లూరివారు సంపూర్ణ గ్రంథాన్ని ప్రకటించారు. కల్లూరివారి శిష్యుడైన సుంకర రంగయ్య చేసిన మోసం అప్పుడు లోకానికి తెలిసింది.

ఈ వ్యాఖ్యలో సూత్రార్థ వివరణతోపాటు మహాకవి ప్రయోగాలను కూడా ప్రదర్శించాడు. ఎన్నో అంశాలు లక్షణ గ్రంథాల నుండి ఉదాహరించబడ్డాయి. రూపసాధన ప్రక్రియతోపాటు లక్ష్యలక్షణ సమన్వయం కూడ ఇందులో కనిపిస్తుంది. అన్వయక్లిష్టత లేకుండా సుగమమైన శైలిలో సాగిన ఈ వ్యాఖ్యానంలో కొన్ని సూత్రాల వ్యాఖ్యానాన్ని గురించి తీవ్రవాదాలు ప్రతివాదాలు కొనసాగాయి.

#### 4.2 బాలవ్యాకరణ సారస్య సర్వస్య పేటిక

పేటికా వ్యాఖ్యగా ప్రసిద్ధమైన ఈ వ్యాఖ్యానకర్త దూసి రామమూర్తి శాస్త్రిగారు. వీరు వజ్ఝలవారి శిష్యులు. దీనికే గ్రాంథికాంధ్ర కల్పకమనే పేరుంది. ఈ వ్యాఖ్యానం పండితైక వేద్యమైన జటిల వ్యాఖ్య. ఈ వ్యాఖ్యదూసివారి మరణానంతరం ప్రచురించబడింది.

బాలవ్యాకరణ సూత్రాలకు ప్రధానాధారమైన చింతామణి సూత్రాలను, అథర్వణ కారికలను, ఆయా బాలవ్యాకరణ సూత్రాల క్రింద నిర్దేశిస్తూ సాగిన ఈ వ్యాఖ్యానంలో ప్రక్రియా నిరూపణ, సూత్రార్థవివరణ, లక్షణ సమన్వయం ప్రధానలక్షణాలు. సూత్రార్థ వివరణలో ప్రతిపదసార్థక్యాన్ని వివరించారు. అక్కడక్కడా ప్రౌఢవ్యాకరణ సూత్రాలు చూపబడ్డాయి.

ద్రుత సంజ్ఞావివరణ సందర్భంలో ద్రుతాన్ని గురించి చేసిన విపుల చర్చవంటివి ఈ వ్యాఖ్యానంలో వివిధ సందర్భాలలో తారసపడతాయి. అవి చదువరులకెంతో ఉపయోగిస్తాయి.

#### 4.3 లఘుటీక

దీనికర్త బులుసు వేంకటరమణయ్య. ఇందులో శాస్త్రచర్చలు, వ్యాకరణ విశేషాలు వంటివాటి జోలికి పోకుండానే సరళమైన సంగ్రహమైన టీకతోపాటుగా లక్షణ సమన్వయాన్ని, ప్రక్రియా నిర్వహణను లఘువుగా చెప్పటం దీనిలోని ప్రత్యేకత.

#### 4.4 సంజీవనీ వ్యాఖ్య (క్రీ.శ.1951)

దీనికర్త వజ్ఝుల చినసీతారామశాస్త్రి. ఆంధ్రశబ్ద చింతామణికి వికృతివివేకానికి కల్పతరు వ్యాఖ్యను, దానికి వివరణమనదగిన సంజీవనీ వ్యాఖ్యను బాలవ్యాకరణ గ్రంథానికి కలిపి వ్యాకరణ సంహితా సరస్వంగా వజలవారు ప్రకటించారు. బాలవ్యాకరణ వ్యాఖ్యలలోకెల్లా సంజీవని పెద్దవ్యాఖ్య.

బాలవ్యాకరణానికి నేపథ్యం చింతామణేనని, దానితోపాటు భారతప్రయోగాలనే లక్ష్యంగా పెట్టుకొని సూరి రచించాడని చాలామంది భావించారు. బాలవ్యాకరణం స్పృశించని భారత ప్రయోగాలను కూడా వజ్ఝులవారు పేర్కొన్నారు.

గుప్తార్థప్రకాశికలోని అసంగతాల్ని, పేటికావ్యాఖ్యలోని దోషాల్ని, గిడుగురామ్మూర్తి పంతులుగారి విమర్శల్ని ప్రస్తావించి వాటికి తగు సమాధానాలను పేర్కొన్నారు.

#### 4.5 బాలవ్యాకరణోద్ద్యోతము

దీనికర్త కూడ వజ్ఝుల వారే. బాల ప్రౌఢవ్యాకరణాలపై శాస్త్రిగారు రచించిన విమర్శనాత్మక వివరణమే ఈ ఉద్ద్యోతము. బాలవ్యాకరణంలోను, ప్రౌఢవ్యాకరణంలోను ఉన్న లక్షణ విరోధాల్ని తొలగించి, ఆ రెండింటిలోను చెప్పని లక్షణ విశేషాల్ని చేర్చి ఈ వ్యాఖ్యను రాసినట్లు వజ్ఝులవారే పేర్కొన్నారు. ఇందులో కవిప్రయోగాలు బహుళంగా ప్రదర్శించబడ్డాయి.

తత్సమ భాషా నిరూపణ సందర్భంలో, సంస్కృత వ్యాకరణంలో చెప్పిన సంధి సమాస విషయాలు, కృత్తద్ధిత సమాస విషయాలను చెప్పటం కనిపిస్తుంది. బాలప్రౌఢవ్యాకరణాలలో తాను దోషాలుగా భావించిన వాటిని ఖండించి, సూత్రక్రమాన్ని మార్చి, కొన్ని సూత్రాల్ని తొలగించి, సూత్రాల పాఠాల్ని సహితము మార్చి తన అభిప్రాయాన్ని నిష్కర్షగా ప్రకటించారు. ప్రకీర్ణక పరిచ్ఛేదం తప్ప సంజ్ఞాపరిచ్ఛేదం నుండి కృదంత పరిచ్ఛేదం వరకు శాస్త్రిగారు పై ప్రణాళికలో వివరణ రాశారు.

#### 4.6 రమణీయము

వజ్ఝుల సీతారామశాస్త్రిగారి శిష్యుడైన దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు రచించిన రమణీయ వ్యాఖ్య బాలవ్యాకరణ వ్యాఖ్యాలలో కెల్లా రమణీయమైంది. దువ్వూరివారు చిన్నయసూరి పట్ల సంభావించిన సౌజన్యం, పాండిత్యం, ఉక్తిలాలిత్యం, వ్యాకరణాభిమానం మొ॥న గుణాలు చిన్నయసూరిగారికేమోగాని వేంకటరమణశాస్త్రి పట్ల సార్థకమని పరిచితులు చెప్పేవారు. చిన్నయసూరిపట్ల వీరారాధనతోశాస్త్రిగారు ఈ వ్యాఖ్యానాన్ని రచించారు.

చాలామంది భావించినట్లు చిన్నయసూరి, భారతప్రయోగాలకే ఈ వ్యాఖ్యానం రాయలేదని ప్రబంధ ప్రయోగాల్ని కూడ నిరూపిస్తుందని సోపపత్తికంగా నిరూపించారు. హరికారికావళి బాలవ్యాకరణానికి సంస్కృతీకరణమని శాస్త్రిగారు నిరూపించి, సూరి గారి మీద వేసిన నీలాపనిందను పోగొట్టారు. ఈ విషయం కూడా ఇందులో పొందుపరచారు. బాలవ్యాకరణం సాధించలేని ప్రయోగాలు సూరిగారి బాలవ్యాకరణేతర వ్యాకరణాలు సాధిస్తున్నాయని శాస్త్రిగారు వివరించారు.

రమణీయవ్యాఖ్య లలితోక్తిచాతురికి పెట్టింది పేరు. ద్రుతసంధికి ఉదాహరణగా ఇచ్చిన పూచెనుగలువలు, తోచెను జుక్కలు, చేసెనుడక్కులు, నెగడెనుదమములు, మొగిడెను బద్మము – అనే వాటిని గురించి చేసిన ఈ వ్యాఖ్యను చూడండి. “పయి యుదాహరణములను వరుసగా పరికించిన యెడ ప్రకృతి సిద్ధములగు సాయంతన సన్నివేశములు స్ఫురణకు వచ్చును. ఉల్లాసకరములగు లక్ష్యములు”.

అలాగే అత్వసంధికిచ్చిన మేనల్లుడు, పుట్టినిల్లు, చూడకుండెను అనే మూడు ఉదాహరణల్ని ఏకవాక్యంగా గుదిగ్రుచ్చి. “మేనల్లుడు పుట్టినిల్లు చూడక' మేనమామ యింటినే అంటిపట్టియుండెనట! ఎందులకో హేతువునూహింపుడు”[3] – అని సరసంగా శాస్త్రిగారు వ్యాఖ్యానించారు.

కేవలం బాలవ్యాకరణ సూత్రాలకు టీకాతాత్పర్యాలు వ్రాయటమే దువ్వూరి వారి లక్ష్యంకాదు. వినూత్నంగా తోచిన అంశాలతో, సూరి శాస్త్ర వైదుష్యాన్ని వెల్లడిస్తూ, సూరి అంతరంగాన్ని ఆవిష్కరిస్తూ సరళతరళంగా ఆనందతీర్థంలా సాగిన వ్యాఖ్యానం ఈ రమణీయం.

### 4.6 ఘంటాపథ వ్యాఖ్య (క్రీ.శ. 1970)

కర్త వంతరాం రామకృష్ణ. ఇది వెలువడిన తరువాత పూర్వవ్యాఖ్యానాలన్నీ పట్టింపుకునోచుకోలేదు. ప్రక్రియా ప్రధానంగా సాగిన ఈ వ్యాఖ్య విద్యార్థి లోకాన్ని బాగా ఆకర్షించింది. బాలవ్యాకరణ సాధుపాఠనిర్ణయంతోపాటు, అవసరమైన మేరకు మాత్రమే వివరణ చేస్తూ, విశేషాంశాలను, సూత్రంలోని పదసార్థకతను వివరిస్తూ సాగిన వ్యాఖ్యానమిది. అవసరాన్నిబట్టి సూత్రాలకు మూలాలను పేర్కొన్నాడు. బాలవ్యాకరణ గణపాఠము, విశేష శబ్దాలు కూర్చబడ్డాయి. ఈ వ్యాఖ్యానం గ్రాంథికశైలిలోనే సాగింది.

### 4.7 బాలవ్యాకరణ వివృతి (క్రీ.శ.1970)

గురువు సహాయం లేకుండా స్వయంగా వ్యాకరణ అధ్యయనం చేయాలని భావించేవారి ఉపయోగార్థం ఈ వ్యాఖ్యానం రచించబడింది. దీనికర్త సన్నిధానం సూర్య నారాయణశాస్త్రిగారు. ఇందులో శాస్త్ర చర్చలు, సూత్రాలకు మూలాల ప్రస్తావన కనిపించదు. సూత్రము – వృత్తి ఉదాహరణలు మాత్రమే కాకుండా అవసరమైనంత వివరణ, విశేషాంశాలుగా ప్రౌఢవ్యాకరణంలోని విషయాలు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్ర భాషానుశాసనము'లోనివి ప్రస్తావించబడ్డాయి.

### 4.8 వికాస వ్యాఖ్య (క్రీ.శ.1977)

దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి ప్రత్యక్షశిష్యులైన ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారిచే రచించబడిన వ్యాఖ్యానం ఇది. ఎన్నో ఏళ్లుగా బాలవ్యాకరణాన్ని బోధించటంచేత బోధనలో స్ఫురించిన భిన్నభిన్న దృక్పథాల్ని అక్షరరూపంలో పెట్టి చేసినదీ వ్యాఖ్యానం. బాలవ్యాకరణ సూత్రాలకు సాంప్రదాయిక, చారిత్రక, తులనాత్మక, సామాన్య భాషాశాస్త్ర సమన్వయాన్ని చేయటం ఇందులో గమనించవచ్చు. ధ్వనిశాస్త్రాది (Phonetics) విషయాలతో సూత్రాలను వివరించటం, వ్యాకరణాంశాల్ని చిత్రాలతో విశదీకరించటం, తమిళాది సోదర భాషలతో ఉన్న సంబంధాన్ని ప్రస్తావించటం ఇందులోని ప్రత్యేకత. ఇది చదువుకునే విద్యార్థులకే కాకుండ, బోధించే ఉపాధ్యాయులకు ఎంతో ఉపయుక్తమైన గ్రంథం. గ్రంథాంతంలో ఇవ్వబడిన వ్యాసాలు బాలవ్యాకరణాంశాల్ని కరతలామలకం చేస్తున్నాయి.

### 4.9 బాల ప్రౌఢవ్యాకరణ సర్వస్వం

దీనికర్త స్ఫూర్తిశ్రీ. బాలవ్యాకరణానికి పూరక గ్రంథంగా భావించే ప్రౌఢవ్యాకరణాన్ని కలిపి వ్యాఖ్యానించిన విలక్షణ గ్రంథమిది. బాలవ్యాకరణ సూత్రాల్ని, ప్రౌఢవ్యాకరణ సూత్రాల్ని సన్నివేశక్రమాన్ని బట్టి కలబోయటం ప్రధానాంశం. ఉదా॥కు బాలవ్యాకరణంలోని మొదటి నాలుగు సూత్రాలు వర్ణసమామ్నాయాన్నే తెలుపుతాయి. ప్రౌఢవ్యాకరణంలోని మొదటి సూత్రం కూడ వర్ణసమామ్నాయానికి చెందిందే. పైగా ప్రౌఢవ్యాకరణ సూత్రం బాలవ్యాకరణ సూత్రాలు నాలిగింటికి సమాహారమనిపిస్తుంది. అందుచేత ఈ వ్యాఖ్యలో అయిదవ సూత్రంగా దానిని వ్యాఖ్యానించి చెప్పటం సమంజసమే.

బాలవ్యాకరణం చెప్పని కొత్త విషయాలతోపాటుగా సవరణలు – పూరణలు ప్రౌఢవ్యాకరణంలో ఉన్నాయి. వాటిని బాలవ్యాకరణ సూత్రం వెంటనే చేర్చి వ్యాఖ్యానించటం ఈ వ్యాఖ్యాత చేపట్టిన విశిష్టకార్యం.

### 4.10 వ్యాకరణదీపిక (క్రీ.శ.1987)

దీనికర్త ఆచార్య కోరాడ మహదేవశాస్త్రిగారు. స్ఫూర్తిశ్రీగారి పద్ధతిలోనే బాలప్రౌఢవ్యాకరణాలను కలిపి రచించిన గ్రంథమిది. ఇందులో సహజమైన శాస్త్రచర్చలులేవు. పూర్వాంధ్ర వ్యాకరణ మీమాంసలులేవు. 'విషయవిస్పష్టవివేచన'కు అవసరమైనమేరకు అక్కడక్కడా కొన్ని సూత్రాలు భాషాశాస్త్ర దృష్టితో వివరించటం ఈ వ్యాఖ్యాన పద్ధతి. వ్యావహారికశైలిలో రచించి ఈ వ్యాఖ్యానం భాషాలక్షణాన్ని సూటిగా చెపుతూ, వ్యాకరణం గురించి ఏమీ తెలియని విద్యార్థి కూడా ఏ గురువు సహాయమూ లేకుండ చదువుకోగల రీతిలో ఉన్నది.

### 4.11 శ్రీప్రభా వ్యాఖ్య

దీని వ్యాఖ్యాత ఆచార్య పి.నరసింహారెడ్డి. ఇది విద్యార్థిని దృష్టిలోపెట్టుకొని చేసిన వ్యాఖ్యానం. లక్ష్యాలుగా ఇచ్చిన అన్ని ప్రయోగాలకు ప్రక్రియను చూపటం ఇందులోని విశిష్టత. వ్యావహారికశైలిలో రచించబడిన ఈ వ్యాఖ్యకు అనుబంధంగా

సూత్రాంశదర్శిని, పారిభాషికపదసూచిని, ప్రయోగదర్శిని, ముఖ్యపదసూచి, తత్సమనామసూచి, బహువచనాలసూచి, సమాపకక్రియాసూచి, తత్సమ–ఆచ్ఛిక ధాతురూపసూచి, ప్రేరణార్థకరూపసూచి, సూత్రదర్శిని ఇవ్వబడ్డాయి.

**4.12 దీపికా వ్యాఖ్య**

పుల్లూరి ఉమ చేత రచించిన ఈ వ్యాఖ్యలో సూత్రాలకు టీక ఇవ్వబడింది. ప్రక్రియ అంత వివరంగాలేదు. అనుబంధంలో ఉదాహృతపదానుక్రమణిక, వృత్తి సూత్రానుక్రమణిక, కతిపయ పరిశీలనాంశాలు ఇవ్వబడ్డాయి. అయితే ఇందులోని క్రియలను భద్రిరాజు కృష్ణమూర్తిగారి Telugu verbal Basis ను ఆధారంగా చేసుకొని వివిధ తరగతి భేదాలు (Division of Classes) చూపబడ్డాయి. ఇవి కాకుండా ఇంకా బాలవ్యాకరణానికి కొన్ని ఆంశిక విశ్లేషణలు, కొన్ని పరిచ్ఛేదాలకు టీకలు ప్రేత్యేకంగా వెలువడ్డాయి.

ఈ విధంగా వెలసిన వివిధ వ్యాఖ్యానాల్ని పరిశీలిస్తే కొన్ని పాండిత్య ప్రదర్శకాలయితే, మరికొన్ని అధ్యాపన ధోరణిలో సాగాయి. ఈ వ్యాఖ్యాతలలో కూడా ఎక్కువ మంది వ్యాకరణబోధకులే.

**5. బాలవ్యాకరణంపై సంస్కృత వ్యాకరణాల ప్రభావాన్ని నిరూపించండి.**

(ఈ వ్యాసంలో బాలవ్యాకరణాన్ని నిర్మించటంలో సంస్కృత వ్యాకరణాల ప్రభావం ఎలా ఉందో తెలుసుకుంటారు. వ్యాకరణ సూత్రాల్ని రచించే పద్ధతిని, వృత్తి వార్తికాలను, పారిభాషిక పద నిర్మాణ పద్ధతి వంటి విషయాలను తెలుసుకుంటారు.)

**5.0** పాణిని 'అష్టాధ్యాయి' సంస్కృత భాషకు ఆధికారిక వ్యాకరణ గ్రంథం. అలాగే తెలుగు భాషకు బాలవ్యాకరణం కూడ ఆధికారిక గ్రంథం. పాఠశాల స్థాయినుంచి స్నాతకోత్తర స్థాయివరకు బాలవ్యాకరణంలోని సూత్రాలను రాపాడి రాపాడి అధ్యయనం చేస్తుంటారు. బాలవ్యాకరణం వ్యాకరించింది కావ్యభాషనే అయినప్పటికీ, దాని ప్రతిభా ప్రాభావాలు ఇప్పటికీ తిరుగు లేకుండా ప్రసరిస్తూనే ఉన్నాయి. గ్రాంథికము, వ్యావహారికము అనేవి ఒక భాషలో ఉండే శైలీభేదాలే కాని దాని మూలపదరూపాలు ఒక్కటే. ఉదా॥ 'వచ్చుచున్నవాడు' అన్నది గ్రాంథిక రూపం. 'వస్తున్నవాడు' అన్నది వ్యావహారిక రూపం. ఈ రెండింటికి మూల రూపం 'వచ్చు'. 'వచ్చుచున్నవాడు' అన్న క్రియా రూప నిర్మాణం తెలిస్తే 'వస్తున్నవాడు' అనే వ్యావహారిక రూప పరిజ్ఞానం తెలుస్తుంది. అలాగే 'తినుము' అనే క్రియా రూప పరిజ్ఞానం లేకుండా 'తినమన్నాడు' అనే పదాన్ని వివరించలేం. రచనలో కూడ అంతా గ్రాంథికంలోనే వ్రాస్తామనటం ఎంత అసమంజసమో అంతా వ్యావహారికంలోనే రాస్తామనటం అంతే అసమంజసం. మాట్లాడేదంతా రచనలో చెప్పటానికి సాధ్యపడదు. అవసరాన్ని బట్టి సందర్భాన్ని బట్టి రెండు రకాలశైలులు ఉపయోగించవలసినదే. అందువలన కేవలం గ్రాంథికభాషకే వ్యాకరణాలున్నాయనే వంకతో వాటిని తిరస్కరించటం సరైన పద్ధతి కాదు. అందుచేత తెలుగు వ్యాకరణ సంప్రదాయాన్ని తెలుసుకోవటం భాషాధ్యయనం చేసేవాళ్లకు అత్యంత అవసరం.

పాణినీయంలో అనుసరించబడ్డ పద్ధతులు బాలవ్యాకరణంలో కూడ అనుసరించబడ్డాయి. వాటిని గమనిద్దాం –

**5.1 పరిచ్ఛేద విభాగం:** అష్టాధ్యాయి సంజ్ఞా పరిచ్ఛేదంతో ఆరంభించినట్లే బాలవ్యాకరణం కూడ సంజ్ఞా పరిచ్ఛేదంతోనే ప్రారంభించబడింది. మిగిలిన పరిచ్ఛేదాలకు విషయానుకూలంగా పేర్లు పెట్టబడ్డాయి.

**5.2 లేఖన పద్ధతి:** పాణినీయ వ్యాకరణంలో సూత్రం తరువాత వృత్తి, ఉదాహరణ పద్ధతి ఉంది. మధ్య మధ్య అవసరమైన చోట్ల వరరుచి రచించిన వార్తికాలున్నాయి. అదే విధంగా బాలవ్యాకరణంలో కూడ సూత్రం, ఉదాహరణలు, అక్కడక్కడ వార్తికాల వలెనే స్వీయ వ్యాఖ్యాన పంక్తులు ఉన్నాయి.

బాలవ్యాకరణంలో కొన్ని సూత్రాల క్రింద ఏ విధమైన వ్యాఖ్యానం లేకుండా కేవలం 'స్పష్టము' – అని మాత్రమే పేర్కొనటం కనిపిస్తుంది. ఇలా వ్రాయటం కూడ సంస్కృత వ్యాకరణ మర్యాదయే.

ఉదా॥ 'నీచైరనుదాత్తః

– అనే పాణినీయ సూత్రానికి స్పష్టమని వృత్తిలో కనిపిస్తుంది. అలాగే బాలవ్యాకరణంలో 'దుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది దుమంతంబనంబడు' – అనే సూత్రం క్రింద 'స్పష్టము' అని వ్రాయటాన్ని గమనించవచ్చు.

**5.3 సంస్కృత వ్యాకరణ పరిభాషను ఉపయోగించటం:** సంస్కృత వ్యాకరణంలోని వికల్పము – విభాష– నిత్యము – బహుళము వంటి సంజ్ఞలను సూరి యథాతథంగా స్వీకరించాడు.

**5.4 జ్ఞాపన పద్ధతి:** "జ్ఞాపక సిద్ధం న సర్వత్ర" ఒక విధానం వ్యర్థమౌతుందని తెలిసి విధించటాన్ని జ్ఞాపకం అంటారు. ఆ వైయర్థ్యం ఒక ప్రత్యేకమైన ప్రయోజనాన్ని సాధిస్తుంది. సంస్కృత వ్యాకరణంలో 'అర్థవద్గ్రహణే నానార్థ కస్య గ్రహణం' – వంటి జ్ఞాపకాలు చేయటం కనిపిస్తుంది. ఈ జ్ఞాపక పద్ధతి బాలవ్యాకరణంలో కూడ కనిపిస్తుంది.

సూత్రంలో ఒక పదానికి 1) వైయర్థ్యం: ఆ పదం వ్యర్థమై, 2) ఒక అర్థ కల్పన చేయటం: ఆ అర్థ కల్పన చేత ఆ పదం తిరిగి ఆ సూత్రంలో ఉండక తప్పని పరిస్థితి ఏర్పడటం. 3) స్వాంశంలో చారితార్థ్యము, 4) అన్యత్రఫలము. అంటే ఇటువంటి జ్ఞాపక పద్ధతివలన మరికొన్ని లక్ష్యాలలో ప్రయోజనం కలగటం అనే ఈ నాలుగు భాగాలు జ్ఞాపక పద్ధతిలో ఉంటాయి.

బాలవ్యాకరణంలో 'నిర్జినామంబులక యుగాగమంబు కలుగదు' – అనే సూత్రంలో "ఈ జ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయందించుగాగమంబగునని యెఱుంగునది" – అని వ్రాయటం దీనికి ఉదాహరణం. 1) ఈ సూత్రంలో 'నామంబులకు' అనే పదం మొదట వ్యర్థమైంది. 2) వ్యర్థమై ధాతువులకే కాకుండ కొన్ని నామాలకు కూడ ధాతుత్వ వివక్ష చేసుకొంటే ఇంచుగాగమం చేయవచ్చని అర్థకల్పన చేసింది. 3) ఈ కల్పన చేత 'నుతి + ఇంచు' అన్నచో ఇంచుగాగమము వచ్చిన పిమ్మట 'ఆయుక్' రాకుండా ఉండేందుకు సూత్రంలో 'నామంబులకు' అనే పదము ఆవశ్యకమై చరితార్థమయినది. 4) ఈ కల్పనకు ఫలితంగా 'శయనించు' మొదలైనవాటిలో ఇంచుగాగమం సిద్ధించింది. దీనికే జ్ఞాపక చతుష్టయమని వ్యవహారం. ఈ పాణినీయ పద్ధతిని బాలవ్యాకరణంలో ఇక్కడ ఒక్కచోటనే సూచించబడింది. పాణినీయ పద్ధతియైన ఈ జ్ఞాపన పద్ధతి.

**5.5 ఆగమ పద్ధతి:** యడాగమ, నుగాగమాదులని టిత్తులుగా, కిత్తులుగా చేయటం సంస్కృత వ్యాకరణ మర్యాదయే.

'ఆద్యంతౌ టకితౌ'–టిత్తులు ఆదిలోను, కిత్తులు అంతంలో చేరును. అలాగే వాటిని లాక్షణికదృష్టితో సూరి ప్రయోగించాడు.

**5.6 కారకములు:** ఈ కారక విధానమంతా సంస్కృత వ్యాకరణానుసారియే. సంస్కృతంలో ఏ విభక్తులు ఏ అర్థంలో ప్రయోగించబడతాయో, అదే అర్థంలో తెలుగు విభక్తులను కూడ వివరించాడు. బాలవ్యాకరణంలో ఉన్న సూత్ర పద్ధతి, రచనా పద్ధతి అంతా సంస్కృతానుసారియే.

ఉదా॥ "ప్రాతిపదికార్థ లింగవచన పరిమాణమాత్రే ప్రథమా"

"కర్మణి ద్వితీయా"

"నియతోపస్థితికం ప్రాతిపదికయే"

వీటిని సూరి

"ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులంబ్రథమయగు",

"కర్మంబున ద్వితీయ యగు"

"నియతోపస్థితికము ప్రాతిపదికము" అని అనువదించి బాలవ్యాకరణంలో ఉపయోగించాడు.

**5.7 ప్రక్రియాపద్ధతి:** రూప సాధనకు సంస్కృతంలో పాణినీయాదులు అనుసరించిన ప్రక్రియా విధానాన్ని అనుసరించి ప్రక్రియా గౌరవాన్ని పాటించాడు. అధిక ప్రక్రియకు పోక వీలయినంత తక్కువలో రూప సాధన చేశాడు. అందుకు అవసరమైన చోట్ల నిపాతపద్ధతిని కూడ స్వీకరించాడు. 'అతడు' – అనే మూడక్షరాల పదాన్ని సాధించటానికి నాలుగు సూత్రాల్ని రాయటం కంటే, నిపాత ద్వారా రూపాన్ని ప్రదర్శించటం మిన్న. అందుకే సూరి దానిని పాటించాడు.

**5.8 నిపాత పద్ధతి:** సంస్కృతంలో 'మయూరవ్యంసకాదయశ్చ' వంటి నిపాత సూత్రాలున్నాయి. అలాగే బాలవ్యాకరణంలో కూడ – (1) వేద పురోధ పురోధసుడు

(2) కద్రువ నాగమాత

(3) నౌశబ్దంబునకు నాదయగు

(4) ద్యుహృచ్ఛబ్దంబులకు దివి హృదియగు – వంటి సూత్రాలు నిపాత సూత్రాలే.

**5.9 అర్థభేదం–ప్రత్యయ భేదం:** సంస్కృత వ్యాకరణంలో ప్రత్యయ భేదాన్ని సూచిస్తూ అర్థభేదాన్ని సూచించే స్థలాలెన్నో ఉన్నాయి.

ఉదా॥ తారకాజ్యోతిషే – తారికా అన్యో
వర్ణకాతాంతవే – వర్ణికా అన్యో – వంటివి

అలాగే బాలవ్యాకరణంలో 'కద్రువ నాగమాత'. కాని మూలరూపమైన 'కద్రూ' శబ్దాన్ని వర్ణ విశేషవాచిగా చెప్పేటప్పుడు వు వర్ణాన్ని చేర్చి 'కద్రువు' అని చెప్పటం కనిపిస్తుంది.

బ్రహ్మ: ఈ శబ్దం కూడ చతుర్ముఖుడైన బ్రహ్మకు, ఋత్విక్కులకు, విప్రులకు వాచకము. కాని అదే శబ్దం తత్త్వతపోవేదయోగ వాచకమైతే 'బ్రహ్మము' అవుతుంది.

**5.10 మధ్య మధ్య వివరణములు:** నడుమనడుమ వివరణలు లేదా సవరణలు సంస్కృతం వ్యాకరణాల్లో కనిపిస్తాయి.

'శశ్ఛోమీతి వక్తవ్యమ్ – మయటి నిత్యం వాచ్యమ్' – వంటి సవరణలు.

'ఋణస్యాపణయనాయ యదన్య దృణం క్రియతే తదృణార్థమ్' మొదలైన వివరణలున్నాయి. తెలుగులో "దయాళు శబ్దంబునకు రేఫంబిట్లు గానంబడియెడి' – దయాళురు ఇటువంటి సవరణలు కనిపిస్తాయి.

**5.11 అపశబ్ద విరాసనము:** వ్యాకర్త తాను దుష్ట ప్రయోగాలు అనుకున్నవాటిని నిరసించటం సంస్కృత వ్యాకరణంలో ఉంది. 'గాణాపత్యోమాంత్రయితి తుప్రామాదితమీవ" మొదలైనచోట్ల ఉంది. ఈ అపశబ్ద విరాసనం సంస్కృతంలో ఉంది.

ఉదా॥

(1) ఏండ్లు కాండ్లు ఇత్యాదులందు డాకుళాదేశంబు కొందఱు వక్కాణించిరి. తెనుగు న బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి గ్రాహ్యంబు కాదు.

(2) ద్వితీయైకవచనం పరంబగునపుడౌపవిభక్తి కంబులు రావని కొందరు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధంబగుటంజేసి యానాదరణీయంబు"

**5.12 సూత్ర రచనా పద్ధతి:** 'అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్
అస్తోభమనవద్యంచ, సూత్రం సూత్ర విదోవిదుః (కావ్యమీమాంస)

**5.12.1 అల్పాక్షరత:** "ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సాహం మన్యంతేవైయాకరణాః"– ఒక్క మాత్రను తగ్గించి చెప్పగలిగిన పుత్రుడు జన్మించినంత సంతోషపడతారట వైయాకరణులు. అంటే భాషను పొదుపుగా వాడటాన్ని గురించి ఇది చెబుతుంది. అల్పాక్షరాలతో చెప్పదలచిన విషయాన్ని చెప్పటం వ్యాకరణ నిర్మాతల సూత్ర నిర్మాణ పద్ధతుల్లో ఒకటి. అందుకు పాణినీయ పద్ధతుల్ని పాటించాడు.

1. పారిభాషిక పదాల్ని వాడటం
2. ఇద్వర్ణాల్ని వాడటం

3. పరిభాషలను అనుసరించి సూత్ర నిర్మాణం చేయటం.

4. అనువృత్తులనాశ్రయించటం.

5. గణవర్గీకరణం.

6. వృత్తి వాక్య రచన

7. నిపాత సూత్ర నిర్మాణం

8. అధికార సూత్ర నిర్మాణం

**5.12.2 అసందిగ్ధత:** 'వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తి ర్నహిసందేహా దలక్షణమ్' – అన్న నిర్వచనానుసారం పరిభాషా కల్పనలో సందిగ్ధత పనికిరాదు. అటువంటి అసందిగ్ధత వ్యాకరణ నిర్మాతకు ప్రాణతుల్యమైంది. బాలవ్యాకరణంలో ఈ లక్షణం బాగా పాటించబడింది.

**5.12.3 సారవత్త్వము:** చెప్పిన ఒక లక్షణం బహులక్ష్య సాధకంగా ఉండాలి. అంతేగాని ఒక ఉదాహరణ కోసమే ప్రత్యేక సూత్ర నిర్మాణంతో గౌరవార్హుడు కాలేడు. బాలవ్యాకరణంలో సూత్రాలు బహులక్ష్యసాధకాలు.

**5.12.4 విశ్వతోముఖత్వం:** అనువృత్తులు మొదలయిన వాటిలో సూత్రంలో ఉన్న పదాల్ని వర్తింప చేయటం. అంటే పరిచ్ఛేదాది నియమాలు లేకుండా సూత్రాలు సర్వతోముఖంగా ప్రవర్తిల్ల చేయటం.

**5.12.5 అస్తోభత:** నిరర్థక పదాలు లేకుండా ప్రతిపదం సార్థకమై ఉండాలి. అంటే ప్రతి పదం ప్రయోజనాన్ని సాధించేదై ఉండాలి.

**5.12.6 అనవద్యత:** అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు లేకుండా ఉండాలి.

**5.13 సూత్రలక్షణం:** సంస్కృతంలో వ్యాకరణ సూత్రాలు ఎలా ఉండాలో వివరిస్తూ చెప్పిన ఈ క్రింది శ్లోకాన్ని గమనించండి–

"సంజ్ఞాచ పరిభాషాచ, విధిర్నియమ ఏవచ

అతిదేశోఽధికారశ్చ, షడ్విధం సూత్ర లక్షణమ్" ఈ శ్లోకంలో సూత్రం ఆరు విధాలుగా ఉండటాన్ని గమనించవచ్చు. ఈ లక్షణాలు బాల వ్యాకరణంలో కూడ ఉన్నాయి.

**5.13.1 సంజ్ఞ:** కొన్ని సూత్రాలు వ్యాకరణంలో రచయిత ఉపయోగించే సంజ్ఞలను వివరించేవిగా ఉంటాయి.

ఉదా॥ 'సంస్కృత సమేతరంబయిన యీ భాష యచ్ఛ యనంబడు' (ఆచ్ఛిక–1)

'నకారంబు ద్రుతంబు'

'కచటతపలు పరుషంబులని గజడదబలు సరళంబులని చెప్పంబడు'

**5.13.2 పరిభాష:** వ్యవహార ప్రసిద్ధమైన లౌకిక న్యాయాల్ని అనుసరించి కల్పించబడే పరిభాష. "పరితః భాష్యంతే ఇతి పరిభాషాః" ఉదా॥ 'ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకంబగు'

**5.13.3 విధి:** వ్యాకరణ కార్యం నిత్యంగా జరిగే సూత్రాలు విధిసూత్రాలు.

ఉదా॥ 'ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు' (సంధి–1)

**5.13.4 నియమం:** వ్యాకరణ నియమం నిత్యంగా కాకుండా ఉన్నప్పుడు వివరించే సూత్రాలు.

ఉదా॥ 'ఆమ్రేడితము పరంబగునపుడు మధ్యమ ముడుజ్‌లకు లోపంబు విభాషనగు'

**5.13.5 అతిదేశము:** వ్యాకరణ నియమాన్ని నిర్దేశించి, అతిదేశాన్ని విధించి చెప్పే సూత్రాలు

ఉదా॥ 1) దుతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు

2) విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు

**5.13.6 అధికారము:** ప్రకరణం మొత్తానికి వర్తించే సూత్రాన్ని అధికార సూత్రం అంటారు.

ఉదా॥ 'ధాతువునకు' (క్రియా–1) ఈ సూత్రం క్రియా పరిచ్ఛేదంలో అన్ని సూత్రాలకు వర్తిస్తుంది.

ఇటువంటి సంస్కృత వ్యాకరణ మర్యాదలను బాలవ్యాకరణానికి కూడ అన్వయించి చెప్పవచ్చు. ఇలా ఉంటే ఇది ఆంధ్ర పాణినీయమే అవుతుందిగాని వేరుకాదు.

**6. చిన్నయసూరి సూత్ర నిర్మాణ దక్షతను వివరించండి.**

(ఈ వ్యాసంలో బాలవ్యాకరణ సూత్రాన్ని నిర్మించటంలో చిన్నయసూరి చూపిన పటుత్వాన్ని గమనిస్తారు)

తెలుగువాళ్లకు వ్యాకరణం పేరు చెప్పితే 'బాలవ్యాకరణం' పేరు వెంటనే స్ఫురిస్తుంది. పేరుకు బాలవ్యాకరణమేగాని, విషయవివేచనలో పండితవ్యాకరణమే. ఈ వ్యాకరణం వెనుక 'పద్యాంధ్ర వ్యాకరణం', 'సూత్రాంధ్ర వ్యాకరణం, శబ్దలక్షణ సంగ్రహం, శబ్దశాసనం – అనే నాలుగు వ్యాకరణాల ప్రయత్నం ఉంది. చిన్నయసూరి అపార పరిశ్రమతోపాటు, మేధకు తార్కారణం ఈ బాలవ్యాకరణం. అందుకే 'బాల శబ్దానికి తర్కశాస్త్రం ఇచ్చిన నిర్వచనం 'గ్రహణధారణపటుః బాలః' అన్నది సమన్వయించుకోవాలని అప్పుడే ఈ వ్యాకరణం పేరులోని 'బాల' శబ్దానికి సార్థక్యం ఏర్పడుతుందని పండితులు భావిస్తారు.

బాలవ్యాకర్త చెప్పని చాలా అంశాలు ప్రౌఢవ్యాకర్త తన 'త్రిలింగలక్షణ శేషము'లో చెప్పాడని భావిస్తారు. దానికి కారణం ప్రౌఢవ్యాకర్త తన గ్రంథానికి పెట్టిన పేరు కూడకావచ్చు. ప్రౌఢవ్యాకర్త 'త్రిలింగలక్షణం'గా బాలవ్యాకరణాన్నే భావించి, శేషించినవే తన వ్యాకరణంలో చెపుతున్నానని స్ఫురించేలా 'త్రిలింగ లక్షణశేష' మనే పేరు ప్రౌఢవ్యాకరణానికి పెట్టటం కారణం కావచ్చు. కాని ప్రౌఢవ్యాకరణంలో చెప్పిన చాలావిషయాలు చిన్నయసూరి బాలవ్యాకరణేతర వ్యాకరణాలలో ఉన్నవే.

'ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సాహం మన్యన్తే వైయాకరణాః' – అన్నది సాధించటం వ్యాకర్తకు ఎంతో క్లేశంతో కూడిన పని. ఆ పనిని సాధించిన ఘనత సూరిది. భారతీయ దర్శనాలన్నింటిలో సూత్ర వాఙ్మయం ఉంది. సూత్రపద్ధతిలో చెప్పటం కేవలం వ్యాకరణాలలో మాత్రమే కనిపించే విషయం కాదు.

వ్యాకరణ సూత్ర రచనమెట్లా ఉండాలి – అంటే

"అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్
అస్తోభమనవద్యంచ సూత్రం సూత్ర విదో విదుః" (కావ్య.మీ.)

"సంజ్ఞాచపరిభాషచ విధిర్నియమ ఏవచ
అతిదేశోऽధికారశ్చ షడ్విధం సూత్ర లక్షణమ్" – వంటి శ్లోకాలు మన మెదళ్లలో మెదలుతాయి.

సూత్రశబ్దానికి

'సూచనాత్ సూత్రమ్'

'సూచయతి సూత్రే సూత్రయతివా సూత్రమ్

'సూత్రం – సూచనకృత్ సూత్ర్యత్ గ్రధ్యతే ఇతిసూత్రమ్'

'సూచనాద్వా'

– వంటి నిర్వచనాలు ప్రచారంలో ఉన్న సంగతి వైయాకరణులకు తెలిసిన విషయమే.

బాలవ్యాకరణ సూత్రాల్ని ఎక్కువగా పాణినీయ సూత్రాలతో పోల్చి 'ఆహా!' సూరి ఎంత లాఘవంగా చెప్పాడని మనం మురిసిపోతాం. కాని వైయాకరణ ప్రపంచంలో, పాణినీయ సంప్రదాయంతోపాటు 'ప్రాతిశాఖ్య సంప్రదాయం' కూడా ప్రసిద్ధమైన సంప్రదాయమే. పాణినికి ముందే శిక్షాప్రాతిశాఖ్యలలో ధ్వనిశాస్త్రం క్షుణ్ణంగా చర్చించబడింది. వాటినన్నింటినీ పాణిని అవసరమైన మేరకు వాడుకున్నాడు. పాణినీయ వ్యాకరణం విశేషమేమిటి? అని ప్రశ్నించి ఒక్కమాటలో చెప్పమంటే 'ప్రత్యాహార పద్ధతి' అని ఠక్కున చెప్పేస్తాం. ఇది మహేశ్వర సూత్రాల నుండి గ్రహించబడింది. ఈ మాహేశ్వర సంప్రదాయంలో జైనేంద్రుడు పరాకాష్ఠ. జైనేంద్ర వ్యాకరణంలో రెండక్షరాల సూత్రాలు కూడా ఉన్నాయి. ఇది పాణినీయం కంటే సాంకేతికమైంది. ఇక కాతంత్ర వ్యాకరణం గురించి చెప్పితే అది Adult Education వాళ్ళ పాఠ్యపుస్తకం లాంటిది.

బాలవ్యాకరణంలో మొత్తం 465 సూత్రాలు ఉన్నాయి. సూరికి పూర్వం, తెలుగులో వ్యాకరణ సూత్రాలు రాసిన సమకాలీనులున్నారు. తొలి ప్రయత్నంగా తాను స్వయంగా వ్రాసిన వ్యాకరణ సూత్రాలూ ఉన్నాయి. తాను నిరంతర అధ్యయన అధ్యాపనాల చేత నిర్మించుకున్న వ్యాకరణ జగత్తు నుండి సృష్టించిన బాలవ్యాకరణం, స్పష్టత, సంక్షిప్తతతో సంస్కృత వ్యాకరణాలకు దీటుగా తయారై, పండితుల మన్ననలకు పాత్రమైంది.

19వ శతాబ్దంలో బాలవ్యాకరణానికి ముందే నాలుగు వ్యాకరణాలు బాగా జనాదరణ పొందాయి. సంప్రదాయ సిద్ధమైన ఆంధ్రశబ్దచింతామణితో పాటు దానికి వ్యాఖ్యానప్రాయంగా వేదం పట్టాభిరామశాస్త్రి రచించిన "పద్యాంధ్ర వ్యాకరణం" పట్టాభిరామ పండితీయం (1816), రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారి 'తెలుగు వ్యాకరణం' (1836), పుదూరి సీతారామశాస్త్రిగారి 'ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణం' (1834), ఉదయగిరి శేషయ్యగారి 'వ్యాకరణం' (1856) – ఇవన్నీ సూరి విద్యార్థులకు బోధించటమో, చూడటమో చేసిన వ్యాకరణాలే. అయితే ఆయన పూర్వులెవ్వరూ సూత్రరచనకుగాని, సంస్కృతంలోని సూత్రవార్తిక పరిభాషా పద్ధతులకు గానీ సూరిలాగా ప్రాధాన్యాన్నీయలేదు. బూదరాజు రాధాకృష్ణ మాటల్లో చెప్పాలంటే "ద్రవిడాత్మను ఆర్యశరీరంలో ఇమిడ్చటంలో, తెలుగు భాషా సహజ లక్షణాలను సంస్కృత వ్యాకరణ ప్రణాళికకు అనుగుణంగా మలచటంలో సూరి తన శక్తియుక్తులనన్నీ ధారపోశాడు.

భట్టోజీ దీక్షితుని సిద్ధాంత కౌముదిలోని రచనా ప్రక్రియనూ, ప్రణాళికను అనుసరించి తెలుగు వచనంలో సూరి వ్యాకరణ సూత్రాలు రచించినట్లు అనిపిస్తుంది. తెలుగుభాషకు, తెలుగులో సంప్రదాయ పద్ధతిలో వచ్చిన వ్యాకరణ గ్రంథాలలో విస్తృతమైంది.

1) సంజ్ఞా – 23 సూత్రాలు, 2) సంధి – 55 సూత్రాలు, 3) తత్సమ – 87 సూత్రాలు, 4) ఆచ్ఛిక – 38 సూత్రాలు, 5) కారక – 37 సూత్రాలు, 6) సమాస– 26 సూత్రాలు 7) తద్ధిత – 28 సూత్రాలు 8) క్రియా – 24 సూత్రాలు, 9) కృదంత – 22 సూత్రాలు 10) ప్రకీర్ణక – 25 సూత్రాలు.

సూత్రంలో ఒక్క హ్రస్వాక్షరాన్ని తగ్గించగలిగినా పుత్రోత్సవం చేసుకున్నంత ఆనందాన్ని వ్యాకర్తలనుభవిస్తారని చెప్పారు కదా! దానికి ఉదాహరణగా ఒకటి చూద్దాం.

క్రియా పరిచ్ఛేదంలో క్రియా ప్రత్యయాల్ని నిర్దేశిస్తూ డుఙ్, రు, వు, రు, ను, ముఙ్ లను పేర్కొన్నాడు.[1] వీటిలో ఏవి ఏకవచనాల్లో, ఏవి బహువచనాల్లో చెపుతూ "రు, ము లు బహువచనంబులు, పెఱలేకవచనంబులు (క్రియా–10) అని పేర్కొన్న సూత్రాన్ని గమనిస్తే ఈ అల్పాక్షరత్వం కోసం చేసిన శ్రమ కనిపిస్తుంది.

సాధారణంగా వచనాల్లో ఏకవచనాన్ని ముందు చెపుతాం. తరువాత బహువచనాన్ని చెపుతాం. ఆ పద్ధతిలో ఈ సూత్రాన్ని చెపితే 'డుఙ్'– వు– ను లేకవచనంబులు, పెరలు బహువచనంబులు' అని వ్రాయాలి. ఏకవచనంలో డు,వు,ను– అనే మూడింటిని పేర్కొనటమే కాకుండ, బహువచనంలో 'రు' – వర్ణకాలు రెండున్నాయి. (ప్రథమబహువచనం, మధ్యమ బహువచనం). కాబట్టి రు,ము అనే రెండు వర్ణాల్ని నిర్దేశిస్తే – మూడు ప్రత్యయాల్నీ చెప్పినట్లే అవుతుంది. అందువల్లనే ముందు ఏకవచనం చెప్పి, తరువాత బహువచనం చెప్పాలన్న క్రమాన్ని తప్పించి, 'రు,ము లు బహువచనంబులు, పెఱలేక వచనంబు' – అని సూత్రించాడు. దీనిని బట్టి సూత్రరచనకవసరమైన లాఘవ దృష్టి సూరికెలా ఉందో విశదమవుతుంది.

పాణినీయాన్ని అనుకరించి, యథాతథంగా కొన్ని సూత్రాల్ని అనువదించినప్పటికీ అందులో కూడ లాఘవం ప్రదర్శించిన సందర్భాలు ఉన్నాయి. ఉదా॥కు పాణినీయంలో

'ధ్రువమపాయేఽ పాదానమ్' (1-4-24)

'అపాదానే పంచమీ ' (2-3-28)

'భీత్రార్థానాం భయహేతుః' (1-4-25)

'పరాజేరసోఢః' (1-4-26)

'వారణార్థానామీప్సితః' (1-4-27)

'అంతర్ధౌ యేనాదర్శనమితి' (1-4-28)

'భువః ప్రభవ' (1-4-31)

ఈ మొదలైన సూత్రాల ద్వారా 'అపాయ - భయ - త్రాణ - పరాజయ - వారణ -అంతర్ధి- భువనార్థాలలో విధించిన పంచమీ విభక్తిని, 'జుగుప్సా విరామ ప్రమాదార్థానా ముపసంఖ్యాయామ్'- అనే వార్తికం ద్వారా 'పంచమీ విభక్తే'-అనే సూత్రంద్వారా నిర్దేశించి చెప్పిన వాటి భావార్థాన్ని గ్రహించి ఒకే సూత్రంగా నిర్మించాడు. అదే 'అపాయ-భయ - జుగుప్సా- పరాజయ - ప్రమాద - గ్రహణ- భవన - త్రాణ - విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు'' (కార-9) అనే సూత్రం.

అలాగే పాణినీయ సూత్రాన్ని, రెండు సూత్రాలుగా వ్రాసిన సందర్భంగా కూడా ఉంది. 'కర్తృకరణయోః తృతీయా' (2-3-18) అన్న సూత్రాన్ని 'చేతవర్ణకంబు కర్తకగు', 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాది యోగజంబగు పంచమికిని బహుళంబుగానగు' - అని చెప్పటం ఇటువంటిదే కారక ప్రకరణంలోని సూత్రాల వరుస అంతా సిద్ధాంత కౌముదిలోని, విభక్త్యర్థ ప్రకరణంపైనే ఆధారపడినట్లు కనిపిస్తుంది.

### 6.1 అనువృత్తి పద్ధతి

ఎన్నోసార్లు చెప్పవలసి వచ్చే ఒక శబ్దాన్ని, ప్రతిసారీ సూత్రంలో చెప్పటం వ్యాకరణ సంప్రదాయం కాదు. దాని కోసం వ్యాకర్తలేం చేస్తారంటే, మొదటనే ప్రసంగ ప్రారంభంలోనే ఆ శబ్దాన్ని ఒక సూత్రంలో ఉంచి, తరువాత సూత్రాలలో దానిని అనువర్తింప చేస్తారు. దీనినే అనువృత్తి పద్ధతి అంటారు. ఉదా॥కు క్రియాపరిచ్ఛేదంలో 'ధాతువునకు' - అని చెప్పిన మొదటి సూత్రంలోని 'ధాతువునకు' - అనేది తరువాతి సూత్రాలకు అనువర్తిస్తుంది. ఉదా॥కు 'వర్తమానంబున లట్టగు' - అంటే 'వర్తమానంబున ధాతువునకు లట్టగు' - నని అర్థం. అలాగే సంధి పరిచ్ఛేదంలో 'ఉత్తున కచ్చుపరంబగునప్పుడు సంధియగు' - అనే సూత్రంలో 'అచ్చుపరంబగునప్పుడు' - అన్న పదాలు 'అత్తునకు సంధి బహుళంబుగానగు' - వంటి తరువాతి సూత్రాలకు వర్తిస్తుంది. ఈ అనువృత్తి పద్ధతి సంస్కృత వ్యాకరణ సంప్రదాయము.

అయితే సంధి పరిచ్ఛేదంలో 'అచ్చుపరంబగునప్పుడు' అన్నది కాక, యడాగమసంధి సూత్రంలో చెప్పిన 'స్వరంబు కంటె స్వరంబు పరమైన' - అన్న దానిని అనువర్తింప చేసుకోవాలని కొందరు చెప్తుతారు, కాని అది సమంజసమనిపించదు. 'అత్తునకు సంధి బహుళంబుగానగు' - అన్న సూత్రానికి 'అత్తునకు అచ్చుపరంబగునప్పుడు సంధి బహుళంబుగానగు' - అన్నదే సమంజసం. 'అత్తునకు స్వరంబుకంటే పరంబైన స్వరంబునకు' అనటం అసంగతంగా కనిపిస్తుంది. అత్తు అంటేనే స్వరం కదా! పైగా చెప్పటం వల్ల ఇది అసంగతకునని అనిపిస్తుంది.

### 6.2 నిపాతపద్ధతి

ప్రౌఢవ్యాకర్త 'అతడు' - అనే సర్వనామరూపాన్ని సాధించటానికి, ఆ పదంలోని అక్షరాల సంఖ్య కంటే ఎక్కువ సూత్రాల్ని వ్రాశాడు. ఒక సూత్రం ద్వారా కనీసం రెండు, మూడు రూపాలు సాధించబడాలి కాని ఒక్క రూపం కోసం మరిన్ని సూత్రాలు వ్రాయటం వ్యాకరణ మర్యాదకాదు. అటువంటి సందర్భాలలో ప్రక్రియారహితంగా, ఆ శబ్దాల స్వరూపాన్ని సూత్రంలో నిర్దేశించి వాటి సాధుత్వాన్ని నిరూపించటమే నిపాత పద్ధతి.

ఉదా॥కు బాలవ్యాకరణంలో 'అన్ని ప్రభృతులు సర్వనామంబులు' (ఆబ్ధి-24) అని సూత్రించిన సందర్భం ఇటువంటిదే. సాధారణంగా అన్ని మొ॥న సర్వనామ శబ్దాల్ని, వర్ణనాత్మక ప్రక్రియ ద్వారా నిరూపించటం అంటే కష్టసాధ్యమైనపనే. ప్రక్రియాత్మకంగా సూత్రించటమంటే రూపాలకంటే సూత్రాల సంఖ్యే అధికం అవుతాయి. సూరి తన పూర్వ వ్యాకరణాలైన సూత్రాంధ్ర వ్యాకరణం, శబ్దలక్షణ సంగ్రహం – లో కొన్ని సర్వనామ శబ్దాలను సాధించే ప్రక్రియ చేపట్టాడు. కాని అది వ్యర్థ ప్రయాసగా భావించి సిద్ధరూపాన్ని బాలవ్యాకరణంలో ప్రదర్శించాడు.

ఇలా తత్సమ పరిచ్ఛేదంలో 'కద్రువనాగమాత' (51) 'పృధ్వీవాచిభూ శబ్దంబునకు భువియగు' (62), 'నౌశబ్దంబునకు నావయగు' (63) 'మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజునాఁబడు' (78), 'వేధపురోధ పురోధసుఁడు' (82) మొదలైనవి.

**6.3 అసందిగ్ధం**

సంక్షిప్తతతోపాటు స్పష్టత ముఖ్యం. ఆ స్పష్టత లేని సంక్షిప్తత వ్యర్థ ప్రయత్నమే. ఆ స్పష్టతను పాటించటంలో సూరి దిట్ట. ఉదా॥కు ఈ క్రింది సూత్రాన్ని గమనించండి.

**6.3.1 "ఇగ్లౌరా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" (తత్సమ 44)**

ఈ సూత్రంతో ఇకారాంత శబ్ద ప్రక్రియ ప్రారంభించబడుతున్నది. వీటికి ప్రథమైక వచనలోపాన్ని విధించటం ఇందులోని అంశం. ఇకారాంతాలతోపాటు, రై, గ్లౌ శబ్దాలకు, హలంత శబ్దాలలో రుక్కు, రాట్టు మొదలైన ఉగాగమాంత శబ్దాలకు కూడ ప్రథమైక వచనలోపం విధించాల్సి ఉంది. ఒకే కార్యాన్ని, వివిధ శబ్దాలకు, వివిధ సందర్భాలలో విధించి చెప్పటం వల్ల సూత్రసంఖ్య పెరుగుతుంది. అలా పెంచకుండ ఒకే సూత్రంలో చెప్పటం వ్యాకరణ సంప్రదాయం. కాని ఇక్కడ ఈ సందర్భంలో ఒక సమస్య ఉంది. ఏమిటంటే అజంతశబ్ద ప్రక్రియ' అ-ఇ-ఉ-ఋ-ఐ-ఔ'- అనే ఆకారాది క్రమంలో సాగుతున్నది తరువాత వచ్చే 64వ సూత్రంతో కూడ 'రై, గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు' (తత్స. 64) అని చెప్పాడు. అంటే ఇందులో రై, గ్లౌ అనటంలో ఐ, ఔ అనే అచ్చుల క్రమాన్ని పాటించటం కనిపిస్తుంది. మరి ఈ సూత్రంలో ఎందుకు ఆ క్రమాన్ని పాటించలేదో గమనిస్తే సూరిగారి స్పష్ట రచనా విధానానికి పరవశించిపోతాం'

**6.3.2.** ఆ క్రమాన్ని పాటించి చెప్పితే ఈ సూత్రం. 'ఇ, రై, గ్లౌ, వు గంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు' – అని తయారవుతుంది. తత్సమ శబ్దాలకు బాలవ్యాకరణ ప్రక్రియలో 'వు'గాగమం విధించటం తెలిసిందే. ఈ సూత్రంలో 'వుగంత' – శబ్దంచేత వుగాగమాంతాలు స్ఫురించి, ఈ ప్రథమైక వచన లోపం దానికి సంబంధించిందేమోనన్న భ్రాంతి కలుగుతుంది. అందుకనే 'ఇ, గ్లౌ, రై + ఉగంత' – అని క్రమాన్ని మార్చి సంధి చేసి, 'ఇ, గ్లౌ రాయుగంత' – అని చెప్పాడు. మరి 'యుగంత'– మన్నప్పుడు 'యుగాగమము' అన్న భ్రాంతికలుగవచ్చును గదా అంటే – బాలవ్యాకరణంలో ఎక్కడ యుగాగమంలేదు. (యుక్) కాబట్టి సందేహానికి తావులేక ఉగంతాలే స్ఫురిస్తాయి.

ఈ సూత్ర వివరణంలో 'ఇకారాంతములకు గ్లౌ, రై శబ్దములకు మఱియుగాగమాంతంబులకు బ్రథమైక వచన లోపంబగు' – అని చెప్పిన వాక్యంలో మఱియు – అన్న పదం ఉకారాంతం అనిపించవచ్చు. కాని విచారిస్తే ఇది కూడ స్పష్టత కోసం చేసిన ప్రయత్నమే. 'మఱి' – శబ్దం లేకుండ 'గ్లౌ, రై శబ్దములకును, నుగాగమాంతంబులకు' – అని అంటే ప్రసిద్ధమైన 'నుగాగమం' – స్ఫురిస్తుంది. అందుకే 'మఱి' – అనే పదాన్ని స్పష్టత కోసం తగిలించాడు. దానివల్ల నుగాగమ భ్రాంతి తొలగుతుంది.

అలాగే క్రియాపరిచ్ఛేదంలో

'తే తేరులు తెచ్చునకగు' (క్రియా – 93)

'చావు నోవులు చచ్చునొచ్చులకగు' (క్రియా–94)

అన్నసూత్రాలు సాధారణ క్రమానికి భిన్నంగా కనిపిస్తాయి. వీటిని సాధారణ క్రమంలో చెపితే 'తే తేరులు తెచ్చునకగు', 'చావు నోవులు చచ్చునొచ్చుల కదు' – అవుతాయి. అప్పుడే సూత్రాల్లోని తే తేరులు, చావు నోవులు సరళాదులన్న సందేహం కలిగే అవకాశం ఉంది. అందుకే స్పష్టత కోసం సరళాదేశ సంధుల్ని తప్పించి, ఉద్దేశ్యవిధేయ క్రమాన్ని తప్పించాడు.

"సంజ్ఞాచ పరిభాషాచ విధిర్నియమ ఏ వచ
అతిదేశోఽ ధికారశ్చ షడ్విధం సూత్ర లక్షణమ్' –

అనే ఈ శ్లోకాన్ని బట్టి సంజ్ఞా సూత్రాలు, పరిభాషా సూత్రాలు, విధి సూత్రాలు, నియమసూత్రాలు, అతిదేశసూత్రాలు, అధికారసూత్రాలు అని ఆరు జాతులుగా సంస్కృత వైయాకరణ సంప్రదాయజ్ఞులు విభజించారు. ఈ ఆరు రకాలకు ఉదాహరణలు చూద్దాం.

**6.4.1 సంజ్ఞాసూత్రానికి:**

సూ॥ 'కచటతపలు పరుషంబులని గజడదబలు సరళంబులని చెప్పంబు' (సంజ్ఞ–5)

సూ॥ నకారంబు ద్రుతంబు (సంజ్ఞ–11)

**6.4.2 పరిభాష:**

'ఇటవిశేషంబుత్సరంబునకు విభాషను బాధకంబగు' (తద్ధిత–2). ఉత్సర్గమంటే సామాన్యవిధి. సామాన్యవిధికి, విశేషవిధి నిత్యంగ బాధకమవటమే వ్యాకరణంలో సార్వత్రికమైన సాధారణ పద్ధతి. కాని ఈ తద్ధిత పరిచ్ఛేదంలో మాత్రం విశేష విధులు, సామాన్య విధికి వికల్పంగా బాధకాలవుతున్నాయి. అంటే విశేష విహితమైన ఇకాదులు ప్రవర్తించిన అన్నిచోటులలో సామాన్య విహితమైన 'తన' వర్ణకము సయితము కలుగుతుందని తాత్పర్యం.

**6.4.3 విధి:**

'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు' (సంధి–1)

**6.4.4 నియమము:**

"ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుజ్ఞులకు లోపంబు విభాషనగు' (సంధి–49)

ఈ సూత్రం ద్వారా ఈ నియమాన్ని చెప్పినట్లయితే 'ఆమ్రేడితంబు' పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు' (సంధి–41) అన్న సూత్రంచేత ఆమ్రేడితస్థలాలలో క్రియావిభక్తులన్నింటికి లోపం రావలసిన పరిస్థితి వచ్చేది. ఈ మధ్యమ ముడుజ్ఞలు గాక తక్కిన 'వచ్చిరి+వచ్చిరి', 'రాగలడు+రాగలడు'– వంటి వాటిలోని క్రియావిభక్తులకు లోపం ప్రవర్తింపచేసి, కురూపాలు రాకుండ చేయటమే ఈ నియమం వలన కలిగే ప్రయోజనం.

**6.4.5 అతిదేశము:**

'దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు' – (తత్సమ–61)

"విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు" (తత్సమ–75)

**6.4.6 అధికారము:**

'ధాతువునకు' (క్రియా–1)

**6.5 వృత్తులు – వార్తికాలు**

**6.5.1 వృత్తులు:** సిద్ధాంత కౌముదిలోలాగే సూత్రాలకు వృత్తులు అంటే వివరణలు బాలవ్యాకరణంలో కనిపిస్తాయి. ఇవినాతి దీర్ఘంగా, సార్థకంగా దాదాపు సూత్రాలే అన్నట్లుగా ఉంటాయి. ఇవి నాలుగు రకాలుగా కనిపిస్తాయి.

**6.5.1.1 స్పష్టము:** సూత్రార్థం స్పష్టంగా ఉండి, ఉదాహరణలు అవసరంలేని చోటులు. ఇటువంటి చోట్ల 'స్పష్టము' – అని మాత్రమే చెపుతాడు. బాలవ్యాకరణంలో ఇవి 5 ఉన్నాయి. తత్సమ–20; ఆచ్ఛిక–1; తద్ధిత–2, 21; ప్రకీర్ణక–3;

**6.5.1.2 స్పష్టము అన్న సంజ్ఞయే కనిపించనివి**: పైన పేర్కొన్న సందర్భాల వంటి సందర్భాలున్న సూత్రాలే అయినప్పటికీ వాటి క్రింద స్పష్టము అన్న సంజ్ఞ కనిపించదు. ఇటువంటివి బాలవ్యాకరణంలో 14 ఉన్నాయి. ఉదా॥కు 'కచటతపలు పరుషంబులని, గజడదబలు సరళంబులని చెప్పబడును (సంజ్ఞ–5)

ఇంకా, సంజ్ఞా–5,11; సంధి–26; తత్సమ–1,7; సమాస–4; క్రియా–10, 11, 31, 86; ప్రకీర్ణక–5,23,24,25.

**6.5.1.3 సాధారణ లక్షణాలకు లొంగనివి:** వివరణలో సూత్రార్థం మాత్రమే కాకుండా, 'రాజు శబ్దం బొక్కదు దంత్యయుక్తంబు కానంబడి యెడి' – వంటిచోట్ల సాధారణ లక్షణాలకు లొంగని విశేషాలు వార్తికాల మూలాన సాధించటం గమనించవచ్చు.

**6.5.1.4 విధించిన కార్యాల్లో ఏది సార్వత్రికమో, ఏది ప్రాయికమో, ఏది విరళమో, ఏది అవివిరళమో, ఎక్కడికక్కడ వివేచించి సూచించే పద్ధతి:**

ఉదా॥ 'సర్వత్రయనుట నగాగమ బాధనార్థము (తత్సమ–23)

'ఉపోత్తమేత్వంబున కనుటం చేసి జగి, నిసి ఇత్యాదు లందుత్వంబులేదు' (తత్సమ–46) మొ॥వి.

**6.5.2 వార్తికాలు:**

'వర్తయన్తి కార్యవిశేషాన్ ఇతివార్తికాని' –

'ఉక్తానుక్త దురుక్త చింతనాత్మకం హి వార్తికం' –

సూత్రాలలో చెప్పబడని కార్యవిశేషాలు. ఇందులో చెప్పబడతాయి. వృత్తివేరు, వార్తికం వేరు. వృత్తులు వివరణ వాక్యాలు. వార్తికాలు సూత్రాలకు చెప్పిన పూరణవాక్యాలు. వీటికి సూత్రాలకున్నంత ప్రతిపత్తి ఉంటుంది. సూత్ర విషయాలకు కొద్ది మార్పునో చేర్పునో తెలుపటానికి రచింపబడేవి వార్తికాలు. ప్రౌఢవ్యాకరణ సూత్రాలనన్నిటిని బాలవ్యాకరణ సూత్రాలకు వార్తికాలుగా చెప్పవచ్చు. ఎందుకంటే ప్రౌఢవ్యాకరణమంతా బాలవ్యాకరణానికి పూరకమే కాబట్టి.

సూత్రాలలో ఎటువంటి సూచనలు లేకుండా, క్రొత్తగా విశేషాల్ని ప్రతిపాదించే వాక్యాల్ని వార్తికాలని అనవచ్చు. సూత్రంలోని బహుళము, తఱచుగానగు, విభాష, ప్రాయికము వంటి శబ్దాలకు ప్రయోజనాల్ని వివరించేవి వార్తికాలు కావు.

బాల వ్యాకరణంలో సూత్రకర్త, వృత్తికర్త, వార్తిక కర్త, ఉదాహరణ కర్త ఒక్కరే. పాణినీయ విషయంలో వీటి కర్తలు వేరు వేరు. బాలవ్యాకరణంలోని వార్తికాల్ని గమనించండి.

1. రాజు శబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి – (సంజ్ఞా–10)
2. ఈ కార్యము కళలగు క్రియాపదముల మీఁద సహితము కానఁబడియెడి – (సంధి–13)
3. ఈ యాగమంబొకానొక చోట స్థిరంబు పరంబగుతోఁ గానంబడియెడి – (సంధి–13)
4. కెంధూళి, కెంజడలని ప్రయోగంబులు కానంబడియెడి – (సంధి–38)
5. ఈ కార్యము కర్మవాచిము వర్ణకమునకు ఁగలుగదు – (సంధి–46)
6. ఈ కార్యము లాతిచో సహితముగానంబడియెడి – (సంధి–51)
7. కార్యర్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడుమానంబడు వర్ణమిత్తునాఁబడు – (తత్సమ–19)
8. దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి – (తత్సమ–38)
9. కొండొకచోనుత్వంబున కిత్వంబు చూపట్టదు – (ఆచ్ఛిక–36)
10. ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చోటులు అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి – (సమాస–15)
11. వచ్చర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడి యెడును – (క్రియా–22)
12. ఈయయనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి (క్రియా–92)

**6.6 లక్ష్యాలు**

సూత్రాల్లో చెప్పిన లక్షణాల్ని సమన్వయిస్తూ ఉదాహరణలిస్తారు.

**6.6.1 ఉదాహరణలు చూపనవసరంలేనివి**

ఉదా॥ పయ్యెద పయ్యద (ప్రకీర్ణ–5)

### 6.6.2 ఉదాహరణలు చూప వీలుపడనివి

ఉదా॥ "ఇకారంబు మీద కు-ను-వు- క్రియావిభక్తులు.

"యుత్వంబున కిత్వంబగు" - (తత్సమ-26). ఈ సూత్రంలో హరికి, హరిని, అని కు, ను లకు మాత్రమే ఉదాహరణలు చూపాడు. 'సుకృతివి', 'చెప్పిరి'- వంటి వాని ప్రక్రియ క్రియాపరిచ్ఛేదంలో (18), కారకపరిచ్ఛేదంలో (33) కనిపిస్తుంది. అందుచేత కేవలం ఇత్వం కోసమే ఇక్కడ ఉదహరించటం వీలుకాక చూపలేదు.

### 6.6.3 ఉదాహరణలు చూపేవి

ఇటువంటి సందర్భాలలో కూడ ఏ సూత్రానికి ఎన్ని అవసరమో అన్నీ నిర్దేశిస్తాడు. ఆ చూపటంలో కూడ కార్యవిధాన క్రమాన్నో, విభక్తి క్రమాన్నో, వచనక్రమాన్నో, వర్ణక్రమాన్నో ఏదో ఒక క్రమాన్ని పాటించటాన్ని స్పష్టంగా చూడవచ్చు. ఒక ఉదాహరణ స్థానంలో వేరొక ఉదాహరణ మనం చూపిద్దామంటే అది అంత సులభం కాదు. అంత ఔచితీమంతంగా ఉదాహరణల్ని పేర్కొంటాడు.

## 6.7 సంజ్ఞలు - ఇత్సంజ్ఞలు

**6.7.1.1 పాణినీయ సంజ్ఞలు:** ఆమ్రేడితము, అవసానము, నామము, విభక్తి, ఉపధ, ఉపోత్తమం, కర్త, కర్మ, ఉపయోగం, నిర్ధారణం, ఆఖ్యాతం, ఆగమం, ఆదేశం, సంప్రదానం, అధికరణం, ప్రథమం, మధ్యమం, ఉత్తమం, గుణము, గతి, ఉపసర్గ, కృత్తు, తద్ధితము మొదలైనవి.

**6.7.1.2 చింతామణీయ సంజ్ఞలు:** వక్రము, వక్రతమము, పరుషము, సరళము, స్థిరము, సవర్ణము, ద్రుతము, ద్రుతపుకృతికము, కళ తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము సంధి, సంశ్లేషము, వర్ణకము, మహత్తు, ఔపవిభక్తకము మొదలైనవి.

సంధి, స్వత్వము, శబ్దపల్లకం వంటి సంజ్ఞలు. ఆధర్వణ కారికల్లో ఉన్నాయి.

**6.7.1.3 సూరి కల్పించుకున్నవి:** చింతామణి, పాణినీయ సంజ్ఞలతోపాటు సూరి స్వయంగా డుమంతము, త్రికము, ముజ్ఞు, ముత్తు అనే సంజ్ఞలకు కల్పించుకున్నాడు. చితామణి, ఆధర్వణకారికలలో కనిపించే స్త్రీసమ, క్లీబసమ శబ్దాలు బాలవ్యాకరణంలో సంస్కృతసమములైన తత్సమ శబ్దాలకు స్త్రీతుల్య, క్లీబతుల్య అని ఆచ్ఛిక శబ్దాలకు స్త్రీసమ, క్లీబసమమనే భేదం కనిపిస్తుంది.

సూరి మేధకు పరాకాష్టగా చెప్పదగిన వాటిలో ఒక సూత్రాన్ని ప్రస్తావిస్తాను. క్రియాపరిచ్ఛేదంలో

**6.7.2 ఇత్సంజ్ఞలు:** సంక్షేపంగా చెప్పటానికి ఇద్వర్ణాలు వ్యాకర్త కల్పించుకుంటాడు. ఇత్సంజ్ఞా కల్పనపై ఆధారపడ్డ ప్రక్రియా ప్రసంగాలు పాణినీయంలో చాలా కనిపిస్తాయి. ప్రాకృత వ్యాకరణంలోను ఇటువంటి పద్ధతి కలదు.

బాలవ్యాకరణంలో అయిదు రకాల ఇద్వర్ణాలు పాటించబడ్డాయి. అవి 1) టిత్తులు, కిత్తులు, జిత్తులు, జీత్తులు, ఞిత్తులు.

1) టిత్తులు - 3 (యట్, లట్, ఇయట్)

2) కిత్తులు - 23 (నుక్, టుక్, రుక్, అలిక్, వుక్, నిక్, నక్, ఆరక్, ముక్, ఉక్, అవక్, ఇక్, దుక్, ఎదక్, ఎడుక్, ఎడిక్, ఇంచుక్, అయుక్, అవుక్, అరుక్, చుక్, పుక్, గుక్)

3) జిత్తులు -5 (దుజ్, కుజ్, గుజ్, పజ్, తజ్)

4) జీత్తులు-11 (లజీ, కలజీ, పదుజీ, కుజీ, వుజీ, రుజీ, కజీ, మిజీ, నుజీ, నిజీ, నజీ)

5) ఞిత్తులు - 3 (దుఞ్, రుఞ్, వుఞ్)

ఈ ఞిత్త్వానికి వ్యాకరణ కార్యవిధానాలపట్ల పెద్ద ప్రయోజనం లేదు. పైన చూపిన దుఞ్, రుఞ్, వుఞ్ అనచోట్లలో ప్రత్యాహారాల కొఱకు మాత్రమే ఇది కల్పించబడినది.

**6.8 పరిభాషలు**

పాణినీయంలో వ్యవహార ప్రసిద్ధమైన లౌకిక న్యాయాలననుసరించి పరిభాషలు కల్పించబడ్డాయి. 'పరితః భాష్యంతే ఇతి పరిభాషాః' అంటే లోకంలో తరచుగా వ్యవహరించబడేవి కాబట్టి వీటికి పరిభాషలన్నపేరు. అలా కాకుండా ఇతర మార్గాలలో కల్పినవి కూడ కొన్ని కనిపిస్తాయి. పాణినీయం నుంచి అనువదించబడిన కొన్ని పరిభాషలను గమనించండి.

ఆద్యన్తౌ టకితౌ (సంధి-3,25); నిరవకాశా హి విధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే (సంధి-3, 9); అలోన్త్యస్య (సంధి-3, 43); సన్నియోగశిష్టానాం సహవా ప్రవృత్తి స్సహవా నివృత్తిః (తత్సమ-43); ప్రత్యయ గ్రహణే తదన్తస్యాపి గ్రహణమ్ (తత్సమ-67); యదాగమాః తద్గుణీ భూతాః తద్గ్రహణేన గృహ్యన్తే (సమాస-25); సహచరితాసహచరితయోః సహచరితస్యైవగ్రహణమ్ (క్రియా-12) - వంటివి చిన్నయసూరి తమ సూత్ర రచనలో వృత్తిలో అనువదించుకున్నాడు.

**6.9 గణాలు**

పెక్కు శబ్దాలకు కలిగే ఒకే విధమైన వ్యాకరణ కార్యాలు చెప్పాల్సివచ్చినప్పుడు ఆ శబ్దాలనన్నింటిని పేర్కొనకుండా సంక్షేపించి చెప్పటం కోసం అటువంటి శబ్దాలన్నింటిలో ఉన్న సాధారణమైన ధర్మాన్ని గుర్తించి దానిని పేర్కొని ఒకే ఒక శబ్దంతో ఆ శబ్దాలనన్నింటిని పేర్కొనటాన్ని గణమని అంటారు. ఇటువంటి గణాలను చిన్నయసూరి పదింటిని పేర్కొన్నాడు. అవి - 1) అంద్వాదులు (సంధి-44), 2) అన్వాదులు (క్రియా-55), 3) అన్ని ప్రభృతులు (ఆచ్ఛిక-24), 4) అప్పాదులు (క్రియా-79), 5) అఱ్ఱు మొదలైనవి (ఆచ్ఛిక-34), 6) ఆల్వాదులు (ఆచ్ఛిక-11), 7) ఇఁకాదులు (సంధి-9), 8) కలన్వాదులు (ఆచ్ఛిక-18), 9) నామ్వాదులు (సమాస-19), 10) పద్వాదులు (క్రియా-51). ఇవి కాక కొన్ని ఆకృతి గణాలుగా కొన్ని సాధారణ గణాలుగా పేర్కొన్నాడు.

**6.10 కార్యవిధానాలు**

బాలవ్యాకరణ సూత్రాలలో ఆగమాలు, ఆదేశాలు, అతిదేశాలు, లోపాలు వంటి కార్య విధానాలతోపాటు ఏడు విశేష నిర్దేశాలకు వ్యాకరణకార్యాలు విధించబడ్డాయి. అవి -

1) నిత్యములు - 6: (తత్సమ-24, 49, 60; ఆచ్ఛిక-14,18;, క్రియా-59)

2) బహుళములు -40

3) ప్రాయికములు - 12: (వివరణగల చోటులు: సంధి-10, ఆచ్ఛిక-2; కారక-6, 33; సమాస-3; క్రియా-89, వివరణములేని చోటులు: ఆచ్ఛిక-29, 31; కారక-11, 25; సమాస-7,18)

4) సార్వత్రికములు-2: ('అంతట': తత్సమ-48, 'ఎల్లచో': ఆచ్ఛిక-15; 'సర్వత్ర': తత్సమ-23; 'ఎల్లయెడల': సమాస-10)

5) క్వాచిత్కములు-18: (తత్సమ-43; ఆచ్ఛిక-17; సమాస-6)

6) వైకల్పికములు-9: (సంజ్ఞ-14; సంధి-2,5,6; తత్సమ-10, 60; క్రియా-59; ప్రకీర్ణక-4,6)

7) వైభాషికములు-72

ఈ పై విభాగాలకు చెందని సూచనా వాక్యాలు కూడా కొన్ని ఉన్నాయి.

చిన్నయసూరి సూత్ర నిర్మాణ దక్షతకు లక్ష్యప్రాయమైన ఒక సూత్రాన్ని చూద్దాం.

"సమానాశ్రయంబులంబూర్వ కాలంబునం దివర్ణకంబగు' (క్రియా-35)

ఈ సూత్రంలో 'ఇ' ప్రత్యయాన్ని క్వార్థంలో విధిస్తూ సమాన కర్తృకాలు' - అనకుండ సమానాశ్రయాలు అనటంలో విశేషం ఉంది. సమాన కర్తృకాలు అంటే 'ఒకే కర్తగల క్రియలు'. సమానాశ్రయాలు అంటే 'కర్తృరూపంలోగాని, కర్మరూపంలోగాని

ఒకే వ్యక్తిని ఆశ్రయించిన క్రియలు.

ఉదా॥ 1. 'రాముడు లంకకు వెళ్లి రావణుని బరిమార్చెను'. ఇక్కడ వెళ్లుట, పరిమార్చుట అన్న క్రియలు రెండింటికి కర్త రాముడే కాబట్టి ఈ రెండు క్రియలు ఏకకర్తృకాలు.

2. 'రామునిచే రావణుడు కోర్చుంబడిమడిసె' – ఇక్కడ కొట్టినవాడు రాముడు' మడిసినవాడు రావణుడు' ఈ వాక్యంలోని కొట్టు, మడియ క్రియలు రెండు భిన్నకర్తృకాలు.

సమాన కర్తృకాలు కావు, కాని సమానాశ్రయాలు ఎట్లాగంటే 'కొట్టు' – అనే క్రియను కర్మ రావణుడు.

'మడియు' అనే క్రియకు కర్త రావణుడు.

'కొట్టు' – అనే క్రియ తనకు కర్మగా, రావణుని ఆశ్రయించి ఉంటే 'మడియు' అన్ని క్రియ తనకు కర్తగా రావణునే ఆశ్రయించి ఉండి ఇక్కడ ఈ రెండు క్రియలు సమానాశ్రయాలు కావటం వలన 'ఇ' – ప్రత్యయు కలిగింది.

'మతుబాదికంబుద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబగు' (తత్సమ. 70)

అన్న సూత్రంలో, మతుబంతాల్లో ఏ లింగంలోని ద్వితీయా రూపం పరిగ్రహ్యామో చెప్పలేదు. ఉదాహరణల్ని బట్టి పుంలింగ రూపాలను ఉద్దేశించి చెప్పినదని గ్రహిస్తాము. కాని పుంలింగ ద్వితీమైక వచనాంతతుల్యంబు' అని స్పష్టంగా చెప్పితే బాగుండేది. ఎందుకంటే మతుబంతాలకు, మూడు లింగాలలో ద్వితీయైక వచనాంతరూపాలు భిన్నాలు కదా!

శ్రీమతీమ్ (స్త్రీ)

'శ్రీమత్' (నపుం)

స్త్రీలింగ ద్వితీయైక వచనాంతమైన 'శ్రీమతీమ్' – శబ్దానికి అంతిమమకారం లోపించి 'శ్రీమతి! సిద్ధిస్తుంది. ఇది అజంత సంస్కృత ప్రాతిపదికలలో సిద్ధమైన రూపమే కదా! అలాగే నపుంసక ద్వితీయైక వచనాంత రూపం 'శ్రీమత్' – ప్రథమైక వచనము కూడ 'శ్రీమత్' హలంతంబు ప్రథమైక వచనాంత తుల్యం బిందు నామంబగు' – అని ప్రథమాంతాలే వస్తాయి – దీన్నిబట్టి అప్రయత్నంగానే 'శ్రీమత్' – సిద్ధిస్తోంది. మళ్లీ వీటికి సూత్రాల్లో ప్రస్తావన దేనికీ అని అంటే పుంలింగాల కోసమే ఈ సూత్రమని వ్యాఖ్యాతలు సూరి గాంభీర్యాన్ని వచించారు.

ఇలా చిన్నయసూరి సూత్రనిర్మాణ దక్షత, పాండితీ పటిమ బహువిధాలుగా దర్శించవచ్చు.

**7. "తెలుగునకున్న వ్యాకరణదీపం చిన్నది"–వివరించండి.**

(ఈ వ్యాసంలో తెలుగు వ్యాకరణాల ప్రభావాన్ని, వాటి పరిధిని తెలుసుకుంటారు.)

**7.1** "తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది, గ్రాహ్యమంచుఁ బె
ద్దలు కొనియాడు భారతముఁ దప్పన శక్యము కాదు, దాన
గలిగిన లక్ష్య భేదములు కాదనకాదృతి సంగ్రహించి, నిశ్చల
గతినిందుఁ గూర్చెదరు, చక్కగఁ దిర్పతి వేంకటేశ్వరా!

– అని దేవీ భాగవతానువాదంలో తిరుపతి వేంకటకవులు చెప్పిన పద్యంలో 'చిన్నది' అనే శబ్దానికి 'చిన్నయది' – 'చిన్నయసూరిది' – అని పెద్దలు కొందరు సరసంగా పేర్కొన్నారు. కారణం ఏమంటే ఆంధ్రబ్ద చింతామణి', వికృతివివేకము, అహోబల పండితీయము, ఈ మొ॥న వ్యాకరణాలు తత్సమపద నిరూపణ ప్రధానాలు. విస్తృత ప్రణాళిక కలవి కావు. సూరి బాలవ్యాకరణాన్నే శిరోధార్యమైన తెలుగువ్యాకరణమని భావించే వాళ్ళున్నారు. అలాంటివారిని ఉద్దేశించినప్పుడు "తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది" – అనే మాట అధిక్షేపించినట్లు అనిపిస్తుంది. విశేషార్థపు మాట ఎలా ఉన్నా, తెలుగు కావ్యభాషనంతా నిరూపించే లక్షణ గ్రంథం సమగ్రంగా తెలుగుకు ఇంతవరకు లేదనేదే తిరుపతి కవుల అభిప్రాయం. అందుకే లక్షణం కన్నా

లక్ష్యాన్ని ఆదరించదగిందని భావించే ఆంధ్ర భారతాదుల్లో ఉన్న కవిప్రయోగాల్ని సైతం, తెలుగు లక్షణ గ్రంథాలు సమగ్రంగా నిరూపించవని అందుచేత లక్ష్యాలే సంగ్రహింప తగినవని వీరి అభిప్రాయం.

**7.2** దేశభాషలకు సమగ్ర వ్యాకరణం ఉంటుందా? సంస్కృతానికి సమగ్ర వ్యాకరణం 'అష్టాధ్యాయి'. అయినా కొందరు మహాకవులు అపాణినీయపదాలు ప్రయోగించాడు. మహాకవి కాళిదాసు కూడ అపాణినీయమైన పదాలను పదకొండు ప్రయోగించాడని పరిశోధకులు నిరూపించారు.

ఉదా॥ 'త్రయంబకం భూతపతిందదర్శ'

ఇక్కడ త్రి + అంబకం = త్ర్యంబకమనాలి. కాని కాళిదాసు త్రయంబకమని వాడాడు. ఇది అపాణినీయం. అయినా ఇది వైదిక భాషాప్రయోగం. వేద పురుషుని ఇలా సంభావించటం భావ్యమే. సంస్కృతంలో ఎనిమిది వ్యాకరణ దృక్పథాలున్నాయి. అవి – ఐంద్ర, చాంద్ర, సారస్వత, కాశకృత్స్న, అపిశలీయ, శాకటాయన, పాణినీయ, అమర, జైనేంద్ర అనేవి. ఒక వ్యాకరణం నిరూపింపని విషయాలు మరొక వ్యాకరణం చేత నిరూపితం కావచ్చు. అప్పుడు వానికి 'సంస్కార గౌరవం' – అబ్బుతుంది. మీననేత్రి, పద్మనేత్రి వంటి రూపాలు అసాధువులని చిన్నయసూరి పేర్కొన్నవి, సంస్కృతంలో ఓపదేవుని వ్యాకరణంచేత సాధింపబడ్డాయి. అందువల్ల అవి సాధువులే అని వాదించేవారు కూడ ఉన్నారు. (ఉదా॥ వజ్ఝలవారు) అయినా పాణినీయంపైనే లక్ష్యం గలవారు దానిని అపాణినీయమని, అసాధువని అనవచ్చు. చిన్నయసూరి అలాంటివాడు. ఇంతకూ సంస్కృతం లక్షణం ద్వారా తెలియదగ్గ భాష. ఆ సుందర సరోవరంలోని ప్రతి జలబిందువు వ్యాకృతమైనదే.

**7.3** దేశభాషల స్థితి దీనికి పూర్తి విరుద్ధం. 'ప్రవాహినీ దేశ్యా' అని చింతామణి చెబుతుంది. దేశ భాషలు ప్రవాహసదృశాలు. వీటిని నియంత్రించటం, దుర్లభమే. అలాగని అసలు లక్షణగ్రంథ నిర్మాణ ప్రయత్నమే అనవసరమనే దురభిప్రాయానికిది ఆధారం కాదు.

**7.4** 'సంస్కారార్థో నియమః' – అని చింతామణి చెప్పిన నియమాలు భాషా సంస్కారాన్ని కలిగించటానికే. అంటే భాషాపరంగా ఒక విధమైన శిక్షణనీయటానికే. అలాంటి శిక్షణ పొందినట్లయితే చాలా పదాల్లోని సాధుత్వాసాధుత్వాల్ని గుర్తించగలదు. ప్రకృతి ప్రత్యయ పరిజ్ఞానాన్ని సాధించగలడు. అలాంటి సంస్కారోపేతుడైన వ్యక్తిలో వ్యాకరణాంతః కరణము అభివృద్ధి చెందుతుంది. నిరంతరం కోట్లాది జీవత్కంఠాలలో ప్రతిధ్వనిస్తూ, బహుముఖ సృజనాత్మక కావ్య కళాకలాప ప్రవర్ధమాన స్వభావంగల యీ భాషాస్రవంతిని, దాని తత్త్వాన్ని పూర్తిగా నిరూపించటం ఎవరికీ సాధ్యంకాదు! కాబట్టి దేశ భాషా వ్యాకరణాలకున్న వ్యాకరణదీపం చిన్నదిగా ఉండటం సహజమే. మారుతున్న కాలాన్ని బట్టి, అవసరాలను బట్టి జీవద్భాషలు నిరంతరం పరిణామానికి లోనవుతూనే ఉంటాయి. వాటిని గమనించి శాస్త్రబద్ధం చేయటం భాషావ్యాకర్తల పని. అందుచేత సార్వకాలీనమైన సమగ్ర వ్యాకరణమంటూ ఉండదు. అందుకే తెలుగునకున్న వ్యాకరణదీపం చిన్నది అనటం సమంజసం కాకున్నా కొంతైనా సత్యం గల వాక్యం.

**మాదిరి ప్రశ్నలు**

1. వ్యాకరణమంటే ఏమిటో తెల్పి వ్యాకరణ అధ్యయన ప్రయోజనాలను వివరించండి.
2. తెలుగు వ్యాకరణాల చరిత్రను వివరించండి.
3. బాలవ్యాకరణ రచనా ప్రణాళికను వివరించండి.
4. బాలవ్యాకరణానికి ఉన్న వ్యాఖ్యానాలను గురించి వ్రాయండి.
5. బాలవ్యాకరణంపై సంస్కృత వ్యాకరణాల ప్రభావాన్ని నిరూపించండి.
6. చిన్నయసూరి సూత్ర నిర్మాణ దక్షతను వివరించండి.
7. "తెలుగునకున్న వ్యాకరణదీపం చిన్నది"–వివరించండి.

# యూనిట్ - 2

## 2) సంజ్ఞా పరిచ్ఛేదం

ఈ పాఠ్యభాగంలో క్రింది విషయాలను తెలుసుకుంటారు.

- సంస్కృత ప్రాకృత తెలుగు వర్ణాలను గురించి
- దంత్య తాలవ్య చజలను గురించి
- కళా ద్రుతప్రకృతిక విభాగాన్ని గురించి
- య ర ల వ ల లఘుత్వ అలఘుత్వాలను గురించి
- తెలుగు పదజాలాన్ని తత్సమ, తద్భవ, దేశ్యాలుగా విభజించి పరిశీలించటాన్ని తెలుసుకుంటారు.
- ఖండబిందువు, పూర్ణబిందువు వచ్చే సందర్భాలను గురించి తెలుసుకుంటారు.

**1. చిన్నయసూరి చేసిన వర్ణనిరూపణను పేర్కొనండి?**

**1.0** చిన్నయసూరి బాలవ్యాకరణంలో సంస్కృత, ప్రాకృత వర్ణమాలను పేర్కొని ఆ పిదప తెలుగు వర్ణమాలను వివరించాడు.

"సంస్కృతమునకు వర్ణములేఁబది" (సంజ్ఞా-1)

"ప్రాకృతమునకు వర్ణములు నలువది (సంజ్ఞా-2)

"తెనుగునకు వర్ణములు ముప్పదియాఱు (సంజ్ఞా-3)

**1.1** సంస్కృత భాషలో 50 వర్ణాలున్నాయని (సంజ్ఞా-1) పేర్కొన్నాడు. అవి: అచ్చులు (16): అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఏ-ఐ-ఓ-ఔ అం-అః. హల్లులు(34): క-ఖ-గ-ఘ-ఙ, చ-ఛ-జ-ఝ-ఞ, ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ-శ-ష-స-హ-ళ. మొత్తం 50 వర్ణాలు.

**1.2** ప్రాకృత భాషలో 40 వర్ణాలుంటాయి (సంజ్ఞ-2). అవి: అచ్చులు (10): అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఓ-అం-అః హల్లులు (30) : క-ఖ-గ-ఘ, చ-ఛ-జ-ఝ, ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ-స-హ-ళ. మొత్తం 40 వర్ణాలు.

సంస్కృత భాషలోని ఋ-ౠ-ఐ-ఔ-ఙ-ఞ-శ-ష అనే 10 వర్ణాలు ప్రాకృతంలో ఉండవు.

'హేమ చంద్రుడు' మొదలైన ప్రాకృత వ్యాకర్తలు ప్రాకృత భాషలో హ్రస్వ వక్రాలు (ఎ,ఒ) ఉన్నాయన్నారు.

మరి కొందరు ప్రాకృత వ్యాకర్తలు వక్రతమాలు (ఐ ఔ) ఉన్నాయన్నారు. అప్పుడు ప్రాకృతంలోని వర్ణాలు 44 అవుతాయి.

**1.3** అచ్చతెనుగుకు వర్ణాలు 36. (సంజ్ఞా 3).

అచ్చులు (14): అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ అం అః

హల్లులు (22): క-గ-చ-చ-జ-జ-ట-డ-ణ-త-ద-న-ప-బ-మ-య-ర-ల-వ-స-హ-ళ.

ఋ-ౠ ఌ ౡ విసర్గ (ః), ఖ-ఛ-ఠ-థ-ఫ, ఘ-ఝ-ఢ-ధ-భ, ఙ-ఞ, శ-ష అనే 19 వర్ణాలు సంస్కృత సమశబ్దాలతో కలిసి తెలుగులో ప్రవేశించాయి. ఉదా॥ ఋతువు పితౄణము కౢప్తము ఌకారము దుఃఖము, ఖడ్గము, ఘరము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్క, రథము, ధరణి, ఫణము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము, షండము.

**1.4** అచ్చు – 1. అ ఇ ఉ(ణ్), 2. ఋ ఌ (క్), 3. ఏ ఓ (ఙ్), 4. ఐ ఔ (చ్) అనే మొదటి నాలుగు మహేశ్వర సూత్రాలలో కనిపించే అకారం మొదలు చ్ వరకు గల వానిని అచ్చులని ప్రత్యాహార సంజ్ఞతో వ్యవహరిస్తారు. ఈ సూత్రాలలో కనిపించే

చివరి వర్ణాలను ఇద్వర్ణాలు అంటారు. అవి ఉచ్చారణలో మాత్రమే వ్యవహరించబడి ప్రయోగించేటప్పుడు వదిలివేసేవి. మొదటి సూత్రంలోని తొలి వర్ణమైన ఆ నాల్గవసూత్రంలోని చివరి ఇద్ వర్ణమైన చ్ కారంతో కలిపి అచ్ అనే సంజ్ఞ ఏర్పడింది. దానికి ఉత్వ ద్విత్వాలను చేర్చి తెలుగులో అచ్చు అని వ్యవహరిస్తాము. దానికి బహువచన రూపమే అచ్చులు. తెలుగు వ్యాకర్తలు అవసరాన్ని బట్టి ఆదులు అకారాదులని అచ్చులను పేర్కొనటాన్ని గమనించవచ్చు.

"ఆదులు స్వరములు అచ్చులు" – (ఆంధ్ర భాషా భూషణము, 16)

"అకారాదులచ్చులు" (బాల వ్యాకరణము, సంజ్ఞ–1)

ఈ అచ్చులనే స్వరములు (స్వయం రాజంతే ఇతి స్వరాః), ప్రాణములు (హల్లులకు ప్రాణాల వంటివి కాబట్టి) అని కూడా వ్యవహరిస్తారు. అచ్చులు లేనిదే హల్లుల్ని ఉచ్చరించడం కష్టం. కాబట్టి అచ్చులకు ఇవి ప్రాణాల్లాంటివి కాబట్టి ప్రాణాలు అనే పేరు వచ్చింది.

హల్లులు : మహేశ్వర సూత్రాలు 5 నుండి 14 వరకు సంస్కృతంలోని హల్లుల్ని తెలుపుతాయి. ఆ సూత్రాలు 5.హయవరట్ 6. ల(ణ్) 7. ఞమఙణన(మ్) 8. ఝభ(ఞ్) 9. ఘఢధ(ష్) 10. జబగడద(శ్) 11. ఖఫఛఠథచటత(వ్) 12. కప(య్) 13.శషస(ర్) 14. హ(ల్)

ఈ సూత్రాల ప్రత్యాహారం వల్ల 'హల్' అనే సంజ్ఞ ఏర్పడింది. ప్రతి సూత్రం చివరి వర్ణాలు ఇద్వర్ణాలు. ఇవి పోగా మిగిలినవే హల్లులు.

హల్లులు : క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, యరలవ, శ ష స హ ళ హల్లులనే 'వ్యంజనాలు', 'ప్రాణులు' అంటారు. స్వరాల వల్ల ప్రకాశించబడేవి కాబట్టి 'వ్యంజనాలు' అనే పేరు, 'అచ్చులు' అనే ప్రాణాల్నికలిగి ఉంటాయి కాబట్టి 'ప్రాణులు' అనే పేరు వచ్చాయి. క చ ట త ప మొదలైన వర్ణాల్లో క్, చ్, ఙ్, త్, ప్ అనే పొల్లు వర్ణాలే హల్లులు. వాటిపై 'అ' కారం ఉచ్చారణ కోసం చేరింది. అంటే 'క' అనే అక్షరంలో 'క్' అనే హల్లు. 'అ' అనే అచ్చు ఉన్నాయి.

### 1.4 పరుష సరళ స్థిర వర్ణాలు

"కచటతపలు పరుషంబులని, గజడదబలు సరళంబులని చెప్పంబడు" (సంజ్ఞా–5)

"ఇతరములగు హల్లులు స్థిరములు" (సంజ్ఞా–6)

'క చ ట త ప' అనే హల్లుల్ని పరుషాలు అంటారు. 'గ జ డ ద బ' అనే వర్ణాల్ని 'సరళాలు' అని అంటారు. ఇవి పోగా మిగిలిన హల్లుల్ని 'స్థిరాలు' అని అంటారు. ఆ హల్లులు ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ.

దంత్య చ జ లు (ౘ ౙ ) కూడా పరుష సరళాల్లో చేరతాయి. కాబట్టి: పరుషాలు: క చ ౘ ట త ప సరళాలు: గ జ ౙ డ ద బ.

నాదతంత్రులు ఉచ్చారణలో 'శ్లథనం' చెందనివి పరుషాలు. ఇవి శ్వాస వర్ణాలు. ఉచ్చారణ పరుషంగా ఉంటుంది.

ఉచ్చారణలో 'నాదత్వం' కలిగి ఉండేవి 'సరళాలు'. వీటి ఉచ్చారణ సరళంగా ఉంటుంది.

వ్యాకరణ కార్యాల్లో ఏ మార్పు చెందనివి కాబట్టి స్థిరాలు' అనే సంజ్ఞ ఏర్పడింది.

సంస్కృత, ప్రాకృత భాషలనుండి తత్సమ, తద్భవ రూపంలో తెలుగులో వ్యవహరించబడే పదజాలం అధికంగా

ఉండటం చేత తెలుగు వ్యాకరణంలో సంస్కృత, ప్రాకృత వర్ణసమామ్నాయాలను చిన్నయసూరి నిరూపించటం సముచితం.

**2. చిన్నయసూరి పేర్కొన్న దంత్య తాలవ్య చ జ లను గురించి వివరించండి.**

చిన్నయసూరి బాలవ్యాకరణంలో దంత్య తాలవ్య చజలను నిరూపిస్తూ "దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు" (సంజ్ఞా-7) అని పేర్కొన్నాడు. దంత్య తాలవ్య చ జ లు (చ̃ జ̃) సవర్ణాలు అంటే తాలవ్య చ జ లకు వచ్చే వ్యాకరణ కార్యాలన్నీ దంత్య చ̃, జ̃లకు కూడా వర్తిస్తాయని తాత్పర్యం.

**2.1 తాలవ్య చజలు**

ఇ-ఈ-ఎ-ఏ- లతో కూడుకొన్న చ జ లు తాలవ్యాలు (సంజ్ఞా.8) అంటే చి-చీ-చె-చే, జి-జీ-జె-జే లు తాలవ్యాలు.

ఉదా॥ చిలుక, చీమ, చెలి, చేమ జిల, జీడి, జెట్టి, జేజె.

**2.2 దంత్య చజలు**

అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ - లతో కూడుకొని ఉన్న చ జ లు దంత్య చ̃ జ̃ లు (సంజ్ఞా.9) అంటే చ̃-చా̃-చు̃-చూ̃-చొ̃-చో̃-చౌ̃, జ̃-జా̃-జు̃-జూ̃-జొ̃-జో̃-జౌ̃ అనేవి దంత్య చ జ లు.

ఉదా॥ చ̃లి, చా̃ప, చు̃క్క, చూ̃పు, చొ̃క్కు, చో̃టు, చౌ̃క -
జ̃ముడు, జా̃తర, జు̃న్ను, జూ̃లు, జొ̃న్న, జో̃లి, జౌ̃కు.

**2.3** సంస్కృత సమాలుకాని దేశ్య శబ్దాలలో, ఐకారంతో అంతమయ్యే చ జ లు లేవు.

ఉదా॥ చైత్రము, జైనము వంటి తత్సమ శబ్దాలలోనే కాని దేశ్య తద్భవాలలో ఐకారంతో అంతమయ్యే చజలు లేనే లేవు.

**2.4** సంస్కృత సమాల్లో ఇకారాంతాలైన శబ్దాల ఉపధాచజలు బహువచనం పరమైనపుడు దంత్యాలవుతాయి. (సంజ్ఞా 10) ఇవి కాకుండా సంస్కృతసమాల్లో దంత్య చ̃ జ̃ లు లేవు. 'ఉపధ' అంటే చివరి వర్ణానికి ముందున్న వర్ణం. ఉదా॥ అర్చి. దీనిలోని చ కారం తాలవ్యం. ఉపధ. 'లు' చేరినపుడు ఈ తాలవ్యచకారం దంత్య చకారంగా మారుతుంది. ఉదా॥ అర్చి+లు = అర్చు̃లు. అలాగే రోచి-రోచు̃లు, రాజి-రాజు̃లు వాజి-వాజు̃లు.

అయితే ఏకవచనంలో తత్సమం అయిన 'రాజు' శబ్దం ఒక్కటి మాత్రమే దంత్యంగా కనిపిస్తుంది.

సంస్కృత సమాల్లో ఏకవచనంలో ఉన్న చ జ లు ఏ అచ్చుతో కూడి ఉన్నా సరే 'తాలవ్య చ జ లు' గానే ఉంటాయి. ఉదా॥ చంద్రుడు, చామరము, చక్రిక, చూర్ణము, చోరుడు, చౌర్యము, జయము, జాతి, జుగుప్స, జూటము మొ॥నవి. ఈ ఉదాహరణల్లోని 'చ జ' లు అన్నీ తాలవ్యాలే.

**3. బాలవ్యాకరణాన్ని అనుసరించి కళా, ద్రుతప్రకృతిక విభాగాన్ని వివరించండి.**

**3.0** శబ్దాలయొక్క పుట్టుకను బట్టి కాకుండా వాటి అంతాలను బట్టి తెలుగు పదజాతాన్ని రెండు విధాలుగా విభజించవచ్చు. 1) కళలు, 2) ద్రుతప్రకృతికము. కళ అంటే భాగము, పాలు, అంశము అనే అర్థాలున్నాయి. ద్రుతము అంటే కరిగిపోయేది, వడి కలది, పారిపోయేది అనే అర్థాలున్నాయి. తెలుగు భాషలో కొన్ని పదాలు నకారాంతాలు. ఈ నకారము కనపడేటట్టుగా కాని కనపడకుండేటట్లుగాని ఉండవచ్చు. ఇది లోపించినప్పటికీ అర్థబోధకు ఎటువంటి ఆటకం ఏర్పడదు. అంటే ఇటువంటి నకారము పదంలో భాగం కాదని తెలుస్తుంది. ఈ నకారానికి ప్రకృతులైన పదాలను ద్రుతప్రకృతులని వ్యాకర్తలు పేర్కొన్నారు.

**3.1 కళలు**

"ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు" (సంజ్ఞా-13) అని చిన్నయసూరి పేర్కొన్నాడు. అంటే ద్రుతప్రకృతికాలు కాని శబ్దాలు కళలని తాత్పర్యం. ద్రుతాంతాలైన పదాలు ద్రుతప్రకృతికాలు. అవి కాని శబ్దాలు కళలు.

**3.1.1** ప్రథమ కయి పట్టి యొక్క విభక్తులు చేరిన శబ్దాలు

ఉదా॥ ప్రథమకు- రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ, అయ్య, అమ్మ.

వీనిలో గోడ, మేడ, అయ్య, అమ్మ – అనేవి ప్రథమైకవచనం లోపించిన అచ్చ తెలుగు పదాలు. వీటిని స్త్రీసమాలని అంటారు.

కయి – రామునికయి,

పట్టి – జ్ఞానముబట్టి,

యొక్క – నాయొక్క

**3.1.2 క్రియలు**

భూతకాల ప్రథమ పురుష బహువచన రూపాలు – వచ్చిరి

భూతకాల మధ్యమ పురుష ఏక, బహువచన రూపాలు – వచ్చితివి, వచ్చితిరి,

భూతకాల ఉత్తమ పురుష బహువచన రూపాలు – వచ్చితిమి.

**3.1.3 వ్యతిరేక క్రియలు** – రాఁడు, రారు, రాదు, రావు, రాము.

**3.1.4 వ్యతిరేక క్త్వార్థకాలు** – కొట్టక, తిట్టక.

**3.1.5 క్త్వార్థకాలు** – ఎత్తిలి, ఒత్తిలి

**3.1.6 అవ్యయాలు** – ఊరక, మిన్నక, భళి, అక్కట, ఏల – మొదలైనవి

**3.2 ద్రుతము**

"నకారంబు ద్రుతంబు" (సంజ్ఞా–11)

ద్రుతము అంటే = ద్రుతినందునది. లోపించునది అని అర్థం. ఇది లోపించినా అర్థం చెడదు. "విభక్త్యాగమచార్థోనుద్రుతః"

నకారము = ను వర్ణము. అంటే

ప్రత్యయాత్మకమైన నకారం – నన్నును,

ఆగమాత్మకమైన నకారం – నా చేతను,

అవ్యయాత్మకమైన నకారం – ఎంతయును

ఇటువంటి నువర్ణము ద్రుతము.

ఉదా॥ నన్ను, నా చేత, ఎంతయు.

పదంలో సహజంగా ఉండే అవయవికమైన నువర్ణము ద్రుతము కాదు.

ఉదా॥ చేను, పేను.

ఇందులోని నువర్ణము ప్రత్యయము, ఆగమము, అవ్యయము కానందున ద్రుతము కాదు. చిన్నయసూరి నకారాన్ని ద్రుతంగా పేర్కొన్నప్పటికీ 'న్ – న – ను' ఈ మూడింటిని ద్రుతంగా అంగీకరించినట్లు బాలవ్యాకరణంలో కనిపిస్తుంది.

**3.3 ద్రుతప్రకృతికములు**

"ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు" (సంజ్ఞా–12)

ద్రుతము అంతంలో ఉన్న పదాలు ద్రుతప్రకృతికాలు. అవి ఏవంటే

**3.3.1 ప్రథమా – కయి – పట్టి యొక్క – ఇతరములయిన విభక్తులు** – అంటే ప్రథమా విభక్తి ప్రత్యయాలైన 'డు, ము, వు, లు', చతుర్థి విభక్తి ప్రత్యయమైన 'కయి', పంచమీ విభక్తి ప్రత్యయమైన 'పట్టి', షష్ఠీ విభక్తి ప్రత్యయమైన 'యొక్క' – అనేవి కాకుండ మిగిలిన విభక్తులు చివరగల పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ నన్నున్ – ద్వితీయా విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాచేతన్, నాతోడన్ – తృతీయా విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాకొఱకున్–చతుర్థీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నావలనన్, నాకంటెన్–పంచమీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాకున్, మాలోపలన్ –షష్ఠీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

మాయందున్ – సప్తమీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

(2) ఉత్తమ పురుష ఏకవచనాలు

ఉదా॥ వత్తున్–వచ్చెదన్

(3) భూత ప్రథమ పురుష ఏకవచనం అంటే 'ఎను' – అనే క్రియా ప్రత్యయం చివరగల పదాలు

ఉదా॥ వచ్చెన్ (క్రియా. 16)

(4) తద్ధార్మాద్యర్థక ప్రథమ పురుష ఏకవచనాలు. అంటే తద్ధర్మాద్యర్థాలను తెలిపేవి

ఉదా॥ వచ్చున్, వచ్చెడున్ (క్రియా. 16,22)

(5) ఆశీస్సు మొదలైన అర్థాలలో వచ్చే 'ఎడు' – 'త' అనే ప్రత్యయాలు చేరే పదాలు.

ఉదా॥ ప్రసన్నులయ్యెడున్, ప్రసన్నులు కావుతన్

(6) శత్రర్థకము = క్రియాన్వయంలో వర్తమానార్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన 'చు' వర్ణకం. ఈ ద్రుతాంతమైన చువర్ణకంతో ("చును") కూడిన పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టుచున్

(7) తుమర్థకము = ఏ క్రియ నిమిత్తం వేఱొక క్రియ జరుగుతుందో ఆ క్రియ తుమర్థకము. తుమర్థంలో వచ్చే 'నుజీ' వర్ణకంతో కూడిన పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టన్, కొట్టఁగన్, వండన్, వండగన్

(8) అనంతర్యార్థకము: అనంతరం యొక్క భావం ఆనంతర్యం. అనంతర్యార్థకం=అనంతరమున అనే అర్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన 'డు' వర్ణకం. ఈ ద్రుతాంత డువర్ణకంతో కూడిన పదాలే ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టుడున్ (కొట్టిన అనంతరం అని అర్థం)

వండుడున్ (వండిన అనంతరం అని అర్థం)

(9) చేదాద్యర్థకములు= చేదర్థకం మొదలైనవి. చేదర్థకం అంటే 'చేత్' శబ్దము యొక్క యర్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన నవర్ణకం. చేత్ అనేది పక్షాంతరాన్ని తెల్పేది. తెలుగులో –ఇనన్ తో కూడిన చేదర్థక పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టినన్ (కొట్టిన పక్షాన. కొట్టిన యెడల)

వచ్చినన్ (వచ్చిన పక్షాన)

(10) నేను–తాను పదాలు ద్రుతప్రకృతికాలు. ఇవి సర్వనామాలు.

(11) వలె ప్రభృతులు. అంటె వలె, మొదలగునవి.

ఉదా॥ వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్

– మొదలైనవి ద్రుతప్రకృతికాలు. ఈ విధంగా చిన్నయసూరి కళలను, ద్రుతాన్ని, ద్రుతప్రకృతికాలను వివరించాడు.

**4. చిన్నయసూరి పేర్కొన్న యరలవల లఘుత్వాలఘుత్వాలను వివరించండి.**

చిన్నయసూరి లఘుత్వ అలఘుత్వాలను నిరూపించిన యరలవలకు సంస్కృతంలో అంతస్థలని పేరు. "యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్ర మధ్య మూలానాం శైథిల్యం జాయతే సలఘూచ్చారణః, యస్య ఉచ్చారణే తేషామశైథిల్యం జాయతే స అలూఘూచ్చారణః" అనే వివరణను బట్టి జిహ్వాగ్రం నుండి జిహ్వామూలం వరకు ఉచ్చారణ కాలంలో శైథిల్యము గలది లఘూచ్చారణమని, అది లేనిది అలఘూచ్చారణమని సంస్కృత వ్యాకర్తలు పేర్కొన్నారు.

యరలవలు ఉచ్చారణను బట్టి లఘువులని అలఘువులని రెండు రకాలు.

**4.1 యరలవల లఘు అలఘు భేదం**

'యరలవ' అనే వర్ణాలు రెండు రకాలు 1. లఘువులు 2. అలఘువులు. (సంజ్ఞా 18)

| | | **లఘువులు** | | **అలఘువులు** |
|---|---|---|---|---|
| **(య)** | **1.** | ఆగమ యకారం | 1. | పదంలో సహజంగా ఉండే యకారం |
| | | ఉదా: హరి**య**తుడు | | ఉదా ॥ కా**య**, రా**యి** |
| **(ర)** | **2.** | రేఫం (ర) | 2. | శకట రేఫం (ఱ) |
| | | ఉదా॥ పె**రు**గు, క**రు**గు | | ఉదా॥ వి**ఱు**ఁగు, మె**ఱు**ఁగు |
| **(ల)** | **3.** | పదంలో సహజంగా ఉండే లకారం | 3. | ఆదేశలకారం (ళ), |
| | | ఉదా॥ తల, నెల | | బహుత్వంలో 'ర,ల,డ,లకు ఆదేశం అయిన 'ళకారం |
| | | | | ఉదా॥ ఏళులు, పాళులు  త్రాళులు మొదలైనవి. |
| **(వ)** | **4.** | ఆదేశ వకారం (గసడదవాదేశం) | 4. | పద సహజంగా ఉండే వకారం |
| | | ఉదా॥ అతుడు వలికె | | ఉదా॥ వంక, వాఁడు |

య,ర,ల,వ – అనే వర్ణాల్ని లఘువులు, అలఘువులుగ చిన్నయసూరి విభజించాడు.

1. హరియతఁడు (హరి+అతఁడు) హరి+య్–అతఁడు) మొదలైన చోట్ల ఉండే ఆగమ యకారం లఘువు. తక్కిన చోట్ల ఉండే శబ్దసిద్ధ యకారం అలఘువు.

2. విఱఁగు, మెఱఁగు మొదలైన పదాల్లో ఉండే శకటరేఫ అలఘువు. పెరుగు, కరుగు లాంటి పదాల్లోని రేఫ లఘువు.

3. తల, నెల, లాంటి పదాల్లోని లకారం లఘువు. బహువచనంలో కనిపించే ఏళులు, పాళులు, త్రాళులు మొదలైన వాటిల్లోని 'ళ'కారం అలఘువు.

4. 'అతఁడు వలికె' మొదలైన చోట్ల ఆదేశంగా వచ్చిన వకారం లఘువు. వంక, వాడు మొదలైన చోట్లలోని శబ్ద సిద్ధ వకారం అలఘువు.

శకటరేఫానికే బండి 'ఱ' అని వ్యవహారం. లిపిలో చిహ్నం వేరేగా ఉన్నప్పటికీ రేఫ యొక్క ఉచ్చారణ భేదమే కాబట్టి, శకట రేఫాన్ని చిన్నయసూరి ప్రత్యేక వర్ణంగా చెప్పలేదు.

తెలుగు వర్ణమాలలోని ళకారం అలఘులకారం కాదని చిన్నయసూరి పేర్కొన్నాడు. అంటే డలరలకు ఆదేశంగా వచ్చే 'ళ'కారమే అలఘువని చిన్నయసూరి తాత్పర్యం.

**5. చిన్నయసూరి చేసిన పదజాత విభజనను పేర్కొనండి?**

**5.0** తెలుగులోని పదాల్ని చిన్నయసూరి తత్సమం, తద్భవం, దేశ్యం అని విభజించాడు. తత్సమంలో సంస్కృత ప్రాకృత సమాలుంటాయి. తద్భవంలో సంస్కృత, ప్రాకృత భవాలుంటాయి. దేశ్యంలో, ఆ దేశంలో మాత్రమే వ్యవహరించే పదజాలం ఉంటుంది. వాస్తవానికి ఈ దేశ్య పదాలే ఆ భాషకు వారసత్వంగా లభించే మూలధనం.

**5.1 తత్సమము**

తత్ + సమము అంటే సంస్కృత ప్రాకృత తుల్యమైన భాష అని చిన్నయసూరి నిర్వచనం.

| **సంస్కృతం** | | **సంస్కృత సమం** |
|---|---|---|
| రామః | – | రాముఁడు |
| విద్యా | – | విద్య |
| హరిః | – | హరి |
| ధేనుః | – | ధేనువు |
| భూ | – | భువి |
| పితా | – | పిత |
| గౌ | – | గోవు |
| సిరీ | – | సిరి |

| సంస్కృతం | | ప్రాకృతం | | ప్రాకృతసమం |
|---|---|---|---|---|
| అగ్నిః | – | అగ్గీ | – | అగ్గి |
| ఆటిః | – | ఆడీ | – | ఆడి |
| ఆలిః(పజ్కౌ) | – | ఓలీ | – | ఓలి |
| కటుః | – | కారో | – | కారము |
| గౌరవమ్ | – | గారవం | – | గారవము |

సంస్కృత శబ్దాలపై తెలుగు విభక్తులు చేరిన పదాలనే తత్సమాలని అంటారు.

తెలుగు నామ విభక్తి ప్రత్యయాలు చేరడం, సంస్కృత ప్రాకృత ప్రాతిపదికల్లో చిన్న చిన్న మార్పులు జరగడం తత్సమాలలో కనిపించే ఒక లక్షణం.

ఉదా॥ రామః – సంస్కృత నామం. దానికి ఉత్వం, డుజ్‌చేరి 'రాముడు' అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

అలాగే 'అగ్నిః' సంస్కృత శబ్దం. దాని నుండి ఏర్పడిన 'అగ్గీ' శబ్దం ప్రాకృతం. ఇందులోని తుది దీర్ఘం హ్రస్వమై 'అగ్గి' అనే తత్సమ రూపం (ప్రాకృతసమం) ఏర్పడింది.

**5.2 తద్భవము**

"సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" (సంజ్ఞా–20)

సంస్కృతభవము, ప్రాకృత భవము నగు భాష తద్భవము. (తద్=ఆ సంస్కృత, ప్రాకృతములనుండి, భవంబు=పుట్టినది). వర్ణలోపము మొదలగు మార్పులు కలిగి యేర్పడిన భాష తద్భవము.

సంస్కృత భవమునకు – ఆకాశః (సంస్కృతం) ఆకసము (సంస్కృత భవము)

ప్రాకృత భవమునకు – ఇంగాలో (ప్రాకృతం) ఇంగలము (ప్రాకృత భవము)

| **సంస్కృతం** | | **సంస్కృతభవం** | | |
|---|---|---|---|---|
| ఆకాశః | – | ఆకసము | | |
| కుడ్యమ్ | – | గోడ | | |
| చన్ద్రః | – | చందురుడు | | |
| హరణమ్ | – | అరణము | | |
| హరితాళమ్ | – | హరిదళము | – | మొదలైనవి |

ప్రాకృత భవాలకు ఉదా॥

| సంస్కృతం | | ప్రాకృతం | | ప్రాకృత భవం |
|---|---|---|---|---|
| అఙ్గారో | – | ఇంగాలో | – | ఇంగలము |
| అప్సరాః | – | అచ్చరా | – | అచ్చర |
| ఆశ్చర్యమ్ | – | అచ్చేరం | – | అచ్చెరువు |
| పఞ్చాశత్ | – | పణ్ణాసా | – | పనస |
| పృథివీ | – | పుఢమీ | – | పుడమి |
| ప్రయాణమ్ | – | పయాణం | – | పయనము |

**5.3 దేశ్యము**

ఏ దేశపు మానవులకు ఆదేశపు భాష దేశ్యమవుతుంది.

"త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగు భాష దేశ్యంబు" (సంజ్ఞా–21) అని చిన్నయసూరి తెలుగు దేశ్యాలను గురించి చెప్పాడు.

తెలుగు దేశపు వాడుకలో సిద్ధించిన భాష దేశ్యము. తత్సమ తద్భవాలను గురించి చెప్పిన తరువాత దేశ్యాన్ని నిర్దేశిస్తూ చెప్పిన పై నిర్వచనాన్ని బట్టి త్రిలింగదేశ వ్యవహార సిద్ధమైన తత్సమ తద్భవేతర భాషను దేశ్యమని గ్రహించాలి. త్రిలింగదేశము అంటే తెలుగు దేశము. ప్రాచీన కాలంలో శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము అనే శైవక్షేత్రాలకు సంబంధించిన మూడు శివలింగాలకు మధ్యనుండే దేశాన్ని త్రిలింగదేశమని వ్యవహరించేవారు. త్రిలింగశబ్ద భవమే తెలుగని భావించి మన వ్యాకర్తలు ఇలా చెప్పారు. కాని తెలుగు శబ్దము తెనుగు శబ్దభవమని 'తెన్' శబ్దం దక్షిణ దిక్కును సూచిస్తుందని భాషాశాస్త్రవేత్తలు భావించారు.

దేశ్య శబ్దాలకు ఉదా॥ ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, తావి, మోవి ఇత్యాదులు.

**5.4 గ్రామ్యం – అనింద్య గ్రామ్యం**

"లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు" (సంజ్ఞా–22)

వ్యాకరణ శాస్త్రానికి విరుద్ధమైన భాష గ్రామ్యం. లక్షణము అంటే వ్యాకరణాది శాస్త్రమని అర్థం.

ఉదా॥ వస్తాఁడు, తెస్తాఁడు – ఇత్యాదులు.

సూరి అభిప్రాయం ప్రకారం శిష్టులు వ్యవహరించే భాష అయినా వ్యాకరణ నియమానికి విరుద్ధంగా ఉంటే అది గ్రామ్యమే అవుతుంది.

**5.5 అనింద్య గ్రామ్యము**

అనింద్యము అంటే నిందింపదగనిది. గ్రామ్యము అంటే 'లక్షణ విరుద్ధమైనది'. అనింద్య గ్రామ్యము అంటే గౌరవింపదగిన వ్యాకరణ విరుద్ధమైన పదమని అర్థం. లోకంలో ప్రసిద్ధమై, వ్యాకరణ విరుద్ధాలైన పదాలను మహాకవులు ప్రయోగించారు. అటువంటివాటిని నిరసింపక, అనింద్య గ్రామ్యంగా భావించాలని వ్యాకర్తలు పేర్కొన్నారు. మహాకవుల కావ్యాలలో కనపడే భాష లక్షణవిరుద్ధమైనప్పటికీ వాటిని ఆదరించి మనం మన కావ్యాలలో వాడుకోవచ్చు. అటువంటి రూపాలను అనింద్య గ్రామ్యాలని పేర్కొన్నారు.

ఉదా॥ ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిల కన్నులు.

కఱకంఠుఁడు– కఱ (ఆచ్ఛికం) + కంఠుడు (తత్సమం) మిశ్ర బహువ్రీహి. ఇది బహువ్రీహి సమాస లక్షణానికి విరుద్ధం కాబట్టి గ్రామ్యం. అయినా నన్నయాదులు ప్రయోగించారు కాబట్టి అనింద్య గ్రామ్యము.

అలాగే ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిల కన్నులు మొ॥వి వైరి సమాసాలు. వీటిలో ప్రాణ, జీవ, కపిల శబ్దాలు కేవల సంస్కృత శబ్దాలు. కేవల 'సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు' (సమాస–3) అనే లక్షణానికి భిన్నంగా కనిపించేవి కాబట్టి ఇవి గ్రామ్యము. అయినా ఇవి ఆర్య వ్యవహారాల్లో ఉన్నాయి. కాబట్టి అనింద్య గ్రామ్యాలు.

**6. బాలవ్యాకరణంలో పేర్కొన్న బిందువు/అనుస్వారం విధానాన్ని గురించి వ్రాయండి.**

**6.0** తెలుగులో బిందువును – అనుస్వారము, బిందువు, బొట్టు, సున్న అనే సంజ్ఞలతో బిందువును వ్యాకర్తలు పేర్కొన్నారు. అనుస్వారం కేవలం ఉచ్చారణ ధర్మమే. సంస్కృత వ్యాకరణాలలో అనుస్వారానికి బిందువును పర్యాయపదంగా వాడినట్లు కనిపిస్తుంది. తెలుగులో మనం ఉపయోగించే అనుస్వారం వర్గానునాసికాలకు (జ, ఞ, ణ, న, మ) సంకేతం.

**6.1** తెలుగులో అర్థ బిందువును అర్థభేదాన్ని కలిగించే వర్ణంగా చెప్పవచ్చు. కాని ఉచ్చారణలో దీనికి అస్తిత్వం లేదు. ఈ బిందువులు ఏర్పడే విధానాన్ని బట్టి సిద్ధబిందువు, సాధ్య బిందువు అని రెండు రకాలుగా వ్యాకరణాలు నిరూపిస్తున్నాయి. సాధ్య బిందువు అంటే వ్యాకరణ కార్యాలద్వారా ఏర్పడేవి. సిద్ధ బిందువు అంటే పదంలో సహజంగా ఉండేవి. అలాగే ఖండ బిందువును కూడా సిద్ధ ఖండ బిందువని సాధ్య ఖండ బిందువని వ్యాకరణాలు నిరూపిస్తున్నాయి.

**6.2** "హ్రస్వము మీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును" (సంజ్ఞా–14). అంటే హ్రస్వాచ్చు తర్వాత వచ్చే అరసున్నకు వికల్పంగా నిండుసున్న ఆదేశం అవుతుంది.

ఉదా॥ 'అడఁకువ'.

దీనిలో హ్రస్వాచ్చు 'అ' తరువాత అరసున్న ఉంది. ఇది వైకల్పికంగా నిండు సున్నా అయితే 'అడంకువ' అవుతుంది. 'వికల్పంగా అవుతుంద'నటంవల్ల 'నిండుసున్న' ఆదేశం కానపుడు అరసున్న అలాగే ఉండి 'అడఁకువ'.

ఇతర ఉదా॥ అరఁటి, అరంటి ఎఱుఁగుట, ఎఱుంగుట

**6.3** "దీర్ఘము మీఁద సాధ్య పూర్ణము లేదు" (సంజ్ఞా–15)

వ్యాకరణ కార్యం ద్వారా సాధించబడే నిండుసున్న దీర్ఘాచ్చు తర్వాత రాదు.

ఉదా॥ వాఁడు: ఇందులోని అరసున్న సాధ్య ఖండబిందువు. దీర్ఘం తర్వాత (ఆ) వచ్చింది కాబట్టి నిండుసున్న కాదు. అంటే 'వాండు' అనే రూపం ఏర్పడదు.

ఇతర ఉదా॥ వీఁడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

**6.4** "సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది" (సంజ్ఞా–16). అంటే సంస్కృతసమాలు కాని శబ్దాల్లో పరుష సరుళాలకు ముందే బిందువు కనిపస్తుంది.

ఉదా॥ వంకర, కలఁకువ మంచు, త్రాఁచు, దంట, దాఁటు కొంత, కోఁత మొదలైనవి.

పై ఉదాహరణల్లో అర్థ బిందువు, పూర్ణ బిందువు పరుషాలకు ముందే కనిపిస్తున్నది.

**6.5** సరళాలకు ముందు కనిపించే అర్ధబిందువు, పూర్ణ బిందువులను ఇలా చూపవచ్చు:

ఉదా కొంగ, ఈఁగ, అంజ, కౌఁజు, దండ, ఈఁడు, క్రింద, ఈఁదర, చెంబు, తాఁబేలు.



**7. తెలుగు మాటలకు మొదట రాని వర్ణాలను పేర్కొనండి?**

యకారం, వువూ వొవో అనేవి తెలుగు మాటలకు మొదట ఉండవు (సంజ్ఞా) ఉదా॥ ఎవడు, ఎక్కడ, ఏమి, ఏల ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ. యకారం ఏ అచ్చుతో కూడి ఉన్నప్పటికీ దానితో తెలుగు మాటలు ప్రారంభం కావు. అలాగే వు వూ వొ వోలతో కూడా తెలుగు మాటలు ప్రారంభం కావు. అంటే ఎవఁడు – అనే రూపమే తప్ప యెవడు వంటి రూపంతో వాక్యం ఆరంభం కాదు. అలాగే 'ఉడుత' సరైన రూపం. అయితే 'వుడుత' వంటి రూపాల పదారంభంలో రావు.

హరియతఁడు, నిద్రవోయె అనే ప్రయోగాల్లో రెండో పదం మొదట కనిపించే య, వలు యడాగమసంధి, గసడదవాదేశ సంధి వలన వచ్చినవి తప్ప ఆ పదంలో సహజంగా ఉన్నవి కావు.

సంస్కృత సమాల్లో కూడా వోఢృ, వోఢవ్య అనే శబ్దాలు తప్ప 'వు వూవో'లతో ప్రారంభించబడే శబ్దాలు లేవు, అన్నీ అచ్చుతోనే మొదలవుతాయి: ఉదకము, ఊర్మిక  ఓదనము – ఇలా.

ఆధునిక కాలంలో ఈ నియమాన్ని పాటించి రాస్తున్న రచయితలు అరుదుగా కనిపిస్తారు.

## ఆ) సంధి పరిచ్ఛేదం

**ఈ విభాగంలో సంధి అంటే ఏమిటో తెలుసుకుంటాము.** అవి.

(1) అచ్సంధులు

(2) ఆదేశ సంధులు

(3) ఆగమసంధులు

(4) ద్రుత సంధికార్యాలు

(5) ప్రాఁతాది సంధులు

(6) ఆమ్రేడిత సంధులు

(7) అలుక్సమాస సంధులు

(8) పరాచ్చులోపసంధి

(9) పడ్వాదుల సంధి

(10) మధ్యమ పురుష సంధులు

(11) అనుకరణ సంధులు

(12) విసంధి

అనే వాటి గురించిన వ్యాకరణకార్యాలను తెలుసుకుంటారు.

**1. సంధి అంటే ఏమిటో వివరించి చిన్నయసూరి చెప్పిన అచ్సంధులను వివరించండి.**

**1.0** 'సమ్' పూర్వక 'ధా' ధాతువునుండి 'సంధి' అనే పదం ఏర్పడుతుంది. సంధి అంటే కూడిక లేక చేరిక అని అర్థం. సాధారణంగా రెండుపదాల మధ్యగానీ, రెండు అపదాల మధ్య గానీ 'సంధి' జరగవచ్చు. సంధి జరిగేటప్పుడు (1) లోపం (2) ఆగమం (3) ఆదేశం (4) ప్రకృతి భావం అనేవి సహజంగా జరిగే సంధికార్యాలు.

సాధారణంగా సంధి నాలుగు సందర్భాలలో జరుగుతుంది. 1) అచ్చుకు అచ్చు పరమైనప్పుడు, 2) అచ్చుకు హల్లు పరమైనప్పుడు, 3) హల్లుకు హల్లు పరమైనప్పుడు, 4) హల్లుకు అచ్చుపరమైనప్పుడు.

ఈ పై నాలుగు సందర్భాలలో అచ్చుకు అచ్చు పరమైనప్పుడు జరిగే సంధికార్యాన్ని ఉద్దేశించి బాలవ్యాకర్త సంధి శబ్దాన్ని వాడాడు. అందుకే "పూర్వ పర స్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు" (సంధి–1) అని సంధికి ఇచ్చిన నిర్వచనాన్ని గమనిస్తే ఇది కేవలం అచ్సంధులకు మాత్రమే వర్తిస్తుందని తెలుస్తుంది.

సంధి పరిచ్ఛేదంలోని మొదటి పదకొండు సూత్రాలలో మాత్రమే 'సంధి అగునని' అనటాన్ని గమనించాలి. అలా సంధిని నిర్వచించటానికి తెలుగు అజంత భాష కావటం కూడ ఒక కారణం. సంధి జరిగేటప్పుడు అర్థానికి ఆఘాతం కలగకుండటం కోసమే ఆగమాలు వస్తాయి.

సంధి పరిచ్ఛేదంలో చెప్పిన సంధులను ఈ క్రింది విధంగా వింగడించవచ్చు.

అవి. (1) అచ్సంధులు (2) ఆదేశ సంధులు (3) ఆగమసంధులు (4) ద్రుత సంధికార్యాలు (5) ప్రాఁతాది సంధులు (6) ఆమ్రేడిత సంధులు (7) అలుక్సమాస సంధులు (8) పరాచ్చులోపసంధి (9) పడ్వాదుల సంధి (10) మధ్యమ పురుష సంధులు (11) అనుకరణ సంధులు (12) విసంధి అనేవి.

### 1.1 అచ్సంధులు

అచ్చుకు అచ్చు పరమైనప్పుడు జరిగే సంధులు అచ్సంధులు. వీటిలో అ ఇ ఉ లకు సంధి జరుగుతుంది. తెలుగులో ఆమ్రేడిత సంధుల్లో మాత్రమే దీర్ఘాచ్చులకు సంధి కన్పిస్తుంది. కావ్య భాషలో ఎ ఒ లకు సంధి లేదు.

చిన్నయసూరి హ్రస్వ అకారాన్ని 'అత్తు' అని, హ్రస్వ ఇకారాన్ని 'ఇత్తు' అని, హ్రస్వ ఉకారాన్ని 'ఉత్తు' అని నిర్దేశించాడు. దీనినే తపరకరణమని అంటారు. ('తపరస్తత్కాలస్య') అని లక్షణం.

చిన్నయసూరి పరిభాషలో 'సంధి' అంటే పూర్వపరాచ్చులకు, పరాచ్చు ఏకాదేశం కావటమే సంధి అని పైన చెప్పుకున్నాము. అచ్సంధులలోమొదటిదైన ఉత్వసంధిని గమనిద్దాం.

### 1.1.1 ఉత్వసంధి

"ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధియగు" (సంధి–1) 'ఉత్తు'కు (హ్రస్వ ఉకారానికి) అచ్చుపరమైతే సంధి అవుతుంది.

ఉదా॥ రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు

సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు (ఉ+ఇ=ఇ)

మనము + ఉంటిమి = మనముంటిమి (ఉ+ఉ=ఉ)

అతఁడు + ఎక్కడ = అతఁడెక్కడ(ఉ+ఎ=ఎ)

ఇతఁడు + ఒకఁడు = ఇతఁడొకఁడు (ఉ+ఒ=ఒ)

మొదటి పదం చివరి 'ఉ'కి, పరపదం మొదటి 'అ, ఇ, ఉ, ఎ, ఒ' లకు సంధి జరిగింది. రెండింటి స్థానంలో పరాచ్చు అయిన 'అ, ఇ,ఉ,ఎ,ఒ' లు ఆదేశం అయ్యాయి.

చిన్నయసూరి పరాచ్చులన్నిటినీ హ్రస్వాచ్చుల్ని మాత్రమే ఇచ్చినా దీర్ఘాలు వచ్చినా సంధి జరుగుతుంది.

ఉదా॥ ఆహా + ఆహా = ఆహాహా

రాముఁడు + ఆతఁడు = రాముడాతఁడు

### 1.1.2 ఉత్వం వైకల్పికంగా రావటం:

"ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును" (సంధి–2) ప్రథమేతర విభక్తుల్లోను, శత్రర్థచువర్ణంలోను ఉన్న 'ఉత్తు'కి సంధి వైకల్పికంగా జరుగుతుంది. ప్రథమేతర విభక్తులలోని ఉదంతాలు ద్రుతప్రకృతికాలే. శత్రర్థక చువర్ణం అంటే సంస్కృతంలో శతృప్రత్యయం యొక్క అర్థంలో తెలుగులో వర్తమాన కాల క్రియా విశేషణార్థంలో ధాతువుకు 'చు' వర్ణం వచ్చి చేరుతుంది. ఇది ద్రుతాంతము.

### 1.1.2.1 ప్రథమేతర విభక్తికి

ఉదా॥ నన్నున్ + అడిగె

ద్రుతలోపం జరిగి నన్ను + అడిగె = నన్నడిగె,

సంధి వైకల్పికం కాబట్టి జరగకపోతే

నన్నున్ + అడిగె = నన్నునడిగె. ఇది ద్వితీయా విభక్తికి ఉదాహరణ.

| | | |
|---|---|---|
| నా కొఱకున్ | + ఇచ్చె | = నాకొఱకిచ్చె / నాకొఱకునిచ్చె (చతుర్థీ) |
| నాకున్ | + ఆదరువు | = నాకాదరువు / నాకునాదరువు (షష్ఠీ) |
| నాయందున్ | + ఆశ | = నాయందాశ / నాయందునాశ(సప్తమీ) |
| ఇందున్ | + ఉన్నాఁడు | = ఇందున్నాఁడు/ఇందునున్నాఁడు |
| ఎందున్ | + ఉంటివి | = ఎందుంటివి/ఎందునుంటివి |

**1.1.2.2. శత్రర్థచువర్ణంబులందున్న ఉకారానికి**

| | | |
|---|---|---|
| వచ్చుచున్ | + ఉండెను | = వచ్చు చుండెను / వచ్చుచునుండెను. |
| చూచుచున్ | + ఏగెను | = చూచుచేగెను / చూచుచునేగెను |

ఇది శత్రర్థ చువర్ణానికి ఉదాహరణ.

**1.2 అత్వసంధి**

"అత్తునకు సంధి బహుళముగా నగు" (సంధి–4). హ్రస్వ అకారానికి, సంధి బహుళంగా జరుగుతుంది. 'బహుళం' అంటే సంధి నిత్యంగా జరగడం (ప్రవృత్తి), సంధి జరగక పోవడం (అపవృత్తి), సంధి విభాషగా జరగడం, ఈ మూడు కాకుండా మరోవిధంగా జరగడం (అన్యకార్య ప్రవృత్తి) అనే నాలుగు విధాలుగా జరగడం. ఈ నాలుగు విధాలుగా జరగాలన్న నియమేమీ లేదు. వీటిలో ఒకటి లోపించినా అది బహుళమే.

ఉదా॥ మేన + అల్లుఁడు = సంధి కార్యం జరిగితే మేనల్లుఁడు

సంధి జరగకపోతే "సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సంధి–3) యడాగమం వచ్చి మేనయల్లుఁడు అవుతుంది. ఇలాగే

పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు / పుట్టినయిల్లు

చూడక + ఉండెను = చూడకుండెను / చూడకయుండెను.

అప్రవృత్తి: (1) స్త్రీ వాచకాలకు సంధిలేదు:

ఉదా॥ అమ్మ + ఇచ్చెను = సంధి జరగక, యడాగమం వచ్చి 'అమ్మయిచ్చెను' సంధి జరిగితే 'అమ్మిచ్చెను' అనే అనిష్టరూపం ఏర్పడి నిర్దేశించిన అర్థం సిద్ధించదు. (అమ్మి ఇచ్చెను)

(2) తత్సమాలకు సంధి లేదు.

ఉదా॥ దూత + ఇతఁడు = దూతయితఁడు. 'దూత' శబ్దం తత్సమం. (సంధి చేస్తే 'దూతితడు' అనే అనిష్ట రూపం ఏర్పడుతుంది.

(3) సంబోధనాంతాలకు సంధిలేదు.

ఉదా॥ చెలువుఁడ + ఇందము = చెలువుఁడయిందము. చెలువుఁడ – సంబోధన వాచకం. సంధి చేస్తే 'చెలువుడిందము' అనే అనిష్టరూపం ఏర్పడుతుంది.

తత్సమానికి (సంస్కృతీయం) సంధి జరుగుతుందని అధర్వణాచార్యులు చెప్పాడు. కానీ పూర్వకావ్యాల్లో ప్రయోగాలు కనిపించలేదు. ఆధునిక కృతుల్లో స్త్రీవాచక తత్సమాలకు సంధి కనిపిస్తుంది అని సూరి వివరించాడు.

ఉదా॥ తత్సమానికి సంధి: గంగ + అనుకాసె = గంగనుకాసె (గంగ అనెడి కాసె); గంగ తత్సమం.

నెలుత + ఇచ్చెను = నెలఁతిచ్చెను; నెలత–స్త్రీవాచకం.

(4) వెలయాల్వాదులలో సంధి లేకపోవడానికి సంధిలో 'బహుళం' అనడమే కారణం.

ఉదా॥ వెల + ఆలు = వెలయాలు.

బహుళానికి నాలుగు ఉదాహరణలను ఇలా పేర్కొనవచ్చు.

ప్రవృత్తి : వచ్చుచున్న + వాఁడు; తచ్ఛబ్ద వకారలోపం జరిగి వచ్చుచున్న+ఆఁడు = వచ్చుచున్నాఁడు

అప్రవృత్తి: అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను

విభాష: మేన + అల్లుడు = మేనల్లుడు/మేనయల్లుడు

అన్యకార్య ప్రవృత్తి: ఒక + ఒక = ఓకానొక

**1.3 ఇత్వ సంధి**

1) ఇకారాంత శబ్దాలకు సంధి రాకపోవటం తెలుగులో సహజం. కాని ఏమి మొదలైన శబ్దాల ఇత్తుకు మాత్రం సంధి వైకల్పికంగా వస్తుందని చెబుతూ చిన్నయసూరి "ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (సంధి-5) అని సూత్రీకరించారు.

ఉదా॥ ఏమి + అంటివి = సంధి జరిగి 'ఏమంటివి', సంధి జరగనపుడు 'ఏమియంటివి',

హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె / హరికినిచ్చె

2) "క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (సంధి-6)

ఉదా॥ వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు/ వచ్చిరియప్పుడు.

వచ్చితిమి + ఇప్పుడు=వచ్చితిమిపుడు/వచ్చితిమి యిపుడు

3) "మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును" (సంధి-7)

మధ్యమ పురుష క్రియల్లోని ఇత్తుకు సంధి నిత్యంగా జరుగుతుంది.

ఉదా॥ ఏలితివి + ఇపుడు = ఏలితివిపుడు

ఏలితి + ఇపుడు = ఏలితిపుడు

ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు.

4) "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" (సంధి-8)

భూతకాలిక అసమాపక క్రియను 'క్త్వార్థం' అంటారు. క్త్వార్థంలో ధాతువుకు 'ఇ' చేరుతుంటుంది.

ఉదా॥ వచ్చి + ఇచ్చెను = (సంధి జరగదు) వచ్చియిచ్చెను.

5) "ఇఁకాదులకుఁ దప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు" (సంధి-9)

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని మొదలైనవి వంటి శబ్దాలకు తప్ప ద్రుత ప్రకృతికాలకు అచ్చు పరమైతే సంధిరాదు. అంటే ద్రుతనకారం పరమందున్న అచ్చుతో కలిసిపోతుంది.

ఉదా॥ వచ్చున్ + ఇపుడు = వచ్చు నిపుడు

చూడన్ + అయితి = చూడనయితి

ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు

వచ్చున్, చూడన్, ఉండెడిన్ అనే ద్రుత ప్రకృతికాలు ఇకాదుల లోనివి కావు. అందువల్ల సంధి జరగదు.

ఇఁకన్ + ఏమి = ఇఁకేమి / ఇఁకనేమి

ఇఁగ + ఏల = ఇఁగేల / ఇఁగనేల, కనియె ఎట్టకేలకుననియె

ఎట్టకున్ + ఏన్ = ఎట్టకేని / ఎట్టకునేని

ఈ సూత్రం ప్రకారం ఇఁకన్ మొదలైన నాలుగు ద్రుతప్రకృతిక శబ్దాలకు తప్ప తక్కిన ద్రుతప్రకృతికాలకు సంధి రాదు. అంటే ప్రథమేతర విభక్తి శత్రర్థ చువర్ణాలకు సంధి చేయకూడదని తాత్పర్యం. అంటే ఇఁకాదులకు, ప్రథమేతర విభక్తి విధిలో చెప్పిన రూపాలకు సంధి వైకల్పికమని తాత్పర్యం.

**1.4 అచ్చుకు ఆమ్రేడితం పరమైతే**

"అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు" (సంధి–10). ద్విరుక్తం యొక్క పరరూపం 'ఆమ్రేడితం'. ఒకే శబ్దాన్ని రెండు సార్లు ఉచ్చరిస్తే రెండోసారి ఉచ్చరించిన పదాన్ని 'ఆమ్రేడితం' అంటారు.

ఉదా॥ ఔర + ఔర = ఔరౌర ఇక్కడ రెండవ 'ఔర' ఆమ్రేడితం. అచ్చుకు ఆమ్రేడితం పరమయి సంధి జరిగింది.

ఆహా + ఆహా = ఆహాహా (ఆ+ఆ=ఆ)

ఎట్టూ + ఎట్టూ = ఎట్టెట్టు (ఊ + ఊ = ఊ)

ఓహో + ఓహో = ఓహోహో (ఓ + ఓ = ఓ)

'తఱచు'గా అనటం చేత వైకల్పికంగా కొన్ని చోట్ల సంధి జరుగుతుంది.

ఉదా॥ ఏమి + ఏమి = ఏమేమి / ఏమియేమి.

అయితే ఆమ్రేడిత సంధి 'క్త్వార్థం'లో రాదు.

ఉదా॥ ఏగి + ఏగి = ఏగియేగి

దీర్ఘాచ్చులకు కూడా సంధిరావడం ఈ సంధిలోని విశేషం.

**1.5 అపదాది స్వర సంధి**

"అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు" (సంధి–11) 'అందు', 'అవక్' అనే అపదాది శబ్దం అచ్చులు పదంయొక్క మొదటి అచ్చు పరమైతే సంధి నిత్యంగా జరుగుతుందని తాత్పర్యం. 'అందు' సప్తమీ విభక్తి ప్రత్యయం. 'అవక్' ఆగమం. 'పూరణ' అర్థంలో సంఖ్యకు చేరే ఆగమం. పదం కానిది అపదం. ఆగమాలు, ప్రత్యయాల్ని 'అపదాలు' అంటారు. ఉదా॥ 'ఎడు', 'ఇంచు' లాంటివి. వీటికి వాక్యంలో వ్యస్తంగా ప్రయోగార్హత లేదు.

ఉదా॥ మూర + ఎఁడు = మూరెఁడు

వీసె + ఎఁడు = వీసెఁడు.

ఎఁడు పరిమాణార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం

అర్థ + ఇంచు = అర్థించు

నిర్జి + ఇంచు = నిర్జించు

'ఇంచు' సంస్కృత ధాతువుల మీద, ఆచ్ఛిక ధాతువుల మీద చేరే ప్రత్యయం. అంతేకాండా ప్రేరణార్థంలో కూడా వస్తుంది. అందు, అవక్ అనేవి కూడా అపదాలయినా, వాటికి వచ్చే సంధిని ప్రయోగాల్ని బట్టి గ్రహించాలి అని సూరి వివరణ.

ఉదా॥ రాముల + అందు = రాములందు / రాములయందు (విభాష)

హరి + అందు = హరియందు (సంధిలేదు)

ఎనిమిది + అవది = ఎనిమిదవది / ఎనిమిదియవది (విభాష)

**2 ఆదేశ సంధులను వివరించండి.**

**2.0** ఒక వర్ణాన్ని తోసివేసి మరో వర్ణం వచ్చి చేరటాన్ని ఆదేశం అంటారు. (మిత్రవదాగమః శత్రువదాదేశః). ఆదేశ సంధికి సంబంధించి సంధి పరిచ్ఛేదంలో కనిపించేవి. (1) ద్విరుక్తటకారాదేశం. (2) గసడదవాదేశం (3) సరళాదేశం (4) పుంప్వాదేశం (5) బింద్వాదేశం (6) అంద్వాదుల ఆదేశం.

**2.1 ద్విరుక్తటకారాదేశం:** "కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అడల కచ్చుపరం బగునపుడు ద్విరుక్త టకారంబగు" (సంధి–12) కుఱు, చిఱు, కడు, నడు, నిడులలోని అడలకు ద్విరుక్త టకారం (ట్ట్) ఆదేశంగా వస్తుంది.

ఉదా॥ కుఱు + ఉసురు (ఱ్ + ఉ) అకారానికి ద్విరుక్తటకారం ఆదేశం (ట్ట్) కుట్ట్ – ఉ + ఉసురు కుట్టుసురు.

చిఱు + ఎలుక = చిట్టెలుక

కడు + ఎదుట = కట్టెదుట,

నడు + ఇల్లు = నట్టిల్లు,

నిడు + ఊరుపు = నిట్టూరుపు.

**2.2 ఆమ్రేడితంలో ద్విరుక్తటకారం:** "ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు" (సంధి-40) ఆమ్రేడితం పరం అయితే 'కడ' మొదలైన శబ్దాలలోని మొదటి అచ్చు తర్వాత ఉండే అన్ని వర్ణాలకు కలిపి ఆదేశంగా అదంత ద్విరుక్తటకారం (ట్ట) వస్తుంది.

ఉదా॥ కడ + కడ = కట్టకడ (రెండవ కడ 'ఆమ్రేడితం'. కడ + కడ తొలి అచ్చు తర్వాత ఉండే వర్ణాలు డ్, అ అనేవి. ఆ రెండింటి స్థానంలో 'ట్ట' ఆదేశం అవుతుంది)

ఎదురు + ఎదురు = ఎట్టయెదురు; కొన + కొన = కొట్టకొన; తుద + తుద = తుట్టతుద

తెన్ను + తెన్ను = తెట్టతెన్ను; తెరువు + తెరువు = తెట్టతెరువు; నడుము + నడుము = నట్టనడుము

పగలు + పగలు = పట్టపగలు; పిడుగు + పిడుగు = పిట్టపిడుగు; బయలు + బయలు=బట్టబయలు

మొదలు + మొదలు = మొట్టమొదలు

'కడాదులు' ఆకృతిగణం. పైవే కాకుండా ఇతర ఉదాహరణలు కూడా ఉంటాయి.

**2.3 గసడదవాదేశం**

కచటతపలకు వరసగా గసడదవలు ఆదేశం కావడం గసడదవాదేశం.

**2.3.1 ప్రథమమీది పరుషాలకు గసడదవలు:**

"ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు" (సంధి-13). ప్రథమా విభక్త్యంత శబ్దాల మీద వచ్చే 'కచటతప'లకు (పరుషాలు), 'గసడదవ'లు బహుళంగా ఆదేశం అవుతాయి.

ఉదా॥ వాఁడు + కొట్టె = వాఁడుగొట్టె. వాఁడు ప్రథమావిభక్త్యంత రూపం. దానికి 'క' (పరుషం) పరం అయింది.

పై సూత్రం ప్రకారం 'క' కు 'గ' ఆదేశం అయి 'వాఁడుగొట్టె' అవుతుంది. బహుళం కాబట్టి 'గ' రాని పక్షంలో 'క' అలాగే ఉండి' వాఁడుకొట్టె అనేరూపమే ఉంటుంది.

అపుడు + చనియె = అపుడు సనియె / అపుడు చనియె (చ > స)

నీవు + టక్కరివి = నీవు డక్కరివి / నీవు టక్కరివి (ట > డ)

వారు + పోరు = వారు వోరు / వారుపోరు (ప > వ)

నన్నయ 'ఆంధ్రశబ్ద చింతామణి'లో ప్రథమా విభక్తిని 'కళ' అన్నాడు. మళ్ళీ యదా (ఎప్పుడు) తదా (అప్పుడు) అనే వాటిని కూడా కళలన్నాడు. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు శబ్దాలు ప్రథమా విభక్త్యంతాలని చెప్పటం స్పష్టత కోసమేనని గమనించాలి.

గసడదవాదేశం కళలైన క్రియలమీద కూడా జరుగుతుంది.

ఉదా॥ రారు + కదా > రారుగదా / రారుకదా

వత్తురు + పోదురు > వత్తురు వోదురు / వత్తురు పోదురు.

పై ఉదాహరణలన్నీ 'బహుళం'లోని 'విభాష'కు ఉదాహరణలు.

**2.3.2 సాంస్కృతిక పరుషాలకు గసడదవలు రాకపోవటం:**

"తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు" (సంధి-14) అచ్చికపదాలకు పరం అయ్యే సాంస్కృతిక (సంస్కృతసమ) పరుషాలకు గసడదవలు రావు.

ఉదా॥ వాఁడు + కంసారి = వాఁడుకంసారి. 'వాఁడు' ప్రథమారూపం. కంసారి సంస్కృత శబ్దం కాబట్టి 'క' సాంస్కృతిక పరుషం అవుతుంది. అలా పరమైన 'క' 'గ' కాలేదు.

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి (చ=చ)

ఆయది + టంకృతి = ఆయదిటంకృతి (ట=ట)

అది + తథ్యము = అదితథ్యము (త=త)

ఇది + పథ్యము = ఇది పథ్యము (ప = ప)

### 2.3.3 ద్వంద్వసమాసంలో గసడదవాదేశం:

"ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు" (సంధి–15). ద్వంద్వసమాసంలో పూర్వపదం తర్వాత చేరే పరుషాలకు గసడదవాదేశం వస్తుంది.

ఉదా॥ కూర + కాయ = కూరగాయ + లు = కూరగాయలు (క > గ)

కాలు+ చేయి = కాలుసేయి + లు = కాలు సేతులు (చ > స)

టక్కు + టెక్కు = టక్కు దెక్కు + లు = టక్కు దెక్కులు (ట > డ)

తల్లి + తండ్రి = తల్లిదండ్రి + లు = తల్లిదండ్రులు (త > ద)

ఊరు + పల్లె = ఊరువల్లె + లు = ఊరువల్లెలు (ప > వ)

### 2.4 సరళాదేశ సంధి:

1) ద్రుత ప్రకృతికం మీది పరుషాలకు సరళాలు ఆదేశం కావడమే సరళాదేశ సంధి. (కచటతప > గసడదవ) "ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు" (సంధి–16)

ఉదా॥ పూచెను + కలువలు = పూచెనుగలువలు. 'ను' ద్రుతం. అది చివర ఉన్నది కాబట్టి 'పూచెను' అనే శబ్దం ద్రుత ప్రకృతికం, దానికి పరమైన కలువలు శబ్దంలోని 'క' పరుషం. పరుషం పరమైంది కాబట్టి దానికి 'గ' అనే సరళం ఆదేశం అవుతుంది. అప్పుడు పూచెనుగలువలు.

తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు (చ > జ)

చేసెను + టక్కులు = చేసెను డక్కులు (ట > డ)

నెగడెను + తమములు = నెగడెను దమములు, (త > ద)

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము (ప > బ)

2) "ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" (సంధి–17)

పరుషాలకు ఆదేశంగా వచ్చే సరళాలు 'ఆదేశసరళాలు'.

ఉదా॥ పూచెను + గలువలు = పూచెంగలువలు

పూచెఁగలువలు

పూచెన్గలువలు

తోఁచెను+జుక్కలు = తోఁచెంజుక్కలు

తోఁచెఁజుక్కలు,

తోచెన్జుక్కలు

చేసెను + డక్కులు = చేసెండక్కులు

చేసెఁడక్కులు

చేసెన్డక్కులు

నెగడెను + దమములు = నెగడెందమములు

నెగడెఁదమములు,

నెగడెన్దమములు,

మొగిడెను + బద్మము = మొగిడెంబద్మము

మొగిడెబద్మము,

మొగిడెన్బద్మము.

ద్రుతానికి బిందువు, సంశ్లేష రాకపోతే దాని 'స్వత్వ' రూపం అలాగే ఉంటుంది. స్వత్వరూపం అంటే నిజరూపం 'ను'.

ఉదా॥ పూచెనుగలువలు, తోఁచెనుజుక్కలు, చేసెనుడక్కులు, నెగడెనుదమములు, మొగిడెనుబద్మము అనే రూపాలుంటాయి.

**2.5 పుంప్వాదేశసంధి**

"కర్మధారయంబునందు మువర్ణకంబునకుం బుంపులగు" (సంధి-32) మువర్ణకానికి పు, ంపు ఆదేశం కావడం పుంప్వాదేశసంధి. కర్మధారయ సమాసాల్లో పూర్వపదం చివర ఉండే 'ము' ప్రత్యయానికి' పు, ంపు' అనేవి ఆదేశంగా వస్తాయి.

ఉదా॥ సరసము + మాట = సరసఁపుమాట

సరసంపుమాట – 'సరసము' విశేషణం, 'మాట' విశేష్యం. రెండూకలిసి విశేషణ పూర్వపద కర్మధారయ సమాసం ఏర్పడుతుంది. పూర్వపదం చివరి 'ము' వర్ణకానికి పు, ంపు ఆదేశం అయితే 'సరసఁపు మాట / సరసంపు మాట.

విరసము + వచనము = విరసఁపు వచనము

విరసంపు వచనము.

**3. ఆగమ సంధులను వివరించండి.**

**3.0** ఆగమం అంటే 'రాక' అని శబ్దార్థం. ఇక్కడ అధికంగా వచ్చే వర్ణమని అర్థం. 'ఆగమమనగా వర్ణాధిక్యమ'ని చిన్నయసూరి పేర్కొన్నాడు. 'మిత్రవదాగమః'-మిత్రునివలె ఉన్న వర్ణాలను అలాగే ఉంచి అధికంగా చేరటం.

ఆగమ వర్ణం పదానికి పూర్వంలో చేరితే అది పూర్వాగమం.

ఉదా॥ రథము; అరదము – ఇందులో రథానికి పూర్వం 'అ' చేరింది.

అలాగే అంతంలో చేరితే 'అంతాగమం' అవుతుంది. ఇటువంటి ఆగమసంధులు: 1) యడాగమం, 2) నుగాగమం, 3) టుగాగమం, 4) రుగాగమం, 5) అలిగాగమం, 6) వుగాగమం.

**3.1 యడాగమసంధి**

"సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సంధి-3) సంధిలేనిచోట పరస్వరానికి ముందు 'యట్' అనే ఆగమం చేరుతుంది. 'యట్' ఆగమం అని చెప్పినందువల్ల ఈ ఆగమం ఉద్దేశించిన శబ్దానికి ముందు చేరుతుంది. 'య'లోని 'అ' ఉచ్చారణ కోసం వచ్చింది కాబట్టి లోపిస్తుంది. అంటే 'య్' మాత్రమే ఆగమంగా చేరుతుంది.

ఉదా॥ మా + అమ్మ = మా+య్+అమ్మ = మాయమ్మ

మీ + ఇల్లు = మీ + య్ = ఇల్లు = మీయిల్లు

మా + ఊరు = మా + య్ + ఊరూ = మాయూరు.

**3.2 నుగాగమ సంధి**

'ను' ఆగమంగా చేరడం 'నుగాగమసంధి'. 'నుక్' అన్నందువల్ల ఈ ఆగమం ఉద్దేశించిన పదానికి చివర చేరుతుంది. ద్రుతం యొక్క స్వత్వరూపం 'ను' కాబట్టి 'ను' అనేదే ఆగమం.

"సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు" (సంధి-25).

సమాసాల్లో (1) ఉదంత స్త్రీ సమాలకు పరుష సరళాలు పరమయితే నుగాగమం చేరుతుంది.

(2) పుంపులకు పరుష సరళాలు పరమయినా నుగాగమం వస్తుంది.

ఉదా॥ ఉదంత స్త్రీ సమాలకు: చిగురు + కయిదువు

'చిగురు' ఉదంతం (హ్రస్వ ఉకారం చివర ఉండేది) అలాగే ఇది స్త్రీసమం. దుమువు చివరలేని ఆచ్ఛిక శబ్దాల్ని 'స్త్రీ సమాలు' అంటారు. దీనికి 'క' (పరుషం) పరమయింది. పై సూత్రం ప్రకారం నుగాగమం వచ్చి

చిగురు+ను+కయిదువు అవుతుంది.

ద్రుత ప్రకృతికం మీది పరుషాలకు సరళాలు ఆదేశంగా వచ్చి

చిగురు+ను+గయిదువు

ఆదేశ సరళానికి ముందున్న ద్రుతానికి బిందువు, సంశ్లేషలు వస్తాయి.

చిగురుంగయిదువు

చిగురుఁగయిదువు

చిగున్గయిదువు

సమాసాల్లో ద్రుతానికి స్వత్వ రూపం ఉండదు. కనుక 'చిగురునుగయిదువు' అనే రూపం ఏర్పడదు.

ఉదంత స్త్రీ సమానికి సరళం పరమైనపుడు :

తళుకు + గజ్జెలు = తళుకు + ను + గజ్జెలు = తళుకుంగజ్జెలు

తళుకుఁగజ్జెలు

తళుకున్గజ్జెలు

పుంపులకు నుగాగమం : సింగపు + కొదమ = సింగపుంగొదమ

సింగపుఁగొదమ

సింగపున్గొదమ

సింగము యొక్క కొదమ. సమాస విభక్తికి లోపం (స.25) సింగము+కొదమ, కర్మధారయాల్లో మువర్ణకానికి పుంపులు ఆదేశం (సంధి. 25) సింగపు కొదమ, సింగంపుకొదమ– పై సూత్రం ప్రకారం నుగాగమంవచ్చి సింగపు+ను+కొదమ దీనిపై ద్రుతకార్యాలు జరిగి సింగపుంగొదమ

సింగపుఁగొదమ

సింగపున్గొదమ

నలుగడలు: 'నాలుగు+కడలు', సమాస విభక్తికి లోపంవచ్చి, 'నలు + కడలువ, ఉదంత స్త్రీసమానికి పరుషం పరమైంది కాబట్టి ఇక్కడ ప్రస్తుత సూత్రం చేత నుగాగమం వచ్చి 'నలు+ను+కడలు'= 'నలుఁగడలు' కావాలి. కాని చిన్నయసూరి 'నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు' అని అనటం చేత నుగాగమం రాదని భావించాలి. నలుగడాదులలో నుగాగమం లేదని అహోబలపతి చెప్పాడు.

గఱువపున్మురువు : పై సూత్రంలో పరుషసరళాలకు ముందే నుగాగమాన్ని విధించినప్పటికి స్థిరవర్ణం పరమయినప్పుడు కూడా కొన్ని చోట్ల నుగాగమం కనిపిస్తుందని సూరి చెప్పాడు. ఉదా॥ గఱువము + మురువు (పుంప్వాదేశం) = గఱువపు + మురువు = (స్థిరం పరం అయింది). నుగాగమం రాదు. కాని వచ్చిన రూపం 'గరువపున్మురువు'.

ఉదంత తద్ధర్మార్థ విశేషణానికి అచ్చుపరం అయితే నుగాగమం రావటం:

"ఉదంతమగు తద్ధర్మార్థ విశేషమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు" (సంధి–33)

ఉదంత తద్ధర్మార్థ విశేషణానికి అచ్చుపరం అయితే నుగాగమం వస్తుంది.

ఉదా॥ చేయు + అతఁడు = చేయు తద్ధర్మార్థ విశేషణం. అతఁడు అనే పదంలోని 'అ' అనే అచ్చు పరం అయింది కాబట్టి నుగాగమం వచ్చి, చేయు + ను + అతఁడు = చేయునతఁడు. అనే రూపం ఏర్పడుతుంది.

'చేసెడు' అనే ఉదంత తద్ధర్మార్థక ధాతుజ విశేషణానికి

ఉదా॥ చేసెడు + అతఁడు > చేసెడు + ను + అతడు = చేసెడునతఁడు.

షష్ఠీ తత్పురుష సమాసాల్లో ఉకార, ఋకారాలకు అచ్చుపరమైనపుడు:

"షష్ఠీసమాసమునం దుకార ఋకారములకచ్చు పరమగునపుడు నుగాగమంబగు" (సంధి–34). షష్ఠీ తత్పురుష సమాసాల్లో ఉకార, ఋకారాలకు అచ్చుపరం అయితే నుగాగమం వస్తుంది.

ఉదా॥ రాజుయొక్క + ఆజ్ఞ

సమాస విభక్తికి లోపం వచ్చి రాజు + ఆజ్ఞ

ఉకారానికి అచ్చుపరం అయింది కాబట్టి నుగాగమం వచ్చి రాజు + ను + ఆజ్ఞ = రాజునాజ్ఞ.

ఋకారానికి ఉదా॥ విధాతృయొక్క + ఆనతి > విధాతృ + ఆనతి > విధాతృ + ను + ఆనతి = విధాతృనానతి.

ఉదంత స్త్రీ సమాలకు, పుంపులకు, అదంత గుణవాచకాలకు 'తనము' పరమయినపుడు:

"ఉదంత స్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు" (సంధి–35)

(1) ఉదంత స్త్రీ సమాలకు

ఉదా॥ సొగసు + తనము : 'సొగసు' ఉదంత స్త్రీ సమం : తనము పరమయింది కాబట్టి నుగాగమం వచ్చి

సొగసు + ను + తనము

ద్రుతకార్యాలు జరిగి : సొగసుందనము

సొగసుఁదనము

సొగసున్దనము

(2) పుంపులకు: సరసపు + తనము > సరసపు + ను + తనము > సరసపు + దనము

సరసపుందనము

సరసపుఁదనము

సరసపున్దనము.

(3) అదంతగుణవాచకాలకు:

తెల్ల + తనము : 'తెల్ల' అదంత గుణవాచకం. హ్రస్వఅకారం చివరనున్న గుణాన్ని తెలిపే శబ్దం. 'తనము' పరం అయింది. నుగాగమం వచ్చి

'తెల్ల + ను+తనము > ద్రుతకార్యాలు జరిగి

తెల్ల + ను + దనము = తెల్లందనము

తెల్లఁదనము

తెల్లన్దనము

**3.3 ప్రాఁతాదుల్లోనుగాగమం**

ప్రాఁతాదుల లుప్త శేషానికి పరుషాలు పరమైనపుడు నుగాగమం వస్తుంది. (సంధి–36)

ఉదా॥ 'ప్రాఁత + కెంపు' సమాసంలో ప్రాఁతాదుల తొలి అచ్చుమీది వర్ణాలకు లోపం వచ్చి

ప్రా + కెంపు అవుతుంది. ఇందులో 'ప్రా' లుప్తశేషం, లుప్తశేషానికి పరుషం పరమైనప్పుడు నుగాగమం వచ్చి

ప్రా + ను + కెంపు అవుతుంది. ద్రుతకార్యాలు జరిగి ప్రాఁగెంపు అవుతుంది.

లేఁత + కొమ్మ > లే + కొమ్మ > లే + ను + కొమ్మ > లేఁగొమ్మ

పూవు + తోట > పూఁదోట

మీఁదు + కడ > మీఁగడ

కెంపు + తామర > కెందామర

చెన్ను + తొవ > చెందొవ

**3.3.1 'క్రొత్త' శబ్దానికి నుగాగమం**

'క్రొత్త' శబ్దం ఆద్యక్షర శేషానికి (క్రొ) కొన్ని చోట్ల లోపం, కొన్ని చోట్ల నుగాగమం వస్తాయి. (సంధి. 38)

ఉదా॥ క్రొత్త + చాయ > ప్రాఁతాదుల తొలి అచ్చు మీద వర్ణాలకు లోపించి

క్రొ + చాయ > నుగాగమం వచ్చి క్రొ + ను + చాయ ద్రుతకార్యాలు జరిగి > క్రొంజాయ

క్రొత్త + చెమట > క్రొ + ను + చెమట > క్రొంజెమట

క్రొత్త + పసిడి > క్రొ + ను + పసిడి > క్రొంబసిడి.

**కెంధూళి, కెంజడలు :**

కెంధూళి, కెంజడలు అనే ప్రయోగాల్లో కూడా నుగాగమం వస్తుందని చిన్నయసూరి చెప్పాడు.

ఉదా॥ కెంపు + ధూళి > కె + ను + ధూళి > కెంధూళి

కెంపు + జడలు > కె + ను + జడలు > కెంజడలు.

క్రీఁగడుపు > క్రీఁగాలు, క్రీఁదొడ – అనే శబ్దాలలో కూడా నుగాగమం వస్తుంది.

ఉదా॥ క్రింది + కడుపు > క్రి + కడుపు > క్రి + ను + కడుపు > క్రి + ను + గడుపు > బహుళ గ్రహణం చేత 'క్రి' కి దీర్ఘం > క్రీ + ను + గడుపు > క్రీఁగడుపు. ఇలాగే క్రీఁగాలు, క్రీఁదొడ మొదలైనవి.

### 3.3.2 ప్రాతాదులు కాని వానిలో కూడా నుగాగమం రావటం:

ఉదా॥ పది + తొమ్మిది > ప + తొమ్మిది > ప + ను + తొమ్మిది > ద్రుతకార్యాలు జరిగి పందొమ్మిది.

ఇలాగే తొమ్మిది + పది > తొంబది

వంక + చెఱుగు > వంజెఱుగు

సగము + కోరు > సంగోరు.

### 3.4 టుగాగమసంధి

టుక్ ఆగమంగా వచ్చేది టుగాగమ సంధి.

1) "కర్మధారయంబులందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" (సంధి–28) కర్మధారయంలో హ్రస్వమయిన ఉకారానికి అచ్చు పరమైతే టుగాగమం వస్తుంది.

ఉదా॥ కఱకు + అమ్ము > కఱకు + ట్ + అమ్ము = కఱకుటమ్ము

నిగ్గు + అద్దము > నిగ్గు +ట్ + అద్దము = నిగ్గుటద్దము

సరసపు + అలుక > సరసపు + ట్ + అలుక = సరసపుటలుక

2) "కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు (సంధి–29) కర్మధారయంలో 'పేరు' మొదలైన శబ్దాలకు అచ్చుపరం అయితే టుగాగమం విభాషగా వస్తుంది.

ఉదా॥ పేరు + ఉరము > పేరు + ట్ + ఉరము = పేరుటురము.

టుగాగమం విభాష కాబట్టి టుగాగమం రాకపోతే పేరు + ఉరము = పేరురము.

చిగురు + ఆకు > చిగురు + ట్ + ఆకు = చిగురుటాకు / సంధి లేనిచో చిగురాకు.

పొదరు + ఇల్లు > పొదరు + ట్ + ఇల్లు = పొదరుటిల్లు / సంధి లేనిచో పొదరిల్లు.

### 3.5 రుగాగమసంధి

రుక్ ఆగమంగా వచ్చే సంధి రుగాగమసంధి.

1) "పేదాదిశబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు" (సంధి–30). పేద మొదలైన శబ్దాలకు 'ఆలు' అనే శబ్దం పరం అయితే 'రుక్' (ర్) ఆగమంగా వస్తుంది.

ఉదా॥ పేద + ఆలు > పేద + ర్ + ఆలు = పేదరాలు.

బీద + ఆలు > బీద + ర్ + ఆలు = బీదరాలు.

ముద్ద + ఆలు > ముద్ద + ర్ + ఆలు = ముద్దరాలు

బాలెంత + ఆలు > బాలెంత + ర్ + ఆలు = బాలెంతరాలు

కొమ + ఆలు = కొమ + ర్ + ఆలు = కొమరాలు

జవ + ఆలు = జవ + ర్ + ఆలు = జవరాలు.

'జవ్వని' అనే, శబ్దానికి 'జవ' ఆదేశం అని చిన్నయసూరి పేర్కొన్నాడు. మనుచరిత్రలో ఏకాంతము నందు నున్న 'జవరాంద్రను' అని ప్రయోగం. జవని + ఆలు > జవ + ఆలు > జవ +ర్ + ఆలు = జవరాలు.

అయిదువ + ఆలు = అయిదువరాలు,

మనుమ + ఆలు = మనుమరాలు,

గొడ్డు + ఆలు = గొడ్రాలు : సంయుక్తం ఏర్పడుతున్నది కాబట్టి 'గొడ్డు'లో ఒక 'డ' కారం లోపం.

2) కర్మధారయంలో 'తత్సమాలకు 'ఆలు' శబ్దం పరమయితే అత్వానికి ఉత్వం, రుగాగమం వస్తాయి. (సంధి 31)

ఉదా॥ ధీర + ఆలు: 'ధీరా' అనే సంస్కృతనామానికి 'ధీర' తత్సమం.

అత్వానికి ఉత్వం. ధీరు + ఆలు > రుగాగమం, ధీరు + ర్ + ఆలు = ధీరురాలు.

ఇలాగే గుణవంత + ఆలు = గుణవంతురాలు

సమాసంలో ఆలు అనే శబ్దం 'స్త్రీ' అనే అర్థాన్ని బోధిస్తుంది. భార్య అనే అర్థాన్ని ఇవ్వదని చిన్నయసూరి చెప్పాడు.

### 3.6. అలిగాగమ సంధి

"అద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు" (సంధి–44)

'అలిక్' అనేది ఆగమంగా రావడం అలిగాగమసంధి.

అందు, ఇందు, ఎందు అనే మూడిటిని 'అంద్వాదులు' అంటారు. వాటికి 'అలి' అనే ఆగమం వస్తుంది.

ఉదా॥ నాయందున్ + కరుణ > సమాసంలో ద్రుతానికి లోపం (సంధి.24)

నాయందు + కరుణ > 'అలి' ఆగమం = నాయందలి కరుణ.

ఇలాగే ఇందున్ + జనులు > ఇందు + జనులు > ఇందు + అలి + జనులు = ఇందలి జనులు.

ఎందున్ + వారు = ఎందలివారు.

అథర్వణుడు, అహోబల పండితుడు ఎందు శబ్దానికి 'అలిగాగమం' లేదన్నారు. ఉదాహరణలు ఉన్నాయి కాబట్టి దాన్ని గ్రహించాలని చిన్నసూరి ఉద్దేశం.

### 3.7. వుగాగమసంధి

"ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు" (సంధి–54)

'వుక్' అనేది ఆగమంగా రావడం వుగాగమసంధి. హ్రస్వ ఉకారం చివరనున్న నామానికి 'అనుకరణం'లో 'వు' ఆగమంగా వస్తుంది.

ఉదా॥ ఇయం ధేనుః + అనె > అనుకరణలో విసర్గకు లోపం వచ్చి ఇయం ధేను + అనె > వుగాగమం వచ్చి

ఇయం ధేను + వ్ + అనె = ఇయంధేనువనె.

## 4. ద్రుతసంధికార్యాలను వివరించండి.

న కారం ద్రుతం. ద్రుతం అంతమందుండే పదాలు ద్రుత ప్రకృతికాలు. ద్రుతానికి సంబంధించిన వ్యాకరణ కార్యాలు ద్రుతకార్యాలు.

### 4.1 సరళాదేశం

"ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు" (సంధి–16)

ద్రుతప్రకృతిక శబ్దాలమీది పరుషాలకు సరళాలు ఆదేశం అవుతాయి

ఉదా॥ పూచెను + కలువలు = పూచెను గలువలు

తోఁచెను + చుక్కలు = తోచెను జుక్కలు

చేసెను + టక్కులు = చేసెను డక్కులు

నెగడెను + తమములు = నెగడెను దమములు

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము.

పై ఉదాహరణలలో ద్రుతప్రకృతికానికి పరమైన కచటతపలకు (పరుషాలు), వరసగా గజడదబలు (సరళాలు) ఆదేశంగా వచ్చాయి.

### 4.1.1 బిందు సంశ్లేషలు ఆదేశం

"అదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" (సంధి-17)

ఆదేశ సరళానికి ముందుండే ద్రుతానికి బిందువు, సంశ్లేష ఆదేశంగా వస్తాయి.

ఉదా॥ పూచెను + గలువలు = పూచెంగలువలు / పూచెఁగలువలు / పూచెన్గలువలు

తోఁచెను + జుక్కలు = తోఁచెను జుక్కలు / తోఁచెఁజుక్కలు / తోఁచెన్జుక్కలు

చేసెను + డక్కులు = చేసెండక్కులు / చేసెఁడక్కులు / చేసెన్డక్కులు

నెగడెను + దమములు = నెగడెందమములు / నెగడెఁదమములు / నెగడెన్దమములు

మొగిడెను + బద్మము = మొగిడెం బద్మము / మొగిడెఁబద్మము / మొగిడెన్బద్మము.

బిందు సంశ్లేషలు రానపుడు పూచెను గలువలు, తోఁచెను జుక్కలు, చేసెను డక్కులు, నెగడెను దమములు, మొగిడెను బద్మము అనే స్వత్వరూపాలుంటాయి.

### 4.1.2 లోప సంశ్లేషలు

"ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు" (సంధి-18)

ద్రుతానికి సరళ స్థిరాలు పరమయితే లోపం, సంశ్లేష వస్తాయి.

ఉదా॥ వచ్చెను + గోవులు = వచ్చెగోవులు (లోపం)

వచ్చెన్గోవులు (సంశ్లేష)

వచ్చెను గోవులు (స్వత్వం)

మెఱసెను + ఖడ్గము = మెఱసె ఖడ్గము (లోపం)

మెఱసె న్ఖడ్గము (సంశ్లేష)

మెఱసెను ఖడ్గము (స్వత్వం)

### 4.1.3 ద్రుతానికి పూర్ణ బిందువులు

వర్గయుక్కులు గానీ, సరళాలు గానీ పరమయినపుడు కొన్ని ప్రయోగాల్లో ద్రుతానికి నిండుసున్న ఆదేశం అవుతుంది (సంధి. 19). 'ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ' అనేవి వర్గయుక్కులు.

ఉదా॥ వచ్చెను + ధాత్రీపతి = వచ్చెంధాత్రీపతి (ద్రుతానికి నిండు సున్న) ఇక్కడ పరమైన 'ధ' వర్గయుక్కు.

పాడెను + గంధర్వుడు = పాడెంగంధర్వుఁడు (ఇక్కడ పరమైన 'గ' సరళం)

కన్ + దోయి = కందోయి.

'కన్' లోని 'న' కారం ద్రుతం కాకపోయినా సూరి ద్రుతంగానే భావించి సంధి అంగీకరించాడు.

### 4.1.4 ద్రుతలోపం/ద్రుత స్వరలోపం

వాక్యాంతంలో ద్రుతానికి కానీ, ద్రుతస్వరానికి గాని లోపం బహుళంగా వస్తుంది (సంధి. 20).

ఉదా॥ వాఁడు వచ్చెను. 'ను' వాక్యాంతంలో ఉంది. ద్రుతం లోపించి 'వాఁడు వచ్చె' అచ్చులోపించి 'వాఁడు వచ్చెన్' అవుతుంది.

ఈ లోపం పద్యాలలో గణాలను బట్టి ఉంటుంది. అంటే పద్యం పాదం చివర ద్రుతస్వరలోపం ఛందో నియమాన్ని బట్టి ఉంటుంది.

ఉదా॥ 'అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్'

ఇది కందపద్య పాదం. రెండు, నాలుగు పాదాలలో చివర గురువుండాలి. కాబట్టి 'సేవన్' అని ఉంటుంది. 'సేవను' అని ఉండదు.

### 4.1.5 ద్రుతం మీద మరో ద్రుతం

కొన్ని చోట్ల ద్రుతం మీద మళ్ళీ న కారం కనిపిస్తుంది. (సంధి. 21)

ఉదా॥ 'అదియును' అనే శబ్దం ద్రుతాంతం. ఈ ద్రుతాంత శబ్దం మీద మళ్ళీ న కారం వచ్చి

అదియును + ను + కాక = అదియునున్గాక అవుతుంది.

దివంబును + పోలె > దివంబును + ను + పోలె = దివంబునుంబోలె

### 4.1.6 ఖండ బిందువు-ద్రుత లోపం

"అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్పు నుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (సంధి-22).

ఉదా॥ ముంగొంగు = ముందు + కొంగు = ప్రాఁతాది సంధి సూత్రాలు, ద్రుతకార్యాలు వచ్చి ముంగొంగు అవుతుంది. పై సూత్రం ప్రకారం అరసున్నతో కూడిన 'ముఁగొంగు' రూపం రాదు.

క్రొత్త + పసిడి, క్రొ + ను + పసిడి = క్రొంబసిడి,

కన్ + దోయి = కందోయి.

### 4.1.7 ద్రుతానికి సంశ్లేషలేదు

తాను, నేను పదాల్లోని ద్రుతానికి సంశ్లేషం లేదు.

ఉదా॥ తాను + చదివె = తాఁజదివె, తానుజదివె

తాను + వినె = తావినె, తానువినె

### 4.1.8 సమాసంలో ద్రుతం

సమాసంలో ద్రుతానికి లోపం వస్తుంది (సంధి. 24)

ఉదా॥ ఎల్లన్ + అర్థములు = ఎల్లయర్థములు (నకారలోపం)

ఎల్లన్ + కలుషములు = ఎల్లకలుషములు (నకారలోపం)

### 4.1.9 ద్రుతానికి స్వత్వం లేదు

సమాసాల్లో ద్రుతానికి స్వత్వ రూపం ఉండదు. ద్రుతానికి స్వత్వ రూపం 'ను' అనేది.

ఉదా॥ చిగురు + ను + కయిదువు = చిగురుఁగయిదువు

చిగురుంగయిదువు

చిగురున్గయిదువు

ఈ సూత్రం ప్రకారం 'చిగురునుగయిదువు' అనే స్వత్వరూపం నిషేధం.

### 4.1.10 తలంబ్రాలు మొదలైన సమాసాలు

'తలఁబ్రాలు మొదలైన సమాసాల్లో ద్రుతానికి లోపం లేదు (సంధి 27).

ఉదా॥ తలఁబ్రాలు = తలయందు + ప్రాలు - సప్తమికి ద్వితీయ (కారక. 22)

తలను + ప్రాలు = ద్రుతకార్యాలు వచ్చి తలఁబ్రాలు. సమాసం అయినా ద్రుతలోపం లేదు.

ఒడి + ప్రాలు =ఒడిఁబ్రాలు; సేసను + ప్రాలు = సేసుఁబ్రాలు; ఊరను + పంది = ఊరఁబంది

ఊరను + పిచ్చుక = ఊరఁబిచ్చుక; తోడను + పుట్టుపు = తోఁడఁబుట్టువు; తోను + పుట్టువు =తోఁబుట్టువు

ఒల్లను + పాటు = ఒల్లఁబాటు (అనంగీకారం); ఒడను + పాటు = ఒడఁబాటు (అంగీకారం)

**5. ప్రాంతాది సంధులను వివరించండి.**

**5.0** ప్రాఁత, క్రొత్త, లేత, పూవు మొదలైన పదాలకు జరిగే సంధులు 'ప్రాఁతాది సంధులు' అంటారు.

**5.1** "సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" (సంధి–36).

సమాసంలో 'ప్రాఁత' మొదలైన శబ్దాల తొలి అచ్చు తర్వాత ఉండే అన్ని వర్ణాలు బహుళంగా లోపిస్తాయి.

ఉదా॥ ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు. 'ప్రా'లో ఉండే 'ఆ' తొలి అచ్చు. దాని తర్వాత ఉండే అన్ని వర్ణాలు లోపించి

ప్రా + ఇల్లు = ప్రాయిల్లు (యడాగమం) వర్ణాల లోపం బహుళం కాబట్టి బహుళంలోని విభాష ప్రకారం లోపం రానపుడు అలాగే ఉండి ప్రాఁత + ఇల్లు > 'ప్రాఁతయిల్లు' అనే రూపం ఏర్పడుతుంది.

ఇలాగే లేఁత + దూడ = లేదూడ / లేఁతదూడ

పూవు + రెమ్మ = పూరెమ్మ / పూవురెమ్మ.

**5.2** ప్రాఁతాదుల లుప్తశేషానికి పరుషం పరం అయితే నుగాగమం వస్తుంది (సంధి. 37)

ప్రాఁత + కెంపు = తొలి అచ్చుమీది వర్ణాలకు లోపం (సంధి. 36)

ప్రా + కెంపు = 'ప్రా' లుప్త శేషం. దానికి 'క' అనే పరుషం పరమయింది. నుగాగమం వచ్చి

ప్రా + ను + కెంపు = ద్రుత కార్యాలు వచ్చి ప్రా + ను + గెంపు = ప్రాఁగెంపు

లేఁత + కొమ్మ > లే + కొమ్మ > లే + ను + కొమ్మ > లే + ను + గొమ్మ = లేఁగొమ్మ

పూవు+తోట = పూఁదోట

మీఁదు + కడ =మీఁగడ

కెంపు + దామర = కెందామర

చెన్ను + తొవ = చెందొవ

'బహుళం' అన్నందువల్ల 'మీఁదు' మొదలైన శబ్దాల్లోని తొలి అచ్చుమీది వర్ణాలు నిత్యంగా లోపిస్తాయి. ఇది బహుళంలోని 'ప్రవృత్తి'కి ఉదాహరణము. చెన్ను + తొవ – అన్నచోట 'చెన్ను' ఎరుపు అనే అర్థాన్ని సూచిస్తుందని సూరి వివరణ.

**5.3** 'క్రొత్త' శబ్దం యొక్క ఆది అక్షర శేషానికి పరుషాలు పరమయితే కొన్ని చోట్ల లోపం, కొన్ని చోట్ల ద్విత్వం వస్తాయి. (సంధి. 38)

ఉదా॥ క్రొత్త + చాయ.

తొలి అచ్చుమీది వర్ణాలకు లోపం (సంధి. 36)

క్రొ + చాయ

'క్రొ' 'క్రొత్త' శబ్దం యొక్క 'ఆద్యక్షర శేషం' పరుషం పరం అయింది. నుగాగమం వస్తుంది.

క్రొ + ను + చాయ

ద్రుత కార్యాలు జరిగి 'క్రొంజాయ'

క్రొత్త + చెమట = క్రొంజెమట

క్రొత్త + పసిడి = క్రొంబసిడి. ఇవి లోప నుగాగమాలకు ఉదాహరణలు.

క్రొత్త + కారు = క్రొక్కారు (లోపం, ద్విత్వం)

క్రొత్త + తావి = క్రొత్తావి (లోపం, ద్విత్వం)

**5.4** పరుషేతరాలు పరం అయితే నుగాగమం రాదు కాబట్టి లోప ద్విత్వాలే వస్తాయి.

ఉదా॥ క్రొత్త + గండి = క్రొగ్గండి

క్రొత్త + నన = క్రొన్నన

క్రొత్త + మావి = క్రొమ్మావి

**5.5** కెంధూళి, కెంజడలు అనే ఉదాహరణల్లో కూడా లోప నుగాగమాలు వస్తాయి. అని సూరి వివరణ.

ఉదా॥ కెంపు + ధూళి = కెంధూళి (లోపం, నుగాగమం, ద్రుతకార్యాలు)

కెంపు + జడలు = కెంజడలు (లోపం, నుగాగమం, ద్రుతకార్యాలు)

**5.6** క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ లాంటి వాటిలో 'క్రింది' శబ్దం లుప్తశేషమైన 'క్రి'కి దీర్ఘం వచ్చి 'క్రీ' అనే రూపం ఏర్పడుతుంది.

క్రింది + కడుపు = క్రీఁగడుపు (లోపం, నుగాగమం, ద్రుతకార్యాలు)

క్రింది + కాలు =క్రీఁగాలు (లోపం, నుగాగమం, ద్రుతకార్యాలు)

క్రింది + తొడ = క్రీఁదొడ (లోపం, నుగాగమం, ద్రుతకార్యాలు)

**5.7** 'క్రొత్త కుండలు లాంటి పదాల్లో 'బహుళం' అన్నందువల్ల తొలి అచ్చుమీది వర్ణాలకు లోపం రాదు. ఇది 'బహుళం'లోని 'అప్రవృత్తి'కి ఉదా॥ క్రొత్త + కుండలు = లోపం లేదు కనుక క్రొత్త కుండలు.

**5.8** "అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచోఁ గానంబడియెడి" (సంధి-39) ప్రాఁతాదులు కాని అన్య పదాలకు కూడా ప్రాఁతాదులకు లాగానే లోపనుగాగమాలు, లోపద్విత్వాలు వస్తాయి.

ఉదా॥ పది + తొమ్మిది = పందొమ్మిది (లోపం, నుగాగమం, ద్రుత కార్యాలు)

తొమ్మిది + పది = తొంబది (లోపం, నుగాగమం, ద్రుత కార్యాలు)

సగము + కోరు = సంగోరు (లోపం, నుగాగమం, ద్రుత కార్యాలు)

నిండు + వెఱ = నివ్వెఱ (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

నిండు + వెఱుగు = నివ్వెఱగు (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

నెఱ + తరి = నెత్తరి (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

నెఱ + నడుము = నెన్నడుము (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

నెఱ + మది = నెమ్మది (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

నెఱ + వడి = నెవ్వడి (లోపం, ద్విత్వం, ద్రుత కార్యాలు)

**6. ఆమ్రేడిత సంధి కార్యాలను పేర్కొనండి.**

**6.0** ఒకే శబ్దాన్ని రెండుసార్లు ఉచ్చరిస్తే, రెండోసారి ఉచ్చరించిన శబ్దాన్ని 'ఆమ్రేడితం' అంటారు. ఇటువంటి ఆమ్రేడిత శబ్దాలకు జరిగే సంధికార్యాలే ఆమ్రేడిత సంధికార్యాలు.

**6.1** "అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు" (సంధి-10)

ఉదా॥ ఔర + ఔర = ఔరౌర

ఆహా + ఆహా = ఆహాహా

ఎట్టా + ఎట్టా = ఎట్టెట్టా

ఓహో + ఓహో =ఓహోహో

'తఱచుగా' అన్నందువల్ల అక్కడక్కడా సంధి వికల్పంగా వస్తుంది.

ఉదా॥ ఏమి + ఏమి = ఏమేమి

ఏమియేమి (సంధి జరగకపోతే యడాగమం వచ్చిన రూపం)

క్త్వార్థంలో ఆమ్రేడితం వచ్చినా సంధి జరగదు.

ఉదా॥ ఏగి + ఏగి = ఏగియేగి.

**6.2 విభక్తిలోపం**

"ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు" (సంధి–41)

ఉదా॥ అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్

అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్ / అక్కడనక్కడన్

ఇంటన్+ ఇంటన్ = ఇంటింటన్ / ఇంటనింటన్

ఊరన్ + ఊరన్ = ఊరూరన్ / ఊరనూరన్

**6.3 అంతిమాక్షరలోపం**

"ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు" (సంధి–41)

పై సూత్రంలో 'బహుళం' అని చెప్పటం చేత ఇంచుక, నాఁడు మొదలైన శబ్దాలలో చివరి అక్షరం లోపిస్తుంది.

ఉదా॥ ఇంచుక + ఇంచుక = ఇంచించుక / ఇంచుకించుక

నాఁడు + నాడు = నానాఁడు / నాఁడు నాఁడు =

'నాఁనాఁడు' లోని 'న' తరువాతి అరసున్న స్థిరవర్ణం పరమయినందున లోపిస్తుంది.

**6.4 అందదుకు ప్రభృతులు**

"అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (సంధి–42)

అందదుకు మొదలైన పదాల్ని యథాతథంగా స్వీకరించాలి. 'అదుకు' మొదలైన శబ్దాలకు ఆమ్రేడితం పరమయితే పూర్వపదం వివిధ రకాలుగా మారుతుంది.

ఉదా॥ అదుకు + అదుకు > అందు + అదుకు > అందదుకు+లు = అందదుకులు

ఇంకు + ఇంకు > ఇఱ్ఱు + ఇంకు > ఇఱ్ఱింకు+లు = ఇఱ్ఱింకులు

ఇగ్గు + ఇగ్గు > ఇల్లు + ఇగ్గు > ఇల్లిగ్గు+లు = ఇల్లిగ్గులు

చెదురు + చెదరు > చెల్ల/చెల్లా+చెదరు > చెల్ల చెదరు/చెల్లాచెదరు

తుమురు +తుమురు > తుత్ + తుమురు > తుత్తుమురు

తునియ + తునియ > తుత్ + తునియ > తుత్తునియ+లు = తుత్తునియలు

మిట్లు + మిట్లు > మిఱు +మిట్లు > మిఱుమిట్లు

**6.5 కడాదులు**

"ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు" (సంధి–40)

ఆమ్రేడితం పరమయితే 'కడ' మొదలైన శబ్దాల తొలి అచ్చు మీది వర్ణాల కన్నింటికీ 'ట్ట' ఆదేశంగా వస్తుంది.

ఉదా॥ కడ + కడ = కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టయెదురు

కొన + కొన = కొట్టకొన

చివర + చివర = చిట్టచివర

తుద + తుద = తుట్టతుద

తెన్ను + తెన్ను = తెట్టతెన్ను

తెరువు + తెరువు = తెట్టతెరువు

నడుము + నడుము = నట్టనడుము

పగలు + పగలు = పట్టపగలు

పిడుగు + పిడుగు = పిట్టపిడుగు

బయలు + బయలు = బట్టబయలు – మొదలైనవి.

**6.6 మధ్యమ ముదుజ్ఞుల లోపం**

ఆమ్రేడితం పరమయితే మధ్యమ పురుష ము, డుజ్ వర్ణకాలు విభాషగా లోపిస్తాయి.

ఉదా॥ ఉండుము + ఉండుము = ఉండుండుము / ఉండుముండుము

కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడు కొట్టుఁడు

**7. మధ్యమ పురుష క్రియలలో జరిగే సంధికార్యాలను వివరించండి.**

**7.0** మధ్యమ పురుష క్రియా పదాలలో జరిగే సంధులు 'మధ్యమ పురుష సంధులు'.

"మధ్యమపురుష ముపర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు" (సంధి–47)

మధ్యమ పురుష 'ము వర్ణకానికి, హల్లుకానీ, అవసానం కానీ పరం అయితే 'ము' వర్ణకం విభాషగా లోపిస్తుంది.

1) ముపర్ణకం లోపించినపుడు

ఉదా॥ చూడుము + నన్ను = చూడునన్ను / చూడుమునన్ను

నన్ను + చూడుము = నన్ను చూడు / నన్ను చూడుము

2) 'ము వర్ణకానికి అవసానం పరం అయింది. అచ్చుపరం అయితే మధ్య పురుష ముపర్ణకంలోపించదు.

ఉదా॥ చూడుము + అనియె = చూడుమనియె

వినుము + అనియె = వినుమనియె

**7.1 వ్యతిరేక మధ్యమ 'ము' వర్ణకం**

"వ్యతిరేక మధ్యమ ముపర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు" (సంధి–48)

వ్యతిరేక మధ్యమ పురుష ముపర్ణకానికి అచ్చుపరం అయినా, హల్లుపరం అయినా అవసానం పరం అయినా లోపం విభాషగా వస్తుంది.

ఉదా॥ నమ్మకుము + ఇట = నమ్మకిట / నమ్మకు మిట

నమ్మకుము + వానిని = నమ్మకు వానిని / నమ్మకుము వానిని

వానిని + నమ్మకుము = వానిని నమ్మకు / వానిని నమ్మకుము

**7.2 మధ్యమ ముదుజ్ఞుల లోపం**

"ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముదుజ్ఞులకు లోపంబు విభాషనగు" (సంధి–49)

మధ్యమ ముదుజ్ఞులకు ఆమ్రేడితం పరం అయితే విభాషగా లోపం వస్తుంది.

ఉదా॥ ఉండుము + ఉండుము = ఉండుండుము / ఉండుముండుము.

కొట్టుఁడు + కొట్టుడు = కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడు కొట్టుఁడు

**8. పద్వాదుల సంధిని వివరించి పుంప్వాదేశానికి పద్వాదికి గల భేదాన్ని వివరించండి.**

**8.0 పద్వాదుల సంధి**

'పడు' మొదలైనవి పరం అయితే ముపర్ణకానికి 'లోపం', లేదా 'పూర్ణ బిందువు' విభాషగా వస్తాయి.

భయము + పడె : 'ము' లోపం : భయపడె పూర్ణబిందువు = భయంపడె

లోపం, నిండుసున్న రానపుడు : భయముపడె

అలాగే సూత్రము + పట్టె > సూత్రపట్టె (లోపం) సూత్రం పట్టె (బిందువు) సూత్రము పట్టె.

### 8.1 పుంప్వాదేశ సంధి

"కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు" (సంధి–32)

కర్మధారయ సమాసంలో మువర్ణం పుంపులుగా మారుతుంది. పడ్వాది సంధిలో మువర్ణము లోపించటం గాని లేదా పూర్ణ బిందువుగా మారటంగాని విభాషగా జరుగుతుంది.

పడ్వాది సంధికి ఇచ్చిన ఉదాహరణలో భయంపడె అన్నప్పుడు బిందుపూర్వక పకారానికి పుంప్వాదేశానికి ఏ మాత్రం సంబంధం లేదు.

## 9. అనుకరణ సంధి కార్యాలను వివరించండి.

**9.0** అనుకరణము అంటే ఒకరిని అనుకరించి చెప్పటం. అంటే ఒకరు చెప్పినట్లు చెప్పటం. ఇలా చెప్పేటప్పుడు 'అను' ధాతువుయొక్క క్త్వార్థక రూపం 'అని', కాని అదే అర్థంగల ఇతర పదాలుగాని వస్తాయి.

ఆధునికులు ఇతరులు చెప్పిన మాటలను యథాతథంగా చెప్పేటప్పుడు ఆద్యంతాలలో " " అనే గుర్తులు రాతలో ఉంచుతున్నారు. అలా కాకుండా సంస్కృత క్రియలు, అవ్యయాలు, విభక్త్యంత శబ్దాలు, వాక్యాలను అనుకరించేటప్పుడు పాటించవలసిన నియమాలను చిన్నయసూరి అనుకరణ సంధులలో వివరించారు. ఇక్కడ అనుకరణము అంటే ఇతరులు చెప్పిన సంస్కృత వాక్యాలను లేదా పదాలను ప్రస్తావించేటప్పుడు పాటించాల్సిన పద్ధతి.

సంస్కృత అనుకరణ వాక్యాలు తెలుగులో వచ్చేటప్పుడు జరిగే సంధులు 'అనుకరణ సంధులు'.

### 9.1 విసర్గలోపం

1) "విసర్గంబున కనుకరణంబున లోపంబగు" (సంధి–50)

అనుకరణంలో విసర్గకు లోపం వస్తుంది.

ఉదా॥ వర్ధతాం శ్రీః + అనియె'

వర్ధతాం శ్రీః అనేది సంస్కృత వాక్యం. దానికి 'అనియె' అనే తెలుగు పదం కలిసి తెలుగు వాక్యం ఏర్పడుతుంది. చివరి విసర్గ లోపిస్తుంది. 'వర్ధతాం శ్రీయనియె'.

### 9.2 నమశ్శబ్దం

"అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాషనగు" (సంధి–51)

అనుకరణంలో 'నమః' శబ్దం తుది అత్తుకు ఓత్వం వస్తుంది.

ఉదా॥ తుభ్యం నమః + అనె = తుభ్యం నమో యనె

తుభ్యం నమ యనె

### 9.3 ఇతరచోట్ల ఓత్వం రావడం

నమశ్శబ్దం కాని చోట్ల కూడి తుది 'అత్తు'కు ఓత్వం వస్తుంది.

గతానుగతికోలోకః + అటంచున్

విసర్గ లోపించి – గతానుగతికో లోక + అటంచున్

ఓత్వం వచ్చి – గతానుగతికో లోకోయటంచున్

### 9.4 తుది హల్లుకు ద్విత్వం

"అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు" (సంధి–52)

'అనుకరణం' లో తుది హల్లుకు ద్విత్వం వస్తుంది.

ఉదా॥ కింతత్ + అనియె = కింతత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె

**9.5 అహమాదుల మకారానికి ద్విరుక్తి**

"అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు" (సంధి-53)

అనుకరణంలో 'అహమ్' మొదలైన శబ్దాల మకారానికి ద్విత్వం వస్తుంది.

దాసోహమ్ + అనె = దాసోహమ్మనె / 'దాసోహమనె' (ద్విత్వం రానప్పుడు)

తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె (ద్విత్వం రానప్పుడు)

**9.6 వుగాగమం రావడం**

"ఉదంత నామంబున కనుకరనంబునందు వుగాగమంబగు" (సంధి-54)

అనుకరణంలో ఉదంతమైన నామానికి 'వు' అనే ఆగమం చేరుతుంది.

ఉదా॥ ఇయంధేనుః + అనె = విసర్గలోపం > ఇయం ధేను + అనె > 'వు' ఆగమం > ఇయంధేనువనె.

**9.7 దీర్ఘానికి హ్రస్వం రావడం**

'అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండువలికె నది నిరాకరంబు'' (సంధి-54)

ఉదా॥ దుర్బలస్య బలం రాజా యనవినవే

అనుకరణంలో దీర్ఘానికి హ్రస్వం వస్తుందని కొందరు చెప్పారు. అయితే దానికి ప్రయోగాలు లేవని చిన్నయసూరి పేర్కొన్నాడు.

'దుర్బలస్యబలం రాజా' + అనవినవే

'రాజా' లో దీర్ఘానికి హ్రస్వం రాలేదు. 'రాజా' శబ్దం దీర్ఘాంతమే. 'దుర్బలస్యబలం రాజా యన వినవే' అని ప్రయోగం.

**మాదిరి ప్రశ్నలు**

1. బాలవ్యాకరణంలో చిన్నయసూరి చేసిన వర్ణనిరూపణను పేర్కొనండి?
2. చిన్నయసూరి పేర్కొన్న దంత్య తాలవ్య చ జ లను గురించి వివరించండి.
3. బాలవ్యాకరణాన్ని అనుసరించి కళా, ద్రుతప్రకృతిక విభాగాన్ని వివరించండి.
4. చిన్నయసూరి పేర్కొన్న యరలవల లఘుత్వాలఘుత్వాలను వివరించండి.
5. చిన్నయసూరి చేసిన పదజాత విభజనను పేర్కొనండి?
6. బాలవ్యాకరణంలో పేర్కొన్న బిందువు/అనుస్వారం విధానాన్ని గురించి వ్రాయండి.
7. సంధి అంటే ఏమిటో వివరించి చిన్నయసూరి చెప్పిన అచ్సంధులను వివరించండి.
8. ఆదేశ సంధులను వివరించండి.
9. ఆగమ సంధులను వివరించండి.
10. ద్రుతసంధిని పేర్కొని ద్రుతకార్యాలను వివరించండి.
11. ప్రాంతాది సంధులను వివరించండి.
12. ఆమ్రేడిత సంధి కార్యాలను పేర్కొనండి.
13. మధ్యమ పురుష క్రియలలో జరిగే సంధికార్యాలను వివరించండి.
14. అనుకరణ సంధి కార్యాలను వివరించండి

**లఘు ప్రశ్నలు**

1. పడ్వాది సంధిని వివరించండి.
2. నుగాగమ సంధిని వివరించండి.
3. గసడదవాదేశ సంధిని వివరించండి.
4. ప్రాంతాది సంధి కార్యాలను తెల్పండి.

# యూనిట్-3

**ఈ యూనిట్‌లో రెండు విభాగాలు ఉన్నాయి. అవి - అ) తత్సమ పరిచ్ఛేదం ఆ) ఆచ్ఛిక పరిచ్ఛేదం. అ) తత్సమ పరిచ్ఛేదంలో - 1) తెలుగు నామవిభక్తులు, 2) సంబోధనలో జరిగే వ్యాకరణ విశేషాలు, 3) లింగ బోధక విధానం, 4) అజంత శబ్ద తత్సమీకరణ పద్ధతులు, 5) హలంత శబ్ద తత్సమీకరణ విధానం, ఆ) ఆచ్ఛిక పరిచ్ఛేదంలో ఆచ్ఛికమంటే ఏమిటో తెలుసుకోవటంతో పాటు ఆచ్ఛిక పదాల బహుచన రూప నిష్పత్తుల గురించి, ఆచ్ఛిక శబ్దాల లింగ బోధక విధానం, ఔప విభక్తికాలనుగురించి తెలుసుకుంటారు.**

**అ) తత్సమ పరిచ్ఛేదం**

**1. చిన్నయసూరి పేర్కొన్న తెలుగునామవిభక్తులను పేర్కొని అవి చేరేటప్పుడు జరిగే వ్యాకరణకార్యాలను వివరించండి.**

**1.0 విభక్తులు రెండు రకాలు:** (1) నామ విభక్తులు (2) క్రియా విభక్తులు. 'నామాలు' లేదా 'ప్రాతిపదికల' మీద చేరే విభక్తుల్ని నామ విభక్తులు అని, ధాతువుల మీద చేరే విభక్తి ప్రత్యయాల్ని 'క్రియా విభక్తులు' అని అంటారు.

**1.1 చిన్నయసూరి పేర్కొన్న నామ విభక్తులు ఏడు:** అవి ప్రథమ, ద్వితీయ, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ. ఈ విభక్తి అర్థాలలో చేరే ప్రత్యయాలు గమనించండి:

1. ప్రథమా విభక్తి ప్రత్యయాలు : డు, ము, వు, లు
2. ద్వితీయా విభక్తి ప్రత్యయాలు : ను
3. తృతీయా విభక్తి ప్రత్యయాలు : చేత, తోడ
4. చతుర్థీ విభక్తి ప్రత్యయాలు : కొఱకు, కయి
5. పంచమీ విభక్తి ప్రత్యయాలు : వలన, కంటె, పట్టి
6. షష్ఠీ విభక్తి ప్రత్యయాలు : కు, యొక్క, లోపల
7. సప్తమీ విభక్తి ప్రత్యయాలు : అందు, న

సంస్కృతంలోలాగ సంబోధన ప్రథమా విభక్తి ప్రత్యేకంగా తెలుగులో విభక్తి కాదు.

సప్తమీ విభక్తి ప్రత్యయమైన 'అందు'తో పాటు ఇందు, ఎందు అనేవి అంద్వాదులలో చేరి, వ్యాకరణ కార్యాల్ని సమంగా పంచుకొన్నా, సప్తమీ విభక్తి ప్రత్యయాలలో 'అందున్' ఒక్కదానినే వ్యాకర్తలు పరిగణించారు.

**1.2 విభక్తి ప్రత్యయాలు చేరేటప్పుడు జరిగే వ్యాకరణకార్యాలు:**

**1.2.1** "తృతీయాదులకు నుగాగమంబగు" (తత్సమ-8)

ఉదా॥ రాముని చేతను, రామునితోడను (తృతీయ)

రాముని కొఱకును (చతుర్థీ)

రాముని వలనను, రామునికంటెను (పంచమీ)

రామునకును, రాముని లోపలను (షష్ఠీ)

రాముని యందును (సప్తమీ)

**1.2.2** "కయి-పట్టి-యొక్కలకు నుగాగమంబులేదు" (తత్సమ-9). కయి, పట్టి, యొక్కలకు నుగాగమం చేరదు.

ఉదా॥ రామునికయి, జ్ఞానము బట్టి, రాముని యొక్క

**1.2.3** "చేత, తోడ-లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు" (తత్సమ-10)

చేత, తోడ, లోపల ఈ మూడు ప్రత్యయాలలో మొదటి అక్షరం మాత్రం ఉండి తక్కినవి వికల్పంగా లోపిస్తాయి.

ఉదా॥ రాముని చే (చేత)

రామునితో (తోడ)

వనములలో (లోపల)

**1.3** "డు-ము-వు-న లేకవచనంబులు" (తత్సమ-11). డు, ము, వు అనే ప్రథమా విభక్తి ప్రత్యయాలు, న అనే సప్తమీ విభక్తి ప్రత్యయం ఏకవస్తు బోధకాలు. అందుచేత ఇవి ఏకవచనాలు. ఈ ప్రత్యయాలు ప్రకృతికి ఏకవచనంలోనే వస్తాయి.

ఉదా॥ రాముడు, సోముడు, వనము, ధేనువు.

**1.4** "లువర్ణంబు బహువచనంబు" (తత్సమ-12)

లు వర్ణకం వస్తువుల బహుత్వాన్ని అంటే అనేకత్వాన్ని బోధిస్తుంది.

ఉదా॥ రాములు, సోములు, వనములు, ధేనువులు, భానువులు మొదలైనవి.

**1.5** "తక్కినవి యుభయంబులు" (తత్సమ-13).

డు, ము, వు, న, లు అనే ప్రత్యయాలు కాక మిగిలిన ప్రత్యయాలు అటు ఏకవచనాన్ని, ఇటు బహువచనాన్ని బోధిస్తాయి.

ఉదా॥ వనమును / వనములను

వనము చేతను / వనముల చేతను,

వనమునందును / వనముల యందును.

**2. బాలవ్యాకర్త పేర్కొన్న ఆమంత్రణ విధులను పేర్కొనండి.**

**2.0** 'ఆమంత్రణం' అంటే సంబోధన అని అర్థం. ఈ సంబోధనలో కలిగే వ్యాకారణ కార్యాన్ని ఆమంత్రణ విధులని పిలుస్తారు.

**2.1** "ఓ యామంత్రణంబునందగు" (తత్సమ-14).

ఓ అనే శబ్దం సంబోధ్య వాచకానికి ముందే ప్రయోగించబడుతుంది.

ఉదా॥ ఓ రాముడ, ఓ రాములార : 'రాముడు' సంబోధ్య వాచకం. దానిముందు 'సంబోధన'లో 'ఓ' చేరింది.

'ఓ' శబ్దం లేకుండా కూడా సంబోధ్య వాచకం ఉండవచ్చు. ఉదా॥ రాముడ, రాములార.

**2.2** "ఓ శబ్దంబునకుం బురుష, నీచస్త్రీపురుషామంత్రణంబులందు యి, సి, రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు" (తత్సమ-15)

ఓ శబ్దానికి పురుష సంబోధనలో యి వర్ణం, నీచ స్త్రీ సంబోధనలో సి వర్ణం, నీచ పురుష సంబోధనలో రి వర్ణం వికల్పంగా అంతాగమంగా వస్తాయి.

పురుష సంబోధన : ఉదా॥ ఓయి రాముఁడ / ఓ రాముఁడ,

నీచ స్త్రీ సంబోధన : ఉదా॥ ఓసి దుష్టురాల / ఓ దుష్టురాల

నీచ పురుష సంబోధన: ఉదా॥ ఓరిదుష్టుఁడ / ఓ దుష్టుఁడ

**2.3** "ఓరి యోసి మైత్రియందుంగలవు" (తత్సమ-16)

ఓరి, ఓసి అనే వాటిని నీచ పురుష, నీచ స్త్రీల సంబోధనలోనే కాకుండా 'మైత్రి'లో కూడా వ్యవహరిస్తారు.

ఉదా: ఓరి చిన్ని కృష్ణ, ఓసిముద్దుబాల.

ఇక్కడ ఓరి, ఓసి వాత్సల్యాన్ని ప్రేమను సూచిస్తాయి.

'ఓయి' మొదలైన వాటిని సంబోధ్య వాచకం ముందే కాదు. స్వతంత్రంగా కూడా చేర్చవచ్చు.

ఉదా॥ సంగతియె యోయి, ఓసి పోవే, ఓరోరి యింకెందుఁ బోవవచ్చు.

ఓయి, ఓరి, ఓసి అనే వాటికి దీర్ఘం కూడా ఉంది.

ఉదా॥ ఓయీ విప్రకులావతంస, ఓరీ దుష్టనిశాటులార, ఓసీ ననుఁజెనకరాకు.

**2.4** "సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారంబగు" (తత్సమ-32)

సంబోధనలో ఏక వచనాన్ని బోధించేటప్పుడు చివరి ఉకారానికి అకారం వస్తుంది.

ఉదా॥ ఓ రాముఁడ (సంబోధ్య వాచకం, ఏకవచనం, దానిముందు 'ఓ' చేరింది.

ఓ రాముఁడ. చివరి ఉత్వానికి అత్వం ఆదేశం

ఓ వృక్షమ, ఓశంభువ, ఓ కొడుక మొదలైనవి.

**2.5** "సంబోధనంబునందుఁ బదంబుతుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు" (తత్సమ-33)

సంబోధనలో పదం చివర ఉండే అకార, ఇకారాలకు దీర్ఘం విభాషగా వస్తుంది.

ఉదా॥ ఓ రాముఁడా / ఓ రాముఁడ (సంబోధనకు)

ఓ చెలియా / ఓ చెలియ (సంబోధనకు)

ఓహరీ / ఓహరి (ఇకారానికి దీర్ఘం)

ఓ తండ్రీ / ఓ తండ్రి (ఇకారానికి దీర్ఘం)

**2.6** "కృతోత్కంబగు సంస్కృత నామంబు సంబుద్ధి డుజ్ఞునకు లోపంబు విభాషనగు" (తత్సమ-34)

చేయబడిన హ్రస్వమైన ఉకారము కలది కృతోత్కము. అంటే పదంలో సహజంగా ఉన్న ఉత్వం కాకుండా వ్యాకరణ శాస్త్ర వశాన చేయబడిన ఉత్వం కలది అని తాత్పర్యం. అటువంటి ఉత్వంగల సంస్కృత నామాలకు సంబంధించి సంబోధనలో డుజ్ఞు ప్రత్యయానికి లోపం వికల్పంగా వస్తుంది.

ఉదా॥ రాము, కృష్ణు

సహజంగా ఈ శబ్దాలు రామ, కృష్ణ. కాని ఈ రెండు శబ్దాలు "పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుదియత్వంబునకుత్వంబగు" అనే సూత్రం చేత ఉత్వం వచ్చి రాము, కృష్ణు అవుతాయి. ఇవి వ్యాకరణ శాస్త్రం వలన పొందిన రూపాలు. శంభు, విష్ణు శబ్దాలలోని 'ఉ' పదగతమైన సహజ ఉత్వం.

'కృతోత్కం' అయిన సంస్కృత నామంలోని సంబోధన డుజ్ఞుకు (ండు / ఁడు) విభాషగా లోపం వస్తుంది.

ఉదా॥ రామ – చివర 'అత్వం' ఉంది. పుంలింగం మహద్వాచకం కాబట్టి అత్వానికి ఉత్వం వస్తే

'రాము' అవుతుంది: 'రాము' 'కృతోత్కం' అయిన సంస్కృతనామం. దీనికి డుజ్ చేరి రాము+డుజ్; 'ఓ' చేరి ఓ రాముడుజ్; కృతోత్కం అయిన 'రాము' అనే సంస్కృత నామం యొక్క సంబోధన డుజ్ఞుకు లోపం విభాష కాబట్టి 'ఓ రాము' – చివరి ఉకారానికి అకారం వచ్చి 'ఓరామ' అవుతుంది.

తెలుగు సంబోధ్య వాచకాలడుజ్ఞుకు లోపం ఉండదు.

ఉదా॥ ఓ తమ్ముఁడ, ఓబల్లిదుఁడ : తమ్ముఁడు, బల్లిదుఁడు

**2.7** "ఉదంత సంస్కృత నామంబు మీఁది సంబుద్ధి డుజ్ఞునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు" (తత్సమ-35)

హ్రస్వ ఉకారాంత సంస్కృత నామం మీద చేరే సంబోధన 'డజ్ఞు'కు ప్లుత 'ఊ' కారం విభాషగా ఆదేశం అవుతుంది.

ఉదా॥ ఓ విష్ణూ$_3$, ఓశంభూ$_3$

'విష్ణు' హ్రస్వ ఉకారం చివరనున్న సంస్కృతనామం. దీనిమీదచేరే సంబోధన 'డుజ్ఞు'కు ప్లుత (ప్లుతమంటే త్రిమాత్రాకాలం) ఊకారం ఆదేశం అవుతుంది.

ఉదా॥ ఓ విష్ణు + ఊ$_3$ = ఓ విష్ణూ$_3$

ఓ శంభు + ఊ$_3$ = ఓ శంభూ$_3$

ఇలా ప్లుత ఊకారంరాకపోతే

ఓ విష్ణుఁడ, ఓ శంభుఁడ

అనే రూపాలు ఉంటాయి.

**2.8** "సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు" (తత్సమ-36)

సంబోధనలో బహువచనం చివర 'ఆర(క్)' అనే ఆగమం చేరుతుంది. 'క్' ఇత్సంజ్ఞ.

ఉదా॥ ఓ రాములు. సంబోధ్య వాచకం. బహువచనం కాబట్టి 'ఆర' అనే ఆగమం చేరుతుంది.

ఓ రాములు + ఆర = ఓ రాములార

ఓ కృష్ణులు + ఆర = ఓ కృష్ణులార. 'ఆర'కు దీర్ఘం విభాష కాబట్టి

ఓ రాములారా, ఓ కృష్ణులారా

**2.9** "మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు" (తత్సమ-37)

మధ్యమ పురుష క్రియతో అన్వయం ఉంటే సంబోధ్య వాచకం యొక్క బహువచన ప్రత్యయానికి చివర 'ఆర(క్)' అనే ఆగమం విభాషగా వస్తుంది.

ఉదా॥ వినుఁడు బాలకులు

ఇట 'వినుఁడు' మధ్యమ పురుష క్రియ. దానితో 'బాలకులు' అనే సంబోధ్య వాచకానికి అన్వయం ఉంది. అంటే 'మధ్యమ పురుష యోగం' ఉంది. అప్పుడు 'ఆరక్' విభాషగా చేరి

వినుఁడు బాలకులు + ఆర = వినుఁడు బాలకులార అవుతుంది. 'ఆరక్' చేరనపుడు 'వినుఁడు బాలకులు' ఉంటుంది.

ఇలాగే వచ్చితిరి కాంతలార / వచ్చితిరి కాంతలు.

'అన్నలార మిమ్ముnaడిగెద నొకమాట' ఇక్కడ ఆరగాగమం నిత్యం. 'అడిగెను' ఉత్తమ పురుష క్రియ. మధ్యమ పురుష యోగం లేదు కాబట్టి 'ఆరక్' నిత్యంగా చేరుతున్నది. అంటే అన్నలు అని ఉండదని తాత్పర్యం.

**3. చిన్నయసూరి పేర్కొన్న లింగబోధక విధానాన్ని పేర్కొనండి.**

**3.0** 'సంస్కృతం'లో లింగం శబ్దాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. తెలుగులో అర్థాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. సాధారణంగా శబ్దాలు మూడు లింగాలుగా ఉంటాయి. అవి – పుంలింగం, స్త్రీలింగం, నపుంసకలింగం.

సంస్కృతంలో పుంలింగ శబ్దాలన్నీ పురుష బోధకాలు కావు. అలాగే స్త్రీ లింగ శబ్దాలన్నీ స్త్రీ బోధకాలు కావు. నపుంసక లింగ శబ్దాలు స్త్రీ, పుంలింగ బోధకాలలో ఏదైనా కావచ్చు.

ఉదా॥ 'దార' (పుంలింగం), భార్యా (స్త్రీలింగం) కళత్రమ్ (నపుంసకలింగం) అయితే అన్నిటి అర్థం 'భార్య' అనే.

తెలుగులో లింగం అర్థాశ్రయం – పురుషుల్ని తెలిపే శబ్దాల్ని 'మహత్తులు' లేదా 'మహద్వాచకాలు' అని అంటారు. స్త్రీలను తెలిపే శబ్దాల్ని 'మహతీ వాచకాలు' అంటారు. స్త్రీలను, పశుపక్ష్యాదుల్ని, అచేతనాల్ని తెలిపే శబ్దాల్ని 'అమహత్తులు' అని అంటారు. వాటిని గురించి చిన్నయసూరి చెప్పిన విశేషాల్ని గమనిద్దాం.

**3.1 మహత్తులు**

"స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు" (తత్సమ-17)

స్త్రీవాచకాలు, తిర్యక్ వాచకాలు, జడ వాచకాలకు భిన్నమైనవి అంటే పురుష వాచక శబ్దాలు వాటి విశేషణాలు, మహత్తులు అని తాత్పర్యం.

ఉదా॥ రాముఁడు, రావణుఁడు, ఇంద్రుఁడు మొ॥నవి

**3.2 అమహత్తులు/అమహద్వాచకాలు**

మహత్తులు కానివి అమహత్తులు. "స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు" (తత్సమ-17) అంటే స్త్రీవాచకాలు, పశువాచకాలు, పక్షివాచకాలు, జడవాచకాలు, వాటి విశేషణాలను తెలుగులో అమహత్తులంటారు.

ఉదా॥ (1) సీత పాడినది

(2) ఆవు తెల్లనిది

(3) పక్షి వాలినది

(4) వృక్షము ఎత్తైనది

**3.3 క్లీబములు**

క్లీబములు అంటే నపుంసక లింగాలు. సంస్కృతంలో నపుంసలింగ శబ్దాలే మహద్వాచకాలైన పక్షంలో అవి వికల్పంగా పుంలింగ తుల్యాలు అవుతాయి. అంటే పుంలింగ శబ్దాలకు సమానమైన వ్యాకరణకార్యాలను పొందుతాయని అర్థం. పుంలింగ తుల్యత్వం రానిపక్షంలో సంస్కృతంలో నపుంసకలింగాలు కావడం వలన ము వర్ణకం వస్తుంది. ఉదా॥ మిత్ర, శరణ వంటి శబ్దాలు.

ఉదా॥ మిత్రుఁడు – మిత్రము, శరణుఁడు – శరణము

**3.4 క్లీబతుల్యాలు**

నపుంసక లింగంతో సమానమైన సంస్కృత శబ్దాలు క్లీబతుల్యాలు. చిన్నయసూరి "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" (తత్సమ-66) అని సూత్రీకరించాడు. కంధరాదులు సంస్కృతంలో స్త్రీ లింగాలు. ఇవి తత్సమాలయ్యేటప్పుడు దీర్ఘానికి హ్రస్వం, ప్రథమైక వచనలోపం కలిగిన రూపాలవుతాయి. ఇలా ప్రథమైకవచన లోపం కలిగిన రూపాలే కాకుండా 'ము' వర్ణకం చేరిన రూపాలు కూడా ఏర్పడుతున్నాయి. అందుచేత 'ము' వర్ణకం చేరిన రూపాలను సాధించడం కోసం కంధరాదులకు క్లీబతుల్యతను అతిదేశించారు.

ఉదా॥ కంధరా-కంధర, కంధరము – ఇత్యాదులు

**3.5 స్త్రీ సమము**

ప్రథమా విభక్తి ఏకవచనం లోపించిన అచ్చతెనుగు శబ్దాన్ని స్త్రీసమం అంటారు. ప్రథమైకవచన విభక్తులైన డు,ము,వు అనే ప్రత్యయాలు లోపించిన ఆచ్ఛిక శబ్దాలు. తెలుగులోని అత్యధిక దేశ్య శబ్దాలు ఇటువంటివే.

ఉదా॥ చిగురు, అన్న, అక్క, దున్న, గోడ

**4. అజంత శబ్ద తత్సమీకరణ విధానాన్ని వివరించండి.**

**4.0** సంస్కృతం నుండి వచ్చే సామాన్య నామాల్ని గురించి తత్సమపరిచ్ఛేదంలో సూరి వివరించాడు. సాధారణంగా పుంలింగంబయి మహద్వాచకంబయిన నామానికి ఉత్వము డుజ్ చేరటం, అమహన్నపుంసకములైన అదంత శబ్దాలకు 'ము' వర్ణకం చేరటం, ఉకారాంతమైన మహత్తులకు బహుళంగా'వు' వర్ణకం చేరటం, ఆకారాంతాల మీద ఏ ప్రత్యయాలు చేరక దీర్ఘాంతాలు హ్రస్వాలు కావటం (రమా > రమ), ఋకారాంతాలకు అత్త్వం స్త్రీవద్భావం కలగటం, (భ్రాత, జామాత) విధాతృ, ధాతృ, సవితృ, నేతృ శబ్దాల, మహత్తులకత్వ స్త్రీ వద్భావాలు విభాషగా రావటం. వృద్ధాదుల డుజ్‌నకు లోపం విభాషగా రావటం, చరిత్రాదుల 'ము' వర్ణకానికి బహుళంగా లోపం రావటం, (చరిత్ర, చరిత్రము, చరిత, చరితము), స్వర్గివాచి దేవసుర శబ్దాలు ఏకత్వబహుత్వాలలో ప్రయోగించబడటం, సంస్కృత సమాసంలో కాకుండా, సురశబ్దం, నిత్యంగా, అసురశబ్దం వైకల్పికంగా స్త్రీతుల్యం కావటం, దూతాదులకు స్త్రీత్వంబహుళంగా రావటం, పేర్కొన్నాడు. పృధ్వివాచి భూశబ్దం 'భువి'-గ, నౌశబ్దం 'నావ'గ, నాగమాత అనే అర్థంలో 'కద్రువ' శబ్దాన్ని నిపాత రూపాలుగా పేర్కొన్నాడు. రై, గ్లౌ శబ్దాలకు ఓత్వం విభాషగా రావడం ప్రస్తావించాడు.

### 4.1 'అ' కారాంత ప్రాతిపదికలు

"పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వం బగు" (తత్సమ-21)

"పుంలింగమగు మహద్వాచకమునకు డుఙ్ఞగు (తత్సమ-22)

సంస్కృత అకారాంత ప్రాతిపదికలు పురుషబోధకాలయితే (మహత్తులు) 'డుఙ్' చేరుతుంది. అమహత్తులయితే 'ము' చేరుతుంది. సంస్కృతంలో పుంలింగం అయి, తెలుగులో మహద్వాచకం అయిన నామం తుది అకారానికి ఉకారం వస్తుంది.

ఉదా॥ రామ. ఇది అకారాంత సంస్కృత నామం. పురుష బోధకం. కాబట్టి మహద్వాచకం. దీని చివరి అత్వానికి ఉత్వం చేరి రాము అవుతుంది.

పుంలింగమయి మహద్వాచకమయిన ప్రాతిపదిక చివర 'డుఙ్' చేరుతుంది.

ఉదా॥ రాము + డుఙ్

ఙ కారం ఇద్వర్ణంగా ఉండే వర్ణం ముందు అరసున్న గానీ, నిండు సున్న గానీ వస్తాయి.

రాముఁడు (అరసున్న రూపం)

రాముండు (పూర్ణబిందు రూపం)

ఇలాగే డిత్థుఁడు భార్గవుఁడు, రాజపురుషుఁడు వంటివి.

### 4.2 పుంలింగ తుల్య శబ్దాలు

'మిత్ర' మొదలైన శబ్దాలు సంస్కృతంలో నపుంసక లింగాలు. ఇవి తెలుగులో మహద్వాచకాలు. అయితే వాటికి 'పుంలింగ తుల్యత్వం' వస్తుంది.

ఉదా॥ మిత్ర – నపుంసకలింగం – సంస్కృత అకారాంత ప్రాతిపదిక. అందుచేత పుంలింగతుల్యమయితే

మిత్రుడు అని, నపుంసకలింగం గానే ఉంటే 'మిత్రము' అనే రూపం ఏర్పడుతుంది.

ఇలాగే శరణ : శరణుఁడు / శరణము

ప్రధాన : ప్రధానుఁడు / ప్రధానము

పాత్ర : పాత్రుఁడు / పాత్రము

మిత్రాదులు పుంలింగ తుల్యాలు కాకుంటే అదంత నపుంసకాలు కాబట్టి 'ము' చేరుతుంది.

### 4.3 డుఙ్ లోపించి ఏర్పడే రూపాలు

"వృద్ధాదుల డుఙ్ఞునకు లోపము విభాషనగు" (తత్సమ-56).

'వృద్ధ మొదలైన శబ్దాలకు వచ్చే 'డుఙ్ఞు'కు లోపం విభాషగా వస్తుంది.

ఉదా॥ వృద్ధ – అకారాంత పుంలింగం – మహద్వాచకం. చివరి అత్వానికి ఉత్వం వస్తే వృద్ధు. దానికి 'డుఙ్' చేరి వృద్ధు + డుఙ్ = 'డుఙ్ఞు'కు విభాషగా లోపం వస్తే 'వృద్ధు'. లోపం రానపుడు : 'వృద్ధుఁడు'

ఇలాగే మూర్ఖ : మూర్ఖు / మూర్ఖుఁడు

నీచ : నీచు / నీచుఁడు

గృహస్థ: గృహస్థు + గృహస్థుఁడు

చార్వాక: చార్వాకు / చార్వాకుఁడు

### 4.4 'దేవ', 'సుర' శబ్దాలు

"స్వర్గవాచి దేవ సుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు" (తత్సమ-59)

స్వర్గలోక నివాసి అనే అర్థంలో దేవ శబ్దం ఎప్పుడూ ఏకవచనంలోనే ప్రయోగించబడుతుంది. అంటే దేవుడు అనే ఏకవచన రూపమే ఉంటుంది కాని దేవులు అనే రూపం ఉండదు.

ఉదా॥ దేవ > దేవు > దేవుఁడు

స్వర్గలోక నివాసి అనే అర్థంలో 'సుర' ఎప్పుడూ బహువచనంలోనే ప్రయోగించబడుతుంది. అంటే 'సురలు' అనే బహువచన రూపమే ఉంటుంది కాని 'సురుడు' అనే ఏకవచన రూపం ఉండదు.

ఉదా॥ సకల + సుర + లు = సకల సురలు.

'స్వర్గివాచి' అనటం చేత భూలోకవాసులను తెలిపే దేవ, సుర శబ్దాలకు ఏక, బహువచన రూపాలు రెండూ ఉంటాయి.

ఉదా॥ భూదేవ : భూదేవుఁడు, భూదేవులు

భూసుర: భూసురుఁడు, భూసురులు

### 4.5 'సుర' 'అసుర' శబ్దాలు

"సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు సంస్కృత సమాసంబునఁగావు (తత్సమ–60)

'సుర' శబ్దం అకారాంత పుంలింగమే అయినా వ్యస్తంగా ఉన్నప్పుడు నిత్యంగా స్త్రీ తుల్యం అవుతుంది.

అసుర శబ్దం వైకల్పికంగా స్త్రీతుల్యం అవుతుంది. కాని ఈ రెండు శబ్దాలు సంస్కృత సమాసంలో మాత్రం స్త్రీ తుల్యాలు కావు. స్త్రీ తుల్యత్వం వలన అత్వానికి ఉత్వం రాకపోవటం ప్రథమైకవచన లోపం జరుగుతుంది.

తెలుగులో సుర శబ్దానికి ఏకవచన ప్రయోగం లేదు. సుర + లు = సురలు. స్త్రీతుల్యత్వం వలన ప్రాతిపదికకు ఉత్వం రాదు.

అసుర శబ్దం స్త్రీతుల్యమైనప్పుడు అసుర (ఏకవచనం) అసురలు (బహువచనం), స్త్రీ తుల్యం కానిపక్షంలో ఉత్వడుఙ్‌లు వచ్చి అసురుడు, అసురులు వంటి రూపాలు వర్తిస్తాయి.

సంస్కృత సమాసంలో స్త్రీతుల్యత్వం లేదు కాబట్టి ఉత్వం వస్తుంది.

ఉదా॥ నిఖిల సురులు, రావణాసురుఁడు

సంస్కృత సమాసంలో కావని చెప్పటం చేత మిశ్రసమాసంలో 'సుర' శబ్దానికి నిత్యంగా 'అసుర' శబ్దానికి వైకల్పికంగా స్త్రీత్వం వస్తుందని తాత్పర్యం.

ఉదా॥ ఎల్ల సురలు, ఎల్ల యసురలు, ఎల్లయసురులు

### 4.6 దూతాది శబ్దాలు

"దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు" (తత్సమ–61)

సంస్కృతంలో 'దూత' మొదలైనవి అకారాంత పుంలింగ ప్రాతిపదికలు. వాటికి బహుళంగా స్త్రీత్వం వస్తుంది.

స్త్రీత్వం వచ్చినపుడు ప్రథమైకవచన లోపం జరిగి దూత అని స్త్రీత్వం రానప్పుడు ఉత్వడుఙ్‌లు వచ్చి దూతుఁడు అనే రూపం ఏర్పడుతుంది.

ఉదా॥ రామునకు హనుమంతుడు దూత/దూతుఁడు

అలాగే యోధ / యోధుఁడు, శుంఠ / శుంఠుఁడు వంటి శబ్దాలు

అమహద్వాచకాన్ని తెలిపేటపుడు 'దూత' శబ్దానికి స్త్రీలింగ తుల్యత్వం నిత్యంగా వస్తుంది.

ఉదా॥ సింగంబు దూత యగు జంబుకంబు. 'జంబుకంబు' విశేష్యం. అమహత్తు. దాని విశేషణం 'దూత' కూడా అమహత్తే. అమహత్వంలో స్త్రీత్వం నిత్యం కాబట్టి 'దూతము' అనే రూపం కాకుండా 'దూత' అనే రూపమే అవుతుంది.

### 4.7 నామాలకు విభక్తులు చేరే విధానం

**4.7.1** "దుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (తత్సమ–23)

'దు' అంతమందు కలది యని అర్థం. ప్రథమైక వచనంలో డుఙ్ ప్రత్యయం నిలిచి ఉండే ప్రాతిపదిక దుమంతము. ప్రత్యయం చేరటానికి ముందుగా ఉన్న మూల శబ్దరూపం.

ఉదా॥ రామ శబ్దం ప్రకృతి. దానికి డుఙ్ చేరుతుంది కాబట్టి 'రామ' అనే ప్రాతిపదిక దుమంతం.

హరి అనే ప్రాతిపదికకు డుఙ్ చేరదు కాబట్టి ఇది దుమంతం కాదు.

డుమంతానికి ద్వితీయాది ఏకవచనం పరం అయితే 'సర్వత్ర' నిగాగమం విభాషగా వస్తుంది.

ఉదా॥ రామునిని, రాముని: రామ –డుమంతం, అకారాంతం, పుంలింగం మహద్వాచకం కాబట్టి చివరి అత్వానికి ఉత్వం వచ్చి 'రాము' అవుతుంది. ద్వితీయావిభక్తి 'ను' వర్ణము వచ్చి రాము+ను అవుతుంది. 'ని' ఆగమం వస్తే రాము+ని+ను > ఇకారం తర్వాత వచ్చే 'ను' నిగా మారుతుంది. అపుడు రామునిని అవుతుంది.

నిగాగమం రానప్పుడు రాము+ను = 'ను' వర్ణకం ఉత్వానికి ఇత్వం వచ్చి, 'రాముని' అవుతుంది.

ఇలాగే రాముని చేతను (నిగాగమం వచ్చిన రూపం)

రాము చేతను (నిగాగమం రాని రూపం)

ఇలాగే రామునికిని నుగాగమం వచ్చి

రామునకును.

**4.7.2 తెనుఁగుడుమంతం**

"అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును" (తత్సమ–24)

ఉదంతం కాని తెనుఁగు డుమంతానికి ద్వితీయాది ఏకవచనం చేరేటపుడు 'నిగాగమం' నిత్యం.

ఉదా॥ మగనిని

మగ – తెనుఁగుడుమంతం, అదంతం. ద్వితీయలో 'ను' చేరి మగ + ను = నిగాగమం వచ్చి మగ + ని + ను; 'ను' నిగా మారి మగనిని అనే రూపం సిద్ధిస్తుంది.

ఇలాగే మగని చేతను, మగనికిని మొదలైన రూపాలు సిద్ధిస్తాయి.

ఉదంతం అయిన తెనుఁగు డుమంతానికి నిగాగమం, సంస్కృత డుమంతానికి లాగానే విభాషగా వస్తుంది.

ఉదా॥ తమ్మునిని / తమ్ముని, తమ్ము – తెలుగు డుమంతం కాబట్టి అత్వానికి ఉత్వం వచ్చి తమ్ము – 'ను వర్ణం ద్వితీయ' తమ్మును = నిగాగమం రాకుంటే 'తమ్ముని' అవుతుంది.

ఇలాగే తమ్ముని చేతను (నిగాగమం) వచ్చిన రూపం

తమ్ముచేతను – నిగాగమం రాని రూపం.

ఇలాగే అల్లునిని / అల్లుని    అల్లుని చేతను /అల్లుచేతను

'బల్లిద' అనేది తెలుగు విశేషణం, తెనుగు డుమంతం, పుంలింగం తుల్యం.

బల్లిదునిని / బల్లిదుని; బల్లిదునిచేతను / బల్లిదుచేతను

**4.7.3** "ఇకారంబు మీఁది కు–ను–వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు" (తత్సమ–26)

**ను:** ని డు మంతం మీద వచ్చే 'ను' లోని ఉత్వానికి ఇత్వం వస్తుంది. రాముని: రామ – డుమంతం, అత్వానికి ఉత్వం: రాము ద్వితీయలో రాము – ను 'ను'లోని ఉత్వం ఇత్వం అయితే 'రాముని' అవుతుంది.

**కు :** షష్ఠీ 'కు' వర్ణకం పరం అయినపుడు ఉకారానికి నుగాగమం వస్తుంది. (త.28) రామునకును : రామ – ప్రాతి అత్వానికి ఉత్వం : రాము – షష్ఠిలో రాము – కు > నక్ – ఆగమం వచ్చి రాము – న + కు > రామునకును అలాగే విష్ణునకును, రాము – మొదట అదంతంగా ఉండి 'కృతోత్కం' అయింది. విష్ణు – సహజోత్కం.

**అందు :** ఉకారానికి 'అందు' అనే సప్తమీ విభక్తి పరం అయితే నుగాగమం వస్తుంది. (త.29) రామునందును : రామ – ప్రాతి అత్వానికి ఉత్వం : రాము > 'అందు' వస్తే రాము – అందు > నుగాగమం : రాము – ను + అందు > రామునందు > రామునందును : ఇలాగే 'విష్ణునందును'

**'లట్' ఆగమం :** ఉకారానికి బహువచనంలో ద్వితీయాది విభక్తులకు ముందు 'ల' అనే ఆగమం చేరుతుంది. 'లట్' అన్నందువల్ల 'ల' అనే ఆగమం విభక్తులకు ముందు చేరుతుంది.

**రాములకు :** రామ – ప్రాతి > ద్వితీయలో 'ను' రాము – ను బహువచనంలో 'ల' ఆగమం : రాము + ల – ను > రాములను ఇలాగే రాములచేతను

**4.7.4 బహువచన లు > రు :** 1) హ్రస్వ అకారం చివర ఉంది (అదంతం) (2) దీర్ఘం ముందున్న (3) లకారం ఉపధగా కలిగిన (4) మహద్వాచకం మీద వచ్చే విభక్తి లకారానికి రేఫ ఆదేశం అవుతుంది. (త.38) ఉదా॥ బాలురు : బాల అదంతం, లకారం ఉపధగా కలది. దానిముందు దీర్ఘం ఉంది. (బా) బహువచనం చేరినపుడు : బాలు–లు : 'లు'కు 'రు' వచ్చి : 'బాలురు' ఇలాగే బాలులను > బాలురను (ద్వి) బాలుల చేతను > బాలురచేతను (తృ) ఇలాగే నృపాలురను, నృపాలురచేతను దయాళు – శబ్దం అదంతం కాదు. 'లఉపధగా ఉన్న పదంకాదు'.

అయినా 'దయాళు' శబ్దానికి 'రేఫ' వస్తుందని సూరి వివరణ దయాళు–లు > దయాళురు దయాళులను > దయాళు రను దయాళుల చేతను దయాళుర చేతను

**4.8 అకారాంత శబ్ద తత్సమీకరణం**

"అమహన్న పుంసకముల కదంతంబులకు మువర్ణకంబగు" (తత్సమ–39)

అదంతాలైన అమహద్వాచక శబ్దాలకు, అదంతాలైన నపుంసక లింగ శబ్దాలకు ప్రథమైక వచనంలో 'ము' వర్ణకం వస్తుంది.

ఉదా॥ వృక్షము : వృక్ష – అకారాంతం – పుంలింగం – అయినా అమహత్తు కాబట్టి 'ము' వర్ణకం చేరుతుంది:

వృక్ష+ము = వృక్షము.

ఋక్షము : ఋక్ష – అదంతం – నపుంసకలింగం అమహత్తు. 'ము' చేరి 'ఋక్షము'.

దైవము : అకారాంతం – నపుంసకలింగం – 'ము' చేరుతుంది. 'దైవము' (ఇది పురుష, స్త్రీ దేవతల్ని తెలుపుతుంది).

కళత్ర – అకారాంతనపుంసకలింగం 'ము' చేరి 'కళత్రము. (ఇది 'మహతీవాచకం')

అపత్య = అకారాంత నపుంసకలింగం : అపత్యము 'అపత్యం' అంటే 'బిడ్డ' 'ఆడబిడ్డ (మహతీ) కావచ్చు లేదా 'మగబిడ్డ' (మహత్) కావచ్చు.

**4.8.1 ముగాగమం**

"వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు" (తత్సమ–40).

ప్రథమైక వచనంలో మువర్ణకం చేరే శబ్దాలకు ఇతర విభక్తి ప్రత్యయాలు పరమైనప్పుడు ముక్ ఆగమంగా వస్తుంది.

ఉదా॥ వృక్షములు : వృక్ష – అకారాంతం. అమహత్తు.

బహువచనంలో వృక్ష + లు; ముగాగమం చేరి వృక్ష+ము+లు = వృక్షములు.

ఇలాగే వృక్ష+ను = వృక్షమును; ఋక్ష + లు = ఋక్షములు; ఋక్ష + ను = ఋక్షమును.

ప్రాతిపదికమీద చేరదగినది విభక్తి ప్రత్యయం. అది పదం మీద చేరినదనటం వ్యాకరణనియమానికి విరుద్ధం. అందుచే ప్రథమైకవచనంలో చేరేది 'ము' ప్రత్యయంగాను, ప్రథమా బహువచనంలోను ఇతర విభక్తులలోను చేరే 'ము' వర్ణకాన్ని ముగాగమంగాను పరిగణించాలి. అందుకే మువర్ణకానికి విధించే లోపాదేశాది వ్యాకరణ కార్యాలు ముగాగమానికి కూడా వర్తిస్తాయని చెప్పాడు.

"చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు" (తత్సమ–58)

ఈ సూత్రం చేత చరిత్రము > చరిత్ర అవుతుంది. ఈ కార్యం ముగాగమానికి కూడ వర్తిస్తుంది. అంటే లోపాదేశాలు ముగాగమానికి కూడా వస్తాయి. చరిత్రములు–చరిత్రలు, చరిత్రమును–చరిత్రను

"మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు" (తత్సమ–42)

మువర్ణకానికి, మకార ద్విత్వం బిందుపూర్వక బు వర్ణం వస్తుంది.

ఉదా॥ వృక్షము – వృక్షమ్ము, వృక్షంబు

వృక్షములు – వృక్షమ్ములు – వృక్షంబులు

పైన పేర్కొన్న ద్విత్వ బిందుపూర్వక రూపాలు ముగాగమానికి కూడా వస్తాయి.

"మువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకునగు" (తత్సమ-41)

పైన పేర్కొన్న ముగాగమానికి వచ్చిన ద్విత్వము (మ్మ) బిందుపూర్వక బకారం (ంబ) ప్రత్యయంగా వచ్చే మువర్ణకానికి కూడా వస్తాయి.

ఉదా॥ వృక్షమును – వృక్షమ్మును – వృక్షంబును

### 4.8.2 ముగాగమలోపం, తత్పూర్వ స్వరదీర్ఘం

"లులనలు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు" (తత్సమ-43)

లు, ల, న అనేవి పరం అయినపుడు ముగాగమానికి లోపం, దానికి ముందున్న హ్రస్వానికి దీర్ఘం విభాషగా జరుగుతాయి.

ఉదా॥ వజ్రాలు: వజ్ర – ప్రాతిపదిక

వజ్ర + లు

'ము' వర్ణకం కాని ఇతర ప్రత్యయం పరమయింది కాబట్టి ముగాగమం వస్తుంది.

వజ్రము+లు

'లు' పరం అయింది కాబట్టి ముగాగమలోపం, దానికి ముందున్న అచ్చుకు దీర్ఘం విభాషగా వచ్చి

'వజ్రాలు' రూపం వస్తుంది. ఇలా రాకుంటే 'వజ్రములు' అనే రూపమే ఉంటుంది.

ఇలాగే వజ్ర + న > వజ్రము + న > వజ్రాన

వజ్ర + లు > వజ్రము +లు = వజ్రాలు

అలాగే పగడాలు, పగడాన వంటి రూపాలు.

"ఒకానొకచో ననుటచే నీ కార్యంబునకుఁ బ్రయోగ వైరళ్యంబు" సూచించబడింది.

(1) ముగాగమలోపం (2) తత్పూర్వస్వర దీర్ఘం ఈ రెండు కార్యాల్ని 'సన్నియోగశిష్టాలు' అంటారు. ఇవి రెండు వ్యాకరణ కార్యాలు వస్తే కలిసే వస్తాయి. లేకుంటే రెండూరావు. 'సన్నియోగ శిష్టానాం సహ వా ప్రవృత్తిః, సహ వా నివృత్తిః' అని లక్షణం. ఇవి విభాష కాబట్టి : వజ్రములు, వజ్రములను పగడములు, పగడములను, పగడమున అనే రూపాలు కూడా ఉంటాయి.

### 4.9 'ఇ'కారాంత శబ్ద తత్సమీకరణ

"ఇగ్గౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (తత్సమ-44)

'ఇ' కారాంత సంస్కృత ప్రాతిపదికల మీద చేరే ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయం లోపిస్తుంది.

ఉదా॥ హరి. ఇది ఇకారాంత పుంలింగం, మహద్వాచకం కాబట్టి 'డుజ్' చేరుతుంది.

హరి + డుజ్ = ఇకారాంతం మీద చేరే ప్రథమా విభక్తి ఏకవచన ప్రత్యయం లోపిస్తుంది. 'హరి' అనేదే తత్సమ రూపం అవుతుంది. అలాగే గిరి, శ్రీ, ధీ మొదలైన శబ్దాలు.

### 4.9.1 కు, ను, వు క్రియావిభక్తులు

ఇకారం మీద చేరే 'కు' (షష్ఠీ ప్రత్యయం) ను (ద్వితీయ). వు (ప్రథమ) ల ఉత్వానికి ఇత్వం వస్తుంది.

ఉదా॥ హరి – ఇకారాంత ప్రాతిపదిక; హరి + కు, ఉత్వానికి ఇత్వం వచ్చి 'హరికి';

ఇలాగే హరి+ను = హరిని

హరి + వు = హరివి.

### 4.9.2 ఇ + బహువచనం

"ఇత్తునకు బహువచనంబు పరంబగునపు దుత్వంబగు" (తత్సమ-45).

'ఇత్తు'కు (హ్రస్వ ఇకారానికి) బహువచనం పరం అయితే ఉత్వం వస్తుంది.

ఉదా॥ హరులు : హరి – ప్రాతిపదిక

హరి + లు = హరులు.

ఇలాగే గిరులు, కవులు, రవులు.

అలాగే ఈకారాంతమయిన యామినీ వంటి శబ్దాలకు బహువచనం పరమైనపుడు

"నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (తత్సమ–54) అనే సూత్రం ప్రకారం దీర్ఘానికి హ్రస్వం వచ్చి యామిని. యామిని+లు అవుతుంది. ఇత్వానికి ఉత్వం వచ్చి యామినులు అవుతుంది. అలానే

భామినీ: భామిని + లు = భామినులు.

"వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహవచనము పరంబగునపు దుత్వంబగు" (తత్సమ–46)

వికృతి శబ్దాలలో అంటే సంస్కృత సమేతరమైన శబ్దాల ఇకారాంతాలలోని ఉపోత్తమ ఇత్వానికి బహువచనం పరమయితే ఉత్వం వస్తుంది.

ఉదా॥ కలికి – కలుకులు:

కలికి శబ్దం వికృతి, ఇకారాంతం. దీనికి బహువచనం పరమైనపుడు ఉపోత్తమ ఇత్వానికి ఉత్వం వచ్చి 'కలికులు' అవుతుంది.

కలికి + లు ఇందులోని 'కి' లోని 'ఇ' ఉత్తమం, దానిముందున్న లి లోని 'ఇ' ఉపోత్తమం.

ఇలాగే ములికి–ములుకులు; చెలిమి–చెలుములు; బలిమి–బలుములు

జిగి, నిసి వంటి శబ్దాలలో ఇత్వం ఉత్వంగా మారదు. ఎందుకంటే మూడు, అంతకంటే ఎక్కువ అక్షరాలుంటేనే ఉత్తమం ఉపోత్తమం అనే పరిభాష వర్తిస్తుంది. జిగి, నిగి రెండక్షరాల పదాలే కాబట్టి చెల్లదు.

### 4.9.3 రలడోపధ నవార్థాదుల ఉపోత్తమం

"రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు" (తత్సమ–47)

బహువచనం పరం అయినపుడు ర, ల, డ, లు ఉపధగా ఉండే వికృతి శబ్దాలకు, తొమ్మిది మొదలైన శబ్దాలలోని ఉపోత్తమ ఇత్వానికి ఉత్వం రాదు.

ఉదా॥ పందిరి – ఇది రకారం ఉపధగాగల వికృతి శబ్దం. 'లు' పరం అయినపుడు పందిరి + లు > 'రి' లోని 'ఇ' ఉత్తమం. 'ది' లోని 'ఇ' ఉపోత్తమం. 'లు' పరం అయినపుడు 'ది' లోని ఇత్వానికి ఉత్వం రావలసి ఉండగా నిషేధం విధించబడింది. కాబట్టి 'పందిరులు' అనే రూపమే ఉంటుంది.

ఇలాగే పిడికిలి – పిడికిలులు : 'కి'లోని 'ఇ' ఉపోత్తమం

రాపిడి – రాపిడులు : 'పి' లోని 'ఇ' ఉపోత్తమం

తొమ్మిది – తొమ్మిదులు: 'మ్మి' లోని 'ఇ' ఉపోత్తమం ఈ శబ్దాలలోని ఉపోత్తమ ఇకారం ఉకారంగా మారలేదు.

### 4.9.4 ఇకారంత శబ్దాల సంబోధన

"సంబోధనంబునందుఁ బదంబుతుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు" (తత్సమ–33)

ఇకారాంత శబ్దాలకు సంబోధనలో దీర్ఘం విభాషగా వస్తుంది.

ఉదా॥ హరి = ఓహరీ (దీర్ఘంవచ్చి) ఓహరి (దీర్ఘంరాక)

తండ్రి = ఓ తండ్రీ (దీర్ఘంవచ్చి) ఓతండ్రి (దీర్ఘంరాక)

## 4.10 ఉకారాంత శబ్ద తత్సమీకరణం

**'వు' వర్ణకం :** "ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు" (తత్సమ–48)

'ఉ'కారాంత ప్రాతిపదికలకు అన్ని లింగాల్లోను 'వు' వర్ణకం ప్రథమా ఏకవచనంలో చేరుతుంది.

ఉదా॥ తరువు. తరు "ఉకారాంతం పుంలింగం". 'వు' చేరి 'తరువు' అనే తత్సమం ఏర్పడుతుంది.

ఇలాగే మధు – మధువు

ధేను – ధేనువు

సాధారణంగా సంస్కృత స్త్రీలింగ ప్రాతిపదికల మీద చేరే ప్రథమా ఏకవచన ప్రత్యయం లోపిస్తుంది. సూత్రంలో 'అంతట' అనటం చేత స్త్రీ లింగాలయిన ఉకారాంత శబ్దాలకు ప్రథమైకవచనం రాదు.

ఉదా॥ తరువు, ధేనువు, మధువు, గోవు.

తరు – తరువు

తరు శబ్దం ఉకారంత పుంలింగం. వు చేరి తరువు అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

ధేను శబ్దం ఉకారంత స్త్రీలింగం. వు చేరి ధేనువు అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

మధు శబ్దం ఉకారాంత పుంలింగం వు చేరి మధువు అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

సాధారణంగా సంస్కృత స్త్రీ లింగ ప్రాతిపదికల మీద చేరిన ప్రథమ ఏకవచన ప్రత్యయం 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు' అనే సూత్రం ప్రకారం లోపించాలి. కాని సూత్రంలో అంతటా అని చెప్పటం చేత స్త్రీ లింగాలమీద కూడ వు లోపించదు.

### 4.10.1 'వు' గాగమం

'వు' వర్ణకం కాని ఇతరమైన విభక్తులు పరమయితే ఉకారాంత శబ్దాలకు బహుళంగా, గో శబ్దానికి నిత్యంగా వుగాగమం వస్తుంది.

ఉదా॥ తరువులు. తరు – ఉకారాంత సంస్కృత ప్రాతిపదిక. లు చేరినపుడు 'వు' ఆగమంగా వస్తుంది.

తరు + వు + లు = తరువులు.

'వుగాగమం బహుళం కాబట్టి, వుగాగమం రానపుడు 'తరులు' అనే రూపమే ఉంటుంది.

అలాగే ధేను = ధేనువులు / ధేనులు.

### 4.10.2 ఉకారాంత మహత్తుకు

"ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగానగు" (తత్సమ–50)

ఉకారాంత మహద్వాచకానికి బహుళంగా 'వు' వర్ణకం వస్తుంది.

ఉదా॥ విష్ణువు / విష్ణుఁడు. విష్ణు ఉకారాంతం పుంలింగం, మహద్వాచకం. 'వు' వర్ణకం బహుళంగా చేరితే 'విష్ణువు' 'వు' చేరనపుడు 'డుజ్' చేరి విష్ణుఁడు అవుతుంది.

ఇలాగే శంభు : శంభువు / శంభుఁడు

వసు : వసువు / వసుఁడు

**కద్రువు :** 'పింగళ' వర్ణం అనే అర్థంలో 'కద్రు' అనే శబ్దానికి 'వు' చేరి 'కద్రువు' అవుతుంది. కద్రువు శబ్దం తత్సమం.

### 4.10.3 ఉకారాంత ప్రాతిపదికలలో కలిగే మార్పులు

**షష్ఠీ విభక్తి అర్థంలో 'కు' చేరినపుడు :** 'కు' వర్ణకం చేరేటప్పుడు ఉకారాంత ప్రాతిపదిక చివర 'న' అనే ఆగమం వస్తుంది.

ఉదా॥ విష్ణువునకును : విష్ణు – ఉకారాంతనామం. 'షష్ఠీ' విభక్త్యర్థంలో కు చేరినప్పుడు విష్ణు + కు, దీనికి నగాగమం వచ్చి విష్ణునకు, నుగాగమం వచ్చి విష్ణునకును అవుతుంది.

**సప్తమి విభక్తి అర్థంలో 'అందు' చేరినపుడు :** ఉకారాంత నామం తర్వాత 'అందు' చేరేటప్పుడు 'ను' అనే ఆగమంగా వస్తుంది.

ఉదా॥ విష్ణు – ఉకారాంత ప్రాతిపదిక. సప్తమిలో విష్ణు + అందు, నుగాగమం చేరి విష్ణు+ను+అందు= విష్ణునందు, విష్ణునందును. 'వు' గాగమం వస్తే విష్ణువునందును. ఇలాగే ధేనువు నందును / ధేనువందును.

**సంబోధన :** సంబోధనలో ఉకారాంత సంస్కృత ప్రాతిపదిక చివరి ఉకారానికి అకారం వస్తుంది.

ఉదా॥ శంభువు – సంబోధ్య వాచకం. ఉకారానికి అకారం వచ్చి 'శంభువు' ఓ శంభువ!

ఉదంత సంస్కృత నామం తర్వాత ఉన్న సంబోధన 'దు జ్ను'కు ప్లుత ఊ కారం (ఊ$_3$) విభాషగా ఆదేశం అవుతుంది.

విష్ణు – విష్ణూ

శంభు – శంభూ

**'దయాళు' శబ్దం విషయం :** "అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు" (తత్సమ–38) అదంతమైన – దీర్ఘ పూర్వ లోపధం అయిన మహత్తు తర్వాత చేరే విభక్తి లకారానికి 'రేఫ' ఆదేశం అవుతుంది.

ఉదా॥ దయాళు – దయాళు+లు = దయాళురు

దయాళులను > దయాళురను

దయాళుల చేతను > దయాళురచేతను

**4.11 ఋకారాంత శబ్ద తత్సమీకరణం**

"ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు" (తత్సమ–52)

ఋకారాంత శబ్దం చివరి ఋకారాంతానికి అత్వం ఆదేశమై ఆ శబ్దానికి స్త్రీలింగ తుల్యత్వం కలుగుతుంది. స్త్రీలింగ శబ్దధర్మం పొందటం వలన ప్రథమైకవచన ప్రత్యయం లోపిస్తుంది.

ఉదా॥ భ్రాతృ – భ్రాత

భ్రాతృ శబ్దం ఋకారాంత సంస్కృత ప్రాతిపదిక. పుంలింగం. మహత్తు, అయినప్పటికీ 'స్త్రీ లింగతుల్యత్వం' విధించినందువల్ల 'డుఙ్' రాదు. 'ఋ'కు అత్వం వచ్చి భ్రాతృ > భ్రాత. అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

ఇలాగే జామాతృ > జామాత; కర్తృ>కర్త; భర్తృ>భర్త; హర్తృ>హర్త; గంతృ>గంత; హంతృ>హంత.

**4.11.1 విధాతృ, ధాతృ, దాతృ, సవితృ నేతృ శబ్దాలు**

"విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు" (తత్సమ–53)

మహద్వాచకాలు ఋకారాంతాలయిన విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ – అనే ప్రాతిపదికలకు అత్వము స్త్రీవద్భావం వికల్పంగా వస్తాయి. అవి రాని పక్షంలో డుఙ్ వర్ణకం వస్తుంది.

ఉదా॥ విధాత / విధాతృఁడు

విధాతృ ఋకారాంత, పుంలింగం, మహత్తు. దీనికి స్త్రీలింగతుల్యత్వం, అత్వం విభాషగా వచ్చినప్పుడు విధాతృ > విధాత రానపుడు పుంలింగం, మహద్వాచకం కాబట్టి 'డుఙ్' చేరి 'విధాతృఁడు' ఏర్పడుతుంది.

ఇలాగే ధాతృ – ధాత / ధాతృఁడు

దాతృ – దాత / దాతృఁడు

సవితృ – సవిత / సవితృఁడు

నేతృ – నేత / నేతృఁడు

అత్వం, స్త్రీవద్భావం – ఇవి రెండూ సన్నియోగ శిష్టాలు – అవి రెండూ వస్తే వస్తాయి. లేకపోతే రెండూ రావు.

ఋకారాంత శబ్దాలకు విభక్తులు చేరినపుడు:

**4.11.2 'కు' వర్ణకం :** 'కు వర్ణకం పరం అయినపుడు ఋకారానికి 'న' ఆగమం చేరుతుంది. ('నక్' ఆగమం) (తత్సమ–28)

ఉదా॥ సవితృ శబ్దం ఋకారాంత ప్రాతిపదిక. షష్ఠి విభక్త్యర్థంలో 'కు' చేరి సవితృ+కు అవుతుంది. నగాగమం చేరి: సవితృనకు, సవితృనకును.

ఇలాగే విధాతృ – విధాతృనకును

**4.11.3 అందు :** ఋకారాంత ప్రాతిపదికకు 'అందు' వర్ణకం చేరినపుడు 'ను' ఆగమం చివర్లో చేరుతుంది (తత్సమ–29).

ఉదా॥ విధాతృనందును. విధాతృ – ఋకారాంతం. సప్తమీ అర్థంలో విధాతృ + అందు; నుగాగమం వచ్చి

విధాతృ + ను + అందు > విధాతృనందు – చివర 'ను' ఆగమంగా వచ్చి – విధాతృనందును.

**4.11.4 లడాగమం :** ఈకారాంతాల ద్వితీయాది విభక్తుల ముందు 'ల' ఆగమంగా చేరుతుంది (తత్సమ–31)

ఉదా॥ విధాతృలను – విధాతృ – ఋకారాంత ప్రాతిపదిక. ద్వితీయా విభక్త్యర్థంలో 'ను' చేరి

విధాతృ + ను – బహువచనం చెప్పాలనుకున్నపుడు 'ల' అనే ఆగమం ద్వితీయ 'ను' ముందు చేరుతుంది.

ధాతృ + ల + ను – విధాతృలను

ఇలాగే విధాతృ + చేతను > విధాతృ + ల + చేతను = విధాతృలచేతను

**4.12 దీర్ఘాంత సంస్కృత ప్రాతిపదికల తత్సమీకరణం:**

(1) సాధారణంగా సంస్కృతంలో దీర్ఘాంత ప్రాతిపదికలు స్త్రీలింగాలుగానే ఉంటాయి.

ఉదా॥ రమా, లక్ష్మీ, చమూ మొదలైనవి.

(2) అలా కాకుండా కొన్ని ప్రాతిపదికలకు స్త్రీ ప్రత్యయాలు చేరి స్త్రీలింగ ప్రాతిపదికలవుతాయి. (తత్సమ–85)

ఉదా: కర్తృ (నామం), కర్త్రీ : స్త్రీ ప్రత్యయాంతం.

వనజముఖ (నామం) వనజముఖా (స్త్రీ ప్రత్యయాంతం) మొదలైనవి.

(3) నామాల తుది దీర్ఘానికి హ్రస్వం రావటం (తత్సమ–54)

ఉదా॥ రమా–రమ; వనితా–వనిత; విద్యా–విద్య; లక్ష్మీ–లక్ష్మి; సేనానీ–సేనాని; కర్త్రీ–కర్త్రి; వనజముఖా–వనజముఖ.

ఇలా హ్రస్వంగా చేయబడిన ప్రాతిపదికలకు (కృతహ్రస్వాలు) హ్రస్వాంతాలకు లాగానే వ్యాకరణకార్యాలు వస్తాయి.

ఉదా॥ లక్ష్మీ – శబ్దం ఈ కారాంతం. దీర్ఘానికి హ్రస్వం వచ్చి లక్ష్మి అవుతుంది. ఈ కృత హ్రస్వానికి 'లు' చేరి

లక్ష్మి + లు > ఇత్తుకు ఉత్వం వచ్చి లక్ష్ములు అవుతుంది.

ఇలాగే సేనానీ > సేనాని > సేనానులు; సిరీ > సిరి > సిరులు

**4.12.1 ఏకాక్షర పదాల దీర్ఘాలు హ్రస్వాలు కావు**

ఏకాక్షరాలకు హ్రస్వం లేదు (తత్సమ–55) ఏకాచ్చుతో ఏర్పడిన ప్రాతిపదికల చివరి దీర్ఘానికి హ్రస్వం రాదు.

ఉదా॥ క్ష్మా, మా, భా, శ్రీ, స్త్రీ, ధీ, భీ – వీటిలోని దీర్ఘం అలాగే ఉంటుంది.

భ్రూవు శబ్దం

భ్రూ శబ్దం ప్రాతిపదిక. ఉకారాంతం, ఊకారాంతాల (ఉ, ఊ) చివర 'వు' చేరుతుంది (తత్సమ–48) 'భ్రూవు' తత్సమం.

**4.13 స్త్రీ ప్రత్యయాంత శబ్దాల తత్సమీకరణ**

సంస్కృత శబ్దాలను వాటికి స్త్రీత్వంలో కలిగిన టాప్, జీప్ మొదలైన ప్రత్యయాలతో సహా తెలుగులోకి వస్తాయి. అంటే స్త్రీప్రత్యయాంతాలైన శబ్దాలనుండి తెలుగులో తత్సమాలేర్పడతాయని తాత్పర్యం. దీనినే సూత్రీకరించి చిన్నయసూరి ఇలా చెప్పాడు. "స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబులం గూడి యిందు బ్రవర్తిల్లు" (తత్సమ–85)

| నామం | | స్త్రీ ప్రత్యయాంతం | | తత్సమం |
|---|---|---|---|---|
| కర్తృ | – | కర్త్రీ | – | కర్త్రి |
| జనయితృ | – | జనయిత్రీ | – | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | – | భాగ్యశాలినీ | – | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | – | బుద్ధి శాలినీ | – | బుద్ధిశాలిని |
| మతిమత్ | – | మతిమతీ | – | మతిమతి |
| గుణవత్ | – | గుణవతీ | – | గుణవతి |
| విద్వస్ | – | విదుషీ | – | విదుషి |
| వనజముఖ | – | వనజముఖా | – | వనజముఖ |

– వనజముఖీ – వనజముఖి

మీననేత్ర – మీననేత్రా – మీననేత్ర

పై ఉదాహరణలలో టాప్ (ఆ), జీష్ (ఈ) ప్రత్యయాలు చేరి స్త్రీ ప్రత్యయాంత నామాలు ఏర్పడ్డాయి. ఆ నామాల తుది దీర్ఘం హ్రస్వం అయి తత్సమాలు ఏర్పడ్డాయి.

'అంగ' మొదలైన వాటికి తప్ప సంయోగం ఉపధగా ఉండే ప్రాతిపదికలకు 'స్త్రీ' ప్రత్యయం లేనందువల్ల మీననేత్రి, పద్మనేత్రి మొదలైనవి అసాధు రూపాలు అవుతాయని చిన్నయసూరి పేర్కొన్నాడు.

**4.13.1 స్త్రీలింగ నామాల ప్రథమైకవచన లోపం**

"స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (తత్సమ-57)

స్త్రీ లింగ నామాల మీద చేరే ప్రథమైక వచనానికి లోపం వస్తుంది.

ఉదా॥ రమా – ఆకారాంత స్త్రీ లింగం. నామాల తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి రమ అవుతుంది. ఇది అదంతం – అమహత్తు. 'ము' చేరి రమ + ము అవుతుంది. స్త్రీ లింగం మీద ప్రథమైక వచనం లోపం వచ్చి 'ము' లోపించి 'రమ' ఏర్పడుతుంది. ఇది తత్సమం.

ఇలాగే : క్షమా – క్షమ; వనిత – వనిత; ఘనతా-ఘనత; విద్యా-విద్య; దేవతా-దేవత; మీననేత్రా-మీననేత్ర.

**4.13.2 క్లీబతుల్యత్వం**

"కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు" (తత్సమ-66)

స్త్రీ లింగ శబ్దాలైన 'కంధరా' మొదలైన ప్రాతిపదికలు, బహుళంగా నపుంసకలింగ తుల్యాలు అవుతాయి.

ఉదా॥ కంధరము / కంధర : కంధరా – ఆకారాంత స్త్రీలింగ ప్రాతిపదిక. దీని తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి కంధర అవుతుంది. దీనికి క్లీబతుల్యత్వం బహుళంగా వస్తే 'ము' చేరి కంధరము అవుతుంది. క్లీబతుల్యత్వం రాకపోతే స్త్రీలింగం కాబట్టి 'ము' చేరి లోపిస్తుంది. 'కంధర' అనే రూపం ఉంటుంది.

ఇలాగే నాసికా-నాసికము/నాసిక; భిక్షా-భిక్షము/భిక్ష; దంష్ట్రా-దంష్ట్రము/దంష్ట్ర; గ్రీవా-గ్రీవము/గ్రీవ; పాదుకా-పాదుకము /పాదుక; ఉల్కా- ఉల్కము/ఉల్క

బహుళంలో 'అప్రవృత్తి' ప్రవర్తించి 'విధా' శబ్దానికి క్లీబతుల్యత్వం నిత్యంగా విధించబడినందువల్ల 'విధము' అనే రూపం మాత్రమే ఉంటుంది.

**4.13.3 ఇకారంబు మీద వచ్చే కు-ను-వు క్రియావిభక్తుల ఉత్వానికి ఇత్వం రావటం:**

"ఇకారంబు మీఁదికునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు" (తత్సమ-26)

ఇకారం మీద వచ్చే కు-ను-వు-ల ఉత్వం ఇత్వంగా మారుతుంది. ఇకారం అంటే 'ఇఈ'లు రెండూ.

ఉదా: శ్రీ – ఈ కారంత ప్రాతిపదిక. ద్వితీయావిభక్త్యర్థంలో 'ను' వచ్చి శ్రీ+ను > ఉత్వానికి ఇత్వం వచ్చి శ్రీని అవుతుంది. ఇలాగే శ్రీ+కు > శ్రీకి+ను > శ్రీకిని

**4.14 ఊకారాంత శబ్ద తత్సమీకరణం**

**కద్రువ**

'కద్రూ' అనే ఊకారంత ప్రాతిపదిక హ్రస్వమై 'కద్రు' అవుతుంది. దీనికి 'వు' చేరాల్సి ఉండగా 'కద్రువ నాగమాత' (తత్సమ-51) అనే నిపాత సూత్రంతో నిపతించాడు. నాగమాత అనే అర్థంలో 'కద్రువ' అనే రూపమే ఉంటుంది కాని 'కద్రువు' అనే రూపం ఉండదు.

**4.15 ఐ, ఔలతో కూడిన శబ్ద తత్సమీకరణం**

**'రై':** "రై గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు" (తత్సమ-64)

'రై' అనే నామం మీద చేరే ప్రథమైక వచనం లోపించి 'రై' అనే తత్సమ రూపమే ఉంటుంది.

ఉదా॥ రై + ను > రైని

రై + కు > రైకి

కై + ను > కైని

కై + కు > కైకి

పై + ను > పైని

పై + కు > పైకి.

**'గ్లౌ':**

'గ్లౌ' అనే నామం మీద చేరే ప్రథమాఏకవచన ప్రత్యయం లోపిస్తుంది.

గ్లౌ శబ్దం సంస్కృత నామం, పుంలింగం, మహద్వాచకం. దీనికి గ్లౌ + డుజ్ రావాలి. ఈ సూత్రంతో ప్రథమైకవచన ప్రత్యయమైన 'డుజ్' లోపించి గ్లౌ అనే రూపం ఉంటుంది. ఇది తత్సమం. గ్లౌ అంటే చంద్రుడు అని అర్థం.

రై గ్లౌ శబ్దాలకు విభాషగా ఓత్వం రావటం చేత రై > రో, గ్లౌ > గ్లో రూపాలు ఏర్పడతాయి.

**నౌ:**

'నౌ' అనే సంస్కృత ప్రాతిపదికకు 'నావ' అనే రూపాన్ని సూరి నిపాతంగా విధించాడు. దీనిమీద 'సు' చేరి స్త్రీ లింగం కాబట్టి లోపిస్తుంది. 'నావ' తత్సమం. నావ+లు = నావలు.

మహానౌ = మహానావ

కొందరు నావి అనే రూపాన్ని కూడా తత్సమం అన్నారు.

**5 హలంత శబ్ద తత్సమీకరణాన్ని వివరించండి.**

**5.0** హల్లు అంతమందు గలవి హలంతాలు. సంస్కృత ప్రాతిపదికలలో హల్లు అంతమందుగల శబ్దాలు తెలుగులో తత్సమీకరణ చెందే విధానాన్ని చిన్నయసూరి చెప్పిన విధానాన్ని గమనించండి.

**5.1 ప్రథమైక వచనాంత తుల్యాలే ప్రాతిపదికలు**

అజంత ప్రాతిపదికలు తెలుగులో నేరుగా ప్రాతిపదికలు అవుతాయి. కానీ హలంత శబ్దాలు ప్రథమైక వచనాంతంతో తుల్యమైన రూపమే తెలుగులో ప్రాతిపదిక అవుతుంది. విభక్త్యంతం ప్రాతిపదిక కాకూడదు కాబట్టి ప్రథమైక వచనాంత తుల్యం, ద్వితీయైక వచనాంత తుల్యం అని చిన్నయసూరి పేర్కొన్నాడు.

ఉదా: రుక్, రాట్, మరుత్.

రుచ్ - సంస్కృత హలంత ప్రాతిపదిక. దాని ప్రథమైక వచనం 'రుక్'. (రుక్-రుచౌ-రుచః) అదే ప్రథమైకవచనాంత తుల్యం అవుతుంది. 'రుక్'.

సంస్కృతంలో సం. ప్రథమావిభక్తి, తెలుగులో ప్రాతిపదిక

| | | |
|---|---|---|
| ప్రాతిపదిక రుచ్, | రుక్-రుచౌ-రుచః. | రుక్ (>రుక్కు = కాంతి) |
| రాజ్. | రాట్-రాజౌ-రాజః | రాట్ (>రాట్టు = రాజు) |
| మరుత్. | మరుత్-మరుతౌ-మరుతః | మరుత్ (>మరుత్తు = గాలి) |
| వీరుద్. | వీరుత్ - వీరుధౌ - వీరుదః | వీరుత్ (>వీరుత్తు = తీగ) |
| కర్మన్ | కర్మ-కర్మణీ-కర్మాణి. | కర్మ (> కర్మము = పని) |
| వర్మన్ | వర్మ-వర్మణీ-వర్మాణి. | వర్మ (> వర్మము = కవచము) |
| చర్మన్ | చర్మ-చర్మణీ-చర్మాణి. | చర్మ (> చర్మము) |
| సుధన్వన్. | సుధన్వా-సుధన్వానౌ-సుధన్వాః | సుధన్వా (>సుధన్వుడు) |
| సుత్రామన్. | సుత్రామా-సుత్రామాణౌ-సుత్రామాణః | సుత్రామా (>సుత్రాముడు = ఇంద్రుడు) |

"మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామంబగు" (తత్సమ-70)

'శ్వన్' అనే ప్రాతిపదిక తప్ప, తక్కిన నకారాంత ప్రాతిపదికల ప్రథమాఏకవచనాంత తుల్యాలే ప్రాతిపదికలవుతాయి.

### 5.2 హలంత ప్రాతిపదికలకు ఉత్వదిత్వాలు చేరటం

"ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు" (తత్సమ–68)

హలంత శబ్దాలకు 'ఉక్' అనే ఆగమం, దానికి ముందు 'ద్విత్వం' వస్తాయి.

ఉదా॥ రుచ్, రుక్–రుచౌ–రుచః. రుక్ (>రుక్కు = కాంతి)

రాట్ (>రాట్టు = రాజు)

మరుత్ (>మరుత్తు = గాలి)

వీరుత్ (>వీరుత్తు = తీగ)

నకారాంత శబ్దాల ప్రథమైకవచనం హలంతం కాదు. అజంతం కాబట్టి వీటికి వుగాగమం ద్విత్వం రాదు. కర్మన్, వర్మన్, చర్మన్ శబ్దాలకు కర్మా, వర్మా, చర్మా అనేవి ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికలు. వీటికి మువర్ణకం వచ్చి కర్మము, వర్మము, చర్మము అనే రూపాలే వర్తిస్తాయి. అలాగే సుధన్వన్, సుత్రామన్ శబ్దాలు ఈ రెండు నకారాంత పుంలింగాలు. వీటికి ప్రథమైకవచనాంత తుల్య ప్రాతిపదికలు సుధన్వా, సుత్రామా. నామాల తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి సుధన్వ, సుత్రామ అవుతాయి. పుంలింగ మహద్వాచకాలకు ఉత్వడుజ్‌లు చేరి సుధన్వుఁడు, సుత్రాముఁడు ఏర్పడతాయి.

**5.3** దీర్ఘం తర్వాత వచ్చే హల్లుకు ద్విత్వం బహుళంగా వస్తుంది. అంటే దీర్ఘము, ఉగాగమం వస్తాయి.

ఉదా॥ వాక్కు: వాచ్ (సంస్కృత శబ్దం) దీని ప్రథమ తుల్యరూపం వాక్. ఇది ప్రాతిపదిక. దీనికి ద్విత్వం, ఉగాగమం వస్తే

వాక్+క్ + ఉగాగమం = వాక్కు – అవుతుంది.

ద్విత్వం రాకుంటే ఉగాగమం మాత్రమే వచ్చి, 'వాకు' అని ద్విత్వరహితంగా ఉంటుంది.

ఇలాగే స్వరాట్ > స్వరాట్ (లు) – స్వరాట్టు/స్వరాటు: ఇవి తత్సమాలు.

### 5.4. 'ఋత్విక్' మొ॥నవి

"ఋత్విగాదులు ద్వితీయైక వచనాంత తుల్యంబులు విభాషనగు" (తత్సమ–73)

ఋత్విక్ మొదలైన శబ్దాల ద్వితీయైకవచనాంత తుల్యరూపాలు వికల్పంగా ప్రాతిపదికలవుతాయి. వికల్పం కాబట్టి అలా కాని పక్షంలో ప్రథమైకవచనాంత తుల్యాలే ప్రాతిపదికలై ఉగాగమం, ద్విత్వము వస్తాయి.

ఉదా॥ ఋత్విక్ – ఋత్విజౌ ఋత్విజః (ప్రథమ)

ఋత్విజం – ఋత్విజౌ – ఋత్విజః (ద్వితీయ)

ఇందులో ద్వితీయైకవచనాంతం ప్రాతిపదిక అయితే 'ఋత్విజం' అవుతుంది. దాని అంతిమ మకారానికి లోపం వచ్చి 'ఋత్విజ' అవుతుంది. దానికి ఉత్వ డుజ్‌లు చేరి 'ఋత్విజుఁడు' అవుతుంది. అలా కాని పక్షంలో ప్రథమైక వచన రూపమే 'ఋత్విక్' శబ్దానికి ఉగామం, ద్విత్వము వచ్చి 'ఋత్విక్కు' అవుతుంది.

ఇలాగే నీవృత్ – నీవృతము – నీవృత్తు.

ఇది 'ఆకృతిగణం' కాబట్టి ఇలాంటివే మరికొన్ని రూపాలను గమనించవచ్చు.

### 5.5 మతుప్ తకారానికి 'ఆన' ఆదేశం

"ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు" (తత్సమ–74)

అరుదుగా మహద్వాచక శబ్దాలలో కొన్ని చోట్ల మతుప్ ప్రత్యయానికి 'త' కారానికి 'ఆన' అనేది వికల్పంగా ఆదేశమవుతుంది.

ఉదా: హనుమానుడు – హనుమంతుడు

భగవానుడు – భగవంతుడు – మొదలైనవి

హనుమత్, భగవత్ శబ్దాలు రెండూ మతుప్ ప్రత్యయాంతాలు. మతుప్ తకారమంటే మతుప్ లోని తకారం. 'హనుమత్' అనే సంస్కృత ప్రాతిపదికనే తెలుగులో ప్రాతిపదికగా స్వీకరించాలి. ఈ సూత్రం చేత తకారానికి 'ఆన' ఆదేశంగా వచ్చి హనుమ+ఆన = హనుమాన, దీనికి ఉత్వ డుజ్‌లు చేరి 'హనుమానుఁడు' అవుతుంది.

'ఆన' ఆదేశం రానిపక్షంలో ద్వితీయాంత తుల్యరూపం ప్రాతిపదిక అవుతుంది. అప్పుడు 'హనుమంతమ్' శబ్దంలో అంతిమ మకారానికి లోపంవచ్చి ఉత్వడుజ్‌లు చేరి హనుమంతుడు అవుతుంది.

అలాగే భగవత్ > భగవ + ఆన > భగవాన > భగవానుడు

భగవంతమ్ > భగవంత > భగవంతుఁడు

విశ్వకర్మాదులు

"విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు" (తత్సమ-75)

విశ్వకర్మాదులు నకారాంత పుంలింగ శబ్దాలు. పురుష వాచకాలు. వీటి ప్రథమైకవచనం తుల్య ప్రాతిపదికలకు స్త్రీత్వాన్ని అతిదేశించటం చేత ఉత్వ డుజ్‌లు రావు.

ఉదా॥ విశ్వకర్మన్

'విశ్వకర్మన్' శబ్దం యొక్క ప్రథమైకవచనాంత ప్రాతిపదిక 'విశ్వకర్మా'. దీర్ఘానికి హ్రస్వం వచ్చి 'విశ్వకర్మ' అవుతుంది. ప్రథమైకవచన లోపంతో 'విశ్వకర్మ' అనే రూపం తత్సమం అవుతుంది.

ఇలాగే కృష్ణవర్త్మ, అశ్వత్థామ, యువ, యజ్వ వంటి రూపాలు తత్సమాలు అవుతాయి.

| | | | | |
|---|---|---|---|---|
| కృష్ణవర్త్మన్ | > కృష్ణవర్త్మా | > కృష్ణవర్త్మ | > కృష్ణవర్త్మ | : (తత్సమం) |
| అశ్వత్థామన్ | > అశ్వత్థామా | > అశ్వత్థామ | > అశ్వత్థామ | : (తత్సమం) |
| యువన్ | > యువా | > యువ | > యువ | : (తత్సమం) |
| యజ్వన్ | > యజ్వా | > యజ్వ | > యజ్వ | : (తత్సమం) |

### 5.6 బ్రహ్మన్ శబ్దం

"మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వంబగు" (తత్సమ-76)

మహద్వాచకము, పుంలింగము అయిన 'బ్రహ్మన్' శబ్దానికి స్త్రీత్వం వస్తుంది.

ఉదా॥ బ్రహ్మన్ - సంస్కృత శబ్దం. దీని ప్రథమాతుల్యరూపం 'బ్రహ్మా'. ఇది పుంలింగము, మహద్వాచకము. నామాల తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి బ్రహ్మ అవుతుంది.

(1) బ్రహ్మ శబ్దానికి స్త్రీత్వం విధించినందువల్ల ఉత్వ డుజ్లులు రావు.

స్త్రీ లింగ తుల్యం కాబట్టి ప్రథమైకవచన ప్రత్యయాలు లోపించి 'బ్రహ్మ' అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

ఈ 'బ్రహ్మ'శబ్దం చతుర్ముఖుడైన బ్రహ్మను, ఋత్విజుడిని, విప్రుని తెలుపుతుంది.

(2) బ్రహ్మన్ - నపుంసకలింగం. దీని ప్రథమాతుల్య రూపం బ్రహ్మ. బ్రహ్మ - అదంతము, నపుంసకలింగము కాబట్టి 'ము' చేరి 'బ్రహ్మము' (తత్సమం) అవుతుంది. ఇది తత్త్వాన్ని, తపస్సును, వేదాన్ని తెలుపుతుంది.

(3) బ్రహ్మన్ - పుంలింగము, అమహద్వాచకం. దీని ప్రథమ తుల్యరూపం 'బ్రహ్మా'. బ్రహ్మ అదంతము, అమహద్వాచకము కాబట్టి 'ము' చేరి 'బ్రహ్మము' అనే తత్సమ రూపం ఏర్పడుతుంది. ఇది 'యోగము' అనే అర్థాన్ని తెలుపుతుంది.

### 5.7 ఆత్మన్, ఇమనిచ్ అంతాలు-నాంతాలు

"ఆత్మేమనిజంతంబులకు నాంతములగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు" (తత్సమ-77)

(1) ఆత్మన్, అనే సంస్కృత శబ్దానికి

(2) 'ఇమనిచ్' ప్రత్యయం చివర్లో ఉండే శబ్దాలకు

(3) నకారాంతాలైన మనుష్య సంజ్ఞలకు (నాంతాలు)

స్త్రీత్వం బహుళంగా వస్తుంది.

ఉదా॥ ఆత్మన్: ఆత్మ, ఆత్మము, ఆత్ముడు

మహి

(2) 'ఇమనిచ్'అంతాలు: ఇమనిచ్ ప్రత్యయంతో అంతమయ్యే శబ్దాలు.

ఉదా॥ మహిమన్, గరిమన్, లఘిమన్, అణిమన్ అనేవి ఇమనిచ్ ప్రత్యయాంతాలు.

వీటికి సంస్కృతంలో మాత్రమే 'ఇమన్' అనే ప్రత్యయం చేరుతుంది.

మహా + ఇమన్ = మహిమన్

గురు + ఇమన్ = గరిమన్

లఘు + ఇమన్ = లఘిమన్

అణు + ఇమన్ = అణిమన్

వీటి ప్రథమైక వచనాంత తుల్యరూపాలు: మహిమా, గరిమా, లఘిమా, అణిమా అనేవి.

వీటి తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి మహిమ, గరిమ, లఘిమ, అణిమ అనే రూపాలవుతాయి.

ఇవి అదంతాలు, అమహత్తులు కాబట్టి 'ము' చేరి మహిమము, గరిమము, లఘిమము, అణిమము అనే తత్సమాలు ఏర్పడతాయి.

ఇమనిజంతాలకు స్త్రీ లింగ తుల్యత్వం బహుళం కాబట్టి స్త్రీత్వం వచ్చి 'ము' లోపించి మహిమ, గరిమ, లఘిమ, అణిమ అనే తత్సమ రూపాలు ఏర్పడతాయి.

**5.8 నకారాంత మనుజసంజ్ఞలు:**

నకారాంత సంస్కృత శబ్దాలకు సంస్కృత ప్రాతిపదికలే తెలుగులో ప్రాతిపదికలవుతాయి.

ఉదా॥ దేవశర్మన్ ప్రథమైకవచన తుల్యరూపం దేవశర్మా. దేవశర్మ అదంతము, పుంలింగము, మహద్వాచకము కాబట్టి ఉత్వ డుజ్ఞులు వచ్చి 'దేవశర్ముఁడు' అవుతుంది. వీటికి స్త్రీత్వం బహుళంగా విధించినందువల్ల స్త్రీత్వం వస్తే ఉత్వడుజ్ఞులు రావు కాబట్టి ప్రథమైకవచన ప్రత్యయం లోపించి 'దేవశర్మ' అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

**5.9 'రాజన్':**

మహద్వాచకమయి స్వార్థ ప్రధానమయినప్పుడు రాజ శబ్దము ప్రథమైక వచనంలో 'రాజు' అవుతుంది. సామాన్య ప్రక్రియచేత రాజా > రాజుడు కావలసి ఉండగా దాన్ని స్వార్థపరమైనప్పుడు రాజు అవుతుందని నిపతించి చెప్పాడు.

"మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు" (తత్సమ-78)

ఉదా॥ రాజు - ఖగరాజు (మహత్తు)

రాజము - వృక్షరాజము (అమహమత్తు)

అప్రధానం అయినపుడు 'రాజు' శబ్దం రాదు.

హతరాజుఁడు పరశురాముడు : హతరాజన్ > హతరాజా: హతులైన రాజులు కలవాడు అనే బహువ్రీహి సమాసంలో 'రాజ' శబ్దం యొక్క అర్థం అప్రధానం. హతరాజు అనే రూపం రాదు. ఇది అదంతం పుంలింగం మహద్వాచకం కాబట్టి ఉత్వడుజ్ఞులు వచ్చి 'హతరాజుఁడు' అనే తత్సమ రూపం ఏర్పడుతుంది.

**5.10 జగత్, ఇంద్రజిత్:**

"జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు" (తత్సమ-79)

జగత్, ఇంద్రజిత్ అనే సంస్కృత శబ్దాలలోని 'త'కారం విభాషగా లోపిస్తుంది.

ఉదా: జగము, జగత్తు

ఇంద్రజి, ఇంద్రజిత్తు

జగత్తు, ఇంద్రజిత్తు ప్రథమైకవచనాంత తుల్య ప్రాతిపదికలు.

జగత్ శబ్దంలో తకారం లోపించి 'జగ' అనే రూపం అవుతుంది. 'జగ' అదంతం, అమహత్తు' కాబట్టి దీనికి 'ము'వర్ణకం చేరి 'జగము'. 'త' లోపించినపుడు ఉత్వం, ద్విత్వం వచ్చి 'జగత్తు' అనే తత్సమం ఏర్పడుతుంది.

**5.10.1 ఇంద్రజి/ఇంద్రజిత్తు:**

ఇంద్రజిత్ ప్రథమైకవచన తుల్యరూపం. తకారం లోపించగా 'ఇంద్రజి' అవుతుంది. దానికి ప్రథమైకవచన లోపం వచ్చి

'ఇంద్రజి' అనే తత్సమరూపం ఏర్పడుతుంది. 'త' కారం లోపించని పక్షంలో ద్విత్వం, ఉత్వం వచ్చి 'ఇంద్రజిత్తు' అనే రూపం ఏర్పడుతుంది. ఇంద్రజిత్ శబ్దం ఋత్విగాదులలోనిది కాబట్టి ఇంద్రజితమ్ అనే ద్వితీయాంత ప్రాతిపదికనుండి మకారం లోపించి ఇంద్రజిత > ఉత్వడుజ్‌లు చేరి > ఇంద్రజితుడు అనే రూపం ఏర్పడుతుంది.

**5.11 సకారాంత శబ్దాలు**

"సాంతంబుల తుది సకారమునకు లోపంబు బహుళంబుగానగు" (తత్సమ–80)

సకారాంత శబ్దాల తుది సకారానికి లోపం బహుళంగా వస్తుంది.

ఉదా॥ ఉరస్

సంస్కృత శబ్దమైన ఉరస్ యొక్క ప్రథమైక వచనాంత తుల్యరూపం ఉరస్. దీని తుది సకారానికి లోపం వచ్చి 'ఉర' అవుతుంది. ఇది అదంతం, అమహత్తు కాబట్టి 'ము'వర్ణకం చేరి 'ఉరము' అవుతుంది. 'స' లోపం బహుళం కాబట్టి లోపించికపోతే ఉరస్ శబ్దానికి ఉత్వం, ద్విత్వం, వచ్చి ఉరస్సు – అనే రూపం ఏర్పడుతుంది. సంస్కృత శబ్దానికి ఉరము, ఉరస్సు అనే రెండు తత్సమ రూపాలు ఏర్పడతాయి.

ఇలాగే వక్షస్ > వక్షము/వక్షస్సు; అర్చిస్ > అర్చి/అర్చిస్సు; ధనుస్ > ధనువు/ధనుస్సు; ఆయుస్>ఆయువు/ఆయుస్సు.

అర్చి+సు: ఇకారాంతం కాబట్టి. 'సు' లోపం ధను, ఆయు ఉకారాంతాలు కాబట్టి 'వు' చేరింది.

'బహుళం' అన్నందువల్ల 'పయః' మొదలైన శబ్దాల సకారానికి లోపం లేదు.

పయస్ > పయస్సు (తత్సమం). వయస్ > వయస్సు (తత్సమం).

మహద్వాచకాలైన సాంతాలకు చివరి అక్షరం (స్) లోపం విభాషగా వస్తుంది.

"మహద్వాచకంబులగు సాంతంబుల కంత లోపంబేని ద్వితీయైక వచనాంత తుల్యత్వంబేనగు" (తత్సమ–81)

మహద్వాచకాలైన సకారాంత శబ్దాలకు సకార లోపం గాని ద్వితీయైక వచనాంత తుల్యతగాని ఏర్పడుతుంది.

ఉదా॥ అంగిరసుఁడు

అంగిరః – అంగిరసౌ – అంగిరసః (ప్రథమ)

అంగిరసమ్ – అంగిరసౌ –అంగిరసః (ద్వితీయ)

అంగిరస్ శబ్దంలోని సకారలోపం జరిగి అంగిర రూపం ఏర్పడుతుంది. ఉత్వడుజ్‌లు చేరి అంగిరుడు అనే రూపం ఏర్పడుతుంది. అలా కాకుండా అంగిరసమ్ అనే ద్వితీయైక వచనాంత రూపాన్ని తీసుకున్నప్పుడు మకారానికి లోపం జరిగి ఉత్వడుజ్‌లు చేరి అంగిరసుడు అనే రూపం ఏర్పడుతుంది. అలాగే

ఉగ్రశ్రవవుఁడు, ఉగ్రశ్రవసుఁడు

ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు

ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వరేతసుఁడు అనే తత్సమ రూపాలు ఏర్పడతాయి.

**5.12 వేధ – పురోధ / పురోధసుఁడు**

"వేధ పురోధ పురోధసుఁడు" (తత్సమ–82)

వేధస్ శబ్దానికి 'వేధ' అని, పురోధస్ శబ్దానికి పురోధ/పురోధసుడు అనే రూపాలు తెలుగులో ఏర్పడతాయి.

వేధస్ శబ్దానికి సలోప, స్త్రీవద్భావ శబ్దాలు నిత్యంగా, 'పురోధస్' శబ్దానికి 'స' లోప, స్త్రీవద్భావ శబ్దాలు వికల్పంగా వస్తాయి.

పురోధస్ > (సలోపం) పురోధ > (స్త్రీవద్భావం)

ద్వితీయైక వచనాంత తుల్యత్వం వస్తే పురోధసమ్ > పురోధస > పురోధసుఁడు

**26.12.1 మనస్ మొదలైనవి**

"మనః ప్రభృతుల నకారంబునకు ద్విత్వంబు విభాషనగు" (తత్సమ–83)

'మనస్' మొదలైన సకారాంత శబ్దాల సకారానికి ద్విత్వం వికల్పంగా వస్తుంది.

ఉదా॥ మనస్ – మనసు/మనస్సు

శిరస్ – శిరసు / శిరస్సు

సదస్ – సదసు / సదస్సు

మనస్ శబ్దంలో 'స'కార లోపం వస్తే మన అవుతుంది. ఇది అదంతం, అమహత్తు కాబట్టి 'ము' వర్ణకం చేరి 'మనము' ఏర్పడుతుంది. ఇలాగే శిరస్ > శిర > శిరము, సదస్ > సద > సదము.

**5.12.2 దివ్, హృద్ శబ్దాలు**

"ద్యు హృచ్ఛబ్దంబులకు దివి హృది యగు" (తత్సమ–84)

ద్యు శబ్దానికి దివి అని హృద్ శబ్దానికి హృది అని తెలుగులో ప్రాతిపదికలు ఏర్పడతాయి.

దివి, హృది శబ్దాలు ఇకారాంతాలు కాబట్టి ప్రథమైకవచన లోపాలు వచ్చి దివి, హృది రూపాలు ఏర్పడతాయి. దివి, హృది శబ్దాలు సప్తమీ ఏకవచనాంతాలు. కాని తెలుగులో ప్రథమంగా వాడుకలోనికి వచ్చాయి.

దివి, హృది శబ్దాల ప్రథమా సప్తమీ రూపాలను గమనించండి:

దివ్–దివౌ–దివః (ప్రథమ) ; హృత్ – హృది – హృంది (ప్రథమ)

దివి–దివోః ద్యుషు (సప్తమీ) ; హృది – హృదోః హృత్సు (సప్తమీ)

దివులు : దివి+లు > ఇత్వానికి ఉత్వం వచ్చి 'దివులు' అవుతుంది.

హృదులు : హృది+లు > ఇత్వానికి ఉత్వం వచ్చి 'హృదులు' అవుతుంది.

**5.13 ద్వితీయా ఏకవచనాంతాలు ప్రాతిపదికలుగా ఉండి ఏర్పడే తత్సమాలు**

సాధారణంగా హలంతాలు ప్రథమైక వచనాంతతుల్యాలు ప్రాతిపదికలుగా ఉండి తత్సమాలు ఏర్పడతాయి.

కానీ, కొన్ని హలంతాలు ద్వితీయైక వచనాంతాలు ప్రాతిపదికలుగా ఉండి తత్సమాలు ఏర్పడతాయి.

**5.13.1 మతుబంతాలు**

మతుప్' ప్రత్యయం చివర నుండే సంస్కృత శబ్దాల ద్వితీయా ఏకవచనాంతతుల్యాలు ప్రాతిపదికలు అవుతాయి. (త.70) కలవాడు/కలది అనే అర్థంలో సంస్కృత శబ్దాలకు 'మతుప్' అనే ప్రత్యయం చేరుతుంది. అలా 'మతుప్' ప్రత్యయం చేరిన శబ్దాల్ని 'మతుబంతాలు' అంటారు.

ఉదా॥ శ్రీమత్ (మతుబంతం)

శ్రీ మంతమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం)

ఇలాగే గుణవత్ > గుణవంతమ్

**5.14.2 మతుబాదికాలు కానివి:**

విద్వస్ (సంస్కృత శబ్దం) > విద్వాంసమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం)

అనుడుహ్ – (సంస్కృత శబ్దం) అనడ్వాహమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం)

శ్వన్ (సంస్కృత శబ్దం) శ్వానమ్ – (ద్వితీయైకవచనాంత తుల్యం)

ఉపానహ్ (సంస్కృత శబ్దం) ఉపానహమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం)

అప్సరస్ – (సంస్కృత శబ్దం) అప్సరసమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం) మొదలైనవి.

మతుబాదిక శబ్దాల చివరి మకారానికి లోపం విభాషగా వస్తుంది.

ఉదా: శ్రీమంతమ్ > శ్రీమంత.

ఇది అదంతము, పుంలింగం, మహత్తు కాబట్టి ఉత్వడుజ్ఞులు చేరి 'శ్రీమంతుఁడు',

విశేష్యాలు అమహద్వాచకాలు అయితే 'ము' చేరి 'శ్రీమంతము' ఏర్పడుతుంది.

ఉదా॥ 'వాని వంశము శ్రీమంతము'.

శ్రీమత్– దీని స్త్రీప్రత్యయాంతరూపం: శ్రీమతీ. దీర్ఘానికి హ్రస్వం వచ్చి 'శ్రీమతి' 'సు'చేరి ఇకారాంతం కాబట్టి లోపిస్తుంది.

'మహతీవాచకం' చెప్పాలనుకున్నప్పుడు 'ఆలు' చేరి 'శ్రీమంతురాలు' అనే రూపం ఏర్పడుతుంది.

ఇలాగే గుణవత్ > గుణవంతమ్ > గుణవంత > గుణవంతుఁడు (మహత్) > గుణవంతము (అమహత్), గుణవతీ > (స్త్రీ ప్రత్యయాంతం) > గుణవంతురాలు (మహతీవాచకం) అవుతుంది.

విద్వస్ > విద్వాంసమ్ > విద్వాంస > విద్వాంసుఁడు > విద్వాంసము > విదుషి > విద్వాంసురాలు.

అనడుహ్ > అనడ్వాహమ్ > అనడ్వాహ దీనికి 'ము' చేరి > అనడ్వాహము

శ్వన్ > శ్వానమ్ > శ్వాన  దీనికి 'ము'చేరి > శ్వానము

**5.14.3 ముదమ్**

"ముదాదులకుఁ బ్రథమైకవచన లోపంబు లేదు" (తత్సమ-72)

ముద్ మొదలైన స్త్రీలింగ శబ్దాల మీద చేరే ప్రథమైక వచనం లోపించదు.

ఉదా॥ ముద్ > ముదమ్ > ముద > ముదము.

ఉపానహ్ > ఉపానహమ్ > ఉపానహ > ఉపానహము

స్రజ్ > స్రజమ్ > స్రజ > స్రజము

**5.14.4 ఋత్విగాదులు**

"ఋత్విగాదులు ద్వితీయైక వచనాంత తుల్యంబులు విభాషనగు" (తత్సమ-73)

'ఋత్విక్' మొదలైన శబ్దాల ద్వితీయైక వచనాంతతుల్యాలు విభాషగా ప్రాతిపదికలు.

ఉదా॥ ఋత్విక్ > ఋత్విజమ్ > ఋత్విజ > ఋత్విజుఁడు.

నీవృత్ > నీవృతమ్ > నీవృత > 'నీవృతము'

సాధారణంగా ఋత్విగాదుల ప్రథమైక వచనాంతతుల్యాలు ప్రాతిపదికలు అవుతాయి. ద్వితీయా ఏకవచనాంత తుల్యాలు ప్రాతిపదికలు కావడం విశేషం.

**5.14.5 ఇంద్రజితుండు**

ఇంద్రజిత్ – ఇది ఋత్విగాదిగణం లోనిది. దీని ద్వితీయైక వచనాంతతుల్య రూపం 'ఇంద్రజితమ్'. దీనికి మకారలోపం వచ్చి 'ఇంద్రజిత' అవుతుంది. ఇది పుంలింగం, అదంతం, మహద్వాచకం కాబట్టి దీనికి ఉత్వడుజ్ఞులు చేరి 'ఇంద్రజితుండు'.

**5.14.6 సాంతాలు**

"మహద్వాచకంబులగు సాంతంబుల కంత లోపంబేని ద్వితీయైక వచనాంత తుల్యత్వంబేనగు" (తత్సమ-81)

మహద్వాచకాలైన సకారాంత శబ్దాలకు విభాషగా ద్వితీయైక వచనాంత తుల్యత్వం వస్తుంది.

ఉదా॥ అంగిరస్ > అంగిరసమ్ > అంగిరస > అంగిరసుఁడు.

ఇలాగే ఉగ్రశ్రవస్ > ఉగ్రశ్రవసమ్ > ఉగ్రశ్రవసు > ఉగ్రశ్రవసుఁడు

ఊర్ధ్వరేతస్ > ఊర్ధ్వరేతసమ్ > ఊర్ధ్వరేతస > ఊర్ధ్వరేతసుఁడు

పురోధస్ > పురోధసమ్ > పురోధస > పురోధసుఁడు

**5.15 విశేషణాల విషయం**

"మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁగ్లీబత్వంబు విభాషనగు (తత్సమ-86)

మహతీ వాచకాలు గాని స్త్రీ లింగ శబ్దాల విశేషణాలకు క్లీబత్వం విభాషగా వస్తుంది.

ఉదా॥ పద్మలత మనోహరి / పద్మలత మనోహరిణి.

పద్మలత: విశేష్యం. స్త్రీలింగం. దీని విశేషణం 'మనోహరిణీ' దీని దీర్ఘం హ్రస్వమై 'మనోహరిణి' అవుతుంది.

'పద్మలతా' ఆకారాంత స్త్రీలింగమే కానీ మహతీవాచకం కాదు. అంటే స్త్రీని తెలపడం లేదు. అలాంటప్పుడు దాని విశేషణానికి నపుంసక లింగతుల్యత్వం వస్తుంది.

'మనోహారిన్' అనేది నపుంసకలింగ విశేషణం. నకారం లోపించి 'మనోహారి' అవుతుంది.

హృద్యంబగు విద్య / హృద్యయగువిద్య:

'విద్యా' ఆకారాంత స్త్రీలింగం విశేష్యం. మహతీవాచకం కాదు. విశేషణమైన 'హృద్య' శబ్దం స్త్రీలింగంలో ఉంటే 'హృద్య' అని, నపుంసకలింగంలో ఉంటే హృద్యము > హృద్యంబు అవుతుంది.

మొదవులలో గపిల వరిష్ఠంబు / కపిల వరిష్ఠ: 'కపిల' విశేష్యం. స్త్రీలింగం అయితే వరిష్ఠా – వరిష్ఠ. నపుంసక లింగం అయితే 'వరిష్ఠము' > వరిష్ఠంబు.

**5.16 భవత్, శత్రాదుల విషయం**

"భవచ్ఛత్రాదుల క్రిందుఁ బ్రయోగంబు లేదు" (తత్సమ–87)

'భవత్' మొదలైన హలంత సర్వనామాలకు, శతృప్రత్యయాంతాలు, రేఫాంతాలు మొదలైన వాటికి తత్సమ రూపంలో తెలుగులో ప్రయోగం లేదు. ఇవి సమాసాల్లో పూర్వపదాలుగా ఉండవచ్చు.

ఉదా: భవత్ + గుణంబుల్ = భవద్గుణంబులు 'భవత్'కు వ్యస్త ప్రయోగం లేదు.

అలాగే త్వత్ + ఆశ్రయము = త్వదాశ్రయము,

మత్ + పుణ్యము = మత్పుణ్యము,

లసత్ + రూపము = లసద్రూపము

భవిష్యత్ + కాలము = భవిష్యత్కాలము.

సత్, భవిష్యత్ ధాతువుల శత్రంతరూపాలు.

ధూర్ + వహము = ధూర్వహము. 'ధూర్' రేఫాంతం.

ఇటువంటివి ప్రయోగాల్ని బట్టి గ్రహించాలి.

**6. ఆచ్ఛికపదాల బహువచన రూపనిష్పత్తిని గురించి వివరించండి.**

**6.0** తెలుగు బహువచన ప్రత్యయం 'లు'. ఇది కాకుండా బహువచన స్థానంలో ఆయా సన్నివేశాలలో రు,ఱు,ళు అనేవి వస్తుంటాయి. అవి ఏ సందర్భంలో చేరతాయో, అవి చేరేటప్పుడు జరిగే వ్యాకరణ కార్యాలను గమనిద్దాం.

**6.1 లు > రు:**

1. "పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు" (ఆచ్ఛిక–5)

ఉదా॥ పగతులు > పగతురు, అల్లురు, నెయ్యురు, బలియురు, మార్తురు

బహువచనమైన 'లు' స్థానంలో 'రు' ఆదేశం కావటం పైన గమనించవచ్చు.

2. "కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందు పూర్వక దకారంబు నగు" (ఆచ్ఛిక–6)

ఉదా॥ గండంద్రు, మిండంద్రు

ప్రాతిపదిక 'గండ'

గండ + లు

పై సూత్రం ప్రకారం బహువచన ప్రత్యయమైన ల కు రేఫం వస్తుంది. గండ + రు బిందుపూర్వక దకారాదేశం వచ్చి గండ + ంద్ + రు = గండ్రంద్రు ఏర్పడుతుంది.

3. "కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక దకారంబునగు" (ఆచ్ఛిక–7)

ఉదా॥ విలుకాంద్రు – విలుకాఱు

వేఁటకాంద్రు – వేఁటకాఱు

వేడుక కాంద్రు – వేడుక కాఱు

కా అనే తద్ధిత ప్రత్యయం ముందు చేరే బహువచన లకారానికి రేఫ, దానిముందు బిందుపూర్వక (ండ) దకారం వస్తుంది. మతుబర్థంలో 'విలు' అనే నామం మీద 'కా' అనే తద్ధిత ప్రత్యయం చేరుతుంది. విలుకా – ప్రాతిపదిక. బహువచనంలో విలుకా + లు; 'లు' కు 'రు', దానికి ముందు బిందు పూర్వక 'డ' కారం వచ్చి

విలుకా + ండ్ + రు = 'విలుకాండ్రు' రూపం ఏర్పడుతుంది.

4. "ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగు" (ఆచ్ఛిక–11)

ఉదా॥ ఆండ్రు – ఆండ్రను

ఆలు, చెలియలు, కోడలు, మఱుదలు అనేవి మాత్రమే ఆల్వాదులు.

ద్వితీయ బహువచన రూపాల్లో కూడా ఇటువంటి మార్పులుంటాయి.

ఉదా॥ మఱదండ్రను, చెలియండ్రను, కోడండ్రను

**6.2 లు > ఱు :**

1. "కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు" (ఆచ్ఛిక–7)

ఉదా॥ విలుకాఱు

వేటకాఱు

వేడుక కాఱు

2. "చెయువు బహువచన లకారంబున కలఘు రేఫంబు విభాషనగు" (ఆచ్ఛిక–10)

ఉదా॥ చెయువు + లు = చెయువుఱు, చెయువులు

చెయువు + లు = చెయువుఱను, చెయువులను

**6.3** లు ప్రత్యయం చేరేటప్పుడు ప్రాతిపదికలలో జరిగే మార్పులు.

**6.3.1** "బహువచనము పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు" (ఆచ్ఛిక–12)

ఉదా॥ విభాష: గుండ్లు – గుండులు; కాళ్ళు–కాలులు – మొదలైనవి

అప్రవృత్తి: విల్లులు, పిల్లులు, పులులు – మొదలైనవి

అన్యప్రవృత్తి: కోట్లు, కోటులు, పిప్పళ్లు, పిప్పలులు – మొదలైనవి

**6.3.2 డు + లు:** గుండు – ప్రాతిపదిక. గుండు + లు; 'డు'లోని ఉత్వానికి లోపం బహుళంగా వచ్చి, గుండ్ + లు = గుండ్లు. దీనిలో ఉత్వం లోపించనపుడు గుండులు.

**6.3.3 లు + లు :** 'కాలు' ప్రాతిపదిక. కాలు + లు; 'లు' లోని ఉత్వానికి లోపం. కాల్ + లు; బహువచనంతో కూడి ఉన్న అద్విరుక్త లకారానికి అలఘుళకారం నిత్యంగా వస్తుంది. (ఆచ్ఛిక.13) కాళ్ + లు = కాళ్లు. ఈ మార్పు రానపుడు. కాలు + లు = కాలులు.

ఇలాగే మొసలి – ప్రాతిపదిక. మొసలి + లు = మొసళ్లు / మొసలులు.

**6.3.4 టు + లు:** గొంటు – ప్రాతిపదిక. గొంటు + లు; 'టు' లోని ఉత్వానికి లోపంవచ్చి గొంట్ + లు = గొంట్లు. లేదా గొంటులు.

ఇలాగే తుంటి + లు = తుంటులు; తుంట్ + లు = తుంట్లు. లేదా తుంటులు.

**6.3.5 రు + లు:** 'గోరు' ప్రాతిపదిక. గోరు + లు; 'రు' లోని ఉత్వానికి లోపం బహుళంగావచ్చి గోర్ + లు = గోర్లు. ఉత్వం లోపించకపోతే గోరు + లు = గోరులు.

ఇలాగే సీవిరి – ప్రాతిపదిక. సీవిరి + లు > సీవిరు + లు > సీవిర్ + లు = సీవిర్లు. ఉత్వం లోపించనపుడు 'సీవిరులు' సూత్రంలో బహుళం అని చెప్పినందువల్ల విల్లులు, పిల్లులు, పులులు మొదలైన నామాల్లో ఉత్వం లోపించదు. బహుళంలో 'అప్రవృత్తి'కి ఇవి ఉదాహరణలు.

ఉదా ॥ విల్లు + లు = విల్లులు

పిల్లి + లు = పిల్లులు

పులి + లు = పులులు.

తత్సమ శబ్దాలయిన 'కోటి, పిప్పలి' అనే నామాలకు కూడా బహువచనం పరం అయ్యేటప్పుడు ఉత్వం బహుళంగా లోపిస్తుంది.

కోటి – తత్సమ నామం. కోటి + లు > కోటు + లు; ఉత్వం లోపిస్తే కోట్లు, ఉత్వం లోపించనపుడు 'కోటులు'.

'పిప్పలి' తత్సమ నామం. పిప్పలి + లు > పిప్పలు + లు; ల కారానికి అలఘులకారం పిప్పళ్ + లు = పిప్పళ్లు, లేదా పిప్పలి + లు = పిప్పలులు.

**6.3.6** "ఱే ప్రభృతుల బహువచనమునకు ముందు దుజ్ఞగు" (ఆచ్ఛిక–8)

ఉదా॥ ఱేఁడులు – ఱేండ్లు

**6.4 కూఁతు :** "కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు" (ఆచ్ఛిక–9)

కూఁతు – అనే నామానికి ప్రథమా ఏకవచనంలో 'రు' చేరుతుంది.

కూఁతులు : 'కూఁతు' ఆచ్ఛికనామం. కూఁతు + లు =కూఁతులు. ఏకవచనంలో కూఁతు + వు; 'వు' కి 'రు' ఆదేశం 'కూఁతురు'. దీని ద్వితీయా ఏకవచన రూపం. కూఁతును. ద్వితీయా బహువచన రూపం 'కూఁతులను'.

కూఁతురు : ఇది ప్రథమైక వచన రూపం. దీనిమీద మళ్ళీ 'లు' చేరదు. అంటే కూఁతురులు, కూఁతుళ్ళు అసాధు రూపాలు.

'కూఁతురు' అనే ప్రథమా ఏకవచన రూపం మీద ద్వితీయా 'ను' చేరదు. అంటే కూఁతుంద్రను, 'కూఁతురును' అనే రూపం అసాధువు.

### 6.5 త్రాళులు మొదలైనవి

"బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డలరల కలఘు లకారంబు బహుళంబుగానగు" (ఆచ్ఛిక–13)

ఉదా॥ త్రాళులు – త్రాడులు; గుమ్మళులు–గుమ్మడులు

మొగిళులు – మొగిలులు; పిడికిళులు – పిడికిలులు

ఊళులు – ఊరులు; పందిళులు – పందిరులు

### 6.5.1 త్రాళ్లు మొదలైనవి

"బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు" (ఆచ్ఛిక–14)

ఉదా॥ త్రాళ్లు, గుమ్మళ్లు, మొగిళ్లు, మొసళ్లు, విళ్లు, సిళ్లు

'త్రాళ్లు' మొ॥నవి 1) బహువచనంతో కూడుకొని అద్విరుక్తంగా ఉండే డ కారానికి నిత్యంగా అలఘులకారం(ళ) వస్తుంది. 2) బహువచనంతో కూడుకొని, అద్విరుక్తంగా ఉండే ల కారానికి నిత్యంగా అలఘులకారం(ళ) వస్తుంది.

త్రాడు – ఆచ్ఛిక నామం.

త్రాడు + లు; 'దు'లోని ఉత్వానికి లోపం త్రాడ్ + లు. ఇప్పుడు అసంయుక్త డకారానికి లకారంతో సంయోగం ఉంది (బహువచన శ్లిష్టం) అలఘు 'ళ' కారం : బహుళంగా ఆదేశంగా వచ్చి త్రాళ్లు అవుతుంది.

### 6.6 ఖండ బిందువు పూర్ణ బిందువుగా మారటం

"సమాసంబునందు సంయోగంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు" (ఆచ్ఛిక–15)

ఉదా॥ అనcటులు – అనంట్లు

తేcటులు – తేంట్లు

ఏండ్లు – కాండ్లు ఇత్యాదులందు డా కు ళ ఆదేశంగా వస్తుందని కొందఱు చెబుతారు. కాని తెలుగులో బిందు పూర్వకమైన స్థిర వర్ణం లేనందున యది గ్రాహ్యము కాదు.

**6.7 లి/ల్లు, లు > ం > ందు, లు**

**6.7.1** "ఔప విభక్తికముల లివర్ణ సలలు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగానగు" (ఆచ్ఛిక–16)

ఉదా॥ లివర్ణాంతాలు: కొడవలి + లు = కొడవండులు – కొడవండ్లు

కొడవళులు – కొడవళ్ళు

కొవలు – ఇట్లే రోకలి.

సలలు వర్ణాలు ఇల్లు + లు = ఇండులు

ఇండ్లు

ఇల్లులు

**6.7.2** "ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు" (ఆచ్ఛిక–17)

ఉదా॥ కొడవలి + లు = కొడవలులు

కొడవళులు

కొడవళ్లు

కొడవండులు

కొడవండ్లు

కొడవండ్లులు

**6.8 ను > కు జ్**

"కలన్వాదుల నువర్ణంబు కుజ్ఞగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు" (ఆచ్ఛిక–18)

ఉదా॥ కలకు, కలను, కలcకులు మొదలైనవి.

ఇలాగే : కెలను > కెలుకు / కెలను (ఏక) కెలుకులు (బహు)

కొలను > కొలుకు / కొలను (ఏక) కొలుకులు (బహు)

గవను > గమకు / గవను (ఏక) గమకులు (బహు)

నెఱను > నెఱుకు / నెఱను (ఏక) నెఱుకులు (బహు)

మ్రాను > మ్రాcకు / మ్రాను (ఏక) మ్రాcకులు (బహు)

వరను > వరుకు / వరను (ఏక) వరుకులు (బహు)

వలను > వలుకు / వలను (ఏక) వలుకులు (బహు)

ఇవి 'కలన్వాదులు' అన్నందువల్ల వేరే శబ్దాలు ఈ 'నియతగణం'లో చేరవు.

**6.9 ను > గుజ్**

"అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబుగుజ్జగు" (ఆచ్ఛిక–19)

ఉదా రేcగు, రేను; రేcగులు,

గోcగు, గోను; గోcగులు

రేను – ప్రాతిపదిక. ఏకవచనంలో 'ను' కు 'గుజ్' వికల్పంగా ఆదేశం. రేగుజ్ > రేcగు. ఈ ఆదేశం రానపుడు 'రేను'. బహువచనంలో 'ను' కు 'గుజ్' నిత్యంగా వస్తుంది. రేను + లు > రేనుజ్ + లు = రేcగులు.

ఇలాగే 'గోను' ఏకవచనంలో గోఁగు / గోను, బహువచనంలో గోఁగులు

**6.10 ప్రాతిపదికలో జరిగే లోపాలు**

**6.10.1 ను లోపము**

14. "బహువచనంబు పరంబగునపుడు చేను, పేను, మీను శబ్దముల నువర్ణంబు లోపించు" (ఆచ్ఛిక-20)

ఉదా॥ చేను - చేలు (చేను +లు)

పేను - పేలు (పేలు + లు)

మీను - మీలు (మీను + లు)

**6.10.2 తుది అక్షర లోపం**

"బహువనచంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు" (ఆచ్ఛిక-21)

ఉదా॥ రేలు.

రేయి + లు > 'రేయి'లోని తుది అక్షరం (యి) లోపించి రే + లు = రేలు అవుతుంది.

ఇలాగే ఊయి + లు = ఊలు

వేయి + లు = వేలు

వ్రాయి + లు = వ్రాలు మొదలైనవి.

**6.10.3 విభాషగా తుది అక్షర లోపం**

"బహువచనంబు పరంబగు నపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు" (ఆచ్ఛిక-22)

ఉదా॥ ఆవు - ప్రాతిపదిక. ఆవు + లు : 'ఆవు' లోని తుది అక్షర లోపం వచ్చి ఆ + లు = ఆలు, లోపించనపుడు : ఆవులు. ఇలాగే జాము + లు = జాలు / జాములు

చుట్టము + లు = చుట్టలు / చుట్టములు

మీసము + లు = మీసలు / మీసములు మొదలైనవి.

లు, ల, న లు పరమైనపుడు 'ము' వర్ణకానికి లోపం, అంతకు ముందున్న అచ్చుకు దీర్ఘం వస్తాయి. (త.43)

చుట్టము+లు - ము లోపం వచ్చి చుట్ట + లు; 'లు' ముందున్న 'అ'కి దీర్ఘం వచ్చి చుట్టాలు.

ఇలాగే మీసము + లు: మీస + లు = మీసాలు.

**7. ఔపవిభక్తికం అంటే ఏమిటో బాలవ్యాకర్త పేర్కొన్న ఔపవిభక్తికాల గురించి వివరించండి?**

**7.0** బాల వ్యాకరణంలో ఆచ్ఛిక పరిచ్ఛేదంలో ఔప విభక్తికాల్ని ప్రత్యేక ప్రకరణంలో నిరూపించాడు.

**7.1** సూ॥ "ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు" (ఆచ్ఛిక-28)

విభక్తి నిమిత్తికాలయి, ఆదేశ ఆగమాత్మకాలయిన ఇ టి తి వర్ణాలు ఔపవిభక్తికాలు. "విభక్తీనాం సమీప ముపవిభక్తిః ఉపవిభక్తి మర్హతీతి ఔపవిభక్తికమ్" అని దీని వ్యుత్పత్తి. ఈ ఉప విభక్తులు చేరినవి ఔపవిభక్తికాలు. అవి 'ఇ, టి, తి' అనే వర్ణాలు.

**7.1.1** "ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు" (ఆచ్ఛిక-29)

ఇ టి తి అనే ఔపవిభక్తిక వర్ణాలు ద్వితీయాదివిభక్తుల ఏకవచనప్రత్యయాలు పరమైనప్పుడు మాత్రమే కొన్ని నామాల మీద చేరతాయి.

ఉదా॥ కాలు + ను = కాలు+ఇ+ను = కాలిని

నాగలి + ను = నాగటి+ను = నాగటిని

నేయి + ను = నేతి + ను = నేతిని

**7.2 ఇ:** "ఊరు మొదలగువాని కిత్వంబగు" (ఆచ్ఛిక-30)

ఉదా॥ ఊరిని, కాలిని

ప్రాతిపదిక ఊరు

సూ॥ 'నువర్ణంబుద్వితీయ' (తత్సమ-2)

ఊరు + ను

సూ॥ 'ఊరు మొదలగువాని కిత్వంబగు' (ఆచ్ఛిక-30)

ఊరి+ఇ+ను'

సూ॥ 'అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు దచ్చునకు సంధియగు' (సంధి-11)

ఊరి + ను

సూ॥ 'ఇకారంబు మీఁది కునువు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు' (తత్సమ-26)

ఊరిని

**7.3 టి:** సూ॥ 'టివర్ణంబు కొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు" (ఆచ్ఛిక-31)

(1) అంత్యాక్షరంబున కాదేశంబు – తాడు+ను = త్రాటి+ను = త్రాటిని

(2) అంతాగమంబు – అన్ని+ను = అన్నిటి+ను = అన్నిటిని

(3) ఆగమమును, ఆదేశమును – ఏమి+ను = ఏటి+ను = ఏటిని

ఏమి+ను = ఏమిటి+ను = ఏమిటిని

సూ॥ 'హ్రస్వము మీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు' (ఆచ్ఛిక-32)

ఉదా॥ అన్ని+టి+ను = అన్నింటిని

ఎనిమిది+టి+ను = ఎనిమిదింటిని

సూ॥ 'పదాద్యంబగు హ్రస్వంబు మీఁది టి వర్ణంబునకు ముందుపూర్ణబిందువగు' (ఆచ్ఛిక-33)

**7.4 తి:** సూ॥ 'అఱ్ఱు మొదలగు శబ్దము కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికిలోపంబునగు' (ఆచ్ఛిక-34)

ఉదా॥ అఱ్ఱు+ను = అరు+తి+ను=అఱితిని

సూ॥ 'విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు' (ఆచ్ఛిక-35)

ఉదా॥ గోయి+లు = గోతులు

గోయి+ను = గోతిని

అట్లే చేతులు, చేతిని, చేతులను

**7.5 ఔపవిభక్తికాలు పరమయ్యేటప్పుడు కలిగే కార్యాలు**

**7.5.1** సూ॥ 'టి,తి వర్ణంబులు పరంబులగునపు దుత్వంబున కిత్వంబగు' (ఆచ్ఛిక-36)

ఉదా॥ రెండు+కు = రెండు+టి+కు = రెండిటికి, మూడిటికి, నాలుగిటికి

కొన్ని చోట్ల ఉత్వానికి ఇత్వం రాదు

ఉదా॥ నెత్తుటికి

**7.5.2** సూ॥ టివర్ణంబు పరంబగునపుడు క్రిందు, మీఁదు, ముందు వువర్ణంబుల కత్వంబగు (ఆచ్ఛిక-37)

ఉదా॥ క్రిందు – క్రిందటిని

క్రిందు + ను > క్రిందు+అ+టి+ను = క్రిందటిని

'టి' వర్ణం చేరేటప్పుడు 'క్రిందు, మీఁదు, ముందు' అనే శబ్దాల చివరి ఉత్వం ఇత్వం అవుతుంది. అలాగే నామం చివర 'వు' వర్ణం ఉంటే అక్కడ కూడా ఉత్వానికి అత్వం అవుతుంది. (ఆ.37)

ఇలాగే రెండు > రెండింటిని / రెండిటిని

మూఁడు> మూఁడింటిని / మూఁడిఁటిని

పగలు > పగలింటిని / పగలిఁటిని

పగలు > పగంటిని / పగఁటిని

–'టి' ముందు నిండుసున్న నిత్యంగా చేరడం :

పదం మొదట్లో ఉండే హ్రస్వాచ్చు తర్వాత వచ్చే 'టి' వర్ణానికి ముందు నిండుసున్న నిత్యంగా వస్తుంది. (ఆ.33)

ఉదా॥ కన్ను > కంటిని : కన్ను – నామం. కన్ను + ను (ద్వి) 'టి' ఆదేశం క + టి + ను పదం మొదట్లో హ్రస్వాచ్చు తర్వాత 'టి' వచ్చింది కాబట్టి నిండుసున్న నిత్యం. కంటిని : ఇలాగే మిన్ను > మింటిని; ఇల్లు > ఇంటిని; పల్లు > పంటిని.

ఈ రెండు ఉదాహరణల్లో 'ల్లు' కు బదులు 'టి' ఆదేశంగా వచ్చింది.

**7.6 తృతీయా సప్తములకు అత్వం రావడం :**

సూ॥ ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు (ఆచ్ఛిక–38)

ఉదా॥ గోరను గీఱెను; ఊరనున్నాఁడు; ఇంటలేఁడు.

ఔపవిభక్తికాల తృతీయకు, సప్తమికి 'అత్వం' ఆదేశంగా వస్తుంది. (ఆ.28) 'అ'ను కూడా కొంతమంది ఔపవిభక్తింగా పరిగణిస్తారు.

తృతీయలో 'అ' : గోరను గీఱెను. గోరు – నామం: కరణార్థంలో 'చేత' వచ్చి, గోరు + చేత: ఔపవిభక్తికమైన 'ఇ' వచ్చి 'గోరి చేత' అవుతుంది. 'గోరు' + (ఇ) ఔప విభక్తికం. 'అత్వం' ఆదేశమై గోరి + అ = సంధి జరిగి గోర అవుతుంది. ఆ తర్వాత 'ను' చేరి 'గోరను' అవుతుంది.

గొడ్డట నఱికెను : గొడ్డలిచేత > గొడ్డ–టి–చేత > గొడ్డటి – అ + చేత > గొడ్డట చేత > గొడ్డట చేతను

కఱుత దూటె : కఱ్ఱు – నామం > కఱ్ఱు చేత > కఱుతి చేత > కఱుతి + అ + చేత > కఱుత చేత

సప్తమిలో 'అ' : ఊర నున్నాఁడు : ఊరు– నామం. ఊరు + అందు > అధికరణార్థంలో 'ఇ' ఊరు + ఇ > ఊరి + అందు. సప్తమి 'అందు' కు అత్వం ఆదేశం. ఊరి + అ > సంధి జరిగి ఊర – నుగాగమం చేరి 'ఊరను.

ఇంట లేఁడు : ఇల్లు – నామం. ఇల్లు + అందు > 'టి' ఆదేశం: ఇ – టి + అందు > 'టి' ముందు నిండు సున్న వచ్చి ఇంటి + అందు > 'అందు'కు అత్వం ఆదేశమై ఇంటి + అ = ఇంట అవుతుంది.

వఱుతుగలిసె : 'వఱ్ఱు' నామం. వఱ్ఱు + అందు > వఱుతి + అందు > వఱుతి + అ > సంధి జరిగి వఱుత – నుగాగమం వచ్చి 'వఱుతను' అవుతుంది.

ఇలా ఔప విభక్తికాల తృతీయకు, సప్తమికి 'అత్వం' బహుళంగా ఆదేశం కానపుడు 'గోరిచేత, కఱుతిచేత ఊరియందు' లాంటి రూపాలుంటాయి.

**8. ఆచ్ఛిక శబ్దాల లింగ బోధక విధానాన్ని చిన్నయసూరి నిరూపించిన పద్ధతిని తెల్పండి.**

**8.0** 'సంస్కృతం'లో లింగం శబ్దాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. తెలుగులో అర్థాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. సాధారణంగా శబ్దాలు మూడు లింగాలుగా ఉంటాయి. అవి – పుంలింగం, స్త్రీలింగం, నపుంసకలింగం.

సంస్కృతంలో పుంలింగ శబ్దాలన్నీ పురుష బోధకాలు కావు. అలాగే స్త్రీ లింగ శబ్దాలన్నీ స్త్రీ బోధకాలు కావు. నపుంసక లింగ శబ్దాలు స్త్రీ, పుంలింగ బోధకాలలో ఏదైనా కావచ్చు.

ఉదా॥ 'దార' (పుంలింగం), భార్యా (స్త్రీలింగం) కళత్రమ్ (నపుంసకలింగం) అయితే అన్నిటి అర్థం 'భార్య' అనే.

తెలుగులో లింగం అర్థాశ్రయం – పురుషుల్ని తెలిపే శబ్దాల్ని 'మహత్తులు' లేదా 'మహద్వాచకాలు' అని అంటారు. స్త్రీలను తెలిపే శబ్దాల్ని 'మహతీ వాచకాలు' అంటారు. స్త్రీలను, పశుపక్ష్యాదుల్ని, అచేతనాల్ని తెలిపే శబ్దాల్ని 'అమహత్తులు' అని అంటారు. వాటిని గురించి చిన్నయసూరి చెప్పిన విశేషాల్ని గమనిద్దాం.

సంస్కృతంలో లింగం 'శబ్ద' ధర్మం. సంస్కృత భాషలో మూడు లింగాలుంటాయి. (1) పుంలింగం (2) స్త్రీ లింగం (3) నపుంసక లింగం.

తెలుగులో లింగం 'అర్థ' ధర్మం, తెలుగులో పురుషుల్ని తెలిపే శబ్దాలు 'మహత్తులు', స్త్రీలను, పశుపక్ష్యాదుల్ని, అచేతనాల్ని తెలిపే శబ్దాలు 'అమహత్తులు', స్త్రీలను మాత్రమే తెలిపే శబ్దాలు 'మహతీ' వాచకాలు.

ఆచ్ఛిక శబ్దాలన్నీ తఱచుగా స్త్రీ సమాలుగానో, క్లీబసమాలుగానో ఉంటాయి. (ఆచ్ఛిక-2) 'తఱచుగా' అన్నందువల్ల 'పుంలింగ తుల్యాలు' కూడా ఆచ్ఛిక భాషలో ఉంటాయి.

(1) స్త్రీసమధర్మం ఆరోపించినందువల్ల శబ్దాలకు ప్రథమైక వచనలోపం మొదలైన మార్పులు జరుగుతాయి.

(2) క్లీబసమం అన్నందువల్ల 'ము' వర్ణకం చేరుతుంది.

ఉదా॥ 'అన్న' ఇది పురుషుణ్ణి తెలుపుతున్నది కాబట్టి 'మహద్వాచకం', అకారాంతం కాబట్టి ఉత్వం, డుజ్ఞు, వస్తాయి. 'అన్నుఁడు' అనేరూపం రాముడులాగా ఏర్పడాలి. కానీ 'స్త్రీ సమం' అన్నందువల్ల ఉత్వం, డుజ్ఞు లోపిస్తుంది. 'అన్న' అనే రూపమే ఉంటుంది.

అలాగే గద్ద, జాణ, గాణ లమీద ఉత్వడుజ్ఞులు రావు. అకారాంత అమహత్తులైన మిన్న, అద్ద, గద్ద, ఓడ, గోడ మొదలైన వాటిమీద వచ్చే 'ము' వర్ణకంలోపిస్తుంది.

కొన్ని ఆచ్ఛిక శబ్దాలకు క్లీబతుల్యత్వం విధించి నందువల్ల అకారాంత సంస్కృత నపుంసకలింగాలకు లాగే 'ము' వర్ణకం చేరుతుంది. ఉదా॥ బియ్య > బియ్యము, నెయ్య > నెయ్యము, అల్ల > అల్లము, సున్న > సున్నము మొదలైనవి.

### 8.1 బల్లిదాదులు

"బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు" (ఆచ్ఛిక-3) 'బల్లిద మొదలైన విశేషణాలు సంస్కృతంతో సమానం అయినవి. సంస్కృత తుల్యాలు' అనటం చేత

(ఎ) మహద్వాచకంలో ఉత్వడుజ్ఞులు వస్తాయి.

(బి) అమహద్వాచకంలో 'ము' చేరుతుంది.

(సి) స్త్రీలను తెలిపేటపుడు 'ఆలు' అనే శబ్దంతో కలిసి సమాసం ఏర్పడుతుంది.

బల్లిద – ఇది ఆచ్ఛిక విశేషణం.

పురుషుణ్ణి తెలిపేటప్పుడు మహద్వాచకం అయి ఉత్వం, డుజ్ఞు వచ్చి బల్లిదుఁడు. అమహత్తు అయినప్పుడు 'ము' వర్ణకం చేరి 'బల్లిదము' అవుతుంది.

'స్త్రీ'ని తెలిపేటప్పుడు 'ఆలు' అనే శబ్దంతో కలిసి సమాసం ఏర్పడుతుంది. 'బల్లిదురాలు' (సంధి. 31)

| | | | |
|---|---|---|---|
| ఇలాగే : | అక్కజ | : | అక్కజుఁడు / అక్కజము / అక్కజురాలు |
| | కావల | : | కావలుఁడు / కావలము / కావలురాలు |
| | బెట్టిద | : | బెట్టిదుఁడు / బెట్టిదము / బెట్టిదురాలు |
| | బెడిద | : | బెడిదుఁడు / బెడిదము / బెడిదురాలు |
| | మిసిమింత | : | మిసిమింతుఁడు / మిసిమింతము / మిసిమింతురాలు |
| | మొక్క | : | మొక్కలుఁడు / మొక్కలము / మొక్కలురాలు |

### 8.2 కయిరాదులు

"మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్ఞగు నుత్వంబు గాదు" (ఆచ్ఛిక-4)

'కయిర' మొదలైనవి జంతువాచకాలు, అకారాంతాలు, అశ్వాలపేర్లు. ఇవి అమహత్తులు.మహత్తులతో తుల్యత్వం చెప్తే ఉత్వం, డుజ్ఞు రావాలి. కాని 'డుజ్' మాత్రమే వస్తోంది. అందుకే సూత్రంలో ఉత్వంరాదని చెప్పాడు.

ఉదా॥ కయిర + డుజ్ = కయిరఁడు; కత్తళ + డుజ్ =కత్తళఁడు; జన్న + డుజ్ = జన్నఁడు; నీల + డుజ్ = నీలుడు మొదలైనవి.

### 8.3 సర్వనామశబ్దాలు

చిన్నయసూరి సర్వనామాల్ని సిద్ధంగా ఉండే రూపాల్ని ప్రక్రియ లేకుండా చూపారు. "అన్ని ప్రభృతులు సర్వనామంబులు" (ఆచ్ఛిక-24) అని సూరి చెప్పాడు. 'సర్వాదీని సర్వనామాని' అని సంస్కృతంలో చెప్పబడింది. నామాలని బదులుగా వాడబడేది 'సర్వనామం'.

సర్వనామాలలో మహత్, అమహత్ రూపాలు, మహతీరూపాలు, సంఖ్యావాచకాలు, ప్రథమ ద్వితీయా తృతీయాది రూపాలు ఇచ్చాడు.

మహత్ బహువచన సర్వనామాలు మహతీ బహువచన సర్వనామాలు.

"సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు" (ఆచ్ఛిక-26) మహద్వాచక సర్వనామాల బహువచన రూపాలే మహతీ వాచక సర్వనామ బహువచనాలుగా వస్తాయి.

ఉదా॥ వారిద్దరు రామలక్ష్మణులు 'రామలక్ష్మణులు'

మగవాళ్లని తెలిపే నామవాచకాలు (మహద్వాచకాలు)

'వారు' దీని విశేషణం. సర్వనామం.

ఇదే సర్వనామం మహతీ వాచకాల్ని తెలిపేటప్పుడు కూడా వస్తుంది. వారిద్దరు రుక్మిణీ సత్యభామలు - ఇలాగే వీరు ముప్వరు శ్రీభూనీళలు.

### మాదిరి ప్రశ్నలు

### వ్యాసరూప ప్రశ్నలు

1. చిన్నయసూరి పేర్కొన్న తెలుగు నామ విభక్తులను వివరించండి.
2. బాలవ్యాకర్త పేర్కొన్న ఆమంత్రణ విధులను పేర్కొనండి.
3. చిన్నయసూరి పేర్కొన్న లింగబోధక విధానాన్ని పేర్కొనండి.
4. అజంత శబ్ద తత్సమీకరణ విధానాన్ని వివరించండి.

5 హలంత శబ్ద తత్సమీకరణాన్ని వివరించండి.

6. ఆచ్ఛికపదాల బహువచన రూపనిష్పత్తిని వివరించండి.
7. ఔపవిభక్తికాలను వివరించి అవి చేరేటప్పుడు వ్యాకరణ కార్యాలను పేర్కొనండి

### లఘు ప్రశ్నలు

1. అకారాంత శబ్ద తత్సమీకరణను పేర్కొనండి
2. ఇకారాంత సంస్కృత ప్రాతిపదికలు తెలుగు ప్రవేశించే విధానం
3. ఇకారాంత శబ్ద తత్సమీకరణ విధానాన్ని పేర్కొనండి
4. ద్వితీయ ఏకవచనాంత రూపాల తత్సమీకరణ విధానాన్ని వివరించండి

# యూనిట్-4

## 4. పారిభాషిక పదాలు

వ్యాకరణశాస్త్రంలో ఉపయోగించే పారిభాషిక పదాలను సంజ్ఞలు అంటారు. ఈ యూనిట్‌లో బాలవ్యాకరణంలో ఉపయోగించబడిన ఈ క్రింది సంజ్ఞలను తెలుసుకుంటాము-

1) అచ్చులు, 2) అచ్చు, 3) అతిదేశము, 4) అనింద్యగ్రామ్యము, 5) అనుకరణము, 6) అనుదంతము, 7) అనౌపవిభక్తికము, 8) అమహత్తులు/అమహద్వాచకములు, 9) అలఘురేఫము, 10) అలఘులకారము, 11) అవసానము, 12) అవ్యయము, 13) ఆకృతి గణము, 14) ఆగమము, 15) ఆచ్ఛికము, 16) ఆదేశము, 17) ఆమంత్రణము, 18) ఆమ్రేడితము, 19) ఆశీర్యాద్యర్థకము, 20) ఇత్సంజ్ఞ, 21) ఉత్తమము, 22) ఉత్తర పదము, 23) ఉపధ, 24) ఉపధ్మానీయము, 25) ఉపోత్తమము, 26) ఏకాదేశము, 27) ఔపవిభక్తికములు, 28) కర్త్రర్థకము, 29) కర్మ, 30) కర్మధారయము, 31) కర్మార్థకము, 32) కృతోత్కము, 33) కళ, 34) క్వార్థము, 35) క్లీబతుల్యములు, 36) క్లీబములు, 37) ఖండబిందువు, 38) గ్రామ్యము, 39) డుమంతము, 40) తత్సమము, 41) తద్ధర్మార్థకము, 42) తద్భవము, 43) తాలవ్యములు, 44) దంత్యములు, 45) దేశ్యము, 46) ద్రుతము, 47) ద్రుతప్రకృతికము, 48) నిపాతము, 49) పరుషములు, 50) ప్రాతిపదికము, 51) బహుళము, 52) మతుబాదికము, 53) మధ్యమపురుషయోగము, 54) మహత్తు, 55) లఘువులు, 56) లుప్త శేషము, 57) వికృతి, 58) విధానసామర్థ్యము, 59) వృత్తి, 60) వ్యవస్థితవిభాష, 61) వర్గయుక్కులు, 62) సంబుద్ధి, 63) సంధి, 64) సంశ్లేషము, 65) సంస్కృతసమములు, 66) సరళములు, 67) సర్వనామములు, 68) స్థిరములు, 69) సవర్ణములు, 70) సాంస్కృతికపరుషము, 71) సాధ్యపూర్ణము, 72) స్త్రీసమము.

"సమ్యక్ జానీయు ర్యయ సా సంజ్ఞ" అని సంజ్ఞా శబ్ద వ్యుత్పత్తి ఏ శాస్త్ర గ్రంథంలోనైనా సంగ్రహంగా చెప్పటం కోసం సాంకేతికంగా పారిభాషిక పదాలను ప్రయోగించటం కనిపిస్తుంది. అటువంటివాటినే శాస్త్ర పరిభాషగా పేర్కొంటారు. వ్యాకరణశాస్త్రంలో కూడా అలా ఉపయోగించబడిన సాంకేతిక పదజాలాన్ని సంజ్ఞలుగా ఉపయోగిస్తారు. బాలవ్యాకరణంలో ఉపయోగించబడిన అటువంటి సంజ్ఞలను గమనిద్దాం.

**1) అచ్చులు:**

1. అ ఇ ఉ(ణ్), 2.ఋ (క్), 3. ఏ ఓ (జ్), 4. ఐ ఔ (చ్) అనే మొదటి నాలుగు మహేశ్వర సూత్రాలలో కనిపించే అకారం మొదలు చ్ వరకు గల వానిని అచ్చులని ప్రత్యాహార సంజ్ఞతో వ్యవహరిస్తారు. ఈ సూత్రాలలో కనిపించే చివరి వర్ణాలను ఇద్వర్ణాలు అంటారు. అవి ఉచ్చారణలో మాత్రమే వ్యవహరించబడి ప్రయోగించేటప్పుడు వదిలివేసేవి. మొదటి సూత్రంలోని తొలి వర్ణమైన ఆ నాల్గవసూత్రంలోని చివరి ఇద్ వర్ణమైన చ్ కారంతో కలిపి అచ్ అనే సంజ్ఞ ఏర్పడింది. దానికి ఉత్వ ద్విత్వాలను చేర్చి తెలుగులో అచ్చు అని వ్యవహరిస్తాము. దానికి బహువచన రూపమే అచ్చులు. తెలుగు వ్యాకర్తలు అవసరాన్ని బట్టి ఆదులు అకారాదులని అచ్చులను పేర్కొనటాన్ని గమనించవచ్చు.

"ఆదులు స్వరములు అచ్చులు" - (ఆంధ్ర భాషా భూషణము, 16)

"అకారాదులచ్చులు" (బాల వ్యాకరణము, సంజ్ఞ-1)

ఈ అచ్చులనే స్వరములు (స్వయం రాజంతే ఇతి స్వరాః), ప్రాణములు (హల్లులకు ప్రాణాల వంటివి కాబట్టి) అని కూడా వ్యవహరిస్తారు.

సంస్కృతంలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః అనేవి అచ్చులు.

ప్రాకృతంలో అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఏ,ఓ,అం,అః అనేవి అచ్చులు. కొంతమంది వ్యాకర్తలు ఎ ఒ లను, మరి కొంతమంది వ్యాకర్తలు ఐ, ఔ లను కూడా ప్రాకృతంలోని అచ్చులలో చేర్చారు.

తెలుగులో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ అం, అః అనేవి అచ్చులు.

**2) అచ్చు:**

తత్సమేతరమైన భాషను చిన్నయసూరి అచ్చ అని అన్నాడు.

"సంస్కృత సమేతరంబయిన యీ భాష యచ్చ యనంబడు" (ఆచ్ఛిక-1)

సంస్కృత సమము కాక యితరమైన ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృత భవ, దేశ్యమునైనభాష.

1. ప్రాకృత సమము - సిరి, గారవము
2. సంస్కృత భవము - ఆకసము, చందురుడు
3. ప్రాకృత భవము - లచ్చి, జన్నము
4. దేశ్యము - అన్న, అక్క, మేడ

**3) అతిదేశము:**

ఒక శబ్దము యొక్క ధర్మాన్ని వేఱొక దానియందు ఆరోపించుట అతిదేశము.

సూ॥ "దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు" (తత్సమ-61) అనే సూత్రవృత్తిలో ఈ పదము ప్రయోగించబడింది.

(1) దూతాది శబ్దాలకు బహుళంగా స్త్రీత్వాన్ని అతిదేశించటంచేత, స్త్రీత్వం వచ్చినప్పుడు ప్రథమైకవచనం లోపించి 'దూత' అని స్త్రీత్వం రానప్పుడు ఉత్వము, డుఙ్ చేరి 'దూతుఁడు' అనే రూపం ఏర్పడుతుంది.

ఈ స్త్రీత్వము అమహత్తును చెప్పే చోట ముఖ్యంగా వస్తుంది.

ఉదా॥ సింగంబు దూతయగు జంబుకంబు

ఇక్కడ దూత శబ్దం జంబుకం అన్న అమహద్వాచకానికి విశేషం. అందుచేత స్త్రీత్వం వచ్చి 'దూత' అనే అవుతుంది.

ఈ అతిదేశాన్ని చిన్నయసూరి తత్సమ, ఆచ్ఛిక పరిచ్ఛేదాలలో మరో రెండుచోట్ల వాడాడు.

(2) కంధరాది స్త్రీలింగ శబ్దాలకు నపుంసకత్వాన్ని బహుళంగా అతిదేశించటంచేత కంధర-కంధరము, నాసిక-నాసికము అనే రెండు రూపాలు కలుగుతాయి. (తత్సమ-66)

(3) ఆచ్ఛిక శబ్దాలకు తఱచుగా స్త్రీసమత్వాతిదేశంచేత ప్రథమైకవచన లోపాదికాలు కలుగుతాయి. అన్న, మిన్న, జాణ, ఓడ, గోడ. ఇట్లే మఱి కొన్నింటికి క్లీబసమత్వాన్ని అతిదేశించటంచేత 'ము' వర్ణకం కలుగుతాయి. బియ్యము, నెయ్యము, అల్లము, బెల్లము. (ఆచ్ఛిక-2)

**4) అనింద్య గ్రామ్యము:**

అనింద్యము అంటే నిందింపదగనిది. గ్రామ్యము అంటే 'లక్షణ విర్ధుమైనది'. అనింద్య గ్రామ్యము అంటే గౌరవింపదగిన వ్యాకరణ విరుద్ధమైన పదమని అర్థం. లోకంలో ప్రసిద్ధమై, వ్యాకరణ విరుద్ధాలైన పదాలను మహాకవులు ప్రయోగించారు. అటువంటివాటిని నిరసింపక, అనింద్య గ్రామ్యంగా భావించాలని వ్యాకర్తలు పేర్కొన్నారు. మహాకవుల కావ్యాలలో కనపడే భాష లక్షణవిరుద్ధమైనప్పటికీ వాటిని ఆదరించి మనం మన కావ్యాలలో వాడుకోవచ్చు. అటువంటి రూపాలను అనింద్య గ్రామ్యాలని పేర్కొన్నారు.

ఉదా॥ కఱకంఠుఁడు- కఱ (ఆచ్ఛికం) + కంఠుడు (తత్సమం) మిశ్ర బహువ్రీహి. ఇది బహువ్రీహి సమాస లక్షణానికి విరుద్ధం కాబట్టి గ్రామ్యం. అయినా నన్నయాదులు ప్రయోగించారు కాబట్టి అనింద్య గ్రామ్యము. అలాగే ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిల కన్నులు మొ॥వి. ఇవి వైరిసమాసాలు. వీటిలో ప్రాణ, జీవ, కపిల శబ్దాలు కేవల సంస్కృత శబ్దాలు. కేవల 'సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు' (సమాస-3) అనే లక్షణానికి భిన్నంగా కనిపించేవి కాబట్టి ఇవి గ్రామ్యము. అయినా ఇవి ఆర్య వ్యవహారాల్లో ఉన్నాయి. కాబట్టి అనింద్య గ్రామ్యాలు.

**5) అనుకరణము:**

అనుకరణము అంటే ఒకరిని అనుకరించి చెప్పటం. అంటే ఒకరు చెప్పినట్లు చెప్పటం. ఇలా చెప్పేటప్పుడు 'అను' ధాతువుయొక్క క్త్వార్థక రూపం 'అని', కాని అదే అర్థంగల ఇతర పదాలుగాని వస్తాయి.

ఆధునికులు ఇతరులు చెప్పిన మాటలను యథాతథంగా చెప్పేటప్పుడు ఆద్యంతాలలో “ ” అనే గుర్తులు రాతలో ఉంచుతున్నారు. దీనినే డైరెక్ట్ స్పీచ్ అంటారు. అలా కాకుండా సంస్కృత క్రియలు, అవ్యయాలు, విభక్త్యంత శబ్దాలు, వాక్యాలను అనుకరించేటప్పుడు పాటించవలసిన నియమాలను చిన్నయసూరి అనుకరణ సంధులలో వివరించారు. ఇక్కడ అనుకరణము అంటే ఇతరులు చెప్పిన సంస్కృత వాక్యాలను లేదా పదాలను ప్రస్తావించేటప్పుడు పాటించాల్సిన పద్ధతి.

**6) అనుదంతము:**

‘న ఉదంతం అనుదంతమ్’. ‘ఉత్’ అంతమందు లేని తెలుగు పదము అనుదంతము. ఉదాహరణకు మగఁడు, పాపఁడు మొదలైనవి. ఇటువంటి అనుదంతమైన అచ్చతెలుగు డుమంతాలకు ద్వితియాది ఏకవచనం పరమైనప్పుడు నిగాగమం నిత్యంగా వస్తుంది. ఉదా॥ మగనితో, మగనిచేత

ఇక్కడ అనుదంతము పర్యుదాసార్థంలో వాడబడింది. ‘న ఉదంతం అనుదంతమ్’ నిషేధార్థకమైన ‘న’ శబ్దం సమాసంలోని ఉత్తరపదంతో అన్వయిస్తే అది పర్యుదాసం అవుతుంది. ‘న’ శబ్దానికి ఇక్కడ సాదృశ్యమని అర్థం. మగాదులు నిగాగమం రావటం విషయంలో ఉదంతాని కంటే భిన్నమైనప్పటికీ దుజ్ వర్జక విషయంలో ఉదంతానికి సదృశమైంది.

**7) అనౌప విభక్తికము:**

విభక్తికి సమీపంగా వచ్చేది ఉపవిభక్తి. ఉపవిభక్తి కలది ఔప విభక్తికం. ఔపవిభక్తికం కానిది అనౌపవిభక్తికం. దేశ్యనామాలను రెండు రకాలుగా విభజిస్తారు. అవి –

(1) ఔప విభక్తికాంతాలు, (2) అనౌప విభక్తికాంతములు

ఉదా॥ ‘కల్లు’ మద్యార్థంలో – అనౌప విభక్తికము

ఱాయి అనే అర్థంలో – ఔపవిభక్తికము

**8) అమహత్తులు/అమహద్వాచకములు:**

మహత్తులు కానివి అమహత్తులు. “స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు” (తత్సమ–17). అంటే స్త్రీవాచకాలు, పశువాచకాలు, పక్షివాచకాలు, జడవాచకాలు, వాటి విశేషణాలను తెలుగులో అమహత్తులంటారు.

ఉదా॥ (1) సీత పాడినది

(2) ఆవు తెల్లనిది

(3) పక్షి వాలినది

(4) వృక్షము ఎత్తైనది

**9) అలఘురేఫము:**

అలఘూచ్చారణము గల రేఫము అలఘువు. దీనికే శకటరేఫమని (ఱ) ప్రసిద్ధ వ్యవహారం. (సంజ్ఞ–18)

ఉదా॥ విఱుగు, మెఱుగు, చెఱువు – వీటిలోని శకటరేఫ అలఘురేఫగా వ్యాకర్తలు పేర్కొన్నారు.

**10) అలఘులకారము:**

స్థానకరణ సంయోగము నందు శైథిల్యములేనిచో అది అలఘువు. ఉచ్చారణంలోని గురుత్వ లఘుత్వ ధర్మాలను బట్టి లకారాన్ని లఘు, అలఘులకారాలుగా వ్యాకరణం పేర్కొంటుంది. పదంలో సహజంగా ఉండే లకారం లఘువు. బహువచనంలో ర,ల,డ లకు ఆదేశంగా వచ్చిన లకారం అలఘులకారం (ళ).

ఉదా॥ తల, నెల (లఘు లకారం)

ఏళులు, త్రాళులు, పాళులు (అలఘు లకారం)

**11) అవసానము:**

అవసానము అంటే చివర, ముగింపు, మేర, విరామమని అర్థం. దానికి తరువాత ఏ అక్షరం లేకపోవటం. “వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదనియార్యులంద్రు” (సంధి–55)

వాక్యం యొక్క చివర సంధి చేయకపోవటం తప్పుకాదని పెద్దలు అంటారు.

ఉదా॥ సత్యము సర్వశ్రేయము. అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు.

పై ఉదాహరణలో శ్రేయము అనే పదం వాక్యం చివర ఉంది. తరువాతి పదారంభంలో అచ్చు ఉంది. ఆ పదంలోని ఉత్తుకు పరస్వరం కలిసి సంధి జరగటం లేదు. అది వాక్యం చివర కాబట్టి సంధి చేయకపోవటం తప్పు కాదని చెప్పే సందర్భంలో ఈ అవసాన శబ్దాన్ని చిన్నయసూరి ప్రయోగించాడు.

**12) అవ్యయము:**

వ్యయము లేనిది 'అవ్యయము'. అంటే మార్పులేనిదని అర్థం. లింగ, విభక్తి, వచన శూన్యమైన పదాన్ని అవ్యయంగా వ్యాకరణాలు పేర్కొంటాయి.

పాణిని దీనిని సంజ్ఞగా పరిగణించాడు. స్వర్, ప్రాతర్, అన్తర్ మొదలైన ఉపసర్గలు, అవ్యయీభావ సమాసాలు; అన్ని విభక్తులు చేరని కొన్ని తద్ధితాంతాలు, కొన్ని కృదంత రూపాలు అవ్యయాలుగా పరిగణించబడ్డాయి.

"సదృశం త్రిశులింగేషు

సర్వాసు చ విభక్తిషు

వచనేషు చ సర్వేషు

యన్నవ్యేతి తదవ్యయమ్"

"మూడు లింగములందు, అన్ని విభక్తులందు, అన్ని వచనములందు మార్పు చెందని పదములు అవ్యయములు."

పూర్వ తెలుగు వ్యాకరణాలలో అవ్యయనిరూపణ కనిపించదు. కాని ఆంధ్రకౌముది (గణపవరపు వేంకటకవి) "అప్పుడు, ఇప్పుడు, అచ్చట, ఇచ్చట, ఇక్కడ, కాక, ఆడ, ఈడ, వేమఱు, పలుమఱు, వెండి క్రమ్మఱ, ఓహెూ, ఔర, మరి, సుమ్ము, గదా, అకటా, అయ్యో, కటకటా, మఝు, భళి, మొదలైనవి.

**13) ఆకృతి గణము:**

ఆకృతి అంటే ఆకారము అని అర్థం. మనిషికి కరచరణాది అవయవాలు ఎలా ఆకారానికి గుర్తులో వ్యాకరణంలో కూడా అలాగే కొన్ని పదాలను ఒకే గణంగా చేసి చెపుతారు. అక్కడ కూడా అకారాంతాలనో, ఉకారాంతాలనో ఏదో ఒక తీరును ఆకారంగా భావించి గణనిర్ణయం చేస్తారు. అలా చేసి వాటికి వ్యాకరణ కార్యాన్ని విధిస్తారు.

ఉదా॥ "ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగా నగు" (సంధి-7)

ఇందులో ఏమ్యాదులు అంటే ఏమి, మఱి, కిషష్కి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి అనేవి స్వరూపాన్ని బట్టి హ్రస్వ ఇకారాంత పదాలు. వీటిని ఏమ్యాదుల ఆకృతి గణంగా చిన్నయసూరి పేర్కొన్నాడు. ఇటువంటివి బాలవ్యాకరణంలో చాలా ఉన్నాయి. ఉదా॥ మగాదులు, కయిరాదులు, అంగలాదులు, నిక్కలాదులు మొదలైనవి.

**14) ఆగమము:**

ఆగమం అంటే 'రాక' అని శబ్దార్థం. ఇక్కడ అధికంగా వచ్చే వర్ణమని అర్థం. 'ఆగమమనగా వర్ణాధిక్యమ'ని చిన్నయసూరి పేర్కొన్నాడు. 'మిత్రవదాగమః'-మిత్రునివలె ఉన్న వర్ణాలను అలాగే ఉంచి అధికంగా చేరటం.

ఆగమ వర్ణం పదానికి పూర్వంలో చేరితే అది పూర్వాగమం.

ఉదా॥ రథము; అరదము - ఇందులో రథానికి పూర్వం 'అ' చేరింది.

అలాగే అంతంలో చేరితే 'అంతాగమం' అవుతుంది.

**15) ఆచ్ఛికము:**

"సంస్కృత సమేతరంబయిన యాభాష యచ్ఛ యనంబడు" (ఆచ్ఛిక-1)

సంస్కృత సమము కాక యితరమగు ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృత భవ, దేశ్యమునైనభాష. దీనిని ఆచ్ఛికమని, వికృతి అని వ్యాకర్తలు పేర్కొంటారు.

1. ప్రాకృత సమము - సిరి, గారవము
2. సంస్కృత భవము - అసము, చందురుడు
3. ప్రాకృత భవము - లచ్చి, జన్నము
4. దేశ్యము - అన్న, అక్క, మేడ

**16) ఆదేశము:**

"శత్రువదాదేశః" అంతకు ముందున్న వర్ణాన్ని కాని వర్ణాలను కాని తొలగించి చేరే వర్ణాన్ని కాని వర్ణాలను కాని ఆదేశమని అంటారు.

ఉదా॥ గసడదవాదేశం - వాడు + కొట్టె = వాడుగొట్టె
పుంప్వాదేశం - సరసము + మాట = సరసపు మాట/ సరసంపు మాట
సరళాదేశం - పూచెను + కలువలు = పూచెనుగలువలు

**17) ఆమంత్రణము:**

"ఓ యామంత్రణంబునందగు" (తత్సమ-14)

ఆమంత్రణం అంటే సంబోధనం. సంబోధించదగిన వ్యక్తిని బోధించు శబ్దం. అంటే ఏ వ్యక్తిని సంబోధిస్తామో ఆ వ్యక్తిని చెప్పే శబ్దం అని అర్థం.

ఉదా॥ ఓ రాముడా!
ఓ రాములారా!
ఓ కృష్ణ

**18) ఆమ్రేడితము:**

'ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడితమ'ని చిన్నయసూరి స్పష్టం చేశాడు.

ఆమ్రేడితం అంటే రెండు పర్యాయాలుగాని, మూడు పర్యాయాలుగాని ఉచ్చరించబడేది 'ఆమ్రేడిత'మని అమరసింహము. (ఆమ్రేడితమ్ ద్విస్త్రిరుక్తమ్) 'తస్యపరమామ్రేడితమ'ని ప్రాణిని. (8-1-2) 'ద్విరుక్తపరస్వరం రూపమామ్రేడిత సంజ్ఞంస్యాత్' అని సిద్ధాంత కౌముది.

ఒకే పదాన్ని రెండుసార్లు ఉచ్చరిస్తే రెండవసారి ఉచ్చరించినది ఆమ్రేడితము.

ఉదా॥ ఆహా + ఆహా = ఆహాహా - ఇందులో రెండవ సారి ఉచ్చరించిన ఆహా ఆమ్రేడితం.

**19) ఆశీర్యాద్యర్థకము:**

ఆశీస్సు మొదలైనవాటిని తెలిపేవి. ఈ అర్థంలో -ఎడున్, -తన్ అనే వర్ణకాలు ధాతువుల చివర చేరతాయి.

ఉదా॥ పోషించు + ఎడున్ = పోషించెడున్
పోషించు + తన్ = పోషించుతన్
కొట్టు + ఎడున్ = కొట్టెడున్
కొట్టు + తన్ = కొట్టుతన్

**20) ఇత్సంజ్ఞ:**

"కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడువర్ణమిత్తునాఁబడు" (తత్సమ-19) అని సూరి ఇత్సంజ్ఞను నిర్వచించాడు. వ్యాకరణ కార్యం కోసం ప్రత్యయాదులలో చివర కూర్చబడి ప్రయోగించేటపుడు కనిపించనివి ఔత్తులు. ఇవి ఆది యందు అంతమందు చేరతాయి.

ఉదా॥ టిత్తు అంటే టకారం ఇత్సంజ్ఞగా కలది అని అర్థం. యడాగమం అంటే 'యట్' ఆగమంగా కలది అని అర్థం. 'య' ఆగమంగా వస్తుంది అని అనక, యడాగమమని 'ట్' అంతమందు చేర్చి చెప్పటం వలన, టిత్తులైన ఆగమాలు విధించిన

దానికి ముందు వస్తుంది అని చెప్పటం. అలాగే కిత్తులుగా ఉన్న సంజ్ఞలు విధించిన వానికి చివరవస్తాయి (ఆద్యంతౌ టకితౌ).

1) టిత్తు = ముందుకు వచ్చి చేరటం.

ఉదా॥ యడాగమము – మా + ఇల్లు = మాయిల్లు – ఇందులో యిల్లులోని ఇకారానికి ముందు యడాగమం వచ్చి మా + య్ + ఇల్లు = మాయిల్లు అవుతుంది.

2) కిత్తు = చివర వచ్చి చేరటం.

ఉదా॥ నుగాగమము – రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ – ఇందులో రాజు తరువాత న్ ఆగమంగా వచ్చి రాజు + న్ + ఆజ్ఞ = రాజునాజ్ఞ అవుతుంది.

3) జిత్తు = బిందుపూర్వకం కావటం

ఉదా॥ రామ + డుఙ్ = రాముఁడు

4) జీత్తు = ధాతువు యొక్క ఉత్వం అత్వం కావటం

ఉదా॥ కొట్టు + కజీ = కొట్టక

5) డుఙ్ఞు – ఞ్కారము కేవలం ప్రత్యాహార సంజ్ఞ. అంటే 'డుఙ్'–రు–వు–రు–ను–ముఞ్ లు కలిపి డుఞ్ అవుతుంది.

**21) ఉత్తమము:**

ఇది సంస్కృత వ్యాకరణ సంజ్ఞ. "త్ర్యాదీనామంత్య ముత్తమమ్" అని నియమం. మూడుగాని అంత కంటె ఎక్కువగాని అక్షరాలుగల శబ్దంలోని చివరి అక్షరం ఉత్తమం.

ఉదా॥ బలిమి, కలిమి

ఇందులో 'మి' వర్ణంలోని 'ఇ' ఉత్తమం.

**22) ఉత్తర పదము:**

సమాసంలోని చివరి పదం ఉత్తరపదం. (బా.వ్యా. సంధి–11)

ఉదా॥ రామలక్ష్మణులు – ఇందులో 'లక్ష్మణుడు' ఉత్తర పదము. అలా కాకుండా సమాసంలో బహు పదాలున్నప్పుడు చివరి పదమే ఉత్తర పదం అవుతుంది.

ఉదా॥ రామలక్ష్మణభరతశతృఘ్నులు అన్నప్పుడు శతృఘ్నుడు ఉత్తర పదం అవుతుంది.

**23) ఉపధ:**

ఉపధ అంటే తుది వర్ణమునకు ముందున్న వర్ణము.

ఉదా॥ రోచి; ర్ + ఓ + చ్ + ఇ; ఇందులో చ్–ఉపధ; ఇ–తుదివర్ణము.

**24) ఉపధ్మానీయము:**

'ప', 'ఫ' లకు ముందున్న విసర్గకు ఉపధ్మానీయమని పేరు.

మనఃపద్మము

మనఃఫలకము

**25) ఉపోత్తమము:**

(ఉప + ఉత్తమము) మూడు కాని అంత కంటె ఎక్కువగాని అక్షరాలు ఉన్న శబ్దంలోని చివరి అక్షరం ఉత్తమము. ఉత్తమానికి పూర్వం ఉన్న అక్షరం ఉపోత్తమమౌతుంది. "త్ర్యాదీనామంత్య ముత్తమమ్ – తస్య సమీప ముపోత్తమమ్" అని సంస్కృత వ్యాకరణ నియమము.

ఉదా॥ బలిమి, కలిమి

బ్ + అ + ల్ + ఇ + మ్ + ఇ; ఇందులో 'మ్' ఉపధ, ఉపధకు ముందున్న 'ఇ' ఉపోత్తమము

క్ + అ + ల్ + ఇ + మ్ + ఇ; ఇందులో 'మ్' ఉపధ, ఉపధకు ముందున్న 'ఇ' ఉపోత్తమము

ఈ పదాలలోని లవర్ణము మీది ఇవర్ణం ఉపోత్తమము.

**26) ఏకాదేశము:**

ఏక + ఆదేశము – రెండింటినీ తొలగించి ఒక్కటే ఆ స్థానంలో వచ్చేది.

రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు

– ఇందులో పూర్వస్వరమైన 'ఉ' పరస్వరమైన 'అ' రెండింటికి బదులు పరస్వరమే ఏకాదేశంగా రావటం.

**27) ఔపవిభక్తికములు:**

ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌప విభక్తికంబులు (అచ్చిక–28) అనే సూత్రవృత్తిలో 'విభక్తి నిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబు లయిన ఇ టి తి – అనువర్ణంబులు ఔపవిభక్తికంబు లనంబడు' అని సూరి వివరించాడు. విభక్తికి ముందు చేరేవి కాబట్టి వీటిని ఔపవిభక్తికాలని అన్నారు. విభక్తుల లాగా వీటికి క్రియాన్వయం ఉండదు. ఇ టి తి అనే ఔపవిభక్తిక వర్ణాలు ద్వితీయాది విభక్తుల ఏక వచన ప్రత్యయాలు పరమైనప్పుడు మాత్రమే కొన్ని నామాలమీద వస్తాయి.

**ఇ:** ఉదా॥ ఊరు + ను = ఊరిని

**టి:** ఔప విభక్తికమైన టి వర్ణం ద్వితీయాది ఏక వచన ప్రత్యయాలు పరమైనపుడు కొన్ని శబ్దాల చివరి అక్షరానికి ఆగమంగా, ఆదేశంగా, ఆగమాదేశంగా కూడా వస్తాయి.

ఉదా॥ త్రాడు + ను = త్రాటిని (ఆదేశం)

అన్ని + ను = అన్నిటిని (ఆగమం)

పగలు + ను = పగటిని (ఆగమాదేశం)

**తి:** అఱ్ఱు, కఱ్ఱు, గోయి వంటి శబ్దాలకు ద్వితీయాది ఏకవచన శబ్దాలు పరమైనపుడు 'ంటి' ఆగమంగా వస్తుంది.

ఉదా॥ అఱ్ఱు + ను = అఱితిని

గోయి + ను = గోతిని

చేయి + ను = చేతిని

**28) కర్త్రర్థకము:**

కర్తను ప్రధానంగా గలది. ఇందులో కర్తృవాచకం ప్రథమాంతంగా, కర్మవాచకం ద్వితీయాంతంగా ఉంటుంది.

ఉదా॥ ఈశ్వరుఁడు లోకాలను సృష్టించాడు.

**29) కర్మ:**

ధాత్వర్థ ఫలాశ్రయము

(1) క్రియచెప్పే అర్థం యొక్క ఫలాన్ని పొందేది కర్మ.

ఉదా॥ రాముఁడు రావణుని సంహరించెను

ఈ పై వాక్యంలో సంహారమనే క్రియ యొక్క ఫలాన్ని అనుభవించినది రావణుడు. అందువల్ల ఈ వాక్యంలో రావణుడు కర్మ.

**30) కర్మధారయము:**

"విశేషణమునకు విశేష్యముతోడ సమాసము కర్మధారయము" (సమాస–3). సమాసంలో పూర్వపదం విశేషణం, ఉత్తర పదం విశేష్యమయితే అది సమానాధికరణం అవుతుంది. ఇందులో పూర్వోత్తరపదాలు రెండూ ఒకే విభక్తిలో అంటే ప్రథమావిభక్తిలోనే ఉంటాయి. దీనికే కర్మధారయమని మరొక పేరు.

ఉదా॥ సరసపు వచనము

**31) కర్మార్థకము:**

కర్మ ప్రధానమైన వాక్యం కర్మార్థకం.

సకర్మక ధాతువుయొక్క తుమున్నర్థక రూపం చివర 'పడు' ధాతువు చేర్చటం వలన నిష్పన్నమయ్యే క్రియ కర్మార్థక క్రియ.

ఉదా॥ పోషింపఁబడు

కొట్టఁబడు

**32) కృతోత్కము:**

చేయబడిన హ్రస్వమైన ఉకారము కలది. పదంలో సహజంగా ఉన్న ఉత్వం కాకుండా, వ్యాకరణ శాస్త్రవశాన చేయబడిన ఉత్వం కలది అని తాత్పర్యం.

ఉదా॥ రాము, కృష్ణు

సహజంగా ఈ శబ్దాలు రామ, కృష్ణ. కాని ఈ రెండు శబ్దాలు "పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుదియత్వంబునకుత్వంబగు" అనే సూత్రం చేత ఉత్వం వచ్చి రాము, కృష్ణు అవుతాయి. ఇవి వ్యాకరణ శాస్త్రం వలన పొందిన రూపాలు. శంభు, విష్ణు శబ్దాలలోని 'ఉ' పదగతమైన సహజ ఉత్వం.

**33) కళ:**

"ద్రుత ప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు" (సంజ్ఞా–13) అని చిన్నయసూరి పేర్కొన్నాడు. అంటే ద్రుతప్రకృతికాలు కాని శబ్దాలు కళలని తాత్పర్యం. ద్రుతాంతాలైన పదాలు ద్రుతప్రకృతికాలు. ద్రుతప్రకృతులు కాని శబ్దాలు కళలు.

(1) ప్రథమ కయి పట్టి యొక్క విభక్తులు చేరిన శబ్దాలు

ఉదా॥ ప్రథమకు– రాముఁడు, రాములు, హయము, విష్ణువు,

గోడ, మేడ, అయ్య, అమ్మ.

వీనిలో గోడ, మేడ, అయ్య, అమ్మ – అనేవి ప్రథమైకవచనం లోపించిన అచ్చ తెలుగు పదాలు. వీటిని స్త్రీసమాలని అంటారు.

కయి – రామునికయి,

పట్టి – జ్ఞానముబట్టి,

యొక్క – నాయొక్క

(2) క్రియలు

భూతకాల ప్రథమ పురుష బహువచన రూపాలు – వచ్చిరి

భూతకాల మధ్యమ పురుష ఏక, బహువచన రూపాలు – వచ్చితివి, వచ్చితిరి,

భూతకాల ఉత్తమ పురుష బహువచన రూపాలు – వచ్చితిమి.

(3) వ్యతిరేక క్రియలు – రాఁడు, రారు, రాదు, రావు, రాము.

(4) వ్యతిరేక క్త్వార్థకాలు – కొట్టక, తిట్టక.

(5) క్త్వార్థకాలు – ఎత్తిలి, ఒత్తిలి

(6) అవ్యయాలు – ఊరక, మిన్నక, భళి, అక్కట, ఏల – మొదలైనవి

**34) క్త్వార్థము:**

క్త్వార్థము= (క్త్వా + అర్థ) క్త్వా–అనే సంస్కృత ప్రత్యయం యొక్క అర్థంలో తెలుగులో ధాతువుకు చేరే 'ఇ' ప్రత్యయాన్ని క్త్వార్థమంటారు. ఇది భూతకాలంలో జరిగే అసమాపక క్రియ. దీనిని క్త్వార్థం అంటారు.

"ఏకాశ్రయంబులగు క్రియల లోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచి యగు ధాతువున కివర్ణకంబగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు" (క్రియ–38) అని చిన్నయసూరి నిర్వచించాడు. ఏక వ్యక్తికి చెందిన క్రియలలో పూర్వకాలంలో జరిగే క్రియను తెలిపే ధాతువునకు చేరే 'ఇ' ప్రత్యయాన్ని క్త్వార్థమని అంటారు అని తాత్పర్యం.

ఉదా॥ వచ్చియిచ్చెను. ఇక్కడ వచ్చుట, యిచ్చుట అనే రెండు క్రియలు (=పనులు) ఉన్నాయి. ఈ రెంటిలో వచ్చుట పూర్వకాలంలో జరిగిన క్రియ. ఇక్కడ వచ్చుట, ఇచ్చుట అనే రెండు క్రియలు ఒకే వ్యక్తిని ఆశ్రయించి ఉన్నాయి. ఎలాగంటే వచ్చినవాడు, ఇచ్చినవాడు ఒక్కడే. కాబట్టి వచ్చు + ఇ = వచ్చి–అయినది. కాబట్టి 'వచ్చి' అనేది క్త్వార్థము.

**35) క్లీబతుల్యములు:**

నపుంసక లింగంతో సమానమైన సంస్కృత శబ్దాలు క్లీబతుల్యాలు. చిన్నయసూరి "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" (తత్సమ-66) అని సూత్రీకరించాడు. కంధరాదులు సంస్కృతంలో స్త్రీ లింగాలు. ఇవి తత్సమాలయ్యేటప్పుడు దీర్ఘానికి హ్రస్వం, ప్రథమైక వచనలోపం కలిగిన రూపాలవుతాయి. ఇలా ప్రథమైకవచన లోపం కలిగిన రూపాలే కాకుండా 'ము' వర్ణకం చేరిన రూపాలు కూడా ఏర్పడుతున్నాయి. అందుచేత 'ము' వర్ణకం చేరిన రూపాలను సాధించడం కోసం కంధరాదులకు క్లీబతుల్యతను అతిదేశించారు.

కంధరా-కంధర, కంధరము - ఇత్యాదులు

**36) క్లీబములు:**

క్లీబములు అంటే నపుంసక లింగాలు. సంస్కృతంలో నపుంసలింగ శబ్దాలే మహద్వాచకాలైన పక్షంలో అవి వికల్పంగా పుంలింగ తుల్యాలు అవుతాయి. అంటే పుంలింగ శబ్దాలకు సమానమైన వ్యాకరణకార్యాలను పొందుతాయని అర్థం. పుంలింగ తుల్యత్వం రానిపక్షంలో సంస్కృతంలో నపుంసకలింగాలు కావడం వలన ము వర్ణకం వస్తుంది. ఉదా॥ మిత్ర, శరణ వంటి శబ్దాలు.

మిత్రుఁడు - మిత్రము, శరణుఁడు - శరణము

**37) ఖండబిందువు:**

దీనినే అర్థబిందువు, అరసున్న అని వ్యవహరిస్తారు. ఈ గుర్తు ప్రాచీన శాసనాలలోగాని, తాటాకు ప్రతులలోగాని కనిపించదు. ముద్రణ యంత్రంతోపాటు ఇది ఏర్పడింది. (చూ. తెలుగు మెఱుగులు-శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి-అరసున్న పుట-63)

కావ్య భాషలో ఇది ఉచ్చారణలో కనిపించని అనునాసిక చిహ్నం. ఆఁకలి, చీఁకటి, మఱఁదలు, అరఁటి ఇత్యాదులు. కాని నేటి వ్యవహార భాషలో అనునాసికోచ్చారణ సూచకంగా నాటకాలలో, నవలల్లో ఉపయోగించడాన్ని గమనించవచ్చు. ఉదా॥ ఆఁ, ఊఁ. మాఁవఁయ్య, ఏఁవోఁయ్.

**38) గ్రామ్యము:**

"లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు" (బా.వ్యా.సంజ్ఞా-22)

వ్యాకరణ శాస్త్రానికి విరుద్ధమైన భాష గ్రామ్యం. లక్షణము= వ్యాకరణాది శాస్త్రమని అర్థం.

ఉదా॥ వస్తాఁడు, తెస్తాఁడు - ఇత్యాదులు.

సూరి అభిప్రాయం ప్రకారం శిష్టులు వ్యవహరించే భాష అయినా వ్యాకరణ నియమానికి విరుద్ధంగా ఉంటే అది గ్రామ్యమే అవుతుంది.

**39) డుమంతము:**

'డు' అంతమందు కలది యని అర్థం. ప్రథమైక వచనంలో డుజ్ ప్రత్యయం నిలిచి ఉండే ప్రాతిపదిక డుమంతము. ప్రత్యయం చేరటానికి ముందుగా ఉన్న మూల శబ్దరూపం.

ఉదా॥ రామ శబ్దం ప్రకృతి. దానికి డుజ్ చేరుతుంది. కాబట్టి 'రామ' అనే ప్రాతిపదిక డుమంతం.

హరి అనే ప్రాతిపదికకు డుజ్ చేరదు కాబట్టి ఇది డుమంతం కాదు.

డుజ్ వచ్చి నిలిచిఉండే ప్రాతిపదికకే డుమంతమని వ్యవహారం.

**40) తత్సమము:**

తత్ + సమము అంటే సంస్కృత ప్రాకృత తుల్యమైన భాష అని సాంప్రదాయిక వ్యాకరణాల నిర్వచనం.

రామః - రాముడు

సిరీ-సిరి

సంస్కృత శబ్దాలపై తెలుగు విభక్తులు చేరిన పదాలనే తత్సమాలని అంటారు.

**41) తద్ధర్మార్థకము:**

తస్య ధర్మః అని గాని సః ధర్మః యస్య సః అని గాని తద్ధర్మానికి వ్యుత్పత్తి. మూడుకాలాలను బోధించే క్రియా వాచకం. అంటే వర్తమాన భూత భవిష్యత్తులనే మూడు కాలాలను తెలిపే క్రియావాచకమని అర్థం.

వర్తమానాది కాలత్రయ సాధారణ కాలమును దెల్పు క్రియావాచకములు.

ఉదా॥ సూర్యుడు ఉదయించును

**42) తద్భవము:**

"సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" (సంజ్ఞా-20)

సంస్కృతభవము, ప్రాకృత భవము నగు భాష తద్భవము. (తద్=ఆ సంస్కృత, ప్రాకృతములనుండి, భవంబు=పుట్టినది). వర్ణలోపము మొదలగు మార్పులు కలిగి యేర్పడిన భాష తద్భవము.

సంస్కృత భవమునకు - ఆకాశః (సంస్కృతం) ఆకసము (సంస్కృత భవము)

ప్రాకృత భవమునకు - ఇంగాలో (ప్రాకృతం) ఇంగలము (ప్రాకృత భవము)

**43) తాలవ్యములు:**

"ఇఈఎఏలం గూడిన చజలు తాలవ్యంబులు" (సంజ్ఞా-8)

అచ్చ తెలుగు శబ్దాలలో, ఇ-ఈ-ఎ-ఏ లతో కూడుకొనిన చజలు తాలవ్యాలు. నాలుక మధ్యభాగం తాలువును తాకగా పుట్టే చజలు తాలవ్యాలు. (తాలువు= నాలుకకు పైనుండే శిరోభాగం. (తాలువంటే దవడ కాదు)

ఉదా॥ చిలుక, చీమ, చెలి, చేమ - (ఇఈఎఏలతో కూడిన చకారాలు)

జిల, జీడి, జెట్టి, జేజె - (ఇఈఎఏలతో కూడిన జకారాలు)

**44) దంత్యములు:**

దంతములు స్థానంగా ఉత్పన్నమయ్యే వర్ణాలు.

తెలుగులో చే జే లు దంత్యాలని, తాలవ్యాలని రెండు రకాలు. పైన తాలవ్యాలను గురించి చెప్పుకున్నాం.

"అఆఉఊఒఓఔ లంగూడిన చ,జ లు దంత్యములు" (సంజ్ఞా-9)

దంత్య చకారానికి - చేలి, చాప, చుక్క, చూపు, చొక్కు, చోటు, చౌక

దంత్య జకారానికి - జేముడు, జాతర, జున్ను, జూలు, జొన్న, జోలి, జౌకు.

**45) దేశ్యము:**

ఏ దేశపు మానవులకు ఆదేశపు భాష దేశ్యమవుతుంది.

"త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగు భాష దేశ్యంబు" (సంజ్ఞా-21) అని చిన్నయసూరి తెలుగు దేశ్యాలను గురించి చెప్పాడు.

తెలుగు దేశపు వాడుకలో సిద్ధించిన భాష దేశ్యము. తత్సమ తద్భవాలను గురించి చెప్పిన తరువాత దేశ్యాన్ని నిర్దేశిస్తూ చెప్పిన పై నిర్వచనాన్ని బట్టి త్రిలింగదేశ వ్యవహార సిద్ధమైన తత్సమ తద్భవేతర భాషను దేశ్యమని గ్రహించాలి. త్రిలింగదేశము అంటే తెలుగు దేశము. ప్రాచీన కాలంలో శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము అనే శైవక్షేత్రాలకు సంబంధించిన మూడు శివలింగాలకు మధ్యనుండే దేశాన్ని త్రిలింగదేశమని వ్యవహరించేవారు. త్రిలింగశబ్ద భవమే తెలుగని భావించి మన వ్యాకర్తలు ఇలా చెప్పారు. కాని తెలుగు శబ్దము తెనుగు శబ్దభవమని 'తెన్' శబ్దం దక్షిణ దిక్కును సూచిస్తుందని భాషాశాస్త్రవేత్తలు భావించారు.

దేశ్య శబ్దాలకు ఉదా॥ ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, తావి, మోవి ఇత్యాదులు.

**46) ద్రుతము:**

"నకారంబు ద్రుతంబు" (సంజ్ఞా-11)

ద్రుతము అంటే = ద్రుతినందునది. లోపించునది అని అర్థం. ఇది లోపించినా అర్థం చెడదు. "విభక్త్యాగమచార్థోను ర్ద్రుతః"

నకారము = ను వర్ణము. అంటే

ప్రత్యయాత్మకమైన నకారం - నన్నును,

ఆగమాత్మకమైన నకారం - నా చేతను,

అవ్యయాత్మకమైన నకారం - ఎంతయును

ఇటువంటి నువర్ణము ద్రుతము.

ఉదా॥ నన్ను, నా చేత, ఎంతయు.

పదంలో సహజంగా ఉండే అవయవికమైన నువర్ణము ద్రుతము కాదు.

ఉదా॥ చేను, పేను.

ఇందులోని నువర్ణము ప్రత్యయము, ఆగమము, అవ్యయము కానందున ద్రుతము కాదు. చిన్నయసూరి నకారాన్ని ద్రుతంగా పేర్కొన్నప్పటికీ 'న్ - న - ను' ఈ మూడింటిని ద్రుతంగా అంగీకరించినట్టు బాలవ్యాకరణంలో కనిపిస్తుంది.

**47) ద్రుతప్రకృతికము:**

"ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు" (సంజ్ఞా-12)

ద్రుతము అంతంలో ఉన్న పదాలు ద్రుతప్రకృతికాలు. అవి ఏవంటే

(1) ప్రథమా - కయి - పట్టి యొక్క - ఇతరములయిన విభక్తులు - అంటే ప్రథమా విభక్తి ప్రత్యయాలైన 'డు, ము, వు, లు', చతుర్థి విభక్తి ప్రత్యయమైన 'కయి', పంచమీ విభక్తి ప్రత్యయమైన 'పట్టి', షష్ఠీ విభక్తి ప్రత్యయమైన 'యొక్క' - అనేవి కాకుండ మిగిలిన విభక్తులు చివరగల పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ నన్నున్ - ద్వితీయా విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాచేతన్, నాతోడన్ - తృతీయా విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాకొఱకున్-చతుర్థీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నావలనన్, నాకంటెన్-పంచమీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

నాకున్, మాలోపలన్ -షష్ఠీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

మాయందున్ - సప్తమీ విభక్తి ప్రత్యయాత్మక ద్రుతము

(2) ఉత్తమ పురుష ఏకవచనాలు

ఉదా॥ వత్తున్-వచ్చెదన్

(3) భూత ప్రథమ పురుష ఏకవచనం అంటే 'ఎను' - అనే క్రియా ప్రత్యయం చివరగల పదాలు

ఉదా॥ వచ్చెన్ (క్రియా. 16)

(4) తద్ధార్మాద్యర్థక ప్రథమ పురుష ఏకవచనాలు. అంటే తద్ధర్మాద్యర్థాలను తెలిపేవి

ఉదా॥ వచ్చున్, వచ్చెడున్ (క్రియా. 16,22)

(5) ఆశీస్సు మొదలైన అర్థాలలో వచ్చే 'ఎడు' - 'త' అనే ప్రత్యయాలు చేరే పదాలు.

ఉదా॥ ప్రసన్నులయ్యెడున్, ప్రసన్నులు కావుతన్

(6) శత్రర్థకము = క్రియాన్వయంలో వర్తమానార్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన 'చు' వర్ణకం. ఈ ద్రుతాంతమైన చువర్ణకంతో ("చును") కూడిన పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టుచున్

(7) తుమర్థకము = ఏ క్రియ నిమిత్తం వేఱొక క్రియ జరుగుతుందో ఆ క్రియ తుమర్థకము. తుమర్థంలో వచ్చే 'నుఁ' వర్ణకంతో కూడిన పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టన్, కొట్టఁగన్, వండన్, వండగన్

(8) అనంతర్యార్థకము: అనంతరం యొక్క భావం ఆనంతర్యం. అనంతర్యార్థకం=అనంతరమున అనే అర్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన 'డు' వర్ణకం. ఈ ద్రుతాంత డువర్ణకంతో కూడిన పదాలే ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టుడున్ (కొట్టిన అనంతరం అని అర్థం)

వండుడున్ (వండిన అనంతరం అని అర్థం)

(9) చేదాద్యర్థకములు= చేదర్థకం మొదలైనవి. చేదర్థకం అంటే 'చేత్' శబ్దము యొక్క యర్థంలో ధాతువుకు చేరే ద్రుతాంతమైన నవర్ణకం. చేత్ అనేది పక్షాంతరాన్ని తెల్పేది. తెలుగులో –ఇనన్ తో కూడిన చేదర్థక పదాలు ద్రుతప్రకృతికాలు.

ఉదా॥ కొట్టినన్ (కొట్టిన పక్షాన. కొట్టిన యెడల)

వచ్చినన్ (వచ్చిన పక్షాన)

(10) నేను–తాను పదాలు ద్రుతప్రకృతికాలు. ఇవి సర్వనామాలు.

(11) వలె ప్రభృతులు. అంటె వలె, మొదలగునవి.

ఉదా॥ వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్

– మొదలైనవి ద్రుతప్రకృతికాలు.

**48) నిపాతము:**

'శాస్త్రేణ అన్యథా ప్రాప్తస్య అన్యథా నియమనమ్ నిపాతః'

వ్యాకరణశాస్త్రం చేత సిద్ధించవలసిన రూపానికి భిన్నంగా, కొన్ని శబ్దాలు సామాన్య ప్రక్రియకు ఒదగకుండా కనిపిస్తాయి. ఇటువంటి వాటికి సూత్రకారుఁడు నిర్దేశించిన రూపమే నిపాత రూపం.

ఉదా॥ 'కద్రువ నాగమాత' (తత్సమ–51)

నాగమాత అనే అర్థంగల 'కద్రూ' శబ్దానికి 'కద్రువ' అనే రూపాన్ని ప్రాతిపదికగా నిపతించి చెప్పటం చేత ఇది నిపాత రూపం అవుతుంది. ఇలా నిపతించి చెప్పిన సూత్రం నిపాత సూత్రం అవుతుంది.

**49) పరుషములు:**

"కచటతపలు పరుషంబులని, గజడదబలు సరళంబులని చెప్పంబడు" (సంజ్ఞా–5)

హల్లులలో క–చ–ట–త–ప లు పరుషాలు. (కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః – ఆం.చిం.) కచటతపల ఉచ్చారణ, గజడదబల ఉచ్చారణ కంటె పరుషం. కాబట్టి కచటతపలను పరుషాలని ప్రాచీన వ్యాకర్తలు పేర్కొన్నారు.

**50) ప్రాతిపదికము:**

"నామంబనగా ప్రాతిపదికము" (తత్సమ–21)

'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్' (పాణినీయం) 'కృత్తద్ధితసమాసాశ్చ'.

ధాతువు కానిది, ప్రత్యయం కానిది, ప్రత్యయం చేరనిది అయిన అర్థవంతమైన శబ్ద రూపం ప్రాతిపదిక. కృత్తద్ధిత సమాసాలను కూడా ప్రాతిపదికలే అని అంటారు.

ఉదా॥ 1) డిత్థ

2) కృదంతము – రామ. (రమ్ + ఘఞ్ = రామ, ఘఞ్–కృత్తు. కావున రామ కృదంత ప్రాతిపదికం)

3) తద్ధితాంతము – భార్గవ.

(భృగు + జస్ + అణ్ = భార్గవ. అణ్–తద్ధితం. కనుక ఇది తద్ధిత ప్రాతిపదికం)

4) రాజపురుష – సమాస ప్రాతిపదికం.

**51) బహుళము:**

"క్వచిత్ ప్రవృత్తిః, క్వచిదప్రవృత్తిః,

క్వచిద్విభాషా, క్వచిదన్యదేవ,

విధేర్విధానం బహుధాసమీక్ష్య,

చాతుర్విధం బాహుళకం వదంతి" - అని కాశికావృత్తి వచనం.

'అత్తునకు సంధి బహుళముగా నగు' (సంధి-4)

బహుళము అంటే, విధింపబడిన వ్యాకరణ కార్యము:

(1) కొన్నిచోట్ల తప్పక వచ్చుట,

(2) కొన్ని చోట్ల అసలే రాకపోవుట

(3) కొన్నిచోట్ల వైకల్పికముగా వచ్చుట,

(4) కొన్ని చోట్ల పేర్కొన్నదానికంటె భిన్నముగా వచ్చుట - అనే అర్థాలు గలది.

ఈ నాల్గింటినే, ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యవిధం అని వ్యవరిస్తారు.

ఉదా॥ (1) ప్రవృత్తి: వచ్చుచున్న + వాఁడు = వచ్చుచున్న + ఆఁ+డు = వచ్చుచున్నాఁడు

(2) అప్రవృత్తి: వెల + ఆలు = వెలయాలు

(3) విభాష: మేన + అత్త = మేనత్త, మేనయత్త

(4) అన్యకార్య ప్రవృత్తి: ఒక + ఒక = ఓకానొక

**52) మతుబాదికము:**

మతుప్ + ఆదికము. మతుప్ అర్థాన్నిచ్చే ప్రత్యయాలు అంతమందున్న శబ్దాలు, తదితరాలు మతుబాదికాలు.

ఉదా॥ శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్- ఇత్యాదులు.

ఈ శబ్దాలు ద్వితీయైక వచనాంత తుల్యరూపాలు తెలుగులో ప్రాతిపదికలవుతాయి. వీటి అంతిమ 'మ' కారానికి లోపం, అజంత శబ్దాలకు వలనే డుజ్ మొదలైనవి చేరతాయి.

అతఁడు శ్రీమంతుఁడు

వాని వంశము శ్రీమంతము

ఆమె శ్రీ మంతురాలు

**53) మధ్యమపురుషయోగము:**

మధ్యమ పురుష క్రియతో అన్వయం కలిగి ఉండటాన్ని మధ్యమ పురుష యోగమని అంటారు. ఈ సందర్భంలో -ఆరగాగమం విభాషగా వస్తుంది.

ఉదా॥ వినుఁడు బాలకులు

వినుఁడు బాలకులారా!

**54) మహత్తు:**

"స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు" (తత్సమ-17)

స్త్రీవాచకాలు, తిర్యక్ వాచకాలు, జడ వాచకాలకు భిన్నమైనవి అంటే పురుష వాచక శబ్దాలు వాటి విశేషణాలు, మహత్తులు అని తాత్పర్యం.

ఉదా॥ రాముఁడు, రావణుఁడు, ఇంద్రుఁడు మొ॥నవి

**55) లఘువులు:**

అంతస్థ వర్ణాలైన య-ర-ల-వ అనే వాటిని ఉచ్చారణను బట్టి రెండు రకాలుగా విభజింపవచ్చు. అవి -

(1) లఘువులు - లఘూచ్చారణము కలవి. స్థానకరణ సంయోగంలో వీటిని ఉచ్చరించేటప్పుడు శైథిల్యముంటుంది.

య: హరియతఁడు - (హరి + అతడు = ఇందులో సంధివశాన వచ్చిన ఆగమ యకారం లఘువు)

ర: పెరుగు, కరుగు - (పదగతమైన సహజ సాధురేఫం లఘువు)

ల: తల, నెల – (పదగతమైన సహజ లకారము లఘువు)

వ: అతడువలుకు – (అతడు + పలుకు – ఇందులో సంధివశాన వచ్చిన ఆగమ వకారం లఘువు)

**56) లుప్త శేషము:**

లోపింపగా మిగిలినది.

ఉదా॥ ప్రాఁత

"సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" (సంధి–36) సూత్రంచేత ప్రాఁతలోని 'ఁత' లోపింపగా, మిగిలిన 'ప్రా' లుప్తశేషం అవుతుంది.

**వికల్పము:**

వ్యాకరణ కార్యం ఒకసారి జరగటం, మరొకసారి జరగకపోవటం వికల్పం.

ఉదా॥ వచ్చుచున్ + ఉండెను = వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

**విభాష:**

"నవేతి విభాషా" (=నిషేధ వికల్పయోః విభాషా సంజ్ఞా స్యాత్) అనే దానిని బట్టి విభాష శబ్దానికి నిషేధార్థం కూడా ఉన్నట్లు కనిపిస్తుంది. విధించిన వ్యాకరణ కార్యం ఒకసారి ప్రవర్తిల్లటం, మరొకసారి ప్రవర్తిల్లకపోవటం విభాష. ఈ విభాషతో కూడిన వ్యాకరణ కార్యాలు బాలవ్యాకరణం మొత్తంలో 72 కనిపిస్తాయి.

విభాష, వికల్పం అనేవి సమానార్థకాలుగా భావిస్తారు. ఇవి మూడు విధాలు.

**(1) ప్రాప్తవిభాష**

ఏ సూత్రం చేతనయినా నిత్యంగా ప్రాప్తించే కార్యాన్ని వికల్పంగా విధించేది ప్రాప్త విభాష.

ఉదా॥ 'కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు' (సంధి–28) అనే సూత్రం చేత నిత్యంగా ప్రాప్తించే టుగాగమం 'కర్మధారయంబునందు పేర్వాది శబ్దములకచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు' (సంధి–29) అనే సూత్రం చేత వికల్పితమవుతుంది. దీనినే ప్రాప్త విభాష అంటారు.

**(2) అప్రాప్త విభాష**

ఏ సూత్రం చేత కూడ ప్రాప్తించని కార్యాన్ని వికల్పంగా విధించేది అప్రాప్త విభాష.

ఉదా॥ 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు' (సంధి–17) ఈ సూత్రం ద్వారా విధించిన బిందు సంశ్లేషలు మరే ఇతర సూత్రాలచేత ప్రాప్తించదు. అప్రాప్తమైన కార్యాన్ని ఈ సూత్రం వికల్పంగా విధిస్తున్నది. అందుచేత ఇది అప్రాప్త విభాష.

**(3) ప్రాప్తాప్రాప్త విభాష (ఉభయత్ర విభాష)**

ఏదయినా ఒక వ్యాకరణ కార్యం వికల్పంగా ప్రాప్తించవలసిన రూపాలలో కొన్ని భాగాలలో వేరొక సూత్రం చేత అంతకుముందే నిత్యంగా ప్రాప్తించటం, కొన్ని భాగాలలో అసలే ప్రాప్తించకుండా ఉండటం వంటి సందర్భాలలో ఈ రెండు విభాగాల మొత్తానికి అంటే ప్రాప్తాప్రాప్త విభాగాలు రెండింటికి కలిపి ఆ వ్యాకరణ కార్యాన్ని వికల్పంగా విధించేది ఉభయత్ర విభాష.

**57) వికృతి:**

చిన్నయసూరి దీనిని తత్సమ పరిచ్ఛేదంలోని "వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు దుత్వంబగు" (తత్సమ–46) అనే సూత్రవృత్తిలో 'ఇచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు' నని పేర్కొన్నాడు. వికృతి అంటే సంస్కృతసమేతరము. అంటే సంస్కృత భవము, ప్రాకృత సమము, ప్రాకృత భవము, దేశ్యము. వీటిని వికృతిగా పేర్కొన్నారు. ఆచ్ఛిక పదాన్ని నిర్వచిస్తూ చెప్పింది కూడా ఇదే.

ఉదా॥ కలికి, ములికి, చెలిమి, బలిమి, జిగి, నిసి మొదలైనవి.

**58) విధాన సామర్థ్యము:**

ఒక సూత్రం చేత ఒక కార్యాన్ని విధించటాన్ని విధానము అంటారు. ప్రతి విధానానికి ప్రయోజనం ఉంటుంది. "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు" (సంధి–24) అనే సూత్రం చేత ద్రుతానికి నిత్యంగా సమాసంలో లోపం విధించబడింది. ఆ తరువాత సూత్రమైన "సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు" (సంధి–25) అనే సూత్రం చేత 'నుక్' సమాసంలో ఆగమంగా విధించబడుతుంది. ఇది (నుక్) ఆగమం కావటం చేత ద్రుతమవుతున్నది. సమాసంలోని ద్రుతం కావటం చేత పైన పేర్కొన్న సంధి–24 చే లోపం రావలసి ఉంది. సూరి ముందు లోపాన్ని చెప్పి దానికి ఆగమాన్ని వెంటనే విధించటం ఈ విధానసామర్థ్యం వల్లనే. అంటే ఈ సూత్రం చేత ఏ లోపము రాదని భావము.

ఉదా॥ చిగురు + కయిదువు = చిగురుంగయిదువు
చిగురుఁగయిదువు
చిగురున్గయిదువు.

చిగురు + కయిదువు – ఇక్కడ స్త్రీ సమానికి పరుష కకారం పరంకాగా నుగాగమం వచ్చి చిగురు + ను + కయిదువు అవుతుంది. సంధి–24 చేత సమాసానికి ద్రుతం లోపం రావలసి ఉంది. అలా ద్రుతం లోపిస్తే సూత్రంలో చెప్పిన నుగాగమ విధానవే వ్యర్థమవుతుంది. కాబట్టి 'విధాన సామర్థ్యం' చేత ద్రుతాన్ని ప్రత్యేకంగా విధించటం చేత ఉదంత స్త్రీసమాలకు, పుంపులకు తరువాత ఉన్న ద్రుతానికి లోపం రాదు సంధి–16వ సూత్రం చేత చిగురు + ను + కయిదువు = చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురుంగయిదువు – అనే రూపాలు సిద్ధిస్తున్నాయి. ద్రుతానికి స్వత్వ రూపం లేదు కాబట్టి 'చిగురునుగయిదువు' కాదు.

**59) వృత్తి:**

సూరి ఈ పదాన్ని సమాస పదంగా వాడాడు. "కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు దత్వంబున కుత్వంబును రుగాగమంబునగు" (సంధి–31) అనే సూత్రాన్ని వివరిస్తూ వృత్తిలో 'ఇచట వృత్తియం దాలు శబ్దము స్త్రీమాత్రపరము' అని పేర్కొన్నాడు. సంస్కృతంలో వృత్తులు అయిదు రకాలు.

1) కృద్వృత్తి – ఉదా॥ అలుగు + క = అలక

2) తద్ధిత వృత్తి – ఉదా॥ తెల్ల + తనము = తెల్లఁదనము

3) సమాస వృత్తి – ఉదా॥ ధీర + ఆలు = ధీరురాలు

4) ఏకశేషవృత్తి – ఉదా॥ మాతాచ పితాచ = పితరౌ

5) సనాద్యంత ధాతు వృత్తి – ఉదా॥ రిరంసా (తాను రపింపగోరుట)

**60) వ్యవస్థిత విభాష:**

విధించిన వ్యాకరణకార్యం ఇక్కడ నిత్యంగా వర్తిస్తుందని, ఇక్కడ నిత్యంగా ప్రవర్తించదని, ఇక్కడ వైకల్పికంగా ప్రవర్తిస్తుందని ఇలా లక్ష్యానుసారంగా ఉన్న వ్యవస్థతో కూడుకొన్న విభాషను వ్యవస్థిత విభాష అంటారు. 'లక్ష్యానుసారేణవ్యవస్థయా ప్రవృత్తా విభాష' అని దీని నిర్వచనం.

"ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" (సంధి–17)

అనే సూత్రంలోని విభాష వ్యవస్థిత విభాష. (వ్యవస్థ=ఏర్పాటు). ఈ వ్యవస్థయేమంటే ప్రాతాదులలోని ద్రుతానికి సంశ్లేషం లేదని చెప్పటం. ఇటువంటి వ్యవస్థతో కూడుకొన్నది కాబట్టే ఈ విభాష వ్యవస్థిత విభాష. ప్రాఁత + కెంపు > ప్రా + కెంపు > ప్రా + ను + కెంపు > ప్రా + ను + గెంపు – ఇది ద్రుతకార్యాలు జరిగి బిందు సంశ్లేషలు రావాలి. కాని దీర్ఘము మీద సాధ్య పూర్ణం లేదు కాబట్టి ప్రాంగెంపు కాదు. అలాగే వ్యవస్థిత విభాష చేత ఈ ద్రుతానికి సంశ్లేష రూపం రాదు. అందువలనే ప్రాన్గెంపు అనే రూపం సిద్ధించదు. సమాసంలో ద్రుతానికి స్వత్వం లేదు కాబట్టి 'ప్రానుగెంపు' కూడా కాదు.

**61) వర్గయుక్కులు:**

వర్గయుక్కులు అంటే వర్గాలలోని సరి సంఖ్యగల వర్ణాలు. వర్ణమాలలోని వర్గాలు అయిదు. అవి– కవర్గము, చవర్గము, టవర్గము, తవర్గము, పవర్గము. యుక్కు అంటే సరిసంఖ్య అని అర్థం. కాబట్టి వర్గయుక్కులంటే వర్గాక్షరాలలోని సరిసంఖ్యగల వర్ణాలు. ప్రతివర్గంలో అయిదు వర్ణాలుంటాయి.

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

ఈ పై వర్గాక్షరాలలోని రెండు, నాలుగు వర్ణాలు వర్గయుక్కులు. 2,4 సరిసంఖ్యలు, 1,3,5 బేసి సంఖ్యలు కాగా, ఖ–ఘ, చ–ఝ, ఠ–ఢ; థ–ధ, ప–భ అను పది వర్ణాలు వర్గయుక్కులు అవుతాయి.

**62) సంబుద్ధి:**

సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనాన్ని సంబుద్ధి అని అంటారు. (సంబోధనే ప్రథమాయా ఏకవచనం సంబుద్ధి సంజ్ఞం స్యాత్ – సి.కౌ.)

ఉదా॥ ఓరామ, ఓకృష్ణ

**63) సంధి:**

“పూర్వ పర స్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు”

పూర్వస్వరము, పరస్వరము అనే రెండింటిస్థానంలో పరస్వరం ఒక్కటే ఆదేశంగా వచ్చి నిలవటం సంధి. ఇది తెలుగులోని అచ్సంధులకు మాత్రమే వర్తించే నిర్వచనం.

| | | | |
|---|---|---|---|
| ఉదా॥ | రాముఁడు | + అతఁడు | = రాముఁడతడు |
| | సోముఁడు | + ఇతఁడు | = సోముఁడితడు |
| | మనము | + ఉంటిమి | = మనముంటిమి |
| | అతఁడు | + ఎక్కడ | = అతఁడెక్కడ |
| | ఇతఁడు | + ఒకఁడు | = ఇతడొకఁడు |

**64) సంశ్లేషము:**

(1) మీఁది హల్లుతోఁ గూడుకొనుట.

ఉదా॥ పూచెన్గలువలు

ఇలా వ్రాతలో రెండు హల్లులయొక్క కూడికతో ఏర్పడిన రూపాన్ని సంశ్లేషంగా పేర్కొనబడినప్పటికి ‘పూచెన్‌గలువలు’ అని ఉన్నచోట్ల ఉచ్చారణలో సంయోగమే వినిపిస్తుంది.

**65) సంస్కృత సమములు:**

(1) సంస్కృత శబ్దములతో సమానమైన శబ్దాలు.

విశేషంగా మార్పులకు లోనుగాక, తెలుఁగు విభక్తితో కూడి వ్యవహరించబడేవి.

ఉదా॥ రామః – రాముడు

వనితా – వనిత

(2) ఋఋ౯ా ఌ ౡ విసర్గ (ః)

ఖ, ఛ, ఠ, థ, ఫ,

ఘ, ఝ, ఢ, ధ, భ

జ, ఞ, శ, ష – అను పద్దెనిమిది వర్ణాలలో ఏది ఉన్నా ఆ పదము సంస్కృత సమమేనని చెప్పవచ్చు. దీనికి కారణం ఈ వర్ణాలు సంస్కృత సమాలలోనే ఉంటాయి కాబట్టి.

**66) సరళములు:**

"కచటతపలు పరుషంబులని, గజడదబలు సరళంబులని చెప్పంబడు" (సంజ్ఞా–5)

హల్లులలో గ–జ–డ–ద–బ లను సరళాలని అంటారు. (కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః – ఆం.చిం.) ఉచ్చారణలో గజడదబల ఉచ్చారణ, కచటతపల ఉచ్చారణ కంటె సరళం కాబట్టి గజడదబలకు సరళాలనే పేరు వచ్చింది. దంత్య జకారాన్ని కూడా సరళంగానే భావించాలి.

**67) సర్వనామములు:**

విశేష్యాల పునరుక్తిని నివారించటం కోసం వాటికి మారుగా ఉపయోగించే నామాలను సర్వనామాలు అంటారు. వీటిని అన్ని నామాల స్థానంలో ఉపయోగిస్తారు.

"అన్ని ప్రభృతులు సర్వనామంబులు" (ఆచ్చిక–24)

అన్ని ముదలైనవి – అన్ని, ఇన్ని, ఎన్ని, పెక్కు, పలు, ఆ–ఈ–ఏ–నీ–నా–తా–మన– సంఖ్యావాచకాలు.

ఉదా॥ రాముఁడు వనమున కేగెను.

రాముఁడు రావణుని సంహరించెను.

ఈ వాక్యాలలో రెండవసారి రామశబ్దానికి మారుగా 'అతడు రావణుని సంహరించెను' అని అనవచ్చు. ఇందులో అతడు అనేది సర్వనామం.

**68) స్థిరములు:**

"ఇతరములగు హల్లులు స్థిరములు" (సంజ్ఞా–6)

పరుషాలు సరళాలు కాక మిగిలిన హల్లులు స్థిరములు.

సూత్రంలో ఇతరములు అంటే పరుషసరళేతరములు అని అర్థం. కచచటతపలు – పరుషాలు, గజజడదబలు – సరళాలు కాబట్టి ఇవి కాకుండా తక్కిన హల్లులు స్థిరములు.

ఉదా॥ ఖఘఙ; ఛఝఞ; ఠఢణ; థధన; ఫభమ; యరలవశషసహళ – అనే 24 వర్ణాలు స్థిరవర్ణాలు.

స్థిరములు – సంధి కార్యాలలో ఎటువంటి మార్పులు చెందక స్థిరంగా ఉంటాయి కాబట్టి వీటికి స్థిరవర్ణాలన్న పేరు సార్థకమని కొందరు వ్యాకర్తలు అంటారు.

**69) సవర్ణములు:**

సవర్ణము అంటే తుల్యాస్య ప్రయత్నం కలది. వీటిని సమాన వర్ణాలని అంటారు. చిన్నయసూరి "దంత్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు" (సంజ్ఞా–7) అని దంత్య తాలవ్య చ జలకు సవర్ణత్వాన్ని విధించాడు. ఇవి భిన్నమైన ఉచ్చారణ గల భిన్నమైన వర్ణాలే అయినప్పటికి వ్యాకరణ రీత్యా సవర్ణాలు. అంటే తాలవ్య చకారానికి విధించిన కార్యం దంత్య చకారానికి, తాలవ్య జకారానికి విధించిన కార్యం దంత్య జకారానికి కూడా వర్తిస్తుందని తాత్పర్యం.

ఉదా॥ సరళాదేశంలో తోచెను + చుక్కలు = తోచెను జుక్కలు అన్నప్పుడు చ కు జ వచ్చినట్లే, చ కు జ వచ్చింది. సరళ జకారానికి ముందు ద్రుతానికి కలిగే లోప సంశ్లేషాదులు జ కు ముందుకూడా కలుగుతాయి.

వచ్చెను + జాతర = వచ్చెనుజాతర

గసడదవాదేశ సంధిలో కూడా చ కు స వచ్చినట్లే చ కూడా వస్తుంది.

**70) సాంస్కృతిక పరుషము:**

సాంస్కృతికం అంటే సంస్కృతానికి సంబంధించినది. సంస్కృత సమాలలోని పరుషాలను సాంస్కృతిక పరుషాలు అంటారు. "తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు" (సంధి–14) అనే సూత్రంలో ఈ పదం వాడబడింది.

ఉదా॥ వాఁడు + కంసారి.

ఇక్కడ 'వాఁడు' అనే పదం అచ్చతెనుగు. 'కంసారి' సంస్కృత సమం. ఈ సంస్కృత సమం ఆదిన ఉన్న కకారం పరుషం. కాబట్టి ఇందులోని కకారము సాంస్కృతిక పరుషం.

**71) సాధ్యపూర్ణము:**

వ్యాకరణ కార్యములచే సాధింపదగిన నిండుసున్న.

ఉదా॥ వాఁడు, వీఁడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

ఈ మొదలైన శబ్దాలలోని బిందువు పూర్ణ బిందువు కాదు. "దీర్ఘము మీఁది సాధ్య పూర్ణము లేదు" (సంజ్ఞా-15) అనే సూత్రం ఈ పారిభాషిక పదాన్ని చిన్నయసూరి వాడాడు.

**72) స్త్రీ సమము:**

ప్రథమా విభక్తి ఏకవచనం లోపించిన అచ్చతెనుగు శబ్దాన్ని స్త్రీసమం అంటారు. ప్రథమైకవచన విభక్తులైన డు,ము,వు అనే ప్రత్యయాలు లోపించిన ఆచ్ఛిక శబ్దాలు. తెలుగులోని అత్యధిక దేశ్య శబ్దాలు ఇటువంటివే.

ఉదా॥ చిగురు, అన్న, అక్క, దున్న, గోడ

**మాదిరి ప్రశ్నలు**

1) ఈ క్రింది వానిలో నాలుగు పారిభాషిక పదాలను వివరించండి.

1) సాంస్కృతిక పరుషము

2) విధాన సామర్థ్యము

3) మధ్యమపురుష యోగము

4) నిపాతము,

5) ఉపధ

6) ఇత్సంజ్ఞ

7) అవ్యయము

8) ఆకృతిగణము

# యూనిట్–5

# 5. రూప నిష్పత్తులు

ఈ విభాగంలో కొన్ని పదాల రూపనిష్పత్తులను తెలుసుకుంటారు. ప్రాతిపదిక మీద ఏ ఏ ప్రత్యయాలు చేరి పరిపూర్ణ రూపాలు నిష్పన్నమవుతాయో సోపాన క్రమంలో తెలుసుకుంటారు.

**1. అర్చులు**

ప్రాతిపదిక అర్చి

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

అర్చి + లు

సూ॥ సంస్కృత సమంబులం దికారాంతములయిన శబ్దముల యుపధా చజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును (సంజ్ఞా–10)

అర్ + చ్ + ఇ + లు  > అర్ + చ్ + ఉ + లు = అర్చులు

**2. గోగులు**

ప్రాతిపదిక – గోను

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

గోను + లు

సూ॥ రేను గోను శబ్దంబుల నువర్ణంబుగుఙ్జగు (ఆచ్ఛిక)

గోగుఙ్ + లు

సూ॥ ఙిత్తు బిందుపూర్వంబగు (సమాస–19)

గోఁగులు/గోంగులు

సూ॥ దీర్ఘము మీఁది సాధ్యపూర్ణము లేదు (సంజ్ఞా–15)

గోఁగులు

**3. కలకంఠుడు**

ప్రాతిపదిక – కలకంఠ

సూ॥ స్త్రీ సమ ఘటితంబు యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు (సమాస–6)

కల + ము, కంఠ + ము

సూ॥ సమాస విభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు (సమాస–25)

కలకంఠ

సూ॥ పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వం బగు (సమాస–21)

కలకంఠు

సూ॥ పుంలింగమగు మహద్వాచకమునకు డుఙ్జగు (సమాస–22)

కలకంఠు + డుఙ్

సూ॥ ఙిత్తు బిందు పూర్వంబగు (సమాస–19)

కలకంఠుఁడు

**4. అమ్మయిచ్చెను**

అమ్మ + ఇచ్చెను

సూ॥ అత్తునకు సంధి బహుళముగానగు

దీని ప్రకారం సంధి జరిగి అమ్మిచ్చెను కావాలి. కాని 'బహుళ గ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధి లేదు' అని చెప్పటం చేత

సూ॥ సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు

అనే సూత్రం చేత యడాగమం వచ్చి

అమ్మ + య్ + ఇచ్చెను = అమ్మయిచ్చెను – అవుతుంది.

**5. మూరెఁడు, వీసెఁడు**

మూర + ఎఁడు = మూరెఁడు

వీసె + ఎఁడు = వీసెఁడు

సూ॥ అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు (సంధి–11)

**6. ఏలితిపుడు**

ఏలితివి + ఇపుడు

సూ॥ లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు

ఏలితి + ఇపుడు

సూ॥ మధ్యపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును

ఏలితిపుడు

**7. ఏమియేమి**

ఏమి + ఏమి

సూ॥ అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు (సంధి–10)

ఏమేమి

సంధి తఱుచుగ అనుటచే సంధి రానప్పుడు

ఏమి + ఏమి

సూ॥ సంధి లేనిచోట స్వరంబు కంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు (సంధి–3)

అనే సూత్రంచే యడాగమం వచ్చి

ఏమి + య్ + ఏమి = ఏమియేమి – అగును

**8. కుట్టుసురు**

కుఱు + ఉసురు

సూ॥ కుఱు–చిఱు–కడు–నడు–నిడు శబ్దముల అడలకచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు

కు + ఱ్ + ఉ + ఉసురు

కు + ట్ట్ + ఉ + ఉసురు = కుట్టు + ఉసురు

సూ॥ ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు

కుట్టుసురు

**9. వాడు కంసారి**

వాడు + కంసారి

సూ॥ ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు (సంధి–13)

వాడు + గంసారి, కావాలి కాని

సూ॥ తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు (సంధి–14)

అనే సూత్రం చేత 'వాడు కంసారి' అనే రూపమే సిద్ధిస్తుంది.

**10. రారుకదా**

రారు + కదా

రారు అనే శబ్దము వ్యతిరేక క్రియ, కళ.

సూ॥ ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు

అనే వ్యాకరణ కార్యము కళలైన క్రియా పదాలమీద కూడా బహుళముగా కనిపిస్తుంది.

అందుచేత 'రారుకదా, రారుగదా' అనే రెండు రూపాలు సిద్ధిస్తాయి.

**11. ఊరూరన్**

ఊరన్ + ఊరన్

సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు (సంధి-41)

అను సూత్రముచే ఊరు + ఊరన్

సూ॥ అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు (సంధి-10)

దీనిచే ఊరూరన్ - అగును.

**12. అప్పటప్పటికిన్**

అప్పటికిన్ + అప్పటికిన్

సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు (సంధి-41)

అప్పటి + అప్పటికిన్

సూ॥ అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు (సంధి-10)

దీనిచే అప్పటప్పటికిన్ - అగును

విభక్తిలోపింపనిచో అప్పటికిన్ + అప్పటికిన్

సూ॥ ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు (సంధి-5)

అప్పటికప్పటికిన్, అప్పటికినప్పటికిన్ - అగును.

**13. పూచెఁగలువలు**

పూచెను + కలువలు

సూ॥ ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు

పూచెను + గలువలు

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు

పూచెఁగలువలు

పూచెంగలువలు

పూచెన్గలువలు

బిందు సంశ్లేష రూపాలు విభాష కాబట్టి అవి రానపుడు ద్రుతమునకు స్వత్వరూపమే ఉంటుంది.

పూచెనుగలువలు

**14. నానాఁడు**

నాఁడు + నాఁడు

సూ॥ ఇంచుక, నాఁడిత్యాదులందు బహుళ గ్రహణముచే నంతిమాక్షరలోపంబునగు (సంధి-41)

ఈ సూత్రముచే 'డు' లోపించి

నాఁ + నాఁడు = నాఁనాడు అగును. పిదప

సూ॥ సంస్కృత సమేతరములయిన తెనుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది. (సంజ్ఞా-16) అనే సూత్రముచే

నానాదు – అవుతుంది.

**15. పొదరుటిల్లు**

పొదరు + ఇల్లు

సూ॥ కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు (సంధి–29)

దీనిచే పొదరు + ట్ + ఇల్లు = పొదరుటిల్లు అవుతుంది. విభాషగానని చెప్పటం చేత టుగాగమంరానప్పుడు 'ఉత్తునకచ్చుపరంబగునపుడు సంధియగు' – దీనిచే 'పొదరిల్లు' – అవుతుంది.

**16. కుట్టుసురు**

కుఱు + ఉసురు

సూ॥ కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అడల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త టకారంబగు (సంధి–12)

కుట్టు + ఉసురు

సూ॥ అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు (సంధి–11) దీనిచే "కుట్టుసురు" – అగును.

ఇట్లే 'చిట్టెలుక' (చిఱు + ఎలుక); 'కట్టెదురు' (కడు + ఎదురు); 'నట్టిల్లు' (నడు + ఇల్లు); 'నిట్టూరుపు' (నిడు + ఊరుపు) గ్రహించునది.

**17. తాఁజదివె**

తాను + చదివె

సూ॥ ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు

తాను + జదివె

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషములు విభాషనగు

తాఁజదివె

తాంజదివె

తాన్జదివె

సూ॥ తాను, నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు

ఈ సూత్రంచే 'తాన్జదివె' రూపం సిద్ధించదు

సూ॥ దీర్ఘము మీఁది సాధ్యపూర్ణము లేదు

ఈ సూత్రంచే 'తాంజదివె' అసాధువు

కాబట్టి 'తాఁజదివె' అనే రూపమే ఉంటుంది.

**18. క్రీఁగాలు**

క్రింది + కాలు

సూ॥ సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు (సంధి–36)

క్రి + కాలు

బహుళపద సామర్థ్యముచే దీర్ఘము వచ్చి క్రీ + కాలు – అగును

సూ॥ లుప్తశేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు (సంధి–37)

క్రీ + న్ + కాలు

సూ॥ ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు (సంధి–16)

దీనిచే క్రీ + న్ + గాలు

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు (సంధి–17)

క్రీ + ం + గాలు

సూ॥ దీర్ఘము మీఁద సాధ్య పూర్ణము లేదు (సంజ్ఞా–15)

దీనిచే క్రీఁగాలు – అగును.

ఇట్లే క్రీఁగడుపు (క్రిందు + కడుపు), క్రీఁదోడ (క్రిందు + తోడ) గ్రహించునది.

**19. తలంబ్రాలు**

తలను + ప్రాలు

సూ॥ సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు

ఈ సూత్రం చేత ద్రుతానికి లోపం రావాలి. కాని

సూ॥ తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు

తలను + ప్రాలు

సూ॥ ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు

తలను + బ్రాలు

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషములు విభాషనగు

తలఁబ్రాలు

తలంబ్రాలు

తలన్బ్రాలు

అనే రూపాలు సిద్ధిస్తాయి. అయితే

'వ్యవస్థిత విభాషచే ద్రుతంబునకు సంశ్లేషం లేదు' అనే దాని ప్రకారం 'తలన్బ్రాలు' అనే రూపం లేదు.

**20. ఇంచించుక**

ఇంచుక + ఇంచుక

సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు (సంధి–41)

సూ॥ ఇంచుక, నాడిత్యాదులందు బహుళ గ్రహణముచేత నంతిమాక్షర లోపంబగు. దీనిచే

ఇంచు + ఇంచుక

సూ॥ ఉత్తునకచ్చుపరంబగునపుడు సంధియగు (సంధి–1)

ఇంచించుక – అగును.

**21. తల్లిదండ్రులు**

తల్లి + తండ్రి

సూ॥ సమాస విభక్తికి లోపంబగు, లట్టునకు కాదు (సమాస–25)

తల్లి + తండ్రి

సూ॥ ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు (సంధి–15)

తల్లి + దండ్రి

సూ॥ లువర్ణంబు బహుచనంబు (తత్సమ–12)

తల్లి + దండ్రి + లు

సూ॥ ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు (తత్సమ–45)

దీనిచే తల్లిదండ్రులు – అగును

**22. దివంబునుంబోలె**

దివంబును + పోలె

సూ॥ ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు (సంధి–16)

దివంబును + పోలె

సూ॥ కొన్ని యెడల ద్రుతంబు మీద నకారంబు గానంబడియెడి (సంధి–18)

దివంబును + న్ + బోలె

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు (సంధి–17)

దీనిచే దివంబునుంబోలె

**23. గుణవంతురాలు, ధీరురాలు**

ప్రాతిపదిక – గుణవంతమ్

సూ॥ మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామంబగు (తత్సమ–70)

గుణవంత + ఆలు

సూ॥ కర్మధారయంబునం దత్సమంబుల కాలు శబ్దము పరంబగునపు దత్వంబున కుత్వంబును రుగాగమంబునగు (సంధి–31)

దీనిచే గుణవంతురాలు – అగును.

**24. నమ్మకిట**

ప్రాతిపదిక – నమ్ము. దీని వ్యతిరేక రూపం – నమ్మకుము

నమ్మకుము + ఇట

సూ॥ వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు (సంధి–48)

నమ్మకు + ఇట = నమ్మకిట

విభాష కాబట్టి

నమ్మకుము + ఇట = నమ్మకుమిట

**24. రాజునాజ్ఞ**

రాజుయొక్క + ఆజ్ఞ

సూ॥ సమాసవిభక్తికి లోపంబగు లట్టునకు కాదు (సమాస–25)

రాజు + ఆజ్ఞ

సూ॥ షష్ఠీసమాసంబునందుకార ఋకారములకచ్చు పరమగునపుడు నుగాగమంబగు (సంధి–31)

రాజు + ను + ఆజ్ఞ

అచ్చు పరమైనపుడు ద్రుతస్వరానికి లోపం వస్తుంది.

రాజు + న్ + ఆజ్ఞ

సూ॥ ఇఁకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు (సంధి–9)

దీని ప్రకారం 'రాజునాజ్ఞ' అవుతుంది.

**24. ఇయంధేనువనె**

ఇయంధేనుః + అనె

సూ॥ విసర్గంబున కనుకరణంబున లోపంబగు (సంధి–50)

ఇయంధేను + అనె

సూ॥ ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు (సంధి–54)

ఇయంధేను + వ్ + అనె = ఇయంధేనువనె

**25. తుభ్యంనమోయనె**

తుభ్యంనమః + అనె

సూ॥ విసర్గంబున కనుకరణంబున లోపంబగు (సంధి–50)

తుభ్యంనమ + అనె

సూ॥ అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాషనగు (సంధి–51)

తుభ్యంనమ్ + అ + అనె > తుభ్యంనమ్ + ఒ + అనె = తుభ్యంనమో + అనె

సూ॥ సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు (సంధి–3)

తుభ్యంనమోయనె/ తుభ్యంనమయనె

**25. కెందామర**

కెంపు + తామర

సూ॥ సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు (సంధి–36)

కె + తామర

సూ॥ లుప్తశేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు (సంధి–37)

కె + ను + తామర

సూ॥ ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు (సంధి–16)

కెను + దామర

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషములు విభాషనగు (సంధి–17)

కెఁదామర

కెందామర

కెన్దామర

సూ॥ అఁట ఇఁక చుఁడు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు

ఈ సూత్రం చేత 'కెఁదామర' అనే రూపం సిద్ధించదు.

'ప్రాతాదులలోని వ్యవస్థిత విభాషచే ఈ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' అనే దాని ప్రకారం 'కెన్దామర' అనే పదం సిద్ధించదు.

సూ॥ సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు

అనే సూత్రం ప్రకారం 'కెనుదామర' అనే స్వత్వ రూపం ఉండదు.

'కెందామర' అనే పదమే ఉంటుంది.

**25. క్రొత్తావి**

క్రొత్త + తావి

సూ॥ క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు (సంధి–38)

క్రొ + తావి (ఆద్యక్షర శేషం)

క్రొ + త్తావి (మీది హల్లునకు ద్విత్వం)

క్రొత్తావి

**25. పందొమ్మిది**

పది + తొమ్మిది

సూ॥ సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు (సంధి–36)

ప +తొమ్మిది

సూ॥ లుప్తశేషంబులకు పరుషంబులు పరంబగునపుడు నుగాగమంబగు (సంధి–37)

ప + ను + తొమ్మిది

సూ॥ ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు

ప + ను + దొమ్మిది

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషములు విభాషనగు

పఁదొమ్మిది

పందొమ్మిది

పన్దొమ్మిది

సూ॥ సమాసంబులం ద్రుతంబునకు స్వత్వంబులేదు.

దీనిచే 'పన్దొమ్మిది' రూపం కలుగదు.

సూ॥ అఁట ఇఁక చుఁడు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. (సంధి–22)

దీనిచే 'పఁదొమ్మిది' అనే రూపం ఉండదు. కాబట్టి 'పందొమ్మిది' అనే రూపమే ఉంటుంది.

**25. తుట్టతుద**

తుద +తుద

సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు

తు + ట్ట్ + అ + తుద

తుట్టతుద

**26. ఎట్టఎదురు**

ఎదురు + ఎదురు

సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు (సంధి–40)

ఎ + ట్ట్ + అ + ఎదురు

ఎట్ట + ఎదురు

సూ॥ సంధిలేనిచోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు (సంధి–3)

ఎట్ట + య్ + ఎదురు = ఎట్టయెదురు

**27. గజము పడియె**

గజము + పడియె

సూ॥ పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందులు విభాషనగు (సంధి–46)

ఈ సూత్రం చేత

గజ పడియె

గజంపడియె

గజముపడియె

వంటి రూపాలు సిద్ధిస్తాయి. కాని ఈ పద్వాదులకు సంబంధించిన వ్యాకరణ కార్యం 'కర్తృవాచియైన మువర్ణకమునకు కలుగదు' అనుటం చేత

'గజము' అనే పదం కర్తగా ఉండటం చేత గజము పడియె అనే రూపమే ఉంటుంది కాని మిగిలిన రూపాలు ఉండవు.

**25. వృక్షంబులు**

ప్రాతిపదిక – 'వృక్ష'

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

వృక్ష + లు

సూ॥ వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు (తత్సమ–40)

దీనిచే వృక్ష + ము + లు

సూ॥ మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు. (తత్సమ–42)

దీనిచే 'వృక్షంబులు' – అగును.

**26. గృహస్థు**

ప్రాతిపదిక 'గృహస్థ'

సూ॥ పుంలింగబంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు (తత్సమ–21) దీనిచే గృహస్థు

సూ॥ పుంలింగమగు మహద్వాచకమునకు డుఙ్గు (తత్సమ–22)

దీనిచే 'గృహస్థుడు' – అగును.

సూ॥ వృద్ధాదుల డుఙ్నకు లోపము విభాషనగు (తత్సమ–56)

దీనిచే 'గృహస్థు' – అగును.

**27. పందిరులు**

పందిరి + లు

సూ॥ ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు (తత్సమ–45)

పందిరులు – అగును. కాని

సూ॥ వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు దుత్వంబగు (తత్సమ–46)

పందురులు కావలెను. కాని

సూ॥ రలడోఫద నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు (తత్సమ–47)

దీనిచే 'పందిరులు' – అగును.

**28. సవితృనకును**

సవితృ + కు

సూ॥ తృతీయాదులకు నుగాగమంబగు (తత్సమ–8)

సవితృ + కు + ను

సూ॥ కువర్ణకంబు పరంబగునపుడుకారబుకారంబులకు నగాగమంబగు

దీనిచే 'న' – వర్ణకము చేరి

'సవితృనకును' – అగును

**29. నిగ్గుటద్దము**

నిగ్గు + అద్దము

సూ॥ కర్మధారయంబులందుత్తనకచ్చు పరంబగునపుడు టుగాగమంబగు (సంధి–28)

నిగ్గుటద్దము – అగును.

**30. అల్లురు**

ప్రాతిపదిక 'అల్ల'

సూ॥ పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు (తత్సమ–21)

దీనిచే 'అల్లు'

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

దీనిచే అల్లు + లు = ల్ + ఉ.

సూ॥ పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు (ఆచ్ఛిక–5)

దీనిచే అల్లుర్ + ఉ = అల్లురు – అగును

**31. తేండ్లు**

ప్రాతిపదిక 'తే'

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

తే + లు

సూ॥ తే ప్రభృతుల బహువచనమునకు ముందు డుజ్జగు (ఆచ్ఛిక–8)

తే + డుజ్ + లు

సూ॥ జిత్తు బిందు పూర్వకంబగు (తత్సమ–19)

తేఁడు + లు

సూ॥ బహువచనము పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు (ఆచ్ఛిక–12)

తేఁడ్లు

సూ॥ సమాస పదంబునందు సంయోగంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు (ఆచ్ఛిక–15)

దీనిచే తేండ్లు' – అగును.

**32. కొడవళ్లు**

కొడవలి

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

కొడవలి + లు

సూ॥ ఔప విభక్తికంబుల లివర్ణ సలలు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగానగు (ఆచ్ఛిక–16)

కొడవండులు

సూ॥ బహువచనము పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు (ఆచ్ఛిక–12)

కొడవండ్లు

బహుళ గ్రహణముచే 'ండు' – రానపుడు

కొడవలి + లు

సూ॥ ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు (తత్సమ–45)

కొడవలు + లు

సూ॥ బహువచనము పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు (ఆచ్ఛిక–12)

దీనిచే కొడవల్ + లు

సూ॥ బహువచనము పరమగునపుడసంయుక్తంబులయి యుదంతంబులయిన డలరల కలఘుల కారంబు బహుళంబుగానగు

దీనిచే కొడవళ్లు = కొడవళ్లు

సూ॥ బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు (ఆచ్ఛిక–14)

దీనిచే కొడవళ్లు – అగును

**22. వ్రాలు –వేలు – రేలు**

ప్రాతిపదిక వ్రాయి – వేయి – రేయి

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

వ్రాయి + లు ; వేయి + లు; రేయి + లు

సూ॥ బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు (ఆచ్ఛిక–21)

దీనిచే వ్రాలు; వేలు; రేలు – అగును

**23. తీవలు**

ప్రాతిపదిక 'తీగ'

సూ॥ లువర్ణంబు బహువచనంబు (తత్సమ–12)

తీగ + లు

సూ॥ అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు (ఆచ్ఛిక–27)

దీనిచే తీవలు – అగును

**24. కూఁతురు**

ప్రాతిపదిక 'కూఁతు'

సూ॥ ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు (తత్సమ–48)

కూతు + వు

సూ॥ కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు (ఆచ్ఛిక–9)

కూఁతురు

**25. ధన్యుడవు**

ప్రాతిపదిక 'ధన్య'

సూ॥ పులింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వంబగు (తత్సమ–21)

ధన్యు

సూ॥ పుంలింగంబగు మహద్వాచకంబునకు డుజ్ఞగు (తత్సమ–22)

ధన్యు + డుజ్

సూ॥ జిత్తు బిందు పూర్వకంబగు (తత్సమ –19)

ధన్యుఁడు

సూ॥ ప్రథమాంతంబులగు యుష్మదస్మ ద్విశేషణంబులకే కత్వంబున వు-నులును, బహుత్వంబున దు-ములు నంతాగమంబులు ప్రాయికంబుగనగు.

సూ॥ ధన్యుడు + వు

సూ॥ ఈ యాగమంబులు పరంబులగునపుడుత్వంబునకత్వంబగు

దీనిచే ధన్యుడవు – అగును

**మాదిరి ప్రశ్నలు**

1) ఈ క్రింది వానిలో నాల్గింటికి రూపనిష్పత్తులను వివరించండి.

1) క్రీఁగాలు

2) తల్లిదండ్రులు

3) రాజునాజ్ఞ

4) పందిరులు

5) కొడవళ్లు

6) కెందామర

7) పొదరుటిల్లు

8) కఱకంఠుఁడు

# యూనిట్-6

# 6. సందర్భ సహిత వ్యాఖ్యలు

వ్యాకరణంలో సూత్రం తరువాత వృత్తి లేదా వార్తికము ఆ పిదప ఉదాహరణలు ఉంటాయి. సూత్రం ప్రధానాంశాల్ని బోధిస్తుంది. సూత్రంలో చెప్పటానికి వీలుపడక మిగిలిన అంశాలను వివరించేది వార్తికము. విషయాన్ని చెప్పటంలో ప్రామాణికత్వంలో వార్తికాలు కూడా సూత్రాలతో సమానమైనవే. కాని ఇవి సూత్రంలోని విషయాలను సవరించటానికో, వివరించటానికో వాక్యరూపంలో రచింపబడటంవల్ల వీటికి సూత్రంలో ఉన్నంత విలువ ఉండదు. అందువలననే పాణినీయ వ్యాకరణానికి వార్తికాన్ని రచించిన వరరుచికి వార్తికాకారుడన్న పేరే మిగిలింది.

"వర్తయంతి కార్యవిశేషాన్ ఇతి వార్తికాని" అంటే సూత్రాలలో వదిలివేయబడిన కార్యవిశేషాలను ప్రవర్తింపజేసేవని దీనికి అర్థం. అటువంటి వార్తిక వాక్యాలలో కొన్నింటిని సందర్భసహితంగా వ్యాఖ్యానించటం ఈ యూనిట్‌లో తెలుసుకుంటారు.

**1. "కొందఱ మతంబున హ్రస్వ వక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "ప్రాకృత వర్ణమాలను వివరిస్తూ 'ప్రాకృతమునకు వర్ణములు నలువది" (సంజ్ఞ-2) అనే సూత్ర వృత్తిలో ఈ వాక్యాన్ని పేర్కొన్నాడు.

**వివరణ:** ప్రాకృతంలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఏ, ఓ, అం, అః

క, ఖ, గ, ఘ
చ, ఛ, జ, ఝ
ట, ఠ, డ, ఢ, ణ
త, థ, ద, ధ, న
ప, ఫ, బ, భ, మ
య, ర, ల, వ,
స, హ, ళ అనే వర్ణాలున్నాయి.

అయితే ప్రాకృత వర్ణ నిర్ణయం పట్ల వ్యాకర్తల్లో ఏకాభిప్రాయం లేదు. కొందరు వ్యాకర్తలు హ్రస్వ వక్రాలైన ఎ, ఒ లు కూడ ప్రాకృతంలో ఉన్నాయన్నారు. అప్పుడు ప్రాకృతానికి వర్ణాలు '42' అవుతాయి. ఇంకొందరు వక్రతమాలైన ఐ, ఔ లు కూడ ఉన్నాయన్నారు. అప్పుడు వర్ణ సంఖ్య '44' అవుతుంది.

**2. "కొందఱ మతంబున వక్రతమంబులుంగలవు"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "ప్రాకృత వర్ణమాలను వివరిస్తూ 'ప్రాకృతమునకు వర్ణములు నలువది" (సంజ్ఞ-2) అనే సూత్ర వృత్తిలో ఈ వాక్యాన్ని పేర్కొన్నాడు.

**వివరణ:** ప్రాకృతంలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఏ, ఓ, అం, అః

క, ఖ, గ, ఘ
చ, ఛ, జ, ఝ
ట, ఠ, డ, ఢ, ణ
త, థ, ద, ధ, న
ప, ఫ, బ, భ, మ
య, ర, ల, వ,
స, హ, ళ అనే వర్ణాలున్నాయి.

అయితే ప్రాకృత వర్ణ నిర్ణయం పట్ల వ్యాకర్తల్లో ఏకాభిప్రాయం లేదు. కొందరు వ్యాకర్తలు హ్రస్వ వక్రాలైన ఎ, ఒ లు కూడ ప్రాకృతంలో ఉన్నాయన్నారు. అప్పుడు ప్రాకృతానికి వర్ణాలు '42' అవుతాయి. ఇంకొందరు వక్రతమాలైన ఐ, ఔ లు కూడ ఉన్నాయన్నారు. అప్పుడు వర్ణ సంఖ్య '44' అవుతుంది.

**3. 'ఐదంతములయిన చజలు సమేతర శబ్దములందులేవు"**

**పరిచయం: పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "దంత్యతాలవ్య చజల్ని వివరిస్తూ 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ' లంగూడిన చ, జ లు దంత్యంబులు" (సంజ్ఞ-9) అనే సూత్రవృత్తిలో ఈ వాక్యాన్ని వ్రాశాడు.

**వివరణ:** తాలవ్యేతరములైన 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఔ' - లతో కూడుకున్న చ, జ లు దంత్యాలుగా తెలుగులో ఉచ్చరింపబడతాయి. ఇది తెలుగు భాషలోని ప్రత్యేక లక్షణం.

ఐ కారం కూడ తాలవ్యమే. కాని ఐత్ అంతమందున్న చ, జ లు అంటే 'ఐ' చివరగల 'చ, జ' లు అచ్చ తెనుగు శబ్దాల్లో లేవు. కాబట్టి దీనిని తాలవ్యాచ్చులలో చేర్చలేదు. చెయువులు > చెయ్యులు అనే వాటిని 'చైవులు' అని వ్రాయటం పొరపాటు.

(ఐదంతము - ఐత్ + అంతము, 'ఐత్' - ఇందులోని తకారం ఉచ్చారణార్థం ఐత్ అంతము అంటే ఐ అంతమందుగల అని అర్థం)

**4. "మఱియు రాజు శబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** సంస్కృత సమ శబ్దాల్లో తాలవ్య చజలే గాని దంత్య చ,జలు లేవనే సామాన్య లక్షణానికి అపవాదాలు చెప్తూ "సంస్కృత సమంబులందికారాంతములయిన శబ్దముల యుపధా చ,జలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును" (సంజ్ఞ-10) - అని సూత్రించి ఆ సూత్ర వృత్తిలో పై వాక్యాన్ని పేర్కొన్నాడు.

**వివరణ:** సంస్కృతసమాలలో 'చ, జ'లు ఉపధగా ఉన్న ఇకారాంత శబ్దాలకు బహువచనం పరమైనప్పుడు ఇకారం ఉకారమై, ఆ ఉపధా 'చ,జ'లు దంత్యాలవుతాయి. (ఉపధ అంటే తుదివర్ణానికి ముందరి వర్ణం. ఉదా॥ 'అర్చ్ఇ' - ఇందులో 'చ్' ఉపధ)

అగ్ని, రోచి, వాజి, రాజి వంటి శబ్దాల బహువచన రూపాల్లో తాలవ్యచజలు దంత్య చ,జలు గా మారుతాయని అర్థం. అర్చి: అర్చ్ఇ + లు = అర్చ్ఉ + లు = అర్చులు, అలాగే రోచులు, వాజులు, రాజులు.

ఇక సంస్కృత సమ శబ్దాలలో రాజు శబ్దం ఒక్క దానిలోనే దంత్యజకారం కనిపిస్తుంది. ఇది సంస్కృత సమమైనా దంత్యోచ్చారణాన్ని కలిగి ఉందని పేర్కొన్నాడు. ఇలా వ్యస్తంగానే గాక సమస్త పదాలలో కూడా 'ఖగరాజు, మృగరాజు' వంటి వాటిలో కూడ దంత్యోచ్చారణమే శ్రుతమౌతున్నది. అందుకే సూరి దీనిని ప్రత్యేకంగా హెచ్చరించాడు.

**5. "సంస్కృత సమంబులందు సైతము వువూవొవో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** ఆచ్ఛిక పదాలకు మొదట యకారమూ, వు,వూ,వొ,వో అనే అక్షరాలు ఉండవు. యకారం అవడంచేత ఏ అచ్చుతో కూడిన యకారమూ కూడా పదాదిన ఉండదని చెప్తూ "యకారంబునూ, వు,వూ,వొ,వో లును తెలుగు మాటలకు మొదటలేవు" (సంజ్ఞ-17) - అనే సూత్ర వృత్తిలో వోఢృ, వోఢవ్య అనే శబ్దాలు తప్ప సంస్కృత సమంబులందు సైతము వు,వూ,వొ వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది" అని వ్రాశాడు.

**వివరణ:** ఎవడు, ఏమి, ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ వంటి పదాల్ని యెవడు, యేమి, వుండ, వూరు, వొకడు, వోడ అనే విధంగా పదాది యకార వకారాలతో పలకడం ప్రాచీన కాలం నుంచే వ్యావహారిక భాషలో వస్తున్న ఉచ్చారణ సంప్రదాయం. కావ్యభాషలో మాత్రం ఇలాంటి పదాలను అజాదులుగానే పరిగణించాలి. హరియతడు, నిద్రవోయె అన్నప్పుడు యకార వకారాలు సంధిలో యడాగమ, గసడదవాదేశ సంధి కార్యాలవలన కలిగినది, కాని ఆ శబ్దాలలో సహజంగా ఉన్నవి కావు.

సంస్కృత సమశబ్దాలలో పదాదిన యకారం ఉంటుంది. ఉదా॥ యతి, యాత్ర, వు,వూ లు ఉండవు. ఉదకము, ఊర్మిక, అనే పదాలను తెలుగువారు వుదకము, వూర్మిక అని ఉచ్చరిస్తారు. కాని ఇవి అజాదులని గుర్తుపెట్టుకోవాలి. హ్రస్వ 'ఒ' కారం సంస్కృతంలో లేదు. కనుక 'వొ' అనే అక్షరం తత్సమ పదాదిని ఉండదు. 'వో' తో ప్రారంభించేవి వోఢృ, వోఢవ్య రెండే శబ్దాలు ఉన్నాయి.

**6. "శకట రేఫము తత్సమ తద్భవములందు లేవు"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** లఘువు, అలఘువు అయిన యరలవలను వివరించే సందర్భంలోనివి. "యరలవలు లఘువులని, యలఘువులని ద్వివిధంబు" (సంజ్ఞ–18) – అనే సూత్ర వృత్తిలోనిది ఈ వాక్యం.

**వివరణం:** 'యలవ'ల వలెనే రేఫ కూడ రెండు విధాలుగా అంటే లఘువుగా, అలఘువుగా ఉచ్చరింపబడుతుంది. పెరుగు, కరుగు వంటి వాటిలోని సాధురేఫ లఘువు. 'ఏఱుగు', 'మెఱుగు' వంటి వాటిలోని శకటరేఫ అలఘువు.

ఈ శకటరేఫం తత్సమ తద్భవాలలో ఉండదని సూరి పేర్కొన్నాడు.

'సంస్కృత సమాలు తద్భవాలయ్యేటప్పుడు కొన్ని చోట్ల రేఫ, శకటరేఫ అవుతుందని' మొదట అహోబలపతి పేర్కొన్నాడు. ఈ అభిప్రాయాన్ని సూరి ఖండించాడు. తొలుత అప్పకవి "క్రియా పదాల తుదలను, సంస్కృత పదాలందును, తద్భవాలందును అకారాలు లేవన్నాడు. ఈ అభిప్రాయాన్నే కూచిమంచి తిమ్మకవి, దిట్టకవి వేంకటార్యుడు, ఆడిదము సూరకవి ఆమోదించారు.

శకట రేఫ, రేఫ కావటం ఉచ్చారణలో కలిగిన మార్దవం. రేఫ శకటరేఫ అవటం ధ్వని పరిణామ సూత్రానికి విరుద్ధం. కొందఱు యతి ప్రాస నిర్బంధం భరింపలేక రేఫలు శకటరేఫలుగా వ్రాసినంత మాత్రాన ఉచ్చారణ వెనుదిరగదు గదా! ఇలాంటి పరిణామ రీతికి విరుద్ధంగా అహోబలపతి చేసిన ప్రతిపాదననే ప్రౌఢ వ్యాకర్త సమర్థించి కొన్ని ఉదాహరణలిచ్చాడు. అందులో కొన్ని దేశ్యాలు. ఆ ప్రతిపాదనం నిలువదు.

**7. "వర్ణసమామ్నాయ మందలి ళకారము వర్ణాంతరముగాని యలఘుళకారముగాదని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** లఘువు, అలఘువుగా ఉచ్చరింపబడే లకారాన్ని వివరిస్తూ వర్ణసమామ్నాయంలోని ళకారాన్ని గూర్చి చెప్పే సందర్భంలోనిది.

**వివరణ:** **లకారం.. లఘువు**

ఉదా॥ తల, నెల, వల

అలఘువు – బహువచనంలో ర, ల, డలకు ఆదేశంగా వచ్చిన ళకారం అలఘువు

ఉదా॥ ఏఱు + లు = ఏళులు

నీరు + లు = నీళులు

పాలు + లు = పాళులు

త్రాడు + లు = త్రాళులు

ల,ళ లు వెలుగులో అర్థభేదాన్ని కలిగించే భిన్నవర్ణాలు. ఉదా॥ కల, కళ. శబ్దసిద్ధమైన లకారం లఘులకారమనీ, ర, ల, డ ల కాదేశమైన ళకారం అలఘు లకారమనీ సూరి ప్రతిపాదించాడు. ఇలా ప్రతిపాదించటంలో ఒక చిక్కుంది. రలడలకు ఆదేశంగా వచ్చే అలఘులకారం, శబ్దసిద్ధమైన ళకారం, ఈ రెండూ వేర్వేరు ధ్వనులని చెప్పవలసివస్తుంది. అందుకని మూర్ధన్యాక్షరాలయిన ర,డ లతో కూడిన బహువచన లకారం మూర్ధన్య ళకారమే అవుతుంది. బహువచన 'లు' ప్రత్యయం పూర్వరూపం 'ళు' – కనుక సంధిలో (కాలు + లు = కాళ్ళు) మూర్ధన్య ధ్వని కలగడానికి కారణముంది. వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని, యలఘుళకారము గాదని యెఱుంగునది అని చెప్పాడు.

**8. 'ఈ భాష ప్రయోగంబున కనర్హంబు"**

**పరిచయం:** ఈ వాక్యము చిన్నయసూరి బాలవ్యాకరణంలోని సంజ్ఞా పరిచ్ఛేదం నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** గ్రామ్యాన్ని గూర్చి చెప్పే సందర్భంలో "లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు" (సంజ్ఞ-22) – అనే సూత్రంలో, ఆ సూత్ర వృత్తిలో పేర్కొన్న వాక్యమిది.

**వివరణ:** చిన్నయసూరి దృష్టిలో శిష్టులు వ్యవహరించే భాష అయినా వ్యాకరణ నియమానికి విరుద్ధంగా ఉంటే అది గ్రామ్యమే అవుతుంది. గ్రామ్యం లౌకిక వ్యవహారానికేగాని, కావ్యాలలో ప్రయోగించటానికి అర్హమైంది కాదు.

కాని ప్రౌఢ వ్యాకర్త ఆయా జాతుల వర్ణనలో పాత్రోచితంగా గ్రామ్యాన్ని వాడవచ్చని అలా కవులు వాడారని పేర్కొన్నాడు.

**9. "బహుళ గ్రహణముచే స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** అత్వ సంధిని గూర్చి చెప్తూ 'అత్తునకు సంధి బహుళముగానగు' (సంధి-4) అనే సూత్ర వృత్తిలోనిది ఈ వాక్యం.

**వివరణ:** సూత్రంలో 'బహుళమని చెప్పటం వలన స్త్రీని బోధించే శబ్దాలకు, సంస్కృత సమాలకు, సంబోధనాంతాలకు ఈ అత్వసంధిని చేయరాదు.

ఉదా॥ స్త్రీవాచక శబ్దానికి : అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను

తత్సమ శబ్దానికి : దూత + ఇతడు = దూతయితడు

సంబోధనాంత శబ్దానికి : చెలువుడ + ఇందము = చెలువుడయిందము

పై వానియందు సంధిలేదు.

అమ్మ + ఇచ్చెను = 'అమ్మిచ్చెను' – అని సంధిచేస్తే దానిని; అమ్ము + ఇచ్చెను; అమ్మి + ఇచ్చెను; అమ్మ + ఇచ్చెను అని విడదీయవచ్చు. ఇలా వైవిధ్యానికి అవకాశం లేకుండా సంధి నిషేధింపబడింది. సంస్కృత సమశబ్దాల స్వరూపాన్ని యథాతథంగా పోషించటానికి తత్సమాలకు కూడ సంధి నిషేధింపబడింది.

ఉదా॥ దూత + ఇతడు = దూతయితడు

సంబోధనతో అంతమయ్యే పదాలకు ఈ సంధి వర్తింపదు

ఉదా॥ చెలువుడ + ఇందము = చెలువుడయిందము

**10. "దానికి పూర్వ కావ్యంబులందు బ్రయోగంబు మృగ్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే.

**వివరణ:** అత్వ సంధి స్త్రీ వాచకాలకు తత్సమాలకు నిషేధింపబడింది. కాని సంస్కృత సమ శబ్దాలకు సంధి జరుగుతుందని అధర్వణాచార్యులు చెప్పారు. ఆ కారిక ఇది. "కుత్రచిత్ సంస్కృతీయోఽ పి ప్రాణోప్యత్ర చ్యుతోభవేత్" కాని దానికి భారతాది ప్రాచీన కావ్యాలలో ప్రయోగాలు కనబడవు. ఆముక్తమాల్యద మొదలయిన అర్వాచీన కావ్యాలలో మాత్రం అరుదుగా స్త్రీవాచక శబ్దాలకు తత్సమ శబ్దాలకు సంధి కనబడుతుంది.

ఉదా॥ గంగనుకాసె (గంగ + అనుకాసె =గంగనుకాసె)

నెలతిచ్చెను (నెలత + ఇచ్చను = నెలతిచ్చెను)

పై వానిలో నెలత స్త్రీవాచకం. 'గంగ' తత్సమం.

పూర్వకావ్యాలంటే అథర్వణునకు పూర్వపు కావ్యాలైన భారతాదులని అర్థం.

**11. "ఆధునిక కృతులందొకానొక చోట స్త్రీ వాచక తత్సమంబులకు సంధి గానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** రెండవ సందర్భ వ్యాఖ్యను చూడండి

**వివరణ:** రెండవ సందర్భ వ్యాఖ్యను చూడండి.

**12. "వెలయాల్వాదుల సంధిలేమి బహుళకము చేతనే యని యూహించునది."**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** అత్వ సంధిని వివరించే సందర్భమే.

**వివరణ:** అత్వ సంధి బహుళం. బహుళం అంటే నాల్గు విధాలు. అందులోని అప్రవృత్తికి ఉదాహరణమీ 'వెలయాలు' – శబ్దం. అప్రవృత్తి అంటే వ్యాకరణ కార్యం అసలు ప్రవర్తిల్లకుండటం

వెల + ఆలు = వెలయాలు.

వెలాలు అని రూపముండదు. వెలయాలని యడాగమం చేయాలి. ఇలా చేయటానికి కారణం అత్వ సంధి బహుళంగా ప్రవర్తిల్లటమే.

**13. "ప్రథమేతర విభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** 'ఇకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు' (సంధి–9) – అనే సూత్రవృత్తి లోనిదీ వాక్యము.

**వివరణ:** 'ఇఁకన్', 'ఇఁగన్', 'ఎట్టకేలకున్', 'ఎట్టకేనికిన్' – అనే ద్రుతప్రకృతికాలైన శబ్దాలు ఇకాదులు. ఈ శబ్దాలకు మాత్రం అచ్చుపరమైతే సంధి వికల్పంగా వస్తుంది. సంధి జరిగే పక్షంలో ద్రుతం లోపిస్తుంది. 'ఇఁకన్ మొదలైన నాల్గు శబ్దాలు తప్ప ఇతర ద్రుతప్రకృతికాలకు అచ్చు పరమయితే సంధిరాదు.

ద్రుతమైన 'న్'కారం పరమందున్న అచ్చుతో కలసిపోతుంది.

'ఇకాదులకు దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు' అనే సూత్రం ప్రకారం ప్రథమేతర విభక్తి శత్రర్థచువర్ణాలకు సంధి చేయకూడదని తేలుతుంది. అంటే అప్పుడు 'ప్రథమేతర విభక్తి, శత్రర్థచువర్ణంబులందు యుకారమునకు సంధి వైకల్పికముగానగు' – అనే సూత్రం ప్రవర్తించటానికి అవకాశం లేనిదై నిరవకాశం అయిపోతుంది. అలా కావటానికి సూత్రం వ్యాకర్త వ్రాయడుగదా!

అందుచేత ప్రథమేతర విభక్తి విధి దీనిపై బాధించి ప్రవర్తిస్తుందని వాక్యార్థం.

1. ఇఁకాదులు
2. ప్రథమేతర విభక్తులు
3. శత్రర్థ చువర్ణకము
4. అనంతర్యార్థకము
5. కిషష్ఠి

– వీటికి సంధి వైకల్పికము. ఇవి నిరవకాశాలు. ద్రుతప్రకృతికాలకు సంధి లేదు (సావకాశవిధి)

'నివరకాశాహివిధయః సావకాశాన్ విధీన్ బాధన్తే' – అనే పాణినీయ పరిభాష సూరి వ్యాకరణంలో ఇలా ప్రవేశించింది.

**14. "తఱచుగాననుటచేత నొకానొక చోట వైకల్పిక సంధియుం గలదని తాత్పర్యము"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** 'అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగానగు' (సంధి–10) – అనే సూత్రవృత్తిలోనిది ఈ వాక్యం.

**వివరణ:** అచ్చుకు ఆమ్రేడితం పరమైనపుడు సంధి తరచుగా వస్తుంది.

'తఱచుగా' – అని సూత్రంలో చెప్పటం వల్ల కొన్ని చోట్ల ఈ సంధి వైకల్పికమని మరి కొన్నిచోట్ల సంధి జరుగకనూ పోవచ్చునని సూచిస్తుంది.

ఉదా॥ ఏమి + ఏమి = ఏమేమి, ఏమియేమి (వైకల్పికం)

ఏగి + ఏగి = ఏగియేగి (క్త్వార్థకేకారం, సంధిరాని రూపం)

ఏమ్యాదులలోని వికల్ప రూపాల కోసం, క్త్వార్థకేకార సంధిని నిషేధించటం కోసం సూరి 'తఱచుగా' అని సూత్రంలో పేర్కొన్నాడు.

**15. "ఏగియేగి" యనుచో క్త్వార్థంబగుట సంధిలేదు".**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భ వివరణలే వ్రాయండి.

**వివరణ:** పై సందర్భ వివరణలే వ్రాయండి.

**16. "అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథా సంభవముగా గ్రహించునది"**

**సందర్భం:** 'అంద్వవగాగమంబులందప్ప, నపదాది స్వరంబు పరంబగునపుడచ్చునకు సంధియగు" (సంధి–11) అనే సూత్ర వృత్తిలోనిది పై వాక్యం.

**వివరణ:** అచ్చుకు అపదాది స్వరం పరమైనప్పుడు సంధి నిత్యంగా వస్తుంది. అయితే 'అందు' – అనే ప్రత్యయం, 'అవ' – అనే ఆగమం పరమైనప్పుడు మాత్రం సంధి రావచ్చు. రాకపోవచ్చు. యథాసంభవంగా గ్రహించాలి.

ఉదా॥ అందు: రాములందు, రాములయందు, హరియందు

అవ: ఎనిమిదవది, ఎనిమిదవయది.

**17. "అప్పుడిప్పుడెప్పుడను శబ్దములు నిత్యైక వచనాంతములు. వాగనుశాసనులు యదాతదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుంగునది.**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "ప్రథమ మీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు" (సంధి–13) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ప్రథమా విభక్త్యంత శబ్దాలమీది 'క,చ,ట,త,ప' లకు వరుసగా 'గ,స,డ,ద,వ'లు బహుళంగా ఆదేశం అవుతాయి.

ప్రథమా విభక్తి శబ్దాలన్నీ కళలు

వాడు + కొట్టె = వాడుగొట్టె

వాడుకొట్టె

అపుడు + చనియె = అపుడు సనియె

అపుడు చనియె

అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అనే శబ్దాలు నిత్యైక వచనాంతాలు అంటే వీటిని ప్రథమా విభక్త్యంతాలతో సమానంగా గ్రహించాలి. ప్రథమాలు అయినప్పుడు వీటి మీది పరుషాలకు గసడదవలు ఆదేశం అవుతాయి.

వాగనుశాసనులు (ఆంధ్రశబ్ద చింతామణి కర్త) ప్రథమా విభక్త్యంత పదాలు కళలని చెప్పి, మళ్లీ ప్రత్యేకంగా యదా, తదా (ఎప్పుడు, అప్పుడు) శబ్దాలు కళలని చెప్పటం ఇవి ప్రథమాంతాలుకావనే ఉద్దేశంతో కాదు. స్పష్టత కోసం. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అనే శబ్దాలు ప్రథమాంతాలనే చింతామణి కర్త అభిప్రాయం. అని సూరి స్పష్టపరచాడు.

**18. "ఈ కార్యము కళలగు క్రియా పదముల మీద సహితము కానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** గసడవాదేశం, కళలైన క్రియా పదాల మీద కూడ కనబడుతుంది.

ఉదా॥ రారు + కదా = రారుగదా

రారుకదా

**19. "ఈ లోపంబు పద్యాంతముల యందు గణానుసారముగ వ్యవస్థితంబయి యుండు"**

**(లేదా)**

**20. "గుర్వవసాయియగు పద్యంబు ప్రథమ స్వత్వంబులేదు.**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "అవసానంబునందు, ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు" (సంధి-20) - అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** వాక్యాంతంలో ద్రుతస్వరానికిగాని, ద్రుతానికిగాని లోపంబహుళంగా వస్తుంది. 'వాడు వచ్చెను' - అనే వాక్యంలో అవసానంలో ఉన్న ద్రుతం 'ను'. ఈ 'ను' వర్ణంలోని ద్రుతస్వరానికి లోపం వస్తే 'వచ్చెన్' అవుతుంది. ఈ పదంలోని ద్రుతం అంతటికీ లోపం వస్తే 'వచ్చె' అని, లోపంరాకపోతే 'వచ్చెను' అని రూపాలేర్పడతాయి.

పద్యపాదం చివర ద్రుతస్వరలోపం ఛందోనియమాన్ని బట్టి ఉంటుంది. (గురు + అవసాయి = గుర్వవసాయి) గురువైన అక్షరం చివర కలిగిన పద్యపాదంలో చివర గురువు ఉండవలసినప్పుడు ద్రుతం స్వత్వరూపంతో ఉండదు. అంటే హలంతంగానే ఉంటుంది.

ఉదా॥ అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్

ఇది కంద పద్యంలోని ఉత్తరార్థమందలి రెండు పాదాలలోని రెండవ పాదం. రెండవ పాదం చివర తప్పనిసరిగా గురువుండాలి. అందుకనే ద్రుతస్వరానికి లోపం ఆవశ్యకమైంది.

**21. "దీర్ఘంబు మీఁదిదిగాన దీనికి నెఱసున్నలేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "తాను, నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు" (సంధి-23) అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** తాను, నేను అనే సర్వనామ పదాలు రెండూ ద్రుతప్రకృతికాలు. వీటికి చివర ఉన్న 'ను' వర్ణం ద్రుతం.

'తాను + చదివె'

సూ॥ 'ద్రుతప్రకృతికము మీది పరుషములకు సరళములగు'

దీనిచే 'తాను + జదివె'

సూ॥ 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషంబులు విభాషనగు'

అనే సూత్రం చేత రావలసిన బిందు సంశ్లేషాలలో ప్రకృత సూత్రం సంశ్లేషాన్ని నిషేధిస్తున్నది. 'దీర్ఘము మీద సాధ్యపూర్ణములేదు' అనే సూత్రంచేత 'తాఁజదివె'. అనే ఖండబిందువుతో కూడిన రూపమే ఉంటుంది.

**22. "సర్వ పర్యాయంబయిన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీనికి సమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబులేదు."**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు" (సంధి-24) -అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** సమాసంలోని పూర్వ పదం చివర ఉన్న ద్రుతానికి లోపం వస్తుంది.

ఉదా॥ ఎల్లన్ + అర్థములు = ఎల్లయర్థములు.

ఎల్లన్ + కలుషములు = ఎల్లకలుషములు.

సంస్కృత 'సర్వ' శబ్దానికి పర్యాయమైన తెలుగు 'ఎల్ల' శబ్దం ద్రుతాంతమైన అవ్యయం (ఎల్లన్). దీనికి సమాసంలో మాత్రమే విశేషానికి ముందు (ఎల్లకలుషములు) ప్రయోగం ఉంటుంది. వ్యస్తంగా, విశేషానికి తరువాత ఈ శబ్దాన్ని ప్రయోగించవచ్చు (కలుషములెల్లన్) అని

అయితే 'ఎల్ల' శబ్దానికి సప్తమీ విభక్తి రూపం ఉంది. కాబట్టి అది అవ్యయం కాదని, ఆ సమాసంలో విశేషానికి ముందు కూడా 'ఎల్ల' శబ్దానికి ప్రయోగం కనిపిస్తున్నదని ప్రౌఢ వ్యాకర్త పేర్కొన్నాడు.

**23. "విధాన సామర్థ్యము వలన దీనికి లోపము లేదు"**

**(లేదా)**

**"వక్ష్యమాణ విధిచే స్వత్వములేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబగునపుడు నుగాగమంబగు'' (సంధి–25) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** సమాసాల్లో ఉదంతాలైన స్త్రీ సమాలకు 'పు, ంపు' లకు పరుష సరళాలు పరమైనప్పుడు నుగాగమం వస్తుంది. ఉదంతాలు అంటే హ్రస్వమైన ఉకారం అందమందున్న శబ్దాలు. స్త్రీమాలంటే ప్రథమైకవచన ప్రత్యయం లోపించిన ఆచ్ఛిక శబ్దాలు. పుంపులు అంటే కర్మధారయము సమాసంలో 'ము' వర్ణానికి ఆదేశంగా వచ్చిన 'పు, ంపు' వర్ణాలు.

చిగురు + కయిదువు

ఇక్కడ స్త్రీ సమానికి పరుష కకారం పరం కాగా ఈ సూత్రం చేత 'ను' గాగమం.

'చిగురు+ను+కయిదువు'

'సమాసంబున యందు ద్రుతంబునకు లోపంబగు' – అనే సూత్రం చేత సమాసంలో ద్రుతానికి లోపం రావలసి ఉంది. అలా ద్రుతంలోపిస్తే సూత్రంలో చెప్పిన నుగాగమ విధానమే వ్యర్థమౌతుంది. కనుక విధాన సామర్థ్యంచేత అంటే ద్రుతం ప్రత్యేకంగా విధించినందువల్ల ఉదంత స్త్రీ సమాలకు, పు,ంపులకు తరువాత ఉన్న ద్రుతానికి లోపంరాదు.

ద్రుత ప్రకృతికం మీది పరుషానికి సరళం వచ్చి

'చిగురు + ను + గయిదువు అవుతుంది.

ఆదేశ సరళానికి ముందున్న ద్రుతానికి బిందు సంశ్లేషలు వచ్చి

చిగురుంగయిదువు

చిగురుఁగయిదువు

చిగురున్గయిదువు – అనే రూపాలు వస్తాయి.

'వక్ష్యమాణ విధి' చేత అంటే చెప్పబోయే సూత్రకార్యం చేత అని అర్థం. అంటే 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు' – అనే సూత్రం చేత సమాసాలలో ద్రుతానికి స్వత్వరూపం నిషేధించబడింది. కాబట్టి 'చిగురునుగయిదువు' అని కాదు.

**24. 'నలుగడాదులనీయాగమంబు లేదండ్రు'**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** నాలుగు + కడలు

సూ॥ నిక్కలాదులు యథా ప్రయోగంబులు గ్రాహ్యంబులు

నలు + కడలు

ఉదంత స్త్రీ సమాసానికి పరుషం పరమైంది. కాబట్టి 'సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగు నపుడు నుగాగమంబగు' అనే సూత్రం చేత

నలు + ను + గడలు అవుతుంది.

ద్రుతకార్యాలు జరిగి 'నలుగడలు' – అని కావాలి. కాని'నలుఁగడాదుల నీ యాగమంబు లేదండ్రు' – అనటం చేత 'ను'గాగమం రాదని భావించవలసి ఉంది. 'నలుఁగడలు'లో అరసున్న అచ్చు తప్పయి ఉండవచ్చునని వ్యాఖ్యాతలు సూచించారు. 'నలుఁగడలు' – అని తొలి ముద్రణము నుండి ఉన్నదని నుగాగమ రహిత రూపం సూరి కిష్టం కాదని కొందరు వాదించారు. నలుగడాదులలో నుగాగమం లేదని చెప్పింది అహోబలపతి.

నలు + పది = 'నలువది' యని సూరి 'ప్రాకృతమునకు వర్ణాలు నలువది' అనే చోట పేర్కొన్నాడు గదా! అక్కడ గసడదవాదేశం స్పష్టం. అఱువది, ఇరువది వలెనే 'నలుగడాదులు' కొన్ని సంఖ్యావాచకాలు. వీటిలో నుగాగమం లేదనటం స్పష్టం.

**25. 'ఈ యాగమంబొకానొక చోట స్థిరంబు పరంబగుచోఁగానంబడియెడి'**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** సమాసాల్లో ఉదంతాలైన స్త్రీ సమాలకు 'పు, ంపు' లకు పరుష సరళాలు పరమైనప్పుడు నుగాగమం వస్తుంది. ఇలా పరుష సరళాలు పరమయ్యేటప్పుడు మాత్రమే కాదు. సకృత్తుగా స్థిరము పరమయ్యేటప్పుడు కూడ ఈ నుగాగమం కనిపిస్తుంది.

'గరువపున్మురువు': గరువపు + మురువు = గరువపు + ను + మురువు = గరువపున్మురువు

'గరువంపుమురువు' అనే విధంగా బిందువుండదు. వర్గయుక్సరళాలు పరమైనప్పుడే బిందువు వస్తుంది. సరళస్థిరాలు పరమైయ్యేటప్పుడు లోప సంశ్లేషాలు వస్తాయి.

**26. "ఇందు 'జవ్వని' శబ్దంబునకు 'జవా' దేశంబని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** 'పేదాది శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు' (సంధి-30) అనే సూత్ర వృత్తిలో పేర్కొన్న వాక్యమిది.

**వివరణ:** కర్మధారయ సమాసంలో 'పేద' మొదలైన శబ్దాలకు 'ఆలు' శబ్దం పరమైతే రుగాగమం వస్తుంది.

ఉదా॥ పేద + ఆలు = పేద + ర్ + ఆలు = పేదరాలు

'యువ' శబ్ద భవం 'జవ'. యువజనుడని అర్థం. యౌవన శబ్ద భవం జవ్వన, జవ్వన + ఇ = జవ్వని.

జవ్వని + ఆలు

జవ్వని శబ్దానికి 'జవ' ఆదేశం కలుగుతుందని చెప్పబడింది.

జవ + ఆలు = జవ + ర్ + ఆలు = జవరాలు.

**27. "ఇచట వృత్తియందాలు శబ్దము స్త్రీ మాత్రపరము"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు దత్వంబున కుత్వంబును రుగాగమంబునగు" (సంధి-31) - అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ధీర, గుణవంత అనేవి సంస్కృత శబ్దాలు. వీటికి కర్మధారయ సమాసంలో ఆలు శబ్దం పరమైనప్పుడు అత్వానికి కుత్వం 'రు' (ర్) ఆగమంగా వస్తుంది.

ధీర + ఆలు = ధీరు + ర్ + ఆలు = ధీరురాలు.

గుణవంత + ఆలు = గుణవంతు + ర్ + ఆలు = గుణవంతురాలు.

వృత్తి = సమాసము: 'ఆలు' - శబ్దానికి భార్య, స్త్రీ అని రెండు అర్థాలున్నాయి. సమాసంలో ఉత్తర పరమైనపుడు 'ఆలు' శబ్దానికి స్త్రీ అనే అర్థమే ఉంటుంది.

'ధీరురాలు' అన్నప్పుడు ధీరత్వం గల స్త్రీ అనే అర్థం. ధీరుని యొక్క ఆలు అన్నప్పుడు 'ధీరునాలు' - అని ఉంటుంది.

**28. "చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు"**

**(లేదా)**

**"బహుళ గ్రహణముచే 'మీఁదు' ప్రభృతులందు నిటలోపంబు నిత్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** 'లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు' (సంధి–37) – అనే సూత్ర వృత్తి లోనిదీ వాక్యం.

**వివరణ:** 'చెన్ను + తొవ'

ప్రాతాది సంధి జరిగి 'చెందొవ' అవుతుంది. చెన్ను శబ్దానికి వ్యస్తంగా ఉన్నప్పుడు అందము అని అర్థం. వృత్తిలో అంటే సమాసంలో ఎరుపు అని అర్థం. చెందోవ = ఎఱ్ఱకలువలని అర్థం.

'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుల మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు' అనే సూత్రంలోని బహుళ గ్రహణంచేత, మీఁదు, కెంపు, చెన్ను మొదలైన శబ్దాల తొలి అచ్చు మీది వర్ణాలకు లోపం నిత్యంగా వస్తుంది అని తాత్పర్యం.

ఉదా॥ మీఁదు + కడ = మీఁగడ

కెంపు + తామర = కెందామర

చెన్ను + తొవ = చెందొవ

**29. "వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబులేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** వ్యవస్థిత విభాష = సూత్రంలో విధించిన వ్యాకరణ కార్యం ఇక్కడ నియతంగా వస్తుంది. ఇక్కడ రాదు. ఇక్కడ వైకల్పికంగా వస్తుంది. అని లక్ష్యానుసారంగా ఏర్పరచిన వ్యవస్థ (నియమం) తో కూడిన విభాష.

"ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" – అనే సూత్రంలోని 'విభాష'కు, ప్రాతాది సంధిలో సంశ్లేషం రాదని చెప్పటం కోసం ఇక్కడ వ్యవస్థ కల్పింపబడింది. అంటే వ్యవస్థిత విభాష వల్ల 'ప్రాన్గెంపు', 'కెన్దామర' వంటి రూపాలు ఏర్పడవు.

**30. "పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమ ప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుంగొన్నియెడల మీది హల్లునకు దిత్వంబునగు" (సంధి–38) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'ప్రాత' మొదలైన శబ్దాల ఆద్యక్షర శేషానికి పరుషం పరమైనప్పుడు నుగాగమం మాత్రమే వస్తుంది. క్రొత్త శబ్దం ఆద్యక్షర శేషానికి పరుషం పరమైనప్పుడు కొన్ని చోట్ల నుగాగమం, కొన్ని చోట్ల మీది హల్లునకు ద్విత్వం వస్తుంది. పరుషేతరం పరమైనప్పుడు మాత్రం నుగాగమం రానందున ద్విత్వమే వస్తుంది.

క్రొత్త + గండి = క్రొగ్గండి

క్రొత్త + నవ = క్రొన్నన

క్రొత్త + మావి = క్రొమ్మావి.

**31. "కెంధూళి, కెంజెడలని ప్రయోగంబులుగానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** కెంధూళి = కెంపు + ధూళి

కెంజెడలు = కెంపు + జడలు

సూ॥ సమాసంబునంబ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

కె + దూళి

కె + జడలు.

ఇక్కడ లుప్త శేషానికి స్థిరము, సరళము నయిన వర్ణాలు పరమవుతున్నాయి. కాబట్టి నుగాగమం కలగటానికి అవకాశం లేదు. కాని సూరి గారు 'కెంధూళి, కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి' – అని చెప్పటం చేత నుగాగమం ద్రుత కార్యం కలిగి ఈ రూపాలు సిద్ధిస్తాయి. ఇవి విశేష ప్రయోగాలు. అంటే ఇవి నిపాత రూపాలు.

**32. "బహుళ గ్రహణముచేతఁ గ్రొత్త కుండలిత్యాదుల లోపంబులేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** "సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చు మీది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" – అనే సూత్రంలోని బహుళంలో ఉన్న అప్రవృత్తికి ఉదాహరణం: 'క్రొత్తకుండ'. అంటే 'క్రొత్త+కుండ' – అన్నప్పుడు, ప్రాతాదుల తొలియచ్చుమీది వర్ణాలకు లోపం రావాలి. క్రొత్త + కుండ = క్రొ + కుండ కావాలి. అలా రాకపోవటాన్ని సూరి సూచిస్తూ అది బహుళంలో భాగమని చెప్పాడు.

**33. "ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు దీర్ఘంబు బహుళగ్రహణము చేతనని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** పై సందర్భమే

**వివరణ:** ప్రాతాదుల తొలి అచ్చుమీది వర్ణాలకు లోపం బహుళంగా వస్తుంది. ఆ బహుళంలోని అన్యకార్యానికి ఉదాహరణలు క్రీఁగాలు, క్రీఁగడుపు.

క్రింది + కడుపు; క్రింది + కాలు

సూ॥ సమాసంబునంబ్రాతాదుల తొలియచ్చు మీది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు.

క్రి + కడుపు; క్రి + కాలు

సూ॥ లుప్త శేషంబునకు పరుషంబులు పరంబులగునపుడు నుగాగమంబగు

క్రి + ను + కడుపు; క్రి + ను + కాలు.

ఇక్కడి క్రింది శబ్దపు లుప్త శేషమైన 'క్రీ' కు దీర్ఘం వచ్చి ద్రుతకార్యాలు జరుగుతాయి.

సూ॥ ద్రుత ప్రకృతికము మీది పరుషములకు సరళములగు

క్రీ + ను + గడుపు; క్రీ + ను + గాలు

సూ॥ ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

క్రీన్గడుపు క్రీన్గాలు

క్రీంగడుపు క్రీంగాలు

క్రీఁగడుపు క్రీఁగాలు

సూ॥ దీర్ఘము మీద సాధ్య పూర్ణము లేదు. అనే సూత్రం చేత 'క్రీంగడుపు', క్రీంగాలు' రూపాలు అసాధువులు. వ్యవస్థిత విభాషచే సంశ్లేషం రాదు.

**34. "సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులందొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు" (సంధి–40) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఆమ్రేడితం పరం అయినప్పుడు 'కడ' మొదలైన శబ్దాల తొలి అచ్చుమీది వర్ణాలన్నిటికీ అదంతమైన ద్విరుక్తటకారం ఆదేశం అవుతుంది.

భృశార్థంలో అంటే అత్యంతార్థంలో ద్విరుక్తాలైన శబ్దాలకే ఈ సూత్రం వర్తిస్తుంది.

కడ + కడ = (మిక్కిలి చివర) ఇది భృశార్థంలో ద్విరుక్తమైన శబ్దం.

ఇందులో రెండవ 'కడ' ఆమ్రేడితం. పై సూత్రం ప్రకారం ఆమ్రేడితం పరంగా ఉన్నప్పుడు మొదటి పదంలో తొలి అచ్చు మీది వర్ణాలకు 'ట్ట' ఆదేశం అవుతుంది.

కడ + కడ = కట్టకడ.

**35. "ఇంచుక, నాఁడిత్యాదులందు బహుళ గ్రహణము చేత నంతిమాక్షరం లోపంబునగు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు' (సంధి-41) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఆమ్రేడితం పరం అయినప్పుడు పూర్వ పదం యొక్క నామ విభక్తి ప్రత్యయానికి లోపం బహుళంగా వస్తుంది.

ఉదా॥ అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్

అయితే బహుళగ్రహణంచేత 'ఇంచుక', 'నాడు' మొదలైన శబ్దాల కడపటి అక్షరానికి లోపం కలుగుతుంది. అంటే విభక్తులే కాక ప్రకృతిలోని వర్ణం కూడా లోపిస్తుందన్నమాట.

ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక

ఇక్కడ కకారం వికల్పంగా లోపించింది.

నాఁడు + నాఁడు = నాఁనాఁడు.

సూ॥ సంస్కృత సమేతరములయిన తెనుఁగు శబ్దముల యందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది.

ఈ సూత్రంచే 'నానాఁడు' పక్షాంతరంలో 'నాఁడు నాఁడు'.

**36. "ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు" (సంధి-44) – అనే సూత్రవృత్తిలోనిది ఈ వాక్యం.

**వివరణ:** సమాసంలో అందు, ఇందు, ఎందు అనే శబ్దాలకు చివర 'అలి' – అనే ఆగమం చేరుతుంది. ఇవి సప్తమీ తత్పురుష సమాసాలు.

ఉదా॥ నాయందున్ + కరుణ

సూ॥ సమాసంబున యందు ద్రుతంబునకు లోపంబగు.

నాయందు + కరుణ

సూ॥ అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు

నా యందు + అలి + కరుణ

సూ॥ అంద్వవగాగమంబులందప్పనపదాది స్వరంబుపరంబగునప్పుడచ్చునకు సంధియగు.

నాయందలి కరుణ అవుతుంది.

ఇలాగే ఎందలివారు

ఎందున్ + వారు

అలిగాగమం వచ్చి 'ఎందలివారు' అవుతుంది.

ఎందు శబ్దానికి అలిగాగమం లేదని అధర్వణుడు మొదలైన ప్రాచీన వ్యాకర్తలు కొందరన్నారు. కాని తనకది సమ్మతము కాదని నిరూపించాడు.

**37. "ఈ కార్యము కర్తృవాచి మువర్ణమునకు గలుగదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "పద్వాదులు పరంబులగునపుడు 'ము' వర్ణకంబునకు లోపపూర్ణ బిందువులు విభాషనగు'' (సంధి-46) – అనే సూత్రవృత్తిలోనిదీ ఈ వాక్యం.

**వివరణ:** పడు మొదలైన శబ్దాలు పరమైతే ముఁవర్ణకానికి లోపం కాని, పూర్ణబిందువు కాని వికల్పంగా వస్తుంది.

భయము + పడె = భయపడె (ముఁవర్ణకం లోపిస్తే)

భయంపడె (పూర్ణబిందువు వస్తే)

భయముపడె (లోపపూర్ణబిందువులు రానిచో)

ఈ లోప పూర్ణ బిందువులు కర్తృవాచి యయిన పదంలోని 'ము' వర్ణకానికి రావు. 'గజము పడియె' 'అశ్వము పడియె' – అన్నప్పుడు గజము, అశ్వము అనే పదాలు కర్తలు. కనుక వీటి ముఁవర్ణకానికి లోప పూర్ణ బిందువులు రాలేదు. 'భయముపడె', 'సూత్రము పట్టె' అన్నప్పుడు 'భయము', 'సూత్రము' అనే పదాలు కర్మవాచకాలు. 'భయముపడె', 'సూత్రముపట్టె' అని ఉండగా 'జడంబుద్వితీయకుంబ్రథమయగు' – అనే సూత్రం చేత ద్వితీయ బదులుగా వచ్చిన ప్రథమ రూపాలు కాబట్టి వీటిలోని ముఁవర్ణకానికి లోప పూర్ణ బిందువులు వచ్చాయి.

**38. 'ఇచ్చట నచ్చు పరంబయినది కాబట్టి లోపము లేదు'**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "మధ్యమ పురుష 'ము' వర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు" (సంధి–47) – అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** మధ్యమ పురుష 'ము' వర్ణకానికి హల్లు పరంగా ఉన్నప్పుడు కాని, అవసానంలోకాని లోపం వికల్పంగా వస్తుంది. అవసానము అంటే వాక్యం చివర అని అర్థం. వ్యాకరణ పరిభాషలో అవసానం పరం కావటమంటే అచ్చు గాని హల్లుగాని ఏదీ పరమందు లేకపోవటం. అటువంటి అవసానానికి అచ్చు పరమైనప్పుడు ముఁవర్ణకం లోపింపదు.

ఉదా॥ చూడుము + నన్ను చూడునన్ను; చూడుమునన్ను

చూడు, తిను, విను, కొట్టు, తిట్టు – ఇత్యాదిగా ముఁవర్ణక విరహితంగానే మధ్యమ పురుషైక క్రియలుంటాయి. ఇవి అల్పాచ్చులు. వీటికచ్చు పరమయ్యేటప్పుడు సంధి చేయగా అచ్చు లోపించటం వల్ల అర్థ స్ఫూర్తి తగ్గుతుంది. కాబట్టి సంధి చేయకుండటం హితవు.

ఉదా॥ చూడుము + అనియె = చూడుమనియె

వినుము + అనియె = వినుమనియె

**39. "ఈ కార్యము లాంతిచో సహితము గానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తునకోత్వము విభాషనగు" (సంధి–51) – అనే సూత్ర వృత్తి లోనిదీ వాక్యం.

**వివరణ:** అనుకరణంలో "నమస్' శబ్దం తుది అత్వానికి ఓత్వం వికల్పంగా వస్తుంది.

ఉదా॥ తుభ్యంనమః + అనె

సూ॥ విసర్గంబున కనుకరణంబున లోపంబగు

తుభ్యంనమ + అనె

సూ॥ అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తునకోత్వము విభాషనగు

తుభ్యంనమో + అనె

సూ॥ సంధిలేనిచోటస్వరంబు కంటె పరంబయిన స్వరంబునకు యడాగమంబగు

'తుభ్యంనమోయనె'

ఓత్వంరావటం విభాష కాబట్టి ఓత్వం రాని పక్షంలో 'తుభ్యంనమయనె'

నమశ్శబ్దానికే కాక ఇతర శబ్దానికి కూడా ఈ విధంగా తుది అత్తుకు ఓత్వం రావడం ఉంది.

ఉదా॥ గతానుగతికోలోకః – 'గతానుగతికోలోకో' యటంచున్

సంస్కృత వ్యాకరణంలోనే అత్వమోత్వమయ్యే నియమం ఉంది. సూరి చూపిన సంస్కృతోక్తికి పూర్తి పాఠం ఇది.

"ఏకస్వకర్మసందీక్ష్య కరోత్యన్యోపిర్హితమ్
గతానుగతికోలోకో నలోకః పారమార్థికః"

సూరి ఇచ్చిన ఉదాహరణ సందిగ్ధంగా, మార్పు ఎక్కడ వచ్చిందో చెప్పలేకుండా ఉంది. అలాగాక 'నలోకః పారమార్థికః యనియె' వంటి ఉదాహరణల్ని చూపితే ఉచితంగా ఉండేది.

**40. "అనుకృతిని నిదుదకుం గుఅచయగునని యొకందువలికె నది నిరాకరంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం**: "ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు" (సంధి-54) - అనే సూత్రవృత్తి లోనిదీ వాక్యం.

**వివరణ:** అనుకరణలో ఉకారాంత సంస్కృత ప్రాతిపదికకు వుగాగమం వస్తుంది.

'వు' - లోని ఉకారం ఉచ్చారణ కోసం చేర్చబడింది. 'వ్' అనేదే ఆగమం.

ఉదా॥ ఇయంధేనుః + అనె = ఇయంధేనువనె

సూ॥ విసర్గంబున కనుకరణంబున లోపంబగు

ఇయంధేను + అనె

సూ॥ ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు

ఇయంధేను + వ్ + అనె = ఇయంధేనువనె

అయితే అనుకరణంలో దీర్ఘానికి హ్రస్వం వస్తుందని అప్పకవి అన్నాడు. అది నిరాధారమైనమాట. దానికి ప్రామాణిక కవి ప్రయోగాలు కనబడవు. దీర్ఘానికి హ్రస్వం రాదనడానికి ఉదాహరణ దుర్బలస్యబలం రాజా యనవినవే.

ఇక్కడ 'రాజా' అన్నచోట దీర్ఘానికి హ్రస్వం రాలేదు.

**41. "ఇట్లు సంధివిరహితంబు కావ్యంబులం బాదాంతమందు చూపట్టెడు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణమందలి సంధి పరిచ్ఛేదము నుండి గ్రహింపబడినది.

**సందర్భం:** "వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదనియార్యులంద్రు" (సంధి-55) - అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** వాక్యం పూర్తి అయి, వేఱొక వాక్యం ఆరంభమయ్యేటప్పుడు సంధిచేయక పోయినా తప్పుకాదని పెద్దల అభిప్రాయం.

ఉదా॥ 'సత్యము సర్వశ్రేయము. అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు.

వాక్యాంతం కాబట్టి ఇక్కడ ఉత్వ సంధి రాలేదు. ఈ విధంగా సంధి చెయ్యక పోవడం పద్య కావ్యాలలో వాక్యాంతరం పాదాంతంలో జరిగినప్పుడే కనిపిస్తున్నది.

పడగనున్న హనుమ భయవిహ్వలుఁడుగాఁడు

అరదమునకు సూతుఁడచ్యుతుండు

పై పద్య పాదంలో మొదటి పాదం చివరనున్న ఉత్తుకు రెండవ పాదారంభంలోని అచ్చుకు సంధి జరగకపోవటాన్ని గమనించవచ్చు.

**42. "మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "తక్కినవి యుభయంబులు" (తత్సమ-13) - అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ప్రత్యయాలను వివరిస్తూ వివిధ కారకార్థాలలో ప్రత్యయాలను వివరిస్తూ ఏవి ఏక వచనాలో ఏవి బహువచనాలో చెప్పిన సందర్భంలో

'డు,ము,వు,న లేకవచనంబులు'

'లువర్ణంబు బహువచనంబు'

'తక్కినవి యుభయంబులు'.

అని చెప్పాడు. ప్రథమా విభక్తి ప్రత్యయాలుగా 'డు–ము–వు–లు', ద్వితీయగా 'ను', తృతీయగా 'చేత, తోడ', చతుర్థిగా 'కొఱకు, కై', పంచమిగా 'వలన, కంటె, పట్టి', షష్ఠిగా 'కు, యొక్క, లోపల', సప్తమిగా 'అందు, న' అని చెప్పినవాటిలో 'డు, ము, వు, న, లు' – లు తప్ప తక్కిన ప్రత్యయాలు ఏకవచన, బహువచన ప్రత్యయాలు రెండింటిని బోధిస్తాయి. 'వనమును' అన్నచోట 'ను' ద్వితీయా విభక్తిలో ఏకవచనాన్ని 'వనములను' అన్నప్పుడు ద్వితీయలో బహువచనాన్ని బోధిస్తుంది.

**43. "ఇది సంబంధ వాచకంబునకు ముందే ప్రయోగింపబడును"**

**(లేదా)**

**"ఓ శబ్దంబు తొలంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును."**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "ఓయామంత్రణంబునందగు" (తత్సమ–14) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'ఓ' అనే శబ్దం పిలుపులో వాడబడుతుంది. సంబోధించబడే శబ్దానికి, సంబోధించే శబ్దానికి సామాన్యంగా వ్యవధానం ఉండరాదు. అంటే ఓ శబ్దం సంబోధ్య వాచకానికి ప్రయోగింపబడుతుంది. 'ఓ' శబ్దం లేకుండా కూడ సంబోధన ఉంటుంది.

ఉదా॥ ఓరాముఁడ! ఓ రాములారా!

రాముఁడ! రాములారా!

**44. "ఓయి మొదలగు వానికి స్వతంత్ర ప్రయోగంబు గలదు"**

**(లేదా)**

**"వీనికి దీర్ఘముంగలదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "ఓరి యోసి మైత్రియందుంగలవు" (తత్సమ–16) – అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'ఓరి', 'ఓసి' శబ్దాలు నీచపురుష, నీచస్త్రీ సంబోధనలోనే గాక మిత్రత్వంలో కూడా వ్యవహారంలో ఉన్నాయి.

ఉదా॥ ఓరి ముద్దుకృష్ణ, ఓసి ముద్దుబాల

అంతే కాకుండ 'ఓరి' , 'ఓసి' శబ్దాలు సంబోధ్య వాచకాలు లేకుండా స్వతంత్రంగానూ ప్రయోగింపబడటం ఉంది.

ఉదా॥ సంగతియెమోయి!

ఓసిపోవే! యన్ననోసి పోవేయంచు

ఓరోరి! యింకెందుఁ బోవ వచ్చు

ఈ శబ్దాలకు దీర్ఘం వచ్చిన రూపాలు కూడ వాడుకలో ఉన్నాయి.

'ఓరీ', 'ఓసీ', 'ఓయీ'

ఉదా॥ ఓయీ! విప్రకులావతంస; ఓరీ! దుష్టనిశాటులారా, ఓసీ! ననుఁజెనక! రాకు.

**45. 'సర్వత్ర యనుటనగాగమ బాధనార్థము"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (తత్సమ–23) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ద్వితీయ మొదలైన విభక్తులు ఏకవచన ప్రత్యయాలు పరమైనప్పుడు డుమంతానికి నిగామం సర్వత్ర – అంటే అన్ని విభక్తులలోను – వికల్పంగా చేరుతుంది.

ఉదా॥ రాము + ను

సూ॥ ఇకారంబు మీది కు-ను-వు క్రియా విభక్తుల ఉత్వంబున కిత్వంబగు అనే సూత్రం చేత

రామునిని - కావాలి.

నిగామం కాకపోతే

రాము + ను

సూ॥ డుమంతంబుమీది నువర్ణంబు ఉత్వంబున కిత్వంబగు

రాము + ని = రాముని

సూ॥ కుయొక్క లోపల షష్ఠి

రాముని + కు

సూ॥ తృతీయాదులకు నుగాగమంబగు

రాముని + కును

సూ॥ ఇకారంబు మీది కు-ను-వు క్రియావిభక్తుల ఉత్వంబున కిత్వంబగు అనే సూత్రం చేత

రామునికిని - అవుతుంది.

ఈ నిగాగమం రాని పక్షంలో

సూ॥ కువర్ణకంబు పరంబగునపుడుకార ఋకారంబులకు నగాగమంబగు అనే సూత్రం చేత నగాగమం వచ్చి

రామునకును - అవుతుంది.

ఉకార ఋకారాంతములైన డుమంతములకు 'కు' వర్ణకము పరమగునపుడు నిత్యముగా విధింపబడిన నగాగమమును కూడ బాధించి, నిగామము ప్రవర్తిల్లుతుందని నిరూపించటానికి 'సర్వత్ర' యని పేర్కొనవలసి వచ్చింది. 'నిగాగమం వికల్పం కాబట్టి, నిగాగమం రాకపోతే నగాగమం ప్రవర్తిల్లుతుంది.

'నగాగమ బాధనార్థమ'నుటచే ఉపలక్షణంగా నుగాగమాన్ని కూడ గ్రహించాలి.

రామునందును

రామునియందును

**46. "ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగానగు" (తత్సమ-24) - అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** సంస్కృత నామాలకు చేరే 'డుజ్' ను మాత్రమే లోపింపఁ చేయాలి. కాని ఆచ్ఛికాలైన తమ్ముఁడు, బల్లిదుఁడు మొదలైన వాటికి సంబోధనలో 'డుజ్' లోపం రాదు. అంటే తమ్ము! బల్లిదు! వంటి రూపాలుండవు.

అంతేగాకుండా హలంతాలలో శ్రీమంత, గుణవంత మొదలయినవి - శ్రీమంతుడు, గుణవంతుడు అని అవుతాయి. ఇలాంటి వాటిలో కూడ డుజ్ లోపం రాదు. ఎందుకంటే ఇవి సంస్కృత ప్రాతిపదికలు కావు. సంస్కృత సమ ప్రాతిపదికలు. సంస్కృత నామమవటం చేత ఇలాంటివి రావు.

**47. "ఇచ్చట మధ్యమ పురుష యోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "మధ్యమ పురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు" (తత్సమ-37) - అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** మధ్య పురుష క్రియతో అన్వయం ఉన్నప్పుడు సంబోధ్యవాచకం యొక్క బహువచన ప్రత్యయానికి 'ఆర' గాగమం వికల్పంగా వస్తుంది.

'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు' – అనే సూత్రం చేత నిత్యంగా సిద్ధిస్తున్న ఆరగాగమం మధ్యమ పురుష క్రియా యోగంలో మాత్రం వైకల్పికం అవుతుంది.

వినుడు, వచ్చితిరి అనే క్రియా పదాల యంతమందలి ప్రత్యయాలు మధ్యమ పురుషకు చెందినవి.

బాలకులు (మీరు) వినుఁడు.

బాలకులారా (మీరు) వినుఁడు.

కాంతలు (మీరు) వినుడు

కాంతలారా (మీరు) వినుడు

'అన్నలారా! మిమ్ము అడిగెదను ఒకమాట' – అన్నప్పుడు

'అడిగెద' – అనే క్రియ ఉత్తమపురుషలో ఉంది. కాబట్టి ఆరగాగమం నిత్యం'. అన్నలు– అని అనకూడదు. 'మిమ్ము' – అనే సర్వనామం మధ్యమ పురుషగా భావించరాదు. సంస్కృత ఆంధ్ర భాషా సంప్రదాయాల ప్రకారం పురుషలంటే క్రియల చివర చేరే ప్రత్యయాలు.

నేను మిమ్మందఱ వేడెదను అన్నలారా

ఒప్పు తప్పులు చెప్పకుఁడీ కవులు

**48. "సంస్కృత నామంబనుటం జేసి ఓ తమ్ముండ, ఓ బల్లిదుండ – ఇత్యాదులందు లోపంబు లేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "కృతోత్కంబగు సంస్కృత నామంబు సంబుద్ధి డుజ్‌లనకు లోపంబు విభాషనగు" (తత్సమ–34) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** సంబోధనలో కృతోత్కమమైన (కృతోత్కము = కృత + ఉత్కము. వ్యాకరణ కార్యం చేత కలిగిన హ్రస్వ ఉకారం కలది) సంస్కృత నామం తాలూకు డుజ్ ప్రత్యయానికి లోపం వికల్పంగా వస్తుంది.

ఉదా॥ రామ

సూ॥ పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు అనే సూత్రం ప్రకారం రామ శబ్దము రాము అవుతుంది.

'రాము' ఇది కృతోత్కమమైన సంస్కృతనామం

సూ॥ పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్‌గు

'రాము + డుజ్'

సూ॥ కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు

'రాము'

సూ॥ సంబోధనంబునందేకార్థంబయిన పదంబు తుదియుకారంబున కకారంబగు

'రామ'

సూ॥ సంబోధనందు బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు

'రామా', 'రామ'

సూ॥ ఓయామంత్రణంబునందగు.

ఓ రామా!, ఓ రామ

వికల్పం కాబట్టి సంబుద్ధి డుజ్‌కు లోపం రాని పక్షంలో రాముడు మీద నుండి ఓరాముడ, ఓ రాముడా అని రూపాలు అవుతాయి. ఈ ప్రక్రియ కేవలం రాముడు, కృష్ణుడు వంటి నామాలకే వర్తిస్తుంది కాని తమ్ముడు, బల్లిదుడు వంటి తెలుగు పదాలకు వర్తించదు.

**49. "దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "అదంతంబయి దీర్ఘ పూర్వ లోపధంబయిన మహత్తు మీది విభక్తి లకారంబునకు రేఫంబగు" (తత్సమ–38) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** శబ్దానికి చివర హ్రస్వ అకారం ఉండటం, చివరి వర్ణానికి ముందు లకారం ఉండి దానికి పూర్వం దీర్ఘాచ్చు ఉండడం, మహద్వాచకం కావడం అనే లక్షణం ఉంటే ఆ తత్సమ శబ్దం మీది విభక్తి లకారానికి రేఫ ఆదేశం అవుతుంది.

1. హ్రస్వమైన అకారమంత మందుండాలి: అంటే అదంతేతరాలైన బుద్ధిశాలి మొదలైనవి "బుద్ధిశాలులు' అవుతాయేగాని "బుద్ధిశాలురు' కాదు.

2. దీర్ఘము పూర్వంలో ఉండి లకారం ఉపధయందుండాలి.

ఉదా॥ నల, బల శబ్దాలలో లకారం ఉపధగా ఉందేగాని దానికి పూర్వం దీర్ఘం లేదు.

కాబట్టి నలులు, బలులు – అనే అవుతుంది గాని రేఫం రాదు.

3. మహద్వాచకం కావాలి. 'పిల్ల' – అనే అర్థంలో 'బాల' శబ్దం సంస్కృతంలో ఆకారాంత స్త్రీలింగం. మహత్తు కాదు. కాబట్టి 'బాలలు' – అవుతుందేగాని రేఫ రాదు.

ఇలా ఎంతగా నియమించినా ఈ నియమాల నతిక్రమించి 'దయాళు' – శబ్దానికి రేఫాదేశం రావటాన్ని గమనించి 'దయాళురు' – అనే రూపాన్ని వార్తికం చేత సూరి సాధించాడు. అందుచేత ఈ రూపం సాధువు.

**50. "పాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించటం జేసి మిత్రాది శబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు" (తత్సమ–39) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** అదంతాలైన అమహద్వాచక శబ్దాలకూ, అదంతాలైన నపుంసక లింగ శబ్దాలకూ ప్రథమైక వచనంలో 'ము' వర్ణకం వస్తుంది.

| **సంస్కృతంలో** | **తెలుగులో** |
|---|---|
| లింగం | వాచకం |
| వృక్షః (పుంలింగం) | అమహత్తు – వృక్షము |
| ఋక్ష (పుంలింగం) | అమహత్తు – ఋక్షము (ఎలుగుబంటి) |
| ఋక్ష (నపుంసక లింగం) | అమహత్తు – ఋక్షము (నక్షత్రము) |
| దైవ (నపుంసక లింగం) | మహత్తు – దేవుడు (దైవము) |
| కళత్ర (నపుంసక లింగం) | అమహత్తు – కళత్రము (భార్య) |
| అపత్య (నపుంసక లింగం) | మహత్తు – అమహత్తు |

సంస్కృతంలో వృక్ష, ఋక్ష శబ్దాలు పుంలింగాలే అయినా అమహద్వాచకాలు. దైవ శబ్దం మహద్వాచకమైనా సంస్కృతంలో నపుంసకలింగం. నపుంసకలింగమైన కళత్ర శబ్దం మహతీ వాచకం, అమహత్తు. అపత్య శబ్దం మహదమహత్తులలో ఏదైనా కావచ్చు, అయినా నపుంసక లింగం. కనుక ఈ శబ్దాలన్నింటికీ 'ము' వర్ణకం చేరుతుంది.

మిత్రాదులు నపుంసకలింగ శబ్దాలు. వీటికి "క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషంబులింగతుల్యంబులగు" – అనే సూత్రం చేత వికల్పంగా పుంలింగం తుల్యత్వం ఆదేశించబడింది. ఇవి పుంలింగతుల్యాలు అయినప్పుడు ఉత్వడుఙ్లు చేరి 'మిత్రుడు' అనే పుంలింగ తుల్య రూపాలు కానప్పుడు ఈ నియమం చేత 'ము' వర్ణకం చేరి మిత్రము – అనే రూపాలేర్పడుతాయి.

**51. "పూర్వ సూత్రముచేత ముగాగమమునకీ కార్యంబగు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "మువర్ణకంబునకు మాముడియేనిం పూర్ణబిందు పూర్వక వర్ణంబేని విభాషనగు" (తత్సమ–42) అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** మువర్ణకానికి మాముడికాని, బిందుపూర్వక బువర్ణంగానీ విభాషగా వస్తాయి. అంటే మాముడి మువర్ణకానికి ఆగమంగా వస్తుంది.

వృక్షము = వృక్షమ్ము

పూర్ణ బిందు పూర్వక బువర్ణం 'ము' వర్ణకానికి ఆదేశంగా వస్తుంది.

వృక్షము = వృక్షంబు

ఇది విభాష కాబట్టి రెండూ రాని పక్షంలో 'వృక్షము' – అన్న స్వత్వరూపమే ఉంటుంది. ఈ కార్యం "మువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకునగు" – అనే సూత్రంచేత, ముగాగమానికి కూడా కలుగుతుంది.

వక్షములు, వృక్షంబులు, వృక్షమ్మును, వృక్షంబును మొదలగునవి

**52. "ఒకానొకచో ననుటచే నీ కార్యంబునకు ప్రయోగవైరళ్యంబు సూచింపంబడియె"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "లులనలు పరంబులగునపుడొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు" (తత్సమ–43) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** లు ప్రథమ బహువచన ప్రత్యయం. ల ద్వితీయాది బహువచనంలో వచ్చే లడాగమం. న ఉదంత జడవాచకానికి సప్తమీ ఏకవచనంలో వచ్చే ప్రత్యయం. ఈ మూడూ పరమయ్యేటప్పుడు సకృత్తుగా ము (క్) వర్ణానికి లోపం, తత్పూర్వ స్వరానికి దీర్ఘము, విభాషగా అవుతుంది.

ఉదా॥ వజ్రము + లు = వజ్రాలు; వజ్రము + లను = వజ్రాలను

పగడము + లు = పగడాలు; పగడము + లను = పగడాలను

ఈ లోప, దీర్ఘాలు సహజ ప్రవృత్తి గలవి. వస్తే రెండూ వస్తాయి. లేకపోతే రెండూ రావు. ఇలాంటి వాటినే సన్నియోగశిష్టాలని అంటారు. ఇలా సర్వత్రా వికల్ప రూపాల్ని సాధింపరాదని, ప్రయోగాల్ని బట్టి, శ్రుతిహితత్వాన్ని బట్టి గ్రహింపవచ్చునని సూరి సూచించటానికి ప్రయోగవైరళ్యంబు సూచింపబడియె' – అని సూచించాడు.

**53. "తపరకరణంబుచే దీర్ఘంబునకుత్వంబులేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** హ్రస్వమైన 'ఇ' – అంతమందున్న శబ్దాలకు బహువచన ప్రత్యయమైన 'లు' పరమయ్యేటప్పుడు ఉత్వం వస్తుంది (తత్సమ–45) అని చెప్పే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

ఉదా॥ హరి + లు = హరులు; గిరి + లు = గిరులు

'ఇత్తు' – అని సూత్రంలో తపరకరణం చేయటం వలన, హ్రస్వమైన ఇకారానికే ఈ కార్యం వర్తిల్లుతుందని చెప్పబడింది. ఈకారాంత శబ్దాలు ఇలా మార్పు చెందవని తాత్పర్యం.

ఉదా॥ శ్రీ + లు = శ్రీలు (శ్రూలు కాదు)

స్త్రీ + లు = స్త్రీలు (స్త్రూలు కాదు)

**54. "ఇచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "వికృతి యందికారాంతములయుపోత్తమేత్త్వంబునకు బహువచనము పరంబయినప్పు దుత్వంబగు" – (తత్సమ–46) అనే సూత్ర వృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఇకారాంతాలైన ఆచ్ఛిక శబ్దాలలో ఉపోత్తమం అయిన ఇత్వానికి బహువచన ప్రత్యయం పరమైనప్పుడు ఉత్వం వస్తుంది. సూత్రంలో ఉపయోగించిన వికృత శబ్దానికి అర్థం సంస్కృత సమేతరమని అంటే ఆచ్ఛికమని అర్థం. ప్రాకృతసమ, సంస్కృత ప్రాకృత భవమని అర్థం కాదు. ఉపోత్తమం అంటే మూడు లేక అంతకంటె ఎక్కువ అక్షరాలున్న పదంలో చివరి అచ్చు ఉత్తమం. దానికి ముందున్న అచ్చు ఉపోత్తమం.

ఉదా॥ కలికి + లు = కలుకులు

ములికి + లు = ములుకులు

'ఉపోత్తమేత్వం' అని చెప్పటం చేత రెండక్షరాలున్న పదాలలో మొదటి ఇకారానికి ఉకారం రాదు. జిగి, నిసి ఇత్యాదులుత్తమాలు కావు.

జిగి + లు = జిగులు

నిసి + లు = నిసులు

**55. "ఉపోత్తమేత్వంబునకనుటంజేసి జిగినిసి ఇత్యాదులం దుత్వంబులేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** పై సందర్భాన్ని చూడండి.

**వివరణ:** పై వివరణను చూడండి.

**56. "అంతట ననుట స్త్రీలింగ ప్రథమైక వచన లోప బాధనార్థము"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు" (తత్సమ-48) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఉకారంత శబ్దాలకు 'గో' శబ్దానికి అంతట 'వు' ప్రత్యయం చేరుతుంది. 'అంతట' అనడం చేత స్త్రీ లింగాలైన ఉకారాంత శబ్దాలకు ప్రథమైక వచనం రాదు.

ఉదా॥ తరు – పుంలింగం

మధు – నపుంసక లింగం

ధేను – స్త్రీ లింగం

గో – స్త్రీ లింగం

వీటికి వువర్ణకం రాగా తరువు, మధువు, ధేనువు, గోవు అనే రూపాలేర్పడతాయి. స్త్రీలింగాలైన 'ధేను', 'గో' శబ్దాలకు "స్త్రీ లింగంబు ప్రథమైక వచనంబునకు లోపంబగు" – అనే సూత్రంచేత ప్రథమైక వచనం లోపం చేయవలసి ఉంటుంది. అలా చేయకుండటానికే సూత్రంలో 'అంతట' – అని పేర్కొనబడింది.

**57. "బహుళకము వలన దర్భాదులకు మలోపంబు నిత్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "చరిత్రాదుల ముర్ణకంబునకు లోపంబు బహుళంబుగానగు" (తత్సమ-58) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** చరిత్ర మొదలగునవి శబ్దాల 'ము' వర్ణకానికి లోపం బహుళంగా వస్తుంది. బహుళము అంటే కొన్ని చోట్ల విభాషగా, కొన్ని చోట్ల నిత్యంగా కలుగుతుంది. దర్భ మొదలగునవి వానికి 'ము' – లోపం నిత్యం.

చరిత్ర

సూ॥ అమహన్నపుంసకముల కదంతములకు ముర్ణకంబగు

చరిత్ర + ము

సూ॥ చరిత్రాదుల ముర్ణకానికి లోపంబు బహుళంబుగానగు

చరిత్ర

అలాగే దర్భ+ము = దర్భ; పనస+ము = పనస; వీటికి ముర్ణలోపం నిత్యం.

**58. "బహుళ గ్రహణముచే నమహత్వమునందు స్త్రీత్వంబు నిత్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగనగు" (తత్సమ-61) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'దూత' – మొదలయిన శబ్దాలకు స్త్రీత్వం బహుళంగా వస్తుంది.

స్త్రీత్వం వచ్చినప్పుడు ప్రథమైక వచనం లోపించి 'దూత' అని, స్త్రీత్వం రానప్పుడు ఉత్వడుజ్‌లు వచ్చి దూతుఁడు అనే రూపాలు ఏర్పడతాయి.

ఉదా॥ దూత, దూతుడు, యోధ, యోధుడు మొదలైనవి.

బహుళ గ్రహణముచేత అమహత్తును చెప్పే చోట స్త్రీత్వం నిత్యం.

ఉదా॥ సింగంబు దూతయగు జంబుకంబు

ఇక్కడ దూత శబ్దం జంబుకము అనటం మహద్వాచకానికి విశేషణం. అందుచేత స్త్రీత్వం వచ్చి 'దూత' అనే అవుతుంది. 'దూతము' కాదు.

**59. "స్వర్గివాచి యనుటచే భూదేవులు, భూసురుఁడను ప్రయోగంబు లబాధితంబులయ్యె"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "స్వర్గివాచి దేవ సుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు" (తత్సమ–59) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** స్వర్గలోక నివాసి అనే అర్థంలో దేవ శబ్దం ఎప్పుడూ ఏకవచనలోనే ప్రయోగించబడుతుంది. అంటే 'దేవుడు' అనే ఏకవచన రూపమే ఉంటుంది కాని 'దేవులు' అనే బహువచన రూపం ఉండదు.

దేవ = (ఉత్వడుజ్‌లు వచ్చి) దేవుడు

స్వర్గలోక నివాసి అనే అర్థంలో సుర శబ్దం ఎప్పుడూ బహువచనంతోనే ప్రయోగింపబడుతుంది. అంటే 'సురలు' అనే బహువచన రూపమే ఉంటుందిగాని 'సురుడు' అనే ఏకవచన రూపం ఉండదు.

సూత్రంలో 'స్వర్గివాచి' అనడంచేత భూలోక వాసులను తెలిపే దేవ, సుర శబ్దాలకు ఏక, బహువచన రూపాలు రెండూ ఉంటాయి. భూదేవుఁడు, భూదేవులు, భూసురుఁడు, భూసురులు.

**60. "విధా శబ్దమునకుఁగ్లీబ తుల్యత్వంబు నిత్యంబు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" (తత్సమ–66)– అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** కంధర మొదలైనవి స్త్రీలింగ శబ్దాలు. వీటికి క్లీబతుల్యత బహుళంగా అతిదేశింపబడింది. క్లీబతుల్యాలైనప్పుడు వీటికి మువర్ణకం చేరుతుంది.

'విధా' శబ్దం సంస్కృతంలో ప్రసిద్ధం. తత్సమంలో దానికి విధము అనే రూపం కనిపిస్తుంది. 'విధ' అనే ము విరహిత రూపం లేనందున దీనికి క్లీబతుల్యతను ముఖ్యంగా సూరి విధించాడు.

**61. "ఉగాగమంబు లేమింజేసి యిచట నాంతంబుల కస్త్రీ లింగంబులకుం బ్రథమైకవచన లోపంబులేదు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు" (తత్సమ–68) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ప్రథమైక వచనాంత తుల్యాలైన హలంత ప్రాతిపదికల చివరి హల్లుకు ద్విత్వం వచ్చి ఉకారం అంతాగమంగా చేరుతుంది. ఉగాగమం, ద్విత్వం చేరిన పిమ్మట ప్రథమైక వచనలోపం కలుగుతుంది.

ఉదా॥ రుక్ (ఉగాగమం, ద్విత్వం)

రుక్ + ఉ + క్ = రుక్కు (ప్రథమైక వచన లోపం) రుక్కు

రాట్ = రాట్టు

మరుత్ = మరుత్తు

నకారాంత శబ్దాల ప్రథమైక వచనం హలంతం కాదు. అజంతం కాబట్టి వీటికి ఉగాగమ ద్విత్వాల ప్రసక్తి లేదు. స్త్రీ లింగాలు కాని నకారాంత శబ్దాలకు ప్రథమైక వచన లోపం లేదు. కాబట్టి అవి అమహత్తులైతే మువర్ణకం, మహత్తులయితే ఉత్వడుజ్‌లు చేరతాయి.

ఉదా॥ 'సుధన్వన్' – దీని ప్రథమైక వచన రూపం 'సుధన్వా'

దీర్ఘం హ్రస్వంకాగా సుధన్వ – సుధన్వుడు

**62. "వక్ష్యమాణ లక్షణంబుచే స్త్రీత్వంబున మహతుబాదులు జ్యంతంబులెయిందు గ్రహింపంబడు"**

**(లేదా)**

**"వీనికజంతములకుంబోలె దుజాదులు యథాయోగ్యంబుగనగు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "దాని యంతిమమకారాంబునకు లోపంబగు" (తత్సమ–71) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యములు.

**వివరణ:** ద్వితీయైకవచనాంత తుల్య ప్రాతిపదికలోని తుది మకారానికి లోపం వస్తుంది.

శ్రీమంతమ్ – ప్రాతిపదిక

అంతిమ మకారానికి లోపం వస్తే 'శ్రీమంత'. ఇప్పుడిది అజంతం కాబట్టి అజంతానికి వలె ఉత్వదుజ్‌లు చేరతాయి.

శ్రీమంతుఁడు

అట్లాగే గుణవంతుడు గుణవంతమ్ – గుణవంత – గుణవంతుడు

విద్వాంసమ్ – విద్వాంస – విద్వాంసుడు

ఇవి అమహద్విశేషణాలైనప్పుడు, మువర్ణకం వస్తుంది.

శ్రీమంత – శ్రీమంతము

'అనడ్వాహ', 'శ్వాస' తిర్యగ్వాచకాలు. అమహత్తులు. కాబట్టి అనడ్వాహము, శ్వానము అని 'ము' వర్ణకాంతాలవుతాయి. 'అప్సరస' స్త్రీలింగం కాబట్టి ప్రథమైక వచన లోపం వచ్చి 'అప్సరస' అనే ఉంటుంది.

వక్ష్యమాణంబుచే – అంటే 'స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులంగూడి యందు బ్రవర్తిల్లు.' – అనే తరువాతి సూత్రాన్ననుసరించి 'మతుప్' ప్రత్యయాంత శబ్దాలు స్త్రీత్వంలో 'జీ' అనే ప్రత్యయంతో కూడుకొని తెలుగులో ప్రాదిపదికలవుతాయి. జీ + అంతము = జ్యంతము. జ్ ప్రత్యయంలో 'ఈ' కారమే ప్రకృతిపైన నిలుస్తుంది. శ్రీమతీ, గుణవతీ, విదుషీ, శునీ – ఇవి జ్యంతాలు. తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి శ్రీమతి, గుణవతి, విదుషి, శుని. వీటికి ప్రథమైకవచన లోపం కలిగి ఇవే ప్రథమైక వచన రూపాలు అవుతాయి.

'శ్రీమంత' – మొదలగునవి తెలుగులో మహతీవాచకాలైనప్పుడు 'ఆలు' – శబ్దంతో సమాసం పొందుతాయి.

ఉదా॥ శ్రీమంతురాలు, గుణవంతురాలు.

**63. "స్త్రీలింగత్వాతిదేశంబు చేత నుత్వదుజ్‌లు లేవని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "విశ్వకర్మాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు" (తత్సమ–75) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'విశ్వకర్మ' – మొదలైన శబ్దాలకు స్త్రీత్వమతిదేశింపబడింది. అందుచేత ఇవి మహద్వాచకాలయినప్పటికీ ఉత్వదుజ్‌లు కావు.

'విశ్వకర్మన్' శబ్దం

'విశ్వకర్మా' ప్రథమా ప్రాతిపదిక

విశ్వకర్మ (ప్రథమైకవచన లోపంతో)

**64. "అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీ ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి, పద్మనేత్రి ఇత్యాదు లసాధువులు"**

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబు లం గూడి యిందుఁబ్రవర్తిల్లు" (తత్సమ–85) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** సంస్కృత వ్యాకరణంలో స్త్రీని బోధించే ప్రత్యయాలు జీప్, జీష్, జీన్. ఈ మూడింటిని సంగ్రహించి 'జీ' – ప్రత్యయం అంటారు. అదే విధంగా జీష్ ప్రత్యయాన్ని జీ ప్రత్యయమని సూరి వ్యవహరించాడు. వీటిలో జ్‌కారం లోపించగా

'ఈ' – అనేది సాధారణంగా చేరుతుంది. కొన్నిటికి టాప్ ప్రత్యయం –ఆ చేరుతుంది. ఇలా చేరిన స్త్రీ ప్రత్యయాంత రూపాల దీర్ఘాన్ని హ్రస్వం చేస్తే ప్రథమైకవచనంలో లోపం కలిగి తత్సమరూపం ఏర్పడుతుంది.

| **ఉదా॥** | **నామం** | **స్త్రీప్రత్యయాంతం** | **తత్సమం** |
|---|---|---|---|
| | కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జీబంతములు | జనయిత్రి | జనయిత్రీ | జనయిత్రి |
| టాబంతము+జీషంతము | వనజముఖి | వనజముఖా | వనజముఖ |
| | | వనజముఖీ | వనజముఖి |
| టాబంతము | మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర |

అఙ్గాదులు: అఙ్గి, గాత్ర, కణ్ఠ, ఓష్ఠ, జఙ్ఘ, దన్త, కర్ణ, శృఙ్గ, పక్ష, పుచ్ఛ, ఆక్షిన్, సక్థిన్, – ఇవి మాత్రమే అఙ్గాదులు. వీటికి జీష్ (జే=అ) ప్రత్యయం చేరుతుంది. వీటి తుది దీర్ఘం హ్రస్వం, ప్రథమైక వచనలోపంచే తత్సమ రూపాలేర్పడతాయి. వీటికి తప్ప ఉపధలో సంయోగముంటే జీప్రత్యయం చేరదు.

నేత్ర శబ్దం అఙ్గాదులలోనిది కాదు. ఉపధలో 'త్ర' – అనే శబ్దం ఉంది. అందుచేత మీననేత్రి వంటి రూపాలు సంస్కృతంలోనే ఏర్పడవు. తెలుగులోనూ సిద్ధింపవు. కాబట్టి మీననేత్రి, పద్మనేత్రి వంటివి పాణిని పద్ధతిని అనుసరించే సూరి మతానుసారం సాధువులు కావు.

నేత్ర శబ్దానికి టాప్ (ఆ) ప్రత్యయమును చేర్చగా మీననేత్రా – పద్మనేత్రా అనే రూపాలేర్పడతాయి. దీర్ఘం హ్రస్వమై, ప్రథమైకవచన లోపం కల్గగా మీననేత్ర, పద్మనేత్ర వంటి రూపాలేర్పడతాయి.

### 65. "సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు"

**పరిచయం:** ఈ వాక్యము బాల వ్యాకరణంలోని తత్సమ పరిచ్ఛేదములోనిది.

**సందర్భం:** "భవచ్ఛత్రాదుల క్రిందుఁ బ్రయోగంబు లేదు" (తత్సమ–87) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** భవత్ మొదలైన హలంత సర్వనామ శబ్దాలకూ, గచ్ఛన్, లసత్ మొదలైన శతృ ప్రత్యయాంతాలకు గీర్, ధూర్ మొదలైన రేఫాంత శబ్దాలకు తెలుగులో స్వతంత్ర ప్రయోగంలేదు. అవి సమాసంలో పూర్వపదాలుగా వాడవచ్చు. భవద్గుణాలు అన్నప్పుడు 'భవత్' సమాసంలో పూర్వపదం. అలా సమాసంలో పూర్వపదంగా మాత్రమే కలిసి ప్రవర్తిస్తాయని సూరి తాత్పర్యం.

### 66. "తఱచుగా ననుటచే బుంలింగ తుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము"

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని ఆచ్ఛిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "ఆచ్ఛిక శబ్దంబు లెల్లం దఱచుగా స్త్రీసమంబులు, గ్లీబసమంబులయి యుండు" (ఆచ్ఛిక–2) అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఆచ్ఛిక శబ్దాలు సాధారణంగా స్త్రీ సమాలూ, క్లీబ సమాలే అయి ఉంటాయి. 'తఱచుగా' – అనడం చేత అక్కడక్కడ స్వల్పంగా పుంలింగతుల్యాలైన శబ్దాలు కూడా కొన్ని కనిపిస్తాయి.

స్త్రీ సమమైనప్పుడు ప్రథమైనక వచనలోపం, క్లీబ సమమైనప్పుడు 'ము' వర్ణకం పుంలింగ తుల్యమైనప్పుడు డుజ్ వర్ణకమూ వస్తాయి.

ఉదా॥ స్త్రీ సమం : అన్న, మిన్న, జాణ, గాణ

క్లీబ సమం : బియ్య, నెయ్య, అల్ల, మొల్ల, వీటికి 'ము' వర్ణకం చేరుతుంది.

పుంలింగ తుల్యం : కొమర, చందుర, జమ, కంద వీటికి ఉత్వడుజ్‌లు వచ్చి
కొమరుడు, చందురుడు, జముడు, కందుడు

ఆచ్ఛిక శబ్దాలలో స్త్రీ సమాలు ఎక్కువ. క్లీబ సమాలు తక్కువ. పుంలింగ తుల్యాలు మరీ తక్కువ.

**67. "ఇత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది"**

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని అచ్చిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "కూతు శబ్దము ప్రథమైనకవచనంబునకు రువర్ణంబగు" (అచ్చిక–9) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'కూతు' శబ్దం ప్రథమైకవచన ప్రత్యయానికి 'రు' వర్ణం ఆదేశంగా వస్తుంది.

'కూతు' – ప్రాతిపదిక

సూ॥ ఉకారాంత గో శబ్దంబున కంతట వు వర్ణకంబగు.

కూతు + వు

సూ॥ కూతు శబ్దము ప్రథమైనక వచనంబునకు రువర్ణంబగు.

కూతు + రు = కూతురు

'రు' వర్ణం ప్రథమైక వచనంలోనని మాత్రమే చెప్పడం వలన, ప్రథమా బహువచనంలోను, ఇతర విభక్తుల ఏక, బహువచనాలలోను 'రు' వర్ణం రాదు.

ఉదా॥ కూతులు, కూతులను

భాష మొత్తానికి ఈ ఒక్క శబ్దంలోనే ప్రథమైక వచనంలో 'రు', చేరడం సాధారణం. కాబట్టి అనంతర కాలంలో 'రు' వర్ణ సహితమైన శబ్దమే ప్రాతిపదికగా భావింపబడి 'కూతురులు', 'కూతుళ్ళు', 'కూతురిని' మొదలైన రూపాలు వ్యావహారిక భాషా ప్రచురమై గ్రంథస్థములు కావడం సంభవించింది. అహోబలపతి మొదలైన లాక్షణికులు వీటిని అంగీకరించారు. ప్రాచీన భాషలో విరళాలన్న కారణం చేత కాబోలు సూరి వీటికి సాధుత్వమును కల్పింపక గ్రామ్యాలని తెలుసుకొమ్మంటున్నాడు.

**68. "బహుళ గ్రహణంబులచే విల్లులు, పిల్లులు పులులిత్యాదులందు లోపంబులేదు"**

**(లేక)**

**"తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీ కార్యంబు చూపట్టెడు"**

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని అచ్చిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "బహువచనము పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" (అచ్చిక–12) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** 'డు,లు,టు,రు' ల అంతమందున్న అచ్చికపదాలకు బహువచనం పరమైతే ఉత్వలోపం బహుళంబుగానగు.

విభాష: బహుళం అనటం వల్ల గుండు, కాలు మొ॥న వాటిలో ఉత్వలోపం విభాష.

ఉదా॥ గుండు + లు = గుండ్ + లు = గుండ్లు, ఉత్వంలోపించని పక్షంలో 'గుండులు' అనే ఉంటుంది.

అప్రవృత్తి: పిల్లులు, విల్లులు, పులులు వంటి వాటిలో ఉత్వలోపం లేదు.

పిల్లి + లు = పిల్లులు

అన్యప్రవృత్తి: అచ్చికాలు కాకపోయినా అచ్చిక శబ్దాకృతిలో విశేషంగా వాడుక కెక్కిన కోటి, పిప్పలి వంటి తత్సమ శబ్దాలకు ఈ వాక్యం ప్రవర్తిల్లుతుంది. ఇది అన్యప్రవృత్తి.

కోటి + లు = కోటు + లు = కోట్ + లు = కోట్లు

ఉత్వం లోపించనపుడు – కోట్లు

పిప్పలి + లు = పిప్పలు + లు=పిప్పల్ + లు = పిప్పళ్ + లు = పిప్పళ్ళు

ఉత్వంలోపించనపుడు – పిప్పలులు

**69. "పండ్లు, కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందరు వక్కాణించిరి. తెలుగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబు కాదు."**

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని అచ్చిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "సమాసంబునందు సంయోగంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు" (అచ్చిక–15)

– అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఒకే పదంలో భిన్న హల్లుల కలయిక ఏర్పడ్డప్పుడు, దీర్ఘం మీద ఉన్నా, హ్రస్వం మీద ఉన్నా, ఖండ బిందువు పూర్ణ బిందువు తప్పక అవుతుంది.

ఉదా॥ అనఁటి + లు

సూ॥ ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు

అనఁటు + లు

సూ॥ బహువచనంబు పరంబగునపుడు డ,ల,ట,ర,ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు.

అనఁట్ + లు

సూ॥ సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండ బిందువునకుం బూర్ణంబగు

అనంట్ + లు = అనంట్లు

సూ॥ 'హ్రస్వము మీది ఖండ బిందువునకు పూర్ణబిందువు వైకల్పికముగానగు' – అనే సూత్రం చేత వికల్పంగా రావలసిన కార్యాన్ని పై సూత్రం నిత్యంగా విధిస్తుంది.

అలాగే దీర్ఘం మీద సాధ్యపూర్ణం లేకున్నా, ఈ సూత్రం ప్రకారం దీర్ఘంపై సాధ్యపూర్ణం కూడ వస్తుంది.

ఉదా॥ గోఁటి + లు = గోఁట్ + లు = గోంట్లు

తేఁటి + లు = తేఁట్ + లు = తేంట్లు

పండు + లు = పండ్ + లు = పండ్లు

కాడి+ లు = కాండు + లు = కాండ్ + లు = కాండ్లు

పండ్లు, కాండ్లు మొదలైనవి "బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన దకారంబుల కలఘుల కారంబు నిత్యంబుగనగు" – అనే సూత్రం చేత పంళ్లు, కాంళ్లు, కావచ్చు. ఇలాటి చోట్ల డకారానికి ళకారాదేశం వస్తుందని చెప్పినవారు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు (తెలుగువ్యాకరణం). అయితే తెలుగులో స్థిర వర్ణానికి పూర్వం బిందువు ఉండటం అసహజం. కాబట్టి అది గ్రాహ్యం కాదని సూరి వివరిస్తూ చెప్పిన మాటలివి.

**70. (అ) "బహుళ గ్రహణముచే సందియము, కాఱియ మొదలగు శబ్దంబులం దెత్వములేదు"**

**(ఆ) "ఇయశబ్దంబు నందికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబు లందు మృగ్యంబు"**

**(ఇ) "ముత్తియ శబ్దంబునందు మాత్రమిత్వలోపంబు గానంబడియెడి"**

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని అచ్చిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు" (అచ్చిక–23) – అనే సూత్రవృత్తి లోనిదీ వాక్యం

**వివరణ:** ప్రాతిపదిక చివర ఉన్న 'ఇయ' కు 'ఎ' బహుళంగా ఆదేశం అవుతుంది.

కన్నియ – కన్నె, కొంచియము – కొంచెము

ఈ లోపం బహుళం – అనటం చేత సందియము, కాఱియ మొదలైన శబ్దాలలో 'ఎ' త్వం రాదు.

పూర్వ వ్యాకర్తలు కొందరు – అధర్వణుడు, అహోబలపండితుడు మొ॥వారు 'ఇయ'లోని ఇ కారానికి లోపం వస్తుందని చెప్పారు కాని అది ప్రాచీనకవిప్రయోగాలలో కనబడదు. ఒక్క 'ముత్తియ' శబ్దంలో మాత్రం ఇకారలోపం ప్రయోగసిద్ధమైనదిగా కనిపిస్తుంది. కనుక ఆ లక్షణం దీని విషయంలో అంగీకరించవచ్చని సూరి గారు వివరించారు.

ముత్తియము – ముత్త్యము – ముత్యము – ముతయము (ద్విత్వలోపం) – ముత్యము.

ముత్తియములో 'ఇయ'కు 'ఎ' ఆదేశం కాగా 'ముత్తెము'

ఇది బహుళం కాబట్టి ఎత్వంరాని పక్షంలో 'ముత్తియము' అనే ఉంటుంది.

**71. "అయ్యదిలక్ష్యలక్షణవిరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు"**

**పరిచయం:** ఈ వాక్యం చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణంలోని ఆచ్ఛిక పరిచ్ఛేదంలోనిది.

**సందర్భం:** "ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు" (ఆచ్ఛిక–29) – అనే సూత్రవృత్తిలోనిదీ వాక్యం.

**వివరణ:** ఇ, టి, తి అనే ఔపవిభక్తికవర్ణాలు ద్వితీయాది (ద్వితీయనుండి సప్తమీవరకు గల) విభక్తుల ఏకవచన ప్రత్యయాలు పరములైనప్పుడు మాత్రమే కొన్ని నామములమీద వస్తాయి.

కాలు + ను (ద్వితీయైకవచన ప్రత్యయం) కాల్ + ఉ + ను (తుది ఉత్వానికి ఇత్వం వచ్చి)

కాల్ + ఇ + ను = కాలి + ను = కాలిని

నాగలి + ను = నాగటి + ను = నాగటిని

నేయి + ను = నేతి + ను = నేతిని మొదలగునవి

ద్వితీయైక వచన ప్రత్యయం చేరినపుడు ఔపవిభక్తిక వర్ణాలు చేరవని, తృతీయైక వచనం నుండే అవి చేరుతాయని, రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారు తమ "తెలుగువ్యాకరణం"లో చెప్పాడు. లక్ష్యలక్షణ విరుద్ధం అని సూరి నిరాకరించాడు.

**మాదిరి ప్రశ్నలు**

**ఈ క్రింది వానిలో నాల్గింటికి సందర్భ సహిత వ్యాఖ్యలను వ్రాయండి.**

1) "అంతట ననుట స్త్రీలింగ ప్రథమైక వచన లోప బాధనార్థము"

2) "ఇచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయు"

3) "ఉపోత్తమేత్వంబునకనుటంజేసి జిగినిసి ఇత్యాదులం దుత్వంబులేదు"

4) "ఇచ్చట మధ్యమ పురుష యోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు"

5) 'సర్వత్ర యనుటనగాగమ బాధనార్థము"

6) "ఈ కార్యము లాఁతిచో సహితము గానంబడియెడి"

7) "కెంధూళి, కెంజెడలని ప్రయోగంబులుగానంబడియెడి"

8) 'నలుగడాదులనీయాగమంబు లేదంద్రు'

# యూనిట్-7

# 7. సూత్ర వ్యాఖ్యానాలు

వ్యాకరణంలోని సూత్రాలు వ్యాఖ్యానం లేకుండా పండితులకు తప్ప ఇతరులకు అర్థం కావటం కష్టం. సంస్కృతంలోని పాణినీయ వ్యాకరణం దగ్గరనుంచి చిన్నయసూరి వ్యాకరణం వరకు వ్యాఖ్యానం లేకుండా పరిపూర్ణంగా అర్థం చేసుకోవటం సాధ్యమయ్యే పనికాదు. అందువలన బాలవ్యాకరణంలోని కొన్ని ముఖ్యసూత్రాలను వ్యాఖ్యానంతో అవగాహన చేసుకుందాం. ఈ పాఠ్యాంశంలో అటువంటి కొన్ని సూత్రాలను వ్యాఖ్యానంతో నేర్చుకోగలుగుతారు.

### 1) దంత్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు (సంజ్ఞా-7)

**సూత్రాంశం**: దంత్య తాలవ్య 'చ, జ' లను గురించి వివరించటం.

**సూత్రార్థం**: దంత్య వర్ణాలైన చ, జ లు తాలవ్య వర్ణాలైన 'చ, జ' లతో సమానమైనవని అర్థం.

**వ్యాఖ్య**: పరుషాలలో గల 'చ' వర్ణం తాలవ్యం. ఈ తాలవ్య చకారం దంత్యమైన చకారాన్ని కూడా స్వీకరించాలి. పరుషమైన చకారానికి ఏ ఏ వ్యాకరణ కార్యాలు (ద్రుతకార్యము మ॥వి) అవన్నీ దంత్యమైన చకారానికి కూడా వర్తిస్తాయని తాత్పర్యం. అలాగే సరళాలలోని 'జ' వర్ణం తాలవ్యం. ఈ తాలవ్య వర్ణానికి విధించిన వ్యాకరణ కార్యాలన్నీ దంత్య జకారానికి కూడా వర్తిస్తాయి. అందువలన ఈ దంత్య తాలవ్య 'చ, జ' లు సవర్ణములు. ఇవి భిన్నోచ్చారణముగల భిన్న వర్ణాలే అయినప్పటికీ వ్యాకరణ రీత్యా 'సవర్ణాలు'. అంటే తాలవ్య చకారానికి విధించిన కార్యం దంత్య చకారానికీ, తాలవ్య జకారానికి విధించిన కార్యం దంత్య జకారానికీ వర్తిస్తుందని అర్థం. అందువలన 'చ'తో పాటు 'చ' పరుషం, 'జ' తో పాటు 'జ' సరళం అవుతాయి. సరళాదేశంలో 'చ'కు 'జ'కు వచ్చినట్లు 'చ' కు 'జ' వస్తుంది.

ఉదా॥ తోచెను + చుక్కలు > తోచెను జుక్కలు

సరళ జకారానికి ముందు ద్రుతానికి కలిగే లోప సంశ్లేషాలు 'జ' కు ముందు కూడా కలుగుతాయి.

ఉదా॥ వచ్చెను జాతర > వచ్చెను జాతర, వచ్చెన్జాతర.

గసడదవాదేశంలో 'చ'కు 'స' వచ్చినట్లు 'చ'కు 'స' వస్తుంది.

ఉదా॥ అపుడు +చనియె > అపుడు సనియె

### 2) నకారంబు ద్రుతంబు (సంజ్ఞా-11)

**సూత్రాంశం**: ద్రుతాన్ని వివరించటం సూత్రంలోని అంశం.

**సూత్రార్థం**: నకారము ద్రుతము.

**వ్యాఖ్య**: నకారాన్ని ద్రుతమని చిన్నయసూరి పేర్కొన్నాడు. ఇది మూడు రకాలుగా కనిపిస్తుంది. ను-ని-న్. ఇకారం మీద వచ్చినప్పుడు 'ను' 'ని' గా మారుతుంది. హల్లుగాని అవసానం గాని పరమైనప్పుడు 'ను' అనేది 'న్' గా మారుతుంది. ద్రుతానికి ప్రకృతి భావం కలిగినప్పుడు 'ను' అనే ఉంటుంది. కాబట్టి 'ను' వర్ణమే 'ని-న్' అనే రెండు రూపాల్ని పొందుతుందని చెప్పాలి. ఈ మూడు రూపాలలోనూ సామ్యాన్ని కలిగి స్థిరంగా కనిపించేది 'న'కారము. అందుకే సూరి నకారాన్నే ద్రుతంగా చిత్రీకరించి చెప్పాడు.

ఉదా॥ చేను, పేను, కను.

కొన్నింటిలో 'న' కారం లోపించిపోతూ ఉంటుంది.

ఉదా॥ చదివెను-చదివె, వానికొఱకున్ - వానికొఱకు, వలెన్ - వలె

ఇది లోపించినా శబ్దార్థానికి మాత్రం భగం కలుగదు. ద్రుతం అన్నమాటకు కరిగిపోయేది అని అర్థం. అన్వర్థమైన సంజ్ఞ.

ఈ పై సూత్రంలో సూరి పొల్లు నకారమే ద్రుతమని చెప్పినప్పటికీ ఉత్వ విశిష్టమైన నకారమే ద్రుతమని తాను భావించినట్లు ఇతర సూత్రాలను బట్టి (సంధి. 17, 20) మనకు తెలుస్తోంది.

**3) యకారంబును వువూవొవోలును దెలుఁగు మాటలకు మొదటలేవు** (సంజ్ఞా-17)

**సూత్రాంశం**: తెలుగు మాటలకు మొదటరాని వర్ణాలను గురించి వివరించటం

**సూత్రార్థం**: యకారంబును = ఏ అచ్చుతో కలిసిన యకారమైనా; వువూవొవో అనేవి తెలుగు పదాలకు మొదట ఉండవు.

**వ్యాఖ్య:** అచ్చ తెలుగు మాటల మొదట య గుణింతంలోని య, యా,యి, యీ, యు,యూ, యె, యే, యై, యొ, యో, యౌ వీటిలోని ఏ అక్షరమూ రాదు. అలాగే వు, వూ, వొ, వో అనే అక్షరాలు అచ్చ తెలుగు మాటలకు మొదట రావు.

వోఢృ, వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృత సమంబులందు సహితము 'వు,వూ,వో' వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము, ఊర్మిక, ఓదనము.

అచ్ఛిక పదాలకు మొదట యకారమూ, వు, వూ, వొ, వో అనే అక్షరాలూ ఉండవు. యకారం అనడం చేత ఏ అచ్చుతో కూడిన యకారమూ కూడా పదాదిని ఉండదని అర్థం.

ఎవఁడు, ఏమి, ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ వంటి పదాలను యెవడు, యేమి, వుండ, వూరు, వొకఁడు, వోడ అనే విధంగా పదాది యకార వకారాలతో పలకడం ప్రాచీన కాలం నుంచీ వ్యావహారిక భాషలో వస్తున్న ఉచ్చారణా సంప్రదాయం. కావ్య భాషలో మాత్రం ఇలాంటి పదాలను అజాదులుగానే పరిగణించాలి.

హరియతఁడు, నిద్రవోయె అన్నప్పుడు యకార వకారాలు సంధిలో యడాగమ గసడదవాదేశసంధి కార్యముల వలన కలిగినవి, కాని ఆ శబ్దాలలో సహజంగా ఉన్నవి కావు.

సంస్కృత సమశబ్దాలలో పదాదిని యకారం ఉంటుంది. ఉదా॥ యతి, యాత్ర, 'వు, వూ' లు ఉండవు. ఉదకము, ఊర్మిక, అనే పదాలను తెలుగువారు వుదకము, వూర్మిక అని ఉచ్చరిస్తారు, కాని ఇవి అజాదులని గుర్తుపెట్టుకోవాలి. హ్రస్వ ఒకారం సంస్కృతంలో లేదు కనుక 'వొ' అనే అక్షరం తత్సమ పదాదిని ఉండదు. 'వో' తో ప్రారంభించేవి వోఢృ, వోఢవ్య రెండే శబ్దాలు ఉన్నాయి. వోఢృ > వోఢ, వోఢవ్య > వోఢవ్యము.

యకారము, 'వు వూ వొ వో' లు పదాదిని ఉండ వన్నది కావ్యభాషకు చెప్పిన లక్షణం.

**4) సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు (సంజ్ఞా-19)**

**సూత్రాంశం**: భాషలోని పదాలలో ఏవి తత్సమ పదాలో వివరించటం.

**సూత్రార్థం**: సంస్కృతంతో గాని ప్రాకృతంతోగాని సమానమైన శబ్దాన్ని తత్సమమని సూత్రార్థం.

**వ్యాఖ్య:** సంస్కృతం నుండి కొన్ని శబ్దాలు తెలుగులోనికి నేరుగా ప్రవేశించాయి. కొన్ని శబ్దాలు సంస్కృతం నుండి ప్రాకృతంలో ప్రవేశించి ప్రాకృతంనుండి తెలుగులోకి వచ్చాయి. ఇలా వచ్చిన రెండు రూపాలు తత్సమాలే.

| ఉదా॥ సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము | |
|---|---|---|---|
| యమః | జమో | జముఁడు | |
| రాజ్ఞీ | రాణీ | రాణి | |
| శృఙ్గారః | సింగారో | సింగారము | |
| శ్రీః | సిరీ | సిరి | - మొదలైనవి. |

సంస్కృత శబ్దంతో తుల్యమైనది సంస్కృత సమం. ప్రాకృత శబ్దాలతో తుల్యమైనది ప్రాకృత సమం. సంస్కృత సమంకాని ప్రాకృత సమంకాని అయితే అది తత్సమం అవుతుంది. సంస్కృత ప్రాకృత భాషా పదాలు తెలుగులో ప్రవేశించినప్పుడు ప్రాతిపదికాంతంలో విభక్తి సంబంధమైన మార్పులు తప్ప వేరే విధమైన మార్పులు ఉండవు. వాటినే తత్సమాలు అంటారు.

ఉదా॥ రామః - రాముఁడు

విద్యా- విద్య

ఇక్కడ ఉత్వడుజ్ఞులు రావడం, దీర్ఘం హ్రస్వం కావటం తప్ప ప్రకృతిలో మార్పు ఏమీలేదు.

ప్రాకృతం సంస్కృతం నుంచి ఏర్పడింది కాబట్టి ప్రాకృత సమానికి సంస్కృత మూలం కూడా చూపబడింది. తత్సమానికి

మరికొన్ని ఉదాహరణలు:

సం. ఆర్య > (ప్రా. మాగధి. అయ్య) > తె. అయ్య. రాజ > రాయ > రాయఁడు / రాయలు

సం. కన్యా > ప్రా. కన్నా, కన్నియా > తె. కన్నియ. ఇలానే

సం. ప్రావృత > ప్రా. పావడ > తె. పావడ

సంస్కృతం నుంచి తెలుగులో ఋ, ఖ, ఘ మొదలైన ధ్వనులు (19) ప్రవేశించినట్లు ప్రాకృతం నుంచి తెలుగులోకి ఏవీ రాలేదు. అనాంధ్రవర్ణ ఘటితములైన అచ్ఛరా, పుఢవి, సోభగ్గ వంటి ప్రాకృత శబ్దాలు మహా ప్రాణములను వీడి అచ్చర, పుడమి సొబగు అన్న విధంగా తద్భవ రూపంలోనే తెలుగులో ప్రవేశించాయి. అందుచేతనే ప్రాకృత సమం ఆచ్ఛికంలో ఇమిడిపోవడం సంభవించింది.

### 5) లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు (సంజ్ఞా-22)

**సూత్రాంశం**: వ్యాకరణ శాస్త్ర విరుద్ధమైన భాషనుగురించి వివరించటం.

**సూత్రార్థం**: లక్షణ విరుద్ధంబు + అగు అంటే వ్యాకరణ శాస్త్ర విరుద్ధమైన భాష. లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యము.

**వ్యాఖ్య**: వ్యాకరణ లక్షణానికి సరిపడని భాషలు గ్రామ్యమని ప్రాచీన వ్యాకరణ శాస్త్రవేత్తలు భావించారు. ఇక్కడ గ్రామ్యము అంటే వ్యాకరణం చేత సంస్కరించబడిన శబ్దాలని తాత్పర్యం.

**ఉదా॥** వస్తాడు, తెస్తాడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాడు తెచ్చేవాడు, వచ్చేటివాడు, తెచ్చేటివాడు.

వస్తాడు, తెస్తాడు అనే రూపాలను వచ్చును, తెచ్చును అనే విధంగా ప్రయోగిస్తే వ్యాకరం అంగీకరిస్తుంది కాబట్టి సాధురూపాలు. అలాగే వచ్చేని, తెచ్చేని, వచ్చేవాడు, తెచ్చేటివాడు వంటి వ్యావహారిక భాషా రూపాలను కావ్యభాషలో ప్రయోగించటానికి అనర్హమైనవిగా ప్రాచీన వ్యాకరణాలు భావించాయి. దానిని చిన్నయసూరి ఇలా సూత్రీకరించి చెప్పాడు. అంటే ఆధునిక వచనంలో ఇటువంటి వ్యావహారిక రూపాలు సాధువులుగాను పరిగణించబడ్డాయి. వ్యవహర్త మాట్లాడే భాషలో వ్యాకరణ నియమం తప్పనిసరిగా ఉంటుందని ఆధునిక భాషాశాస్త్రం చెబుతుంది.

### 6) ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు (సంజ్ఞా-23)

**సూత్రాంశం**: అనింద్య గ్రామ్యాన్ని గురించి వివరించటం.

**సూత్రార్థం**: ఆర్యవ్యవహారము = మహాకవుల కావ్య వ్యవహారం. ప్రామాణిక కవి ప్రయోగం, మహాకవులు కావ్యాలలో కనబడే భాష లక్షణ విరుద్ధం అయినప్పటికీ గ్రహింపదగింది.

**ఉదా॥** కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు.

**వ్యాఖ్య**: పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపఁదగునని తాత్పర్యము.

పెద్దలు – ప్రాచీన కవులు చేసిన ప్రయోగాలు లక్షణ విరుద్ధాలైనా వాటిని ఆదరించి మనం కావ్యాలలో వాడవచ్చు. అలాటి రూపాలు అనింద్య గ్రామ్యాలు.

కఱ కంఠుఁడు (కఱ – ఆచ్ఛిక కంఠుఁడు – తత్సమం) మిశ్ర బహువ్రీహి. 'స్త్రీ సమ ఘటితంబు యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు' (సమాస-6) అనే సమాస లక్షణానికి విరుద్ధం కనుక గ్రామ్యం. నన్నయాదులు ప్రయోగించి ఉండటం చేత అనింద్య గ్రామ్యం. తక్కినవి వైరి సమాసాలు. ప్రాణ + గొడ్డము, జీవ + కఱ్ఱ, కపిల + కన్నులు – వీటిలో ప్రాణ, జీవ, కపిల అన్నది కేవల సంస్కృత శబ్దాలు. 'కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసించదు' (సమాస-3 వృత్తి) అనే లక్షణానికి విరుద్ధాలు గనుక గ్రామ్యాలు, అయినా ఆర్యవ్యవహారంలో ఉన్నవి గనక ఇవి అనింద్య గ్రామ్యాలు.

### 7) అత్తునకు సంధి బహుళముగా నగు (సంధి-4)

**సూత్రాంశం**: హ్రస్వమైన అకారానికి జరిగే సంధిని గురించి వివరించటం.

**సూత్రార్థం**: అత్తునకు = హ్రస్వమైన అకారానికి; సంధి = పూర్వపరస్వరాలకు పరస్వరం ఏకాదేశమవటం; బహుళం= ఎక్కువగా.

ఉదా॥ మేన + అల్లుఁడు = మేనల్లుఁడు, మేనయల్లుఁడు

పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు

చూడక + ఉండెను = చూడకుండెను, చూడక యుండెను

బ్రహుళ గ్రహణముచేత స్త్రీ వాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు.

అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను

దూత + ఇతఁడు = దూతయితఁడు

చెలువుఁడ + ఇందము = చెలువుఁడయిందము

సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు ఆధునిక కృతులందొకా నొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధిగానంబడియెడి. గంగు కాసె, నెలఁతిచ్చెను, వెలయాల్వాదుల సంధి లేమి బహుళకము చేతనే యని యూహించునది.

**వ్యాఖ్య:** హ్రస్వ అకారానికి (అత్తు) సంధి బహుళంగా ప్రవర్తిస్తుంది. 'బహుళం'లో వ్యాకరణకార్యం నాలుగు విధాలు.

**1. ప్రవృత్తి** : వ్యాకరణకార్యం నిత్యముగా జరుగుట

**2. అప్రవృత్తి** : వ్యాకరణకార్యం నిత్యంగా రాకుండుట

**3. విభాష** : వ్యాకరణ కార్యం వచ్చుట, రాకుండుట

**4. అన్యకార్యప్రవృత్తి** : వ్యాకరణ కార్యం అన్యవిధంగా జరగటం

మేన + అల్లుఁడు – అత్తునకు సంధి బహుళముగానగు అనే పై సూత్రం ప్రవర్తించి సంధి జరిగి 'మేనల్లుడు' సంధి జరగనపుడు – 'సంధి లేనిచోట స్వరంబుకంటే పరంబైన స్వరంబునకు యడాగమంబగు' (సంధి. 3) సూత్రం ప్రవర్తించి మేన + య్ + అల్లుడు = 'మేనయల్లుడు' అనే రూపం ఏర్పడతాయి.

ఇలాగే– పుట్టిన + ఇల్లు = పుట్టినయిల్లు,

చూడక + ఉండెను = చూడకుండెను/చూడక యుండెను.

పై సూత్రంలో 'బహుళంబు' అని చెప్పినందవల్ల స్త్రీ వాచకాలకు 2. తత్సమాలకు 3. సంబోధనాంతాలకు సంధిలేదు.

1. స్త్రీవాచకం : అమ్మ + ఇచ్చెను = సంధిలేదు. 'అమ్మిచ్చెను' అనే రూపం ఏర్పడదు.

'సంధి లేనిచోట స్వరంబు కంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు' (సంధి. 3) సూత్రం ప్రవర్తించి అమ్మ + య్ – ఇచ్చెను = అమ్మయిచ్చెను. ఈ ఉదాహరణలో 'అమ్మ' అనే పదం స్త్రీవాచకం – అంటే స్త్రీని తెలిపే శబ్దం.

2. తత్సమం: సంస్కృతసమంకానీ,, ప్రాకృతసమం కానీ 'తత్సమం' అవుతుంది.

ఉదా॥ దూత + ఇతఁడు = సంధిలేదు. అందుచేత 'దూతితఁడు' అనే రూపం ఏర్పడదు.

'సంధిలోనిచోట స్వరంబుకంటెంబరమైన స్వరంబునకు యడాగమంబగు' (సంధి–3) అనే సూత్రం ప్రవర్తించి 'దూత + య్ – ఇతఁడు = దూత యితఁడు అనే రూపం ఏర్పడుతుంది.

3. సంబోధనాంతం: సంబోధన ప్రత్యయం 'అ' అది అంతంలో ఉండే శబ్దం చెలువుఁడ + ఇందము = సంధిలేదు. 'సంధిలేని చోట స్వరంబు కంటేంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు అనే సూత్రంతో చెలువుఁడ + య్ + ఇందము = చెలువుఁడయిందము.

సంస్కృతీయానికి – అంటే తత్సమానికి సంధి జరుగుతుందని అధర్వణకారికల్లో అధర్వణా చార్యులన్నాడు. దీనికి ఉదాహరణలు పూర్వకావ్యాల్లో కనిపించవు.

ఉదా॥ గంగ + అనుకాసె.

'గంగ' తత్సమం. అందుచేత సంధిరాదు. కాని 'ఆధునిక కృతులందొకానొకచోట స్త్రీ తత్సమంబులకు సంధి గానంబడియెడి' అనే వివరణవాక్యం ప్రవర్తించి సంధి జరిగి 'గంగను కాసె' అనే రూపం ఏర్పడుతుంది. ఇటువంటివి అరుదైన ప్రయోగాలు.

స్త్రీ వాచకం: నెలఁత + ఇచ్చెను – సంధిరాదు. కాని "ఆధునిక కృతులందొకా నొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధిగానంబడియెడి" అనే వివరణ వాక్యం వల్ల సంధి జరుగుతుంది. దీని ప్రకారం 'నెలఁతిచ్చెను'.

వెల + ఆలు = వెలాలు కావాలి. కాని సంధి ఇక్కడ జరగడం లేదు. 'సంధి లేనిచోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు' అనే సూత్రం ప్రవర్తించి 'వెల+య్-ఆలు = 'వెలయాలు' అనే రూపం ఏర్పడుతుంది.

**8) క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు (సంధి-8)**

**సూత్రాంశం**: భూతకాలిక అసమాపక క్రియలో ఉండే ఇకారానికి సంబంధించిన సంధి విషయం.

**సూత్రార్థం**: క్త్వార్థము = అంటే భూతకాలిక అసమాపక క్రియ. ఇత్తు = హ్రస్వమైన ఇకారం. భూతకాలిక అసమాపక క్రియలోని హ్రస్వమైన ఇకారానికి సంధి జరగదని అర్థం.

ఉదా॥ వచ్చి + ఇచ్చెను = వచ్చి యిచ్చెను

**వ్యాఖ్య:** భూతకాలిక అసమాపక క్రియ క్త్వార్థము. ఇది ఇదంతమై ఉంటుంది. ఇటువంటి క్త్వార్థము చివర ఉన్న ఇత్త్వానికి సంధి చేయరాదని సూత్ర తాత్పర్యం.

చిన్నయసూరి క్త్వార్థాన్ని గురించి క్రియా పరిచ్ఛేదంలో ఇలా వివరించాడు. "ఏకాశ్రయంబులగు క్రియల లోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగు ధాతువున కివర్ణకంబగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు" (క్రియా. 38) ఏకవ్యక్తికిఁ చెందిన క్రియలలో భూతకాలంలో జరిగిన క్రియను తెలిపే ధాతువుకు చేరే 'ఇ' ప్రత్యయాన్ని క్త్వార్థకమని అంటారు.

ఉదా॥ వచ్చియిచ్చెను.

ఇందులో వచ్చుట, యిచ్చుట యని రెండు క్రియలు (=పనులు) ఉన్నాయి. ఈ రెండింటిలో వచ్చుట భూతకాలిక క్రియ ఈ రెండు క్రియలు ఒకే వ్యక్తిని ఆశ్రయించినవి. ఎలాగంటే వచ్చిన వాఁడు, నిచ్చిన వాఁడు, ఒక్కడే కాబట్టి. అందుచేత వచ్చు + ఇ = వచ్చి - అయినది. వచ్చి-లోనిది క్త్వార్థమగు ఇకారము. దీనికి సంధిలేదు.

ఉదా॥ వచ్చి ఇచ్చెను

'సంధిలేనిచోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు' (సంధి-3) అనే సూత్రంచేత యడాగమము వచ్చి - య్+ ఇచ్చెను = వచ్చియిచ్చెను - అవుతుంది.

**9) ఇఁకాదులకుఁ దప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు (సంధి-9)**

**సూత్రాంశం**: ఇఁకాదులకు జరిగే సంధి వైకల్పికం. ఇఁకాదులు కాని ద్రుతప్రకృతికాలకు జరిగే సంధిని గురించి వివరించటం ఇందులోని అంశం.

**సూత్రార్థం**: ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని అనే నాలుగింటికి తప్ప మిగిలిన ద్రుతప్రకృతికాలకు సంధిలేదని సూత్రార్థం.

ఉదా॥ వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు

చూడన్ + అయితి = చూడనయితి

ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు

**వ్యాఖ్య :** ఇఁకాదులకు సంధి వైకల్పికం - ఇఁకాదులుకాని ద్రుతప్రకృతికాలకు సంధిలేదు.

ఇఁకాదులకు : ఇఁక మొదలైన పదాలకు తప్ప = తప్ప; ద్రుతప్రకృతికములకు : ద్రుతంబ చివర ఉండే పదాలకు; సంధిలేదు = సంధిరాదు.

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని - అనే ద్రుతప్రకృతిక శబ్దాలకు తప్ప - తక్కిన ద్రుతప్రకృతికాలకు అచ్చు పరమైతే సంధిరాదు. ఇఁకాదులు - నియతగణం పై నాలుగు శబ్దాలు ఇఁకాది గణం అయింది. పై ఉదా॥ల్లోని వచ్చున్. చూడన్, ఉండిడిన్ అనేవి ఇఁకాదులుకాని ద్రుతప్రకృతికాలు కాబట్టి పై సూత్రంతో సంధి జరగదు. ద్రుతం పరాచ్చుతో కలిసిపోతుంది. వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు, చూడన్ + అయితి = చూడనయితి. ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు.

'ప్రథమేతర విభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని' అని సూరి వివరణ వాక్యం. 'ప్రథమేతకర విభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగానగును' (సంధి-2) అనే సూత్రం ప్రథమేతర విభక్తి విధి. ఈ పూర్వ సూత్రం కంటె (సంధి-2) ప్రస్తుత సూత్రమైన 'ఇకాదులకు ద్రుతప్రకృతికములకు సంధిలేదు' (సంధి-9) బలీయం

కాబట్టి ప్రథమేతర విభక్తి విధికి ఉదాహరణలు ఉండవు. అలాంటి సందర్భంలో 'నిరవకాశాహి విధయః సావకాశాన్ విధీన్ బాధంతే' (ఉదాహరణలులేని సూత్రాలు– ఉదాహరణలున్న సూత్రాల్ని బాధిస్తాయి) అనే సూత్రం ప్రకారం సంధి–2 సూత్రం సంధి–9 సూత్రాన్ని బాధిస్తుంది. అప్పుడు సంధి–2 లోని ఉదాహరణలు తప్ప తక్కిన ద్రుతప్రకృతికాలకు మాత్రమే 'ఇఁకాది విధి' ప్రవర్తిస్తుంది.

అలాగే 'కిషష్ఠి' (కిన్) (సంధి–5) ని కూడా ఇకాది విధి వదిలిపెడుతుంది.

ఇఁకాదులకు సంధి వైకల్పికం

ఉదా॥ ఇఁకన్ + ఏమి = ఇఁకేమి/ఇఁకనేమి

ఇఁగ + ఏల = ఇఁగేల / ఇఁగనేల

ఎట్టకేలకున్ + అనియె = ఎట్టకేలకనియె / ఎట్టకేలకుననియె

ఎట్టకున్ + ఏని = ఎట్టకేని / ఎట్టకునేని.

దీనిని బట్టి (1) సంధి – 2 లోని ద్రుతప్రకృతికాలైన ప్రథమేతర విభక్తి శత్రర్థ వర్ణాలలోని ఉకారానికి (2) ద్రుతప్రకృతికమైన కిషష్ఠికి (సంధి–6) (3) ఇఁకాదులలోని ద్రుతప్రకృతికాలకు సంధి వికల్పము. తక్కిన ద్రుతప్రకృతికాల్లోని అచ్చులకు సంధి జరగదు అని తెలుతున్నది.

### 10) అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగానగు (సంధి–10)

**సూత్రాంశం**: అచ్చుకు ఆమ్రేడిత పరమైనప్పుడు సంధి జరగటం.

**సూత్రార్థం**: పూర్వపదం చివరనున్న అచ్చునకు ఆమ్రేడితం పరమైనప్పుడు సంధి తఱచుగా అవుతుందని అర్థం.

ఉదా॥ ఔర + ఔర = ఔరౌర

ఆహా + ఆహా = ఆహాహా

ఎట్టా + ఎట్టా = ఎట్టెట్టా

ఓహో + ఓహో = ఓహోహో

ఏమి + ఏమి = ఏమేమి, ఏమియేమి

ఏగి + ఏగి = ఏగియేగి అనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

**వ్యాఖ్య:** పూర్వపదం చివరనున్న అచ్చునకు ఆమ్రేడితం పరమైతే సంధి జరుగుతుంది. 'ద్విరుక్తస్య పరరూపమామ్రేడితమ్', అని ఆమ్రేడితపు లక్షణం. ఒకే పదము రెండు సార్లు ఉచ్చరించబడటం ద్విరుక్తము. ద్విరుక్తము యొక్క పరరూపం ఆమ్రేడితం. (ద్విః ఉక్తమ్ > ద్విరుక్తమ్ అంటే రెండుసార్లు ఉచ్చరించబడినది).

ఉదా॥ ఔర + ఔర – ఇక్కడ 'ఔర' అనే శబ్దం రెండుసార్లు ఉచ్చరించబడింది. రెండోసారి ఉచ్చరించబడిన 'ఔర' ఆమ్రేడితం అని పిలవబడుతుంది. ఔర + ఔర > అచ్చుకు ఆమ్రేడితం పరమైంది కాబట్టి పై సూత్రంలోసంధి జరిగి 'ఔరౌర' – అలాగే తక్కిన ఉదాహరణలు కూడా.

సూత్రంలో 'తఱచుగ' అని అనటం వల్ల ఎక్కడైనా వికల్ప సంధి కూడా ఉండవచ్చు.

ఉదా॥ ఏమి + ఏమి > సంధి జరిగి 'ఏమేమి' – సంధి జరగక 'ఏమియేమి'.

'ఏగు' అనే ధాతువుకు క్త్వార్థరూపం – 'ఏగి' ఏగి + ఏగి > అచ్చుకు ఆమ్రేడితం పరం అయింది. అయినా క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు. "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" (సంధి–8) అనే సూత్రం వచ్చి సంధి జరగదు. "సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సంధి–3) అనే సూత్రం చేత యడాగమం వచ్చి ఏగి + య్ + ఏగి > 'ఏగియేగి' అనే రూపం ఏర్పడుతుంది. దీర్ఘాలకు కూడా సంధి రావడం ఈ సూత్రంలో విశేషం.

### 11) తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావు (సంధి–14)

**సూత్రాంశం**: గసడదవాదేశం రాని సందర్భాలను వివరించటం సూత్రంలోని అంశం.

**సూత్రార్థం**: సాంస్కృతిక పరుషములు = సంస్కృత సమ శబ్దాలలోని పరుషాలు. పూర్వపదం తెలుగై పరపదం తత్సమమైనప్పుడు ఆ తత్సమ పదాలలోని పరుషాలకు గసడవలు ఆదేశం కావని సూత్రార్థం.

ఉదా॥ వాఁడు + కంసారి = వాఁడు కంసారి

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి

ఆయది + టంకృతి (వింటి నారి యొక్క ధ్వని) = ఆయది టంకృతి

అది + తథ్యము = అది తథ్యము

ఇది + పథ్యము = ఇది పథ్యము (హితము)

**వ్యాఖ్య:** అచ్చతెనుగు శబ్దాల తరువాత వచ్చిన సంస్కృత సమశబ్దాల పరుషాలకు గ స డ ద వ లు రావు.

తెనుఁగులు = అచ్చ తెనుగు శబ్దాలు, సాంస్కృతిక పరుషములు = సంస్కృత సమ పదముల మొదటఉన్న 'క, చ, ట, త, ప' లు, 'వాఁడు కంసారి' వాఁడు – అచ్చ తెనుగు పదం. 'కంసారి' సంస్కృత సమం. దీని కకారానికి గకారం రాలేదు. వెనుకటి సూత్రం చేత రాదగిన గ స డ ద వా దేశం ఇక్కడ వారింపబడింది. అంటే దాని కిది అపవాద సూత్రమన్నమాట. క చ ట త ప లు ఐదింటికీ వరుసగా ఉదాహరణలు ఇవ్వడం జరిగింది.

ఉదా॥ వాఁడు + కంసారి = వాఁడు గంసారి

వీఁడు + చక్రపాణి = వీఁడు జక్రపాణి

ఆయది + టంకృతి (వింటి నారి యొక్క ధ్వని) = ఆయది డంకృతి

అది + తథ్యము = అది దథ్యము

ఇది + పథ్యము = ఇది వథ్యము (హితము)

అనే రూపాలు ఉండవు.

**12) అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు (సంధి–20)**

**సూత్రాంశం**: ద్రుతానికి, ద్రుత స్వరానికి లోపం ఎక్కడ జరుగుతుందో చెప్పటం.

**సూత్రార్థం**: అవసానంబునందు = అవసానంలో; ద్రుతస్వరంబునకేని = ద్రుతంలోని అచ్చునకుగానీ; ద్రుతంబునకేని = ద్రుతానికి అయినా; లోపంబు = లోపం; బహుళంబుగాన్–అగు= బహుళంగా వస్తాయి. వాక్యం చివరనున్న ద్రుతం యొక్క స్వరానికి గాని ద్రుతానికి గాని లోపం బహుళంగా వస్తుందని అర్థం.

ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితమయి యుండు. గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబు లేదు. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్.

**ఉదా॥** వాఁడు వచ్చెన్, వాఁడువచ్చె, వాఁడు వచ్చెను.

**వ్యాఖ్య:** 'అవసానం' లో ద్రుతంకానీ, ద్రుతంలోని అచ్చుగానీ బహుళంగా లోపిస్తూ ఉంటాయి. అవసానం, ఒకవర్ణం పలికిన తర్వాత అర్ధమాత్రాకాలం కంటే ఎక్కువ సేపు ఉచ్చారణ లేకుంటే దాన్ని అవసానం అంటారు. మాత్ర అంటే చిటిక వేసేందుకు పట్టేకాలం సాధారణంగా వాక్యం చివర 'అవసానం' వస్తుంటుంది.

ఉదా॥ వాఁడు వచ్చెను.

ద్రుతం వాక్యం చివర ఉంది. అంటే 'అవసానం' లో ఉంది. పై సూత్రం ప్రవర్తిస్తే ద్రుతంలోని అచ్చు లోపిస్తే 'వాఁడువచ్చెన్, ద్రుతమే లోపిస్తే 'వాఁడు వచ్చె' ఈ రెండు వ్యాకరణ కార్యాలు బహుళం కాబట్టిటబహుళంలోని విభాష ప్రకారం – జరగకపోతే ద్రుతం మూలరూపం అలాగే ఉంటుంది. వాఁడు వచ్చెను.

ద్రుత లోపం పద్యం చివర గణాల్ని అనుసరించి ఉంటుంది. గురువు చివర్లో ఉండవలసిన (గుర్వవసాయి = గురువు + అవసాయి) పద్యాల చివర్లో ద్రుతానికి స్వత్వరూపం (ను) ఉండదు. కారణం 'ను' గురువు కాకుండా లఘువు కాబట్టి గణభంగం అవుతుంది. ఉదా॥ అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధ సేవన్ – ఇది కందపద్యం నాలుగోపాదం, కందం రెండో పాదంలో నాల్గో పాదంలో చివర గురువుంటుంది. దాన్ననుసరించి పాదం చివర (అవసానంలో) ద్రుతస్వరం లోపించింది. స్వత్వరూపంలో (ను) లేదు.

**13) తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు (సంధి-23)**

**సూత్రాంశం**: తాను, నేను పదాలలోని ద్రుతానికి సంధి జరిగినప్పుడు ద్రుతం యొక్క స్థితిని వివరించటం.

**సూత్రార్థం**: తాను నేను పదంబుల = తాను, నేను అనే పదాలయొక్క; ద్రుతంబునకు = ద్రుతనకారానికి; సంశ్లేషంబు = సంశ్లేష; లేదు : ఆదేశం కాదు. తాను, నేను అనే శబ్దాలలోని ద్రుతానికి ఆదేశ సరళాలు పరమైనప్పుడు బిందు, సంశ్లేషలు వస్తాయి. సరళ, స్థిరాలు పరమైతే లోప సంశ్లేషలు విభాషగా వస్తాయి. వాటిని ఈ సూత్రం నిషేధిస్తున్నది.

ఉదా॥ తాను + చదివె = తాఁజదివె. తాను జదివె

తాను + వినె = తావినె, తాను వినె

దీర్ఘంబు మీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

**వ్యాఖ్య:** తాను, నేను అనే పదాల్లోని ద్రుతానికి సంశ్లేష ఆదేశం కాదు.

ఉదా॥ తాను + చదివె.

'తాను' లోని 'ను' ద్రుతం దానికి 'చ' అనే పరుషం పరం అయింది.

'ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు' (సంధి-16)

తాను + జదివె,

ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషంబులు విభాగనగు (సంధి-17)

తాను + చదివె = తాఁజదివె, తాంజదివె, తాన్జదివె, తాను జదివె

"తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు" అనే సూత్రం ప్రవర్తించి ద్రుతానికి సంశ్లేషరాకుండా ఈ సూత్రం నిషేదిస్తూ ఉంది. అంటే 'తాన్జదివె' అనే రూపం ఉండదు. అరసున్నతో రూపం వచ్చి 'తాఁజదివె' అనే ఏర్పడుతుంది. 'దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు' (సంజ్ఞా-7) అంటే 'తాంజదివె' అనే రూపం రాదు. స్వత్వరూపం ఉంటుంది. 'తానుజదివె'

తాను + వినె. ద్రుతానికి స్థిరం పరమైంది. 'ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు' (సంధి-18) కానీ పై సూత్రం ప్రవర్తించి 'తాను' అనే పదంలోని ద్రుతానికి సంశ్లేష రాదు అంటే 'తాన్వినె' అనే రూపం రాదు. ద్రుతలోపం వచ్చి 'తావినె'. ద్రుతానికి స్వత్వరూపం వచ్చి 'తానువినె'.

**14) సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు (సంధి-26)**

**సూత్రాంశం**: సమాసంలో ద్రుతం యొక్క స్థితిని వివరించటం.

**సూత్రార్థం**: సమాసములయందు ద్రుతమునకు స్వత్వరూపములేదు. స్వత్వము = ద్రుతమునకుఁబ్రకృతిభావము

ఉదా॥ చిగురు + ను + కయిదువు = చిగురునుంగయిదువు, చిగురుఁగయిదువు

తల + ను + ప్రాలు = తలంబ్రాలు, తలఁబ్రాలు

సొగసు + ను + తనము = సొగసుందనము, సొగసుఁదనము

ప్రా + ను + కెంపు = ప్రాఁగెంపు

క్రొ + ను +చాయ + క్రొంజాయ, క్రొఁజాయ

**వ్యాఖ్య:** సమాసంలో పూర్వ శబ్దానికి చివర సహజంగా ఉండే ద్రుతంగాని ఆగమమైన ద్రుతంగాని స్వత్వరూపాన్ని పొందదు. ద్రుతానికి పరుష సరళాలు, స్థిరాలు పరమైనప్పుడు కొన్ని చోట్ల ప్రకృతి భావం కూడా పూర్వరూపాల్లో చేర్చబడింది. అలా వ్యస్తంగా ఉన్నప్పుడు మాత్రమే అలా జరగవచ్చుకాని సమాసంలో అలా ద్రుతానికి ప్రకృతి భావం కలగదని ఈ సూత్రం ద్వారా సూరి నిషేధించి చెప్పాడు.

చిగురు + ను + కయిదువు = చిగురునుంగయిదువు, చిగురుఁగయిదువు

చిగురునుగయిదువు, వంటి రూపాలు ఈ సూత్రంచేత నిషేధించబడుతున్నాయి.

అలాగే తలనుబ్రాలు, సొగసునుదనము, ప్రానుగెంపు, క్రొనుజాయి వంటి రూపాలు ఉండవు.

**15) లుప్తశేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు (సంధి-37)**

**సూత్రాంశం**: ప్రాతాదులకు సంధి జరిగేటప్పుడు వ్యాకరణ కార్యాలను వివరించటం.

**సూత్రార్థం**: లుప్తశేషము = ప్రాతాదుల తొలియచ్చు మీది వర్ణాలకు లోపం రాగా మిగిలిన శబ్దాలు.

ప్రాత, లేత, పూవు వంటి శబ్దాలలోని తొలియచ్చుమీది వర్ణాలు లోపించగా మిగిలిన అక్షరాలకు పరుషాలు పరమైనప్పుడు 'ను' వర్ణం ఆగమంగా వచ్చి చేరుతుంది.

ఉదా॥ ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు

లేఁత + కొమ్మ = లేఁగొమ్మ

పూవు + తోఁట = పూఁదోట

మీఁదు + కడ = మీఁగడ

**వ్యాఖ్య:** "సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" (సంధి-36) అనే సూత్రం ప్రవర్తించి సమాసంలో తొలి అచ్చు తర్వాతి వర్ణాలకన్నింటికీ లోపం రాగా మిగిలిన దానికి (లుప్తశేషం) పరుషాలు పరమయితే నుగాగమం వస్తుంది.

ఉదా॥ ప్రాఁగెంపు : ప్రాఁత + కెంపు

"సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" (సంధి 36) అనే సూత్రం చేత 'ప్రా+కెంపు' అవుతుంది. ఇందులో 'ప్రా' అనేది 'లుప్తశేషం. దీనికి 'కె' అనే పరుషం పరమయింది. పై సూత్రం ప్రవర్తించి లుప్తశేషం చివర 'ను' అనే ఆగమం చేరుతుంది. అలా చేరి

ప్రా-ను+కెంపు >

"ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు" (సంధి-16) చేత

ప్రాను + గెంపు

"ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" (సంధి-17)

ప్రాను + గెంపు = ప్రాఁగెంపు

ప్రాంగెంపు

ప్రాన్గెంపు

"దీర్ఘం మీద సాధ్య పూర్ణంలేదు" (సంజ్ఞా-15) అనే సూత్రం చేత 'ప్రాంగెంపు' అనే రూపం ఉండదు. అలాగే స్వత్వ, సంశ్లేష రూపాలుండవు.

లేఁగొమ్మ = లేత + కొమ్మ > ప్రాతాది సంధి సూత్రాలు (సంధి-36, 37) లే + కొమ్మ > లే+ను + కొమ్మ > ద్రుతకార్యాలు జరిగి (సంధి-16, 17) లేను + గొమ్మ > లేఁగొమ్మ.

పూఁదోట = పూవు + తోట > ప్రాతాది సంధి సూత్రాలు (సంధి-36,37) పూ + తోట > పూ-ను + తోట ద్రుతకార్యాలు జరిగి (సంధి-16, 17) పూ+ను+దోట > పూఁదోట.

మీఁగడ = మీఁదు + కడ > ప్రాతాది సంధి సూత్రాల (సంధి-36,37)చే మీ + కడ > మీ+ను + కడ > ద్రుతకార్యాలు జరిగి (సంధి-16, 17) మీను + గడ > మీఁగడ.

కెందామర = కెంపు + తామర > ప్రాతాది సంధి సూత్రాల (సంధి-36,37)చే కె + తామర > కె + ను + తామర > ద్రుతకార్యాలు జరిగి (సంధి-16,17) కె + ను + దామర > కెందామర

"అఁట, ఇఁక చుఁడు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వము మీఁద ఖండ బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (సంధి-22) అనే సూత్రం చేత కెఁదామర అనే రూపం ఉండదు. 'కెందామర' అనే రూపమే ఉంటుంది.

చెందొవ = చెన్ను + తొవ > ప్రాతాదుల సంధి సూత్రాల (సంధి-36, 37) చె + తొవ > చేను + తోవ > ద్రుతకార్యాలు జరిగి (సంధి-16, 17) చె + ను + దొవ > చెందొవ.

'చెన్ను' అనే శబ్దానికి 'అందం' అనే అర్థం. కూడా ఉంది. 'చెందొవ' అనే సమాసంలో చెన్ను అంటే 'ఎఱ్ఱని' అని అర్థం ప్రాతాదుల (సంధి–36) సూత్రంలో బహుళం అన్నందువల్ల మీఁదు, కెంపు చెన్ను లాంటి శబ్దాల్లో తొలి అచ్చు మీది వర్ణాలకు అన్నింటికీ లోపం నిత్యం అంటే బహుళంలోని 'అప్రవృత్తి' అన్నమాట ప్రాత్రాదుల లుప్తశేషానికి నుగాగమం వచ్చినపుడు – ఆ ద్రుతానికి సంశ్లేష లేదు. అని విభాషకు వ్యవస్థ ఏర్పాటు చేయబడింది. అందువల్ల 'కెన్దామర' లాంటి సంశ్లేష రూపాలు రావు. ఇవన్నీ సమాసాలు కాబట్టి ద్రుతానికి స్వత్వరూపం 'కెనుదామర' లాంటివి ఏర్పడవు.

### 16) అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి (సంధి–39)

**సూత్రాంశం**: ప్రాతాదులలో చేరని ఇతర శబ్దాలలో కూడా ప్రాతాది సంధి సూత్రాన్ని వర్తింపచేసే విషయాన్ని వివరించటం.

**సూత్రార్థం**: అన్యంబులు అంటే ప్రాతాదులలో చేరని ఇతర శబ్దాలు. ప్రాతాదులలో చేరని శబ్దాలకు కూడా ఒక శబ్దం పరమైనప్పుడు లోప నుగాగమాలు మరొక శబ్దం పరమైనప్పుడు లోప ద్విత్వాలు కనిపిస్తాయని సూత్రార్థం.

ఉదా॥ పది + తొమ్మిది = పందొమ్మిది

తొమ్మిది + పది = తొంబది

వంక + చెఱఁగు = వంజెఱఁగు

సగము + కోరు = సంగోరు

నిండు + వెఱ = నివ్వెఱ

నెఱ + తఱి = నెత్తఱి

**వ్యాఖ్య:** ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోప నుగాగమంబులును, గొండొక శబ్దమున కొకానొక శబ్దము పరంబగునపుడు లోప ద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము."

ప్రాఁతాదులలోఁ జేరని యితర శబ్దాలకు కూడ, లోప నుగాగమాలు, లోప ద్విత్వాలు కొన్నిచోట్ల కనిపిస్తాయి. సూరి వృత్తిలో "ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు తొంటి యట్ల లోప నుగాగమంబులును" అనటం చేత తొంటి యట్లు అనగా ప్రాతాది సంధి సూత్రాలలో 36, 37 విధించినట్లు పరుషములు పరమైనపుడు లోపనుగాగమాలు, ద్రుతకార్యాలు అవుతాయని తాత్పర్యం.

పది + తొమ్మిది.

పది ప్రాతాదులలోని శబ్దం కాదు. కాని ఈ సూత్రం చేత తొలియచ్చుమీఁది వర్ణాలకు లోపము, కలుగఁగా, ప+తొమ్మిది అవుతుంది. ఆ పిదప నుగాగమం చేరి ప+ను+తొమ్మిది అవుతుంది. ద్రుతకార్యాలు జరిగి

పను + తొమ్మిది = పందొమ్మిది

ద్రుతానికి స్వత్వము, సంశ్లేషంబు లేదు కాబట్టి 'పన్దొమ్మిది', 'పనుదొమ్మిది' అనే రూపాలు ఉండవు.

"అఁట ఇఁక చుఁడు" అనే సూత్రం చేత 'పఁదొమ్మిది' అనే రూపం ఉండదు. కాబట్టి 'పందొమ్మిది' అనే రూపమే ఉంటుంది. అలాగే ఉదాహరణలో చూపిన శబ్దాలు కూడా ప్రాఁతాదులలోనివి కానప్పటికి ప్రాఁతాదులలాగే వ్యాకరణ కార్యం జరగటం గమనించవచ్చు.

'కొండక శబ్దమున కొకానొక శబ్దము పరమగునపుడు లోప ద్విత్వంబులు"

ఉదా॥ నిండు + వెఱ, ని + వెఱ – నివ్వెఱ

ఇత్యాదులు ప్రయోగములను బట్టి తెలిసికొనవలెను.

### 17) అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు (సంధి–53)

**సూత్రాంశం**: అనుకరణ సంధి విషయం.

**సూత్రార్థం**: అనుకరనంబునందు = వాక్యాన్ని అనుకరించేటప్పుడు. అహమాదుల = అహమ్ మొదలైన శబ్దాల యొక్క మకారంబునకు = మకారానికి, ద్విరుక్తి = ద్విత్వం, విభాషన్ – అగు = విభాషగా వస్తుంది. అనుకరణలో అహమ్ మొదలైన శబ్దాల తుది మకారానికి విభాషగా ద్విత్వం వస్తుంది.

ఉదా॥ దాసోహమ్ + అనె = దాసోహమ్మనె, దాసోహమనె

తత్కర్తవ్యమ్ + అనె = తత్తర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె

**వ్యాఖ్య :** అనుకరణంలో 'అహమ్' మొ॥న వాటి చివరి మకారానికి ద్విత్వం విభాషగా వస్తుంది.

ఉదా॥ దాసోహమ్ + అనె = దాసోహమ్ సంస్కృత వాక్యం. 'అనె' అనే తెలుగు ధాతువుతో కలుస్తోంది. ఈ వ్యాకరణ కార్యం వలన 'అహమ్' లోని చివరి మకారానికి విభాషగా ద్విత్వం వస్తుంది.

దాసోహమ్ + మ్ + అనె = దాసోహమ్మనె,

ద్విత్వం రాకపోతే

దాసోహమ్ + అనె = దాసోహమనె,

ఇలాగే

తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమ్ + మ్ + అనె = తత్కర్తవ్యమ్మనె

## 18) వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యులంద్రు (సంధి-55)

**సూత్రాంశం**: వాక్యం చివరిలో సంధి స్థితిని వివరించటం.

**సూత్రార్థం**: వాక్యాంతంలో సంధి లేకుండడం- వాక్య + అవసానంబున = వాక్యం చివర్లో, సంధిలేమి = సంధి చేయకపోవడం, దోషంబుగాదు అని = దోషం కాదని, ఆర్యులు – అంద్రు = పెద్దలంటారు. వాక్యం చివర సంధిని చేయకపోతే దానిని దోషంగా పరిగణించరాదని అర్థం.

ఉదా॥ సత్యము సర్వశ్రేయము. ఇది లేనిచో సర్వ ధర్మములు వ్యర్థములు.

**వ్యాఖ్య:** వాక్యం చివరిలో సంధి లేకపోవడం దోషంకాదని పెద్దలు చెబుతారు.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వ ధర్మములు వ్యర్థములు.

అనే ఈ ఉదాహరణలో 'శ్రేయము' అనేది వాక్యావసానం ఉదంతం. 'అది' శబ్దంతో మరో వాక్యం ప్రారంభమవుతుంది. ఇక్కడ ఉత్తుకు అచ్చు పరమవుతుంది. అందుచేత ఉత్తుకు సంధి నిత్యంగా జరగాలి. అయినా 'వాక్యం చివర' కాబట్టి ఈ సూత్రంతో సంధి చేయకపోవడం దోషం కాదని చెప్పాడు.

ఇలా సంధి లేకుండడం (సంధి విరహంబు) కావ్యాల్లో పాదాంతం, వాక్యాంతం అయినప్పుడే సంభవిస్తుంది. అహోబలపతి ఇచ్చిన ఉదాహరణ ఇక్కడ చెప్పుకోవచ్చు.

'పడగనున్న హనుమ భయ విహ్వలుఁడుగాఁడు

అరదమునకు సూతు దచ్యుతుండు'

ఈ ఆటవెలది పద్యంలో 'కాఁడు' అనే పదం మొదటి పాదాంతం చివర ఉంది. ఇది ఉదంతం. పాదాంతం తర్వాత రెండవ పాదం 'అ' అనే అచ్చుతో ప్రారంభమయింది. వాక్యావసానం కాబట్టి ఉత్వసంధి ఇక్కడ చేయకపోయినా దోషం కాదు.

## 19) తృతీయాదులకు నుగాగమంబగు (తత్సమ-8)

**సూత్రాంశం**: నుగాగమం చేరే సందర్భాన్ని వివరించటం

**సూత్రార్థం**: తృతీయావిభక్తి మొదలుకొని సప్తమీ విభక్తివరకుగల ప్రత్యయాలకన్నింటికి చివర 'ను' అనేది ఆగమంగా చేరుతుంది.

**ఉదా॥** రాముని చేతను, రాముని తోడను, రాముని కొఱకును, రాముని వలనను, రాముని కంటెను, రామునకును, రామునియందును

**వ్యాఖ్య:** తృతీయాది విభక్తి ప్రత్యయాలకు నుగాగమం వస్తుంది.

నుక్ + ఆగమము > నుగాగమము. ఇది జిత్తు కనుక విభక్తి ప్రత్యయానికి చివర చేరుతుంది. ఈ 'ను' వర్ణం ద్రుతం. తృతీయాది విభక్తులు ద్రుత ప్రకృతికముటలన్నమాట. 'తృతీయాదులు' అంటే తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠిర సప్తమి ప్రత్యయం ఎప్పుడూ ప్రకృతితో చేర్చే వ్యవహరింపబడుతుంది. గనుక రాముని చేతను, రాముని తోడను ఇత్యాదిగా ఉదాహృతులు ఈ విభక్తులకర్థాలు సూరికారక పరిచ్ఛేదంలో వివరించారు.

## 20) జిత్తు బిందు పూర్వంబగు (తత్సమ-19)

**సూత్రాంశం**: జ్‌గారము ఇత్సంజ్ఞగా ఉన్నప్పుడు జరిగే వ్యాకరణకార్యాన్ని వివరించటం.

**సూత్రార్థం**: జకారం (జ్) ఇత్తుగాగలది జిత్తు, (జ్ + ఇత్తు). జకారం అనే ఇత్తుతో చేర్చి విధించిన ప్రత్యయానికి ముందు బిందువు వస్తుందని సూత్రార్థం.

ఇత్తుగా గలది జకారమిత్తుగాగలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము.

**వ్యాఖ్య:** ఒక ప్రయోజనాన్ని అపేక్షించి ప్రత్యయాదులలో కూర్చబడి ప్రయోగించేటప్పుడు వాడబడే వర్ణానికి ఇద్వర్ణమని పేరు. జకారాన్ని ఇద్వర్ణంగా కలదాన్ని జిత్తు అంటారు. జిత్తును కలిగి ఉన్న వర్ణము బిందు పూర్వకమై ఉంటుంది. అంటే జకారము ఏ వర్ణానికి చివరి ఇత్సంజ్ఞగా ఉపయోగించబడుతుందో ఆ వర్ణానికి ముందు బిందువువస్తుంది.

హ్రస్వ దీర్ఘాలనుబట్టి అలా వచ్చే బిందువు ఖండ, పూర్ణ బిందువులలో ఏదైనా కావచ్చును

ఉదా. 'డుజ్' లో జకారం 'డు' వర్ణానికి ముందు బిందువును సమకూర్చి తాను లోపిస్తుంది.

ఒక కార్యాన్ని తెలపడానికి ప్రత్యయంతో చేర్చబడే వర్ణం ఇద్వర్ణం. దానికి నిర్దేశించిన వ్యాకరణ కార్యాన్ని సూచించిన పిమ్మట లక్ష్యంలో లోపించి పోతుంది.

చిన్నయసూరి వృత్తిలో ఇత్సంజ్ఞను వివవరిస్తూ కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తు నాఁబడు అని నిర్వచించాడు. ఉదాహరణము మీఁద స్పష్టంబగు.

చిన్నయసూరి వృత్తిలో 'ప్రత్యయాదులకు' అనటంచేత ఆగమాలకు కూడా ఈ ఇత్సంజ్ఞను చేర్చవచ్చు.

ఉదా॥ కుజ్, గుజ్,

సూరి వృత్తిలో 'ఉదాహరణము మీఁద స్పష్టంబగు' అని పేర్కొన్నాడు. అంటే రాబోయే తర్వాతి సూత్రాలలో (తత్సమ-22) డుజ్వర్ణకం విధించిన చోట దాని బిందు పూర్వకత్వానికి ఉదాహరణ చూపబడుతున్నదని సూచన.

బాలవ్యాకరణంలో వచ్చే జిత్తులు. డుజ్ (తత్సమ-20), 2. కుజ్, 3. గుజ్ (ఆచ్ఛిక-18,19), 4. పజ్ (సమాస-19), 5. తజ్ (కృదంత-5).

## 21) స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు (తత్సమ-17)

తిర్యక్కులనఁగాఁ బశుపక్ష్యాదులు. జడములనఁగా నచేతనములు.

**సూత్రాంశం:** మహత్ శబ్దాలను గురించి వివరించటం.

**సూత్రార్థం:** స్త్రీలు, పశుపక్ష్యాదులు, అచేతనాలు కాక మిగిలినవాటిని, వాటి విశేషణాలను మహద్వాచకాలని అంటారని అర్థం. స్త్రీ తిర్యక్ జడభిన్నంబులు = స్త్రీ తిర్యక్ జడవాచకాలు కానివి, వాని విశేషణంబులును = వాటి విశేషణాలు; మహత్తులు; మహద్వాచకాలు; అనంబడు = అని పిలవబడతాయి.

**వ్యాఖ్య:** స్త్రీలను పశుపక్ష్యాదులను (తిర్యక్కులను) జడ పదార్థాల్ని (అచేతనాలను) తెలిపే శబ్దాలు; వాటి విశేషణాలు – కానివి 'మహత్తులు'గా పిలవబడతాయి.

ఉదా॥ ధీరుఁడు. రాముఁడు.

ఈ పై ఉదాహరణలో 'రామ' అనే సంస్కృత ప్రాతిపదిక స్త్రీని కానీ, జడవాచకాన్నిగానీ, తిర్యక్కునుగానీ తెలపడం లేదు. ఒక పురుషుణ్ణి తెలుపుతోంది. కాబట్టి 'రామ' అనే ప్రాతిపది 'మహత్తు'. అలాగే విశేషణమైన 'వీర' అనే ప్రాతిపదిక కూడా స్త్రీ తిర్యక్ జడవాచకాల్ని తెలపకుండా 'రామ' అనే పురుషుణ్ణి తెలుపుతోంది కాబట్టి 'వీర' – మహద్వాచకం.

అమహత్తులు : స్త్రీలను తెలిపేవి, పశుపక్ష్యాదుల్ని తెలిపేవి. అచేతనాల్ని తెలిపేవి – వాటి విశేషణాల్ని 'అమహత్తులు' అంటారు. గుణవతి సీత : 'సీత' అనే విశేష్యం, 'గుణవతి' అనే విశేషణం స్త్రీని తెలుపుతున్నాయి. కాబట్టి ఇవి 'అమహత్తులు'. 'మనోహరము మృగము' 'మృగము' అనే విశేష్యం, మనోహరము అనే విశేషణం తిర్యక్కును తెలుపుతున్నాయి. కాబట్టి 'అమహత్తులు' అలాగే 'మనోహరము వనము' 'వనము' అనే విశేష్యం, మనోహరము అనే విశేషణం జడవాచకాన్ని అంటే అచేతనాన్ని తెలుపుతున్నాయి. కాబట్టి అవి అమహద్వాచకాలు.

**22) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు (తత్సమ-18)**

**సూత్రాంశం**: నపుంసక లింగ శబ్దాలకు పుంలింగ తుల్యత్వాన్ని విధించటం

**సూత్రార్థం**: క్లీబములు అంటే నపుంసకాలని అర్థం. సంస్కృతంలో నపుంసకాలైన మిత్ర, శరణ, ప్రధాన, పాత్ర వంటి శబ్దాలు మహద్వాచకాలైనప్పుడు విభాషగా పుంలింగతుల్యత్వాన్ని పొందుతాయని అర్థం.

వ్యాఖ్య: సంస్కృతంలో నపుంసక లింగశబ్దాలై, ఆది మహద్వాచకమైన పక్షంలో ఆ శబ్దాలు వికల్పంగా పుంలింగతుల్యాలు అవుతాయి. ఉదా॥ ('మిత్ర' మొదలైనవి) అంటే పుంలింగ శబ్దాలతో సమానమైన వ్యాకరణ కార్యాలు పొందుతాయని తాత్పర్యం. పుంలింగ తుల్యములైనప్పుడు వీటికి 'రామ' మొదలైన పుంలింగ శబ్దాలలాగ ఉత్వడుజ్ఞులు వస్తాయి. పుంలింగ తుల్యత్వం రాని పక్షంలో సంస్కృతంలో నపుంసకలింగాలు కావడంవల్ల మువర్ణకం వస్తుంది.

ఉదా॥ మిత్రుఁడు, మిత్రము అని ఇలా రెండేసి రూపాలు కలుగుతాయి.

శరణ-శరణుఁడు, శరణము

ప్రధాన-ప్రధానుఁడు, ప్రధానము

పాత్ర-పాత్రుఁడు, పాత్రము.

మిత్రాదులు ఆకృతిగణం.

**23) ఇకారంబు మీఁది 'కు,ను,వు' క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు (తత్సమ-26)**

**సూత్రాంశం**: ఇకారముమీది కు-ను-వు క్రియా విభక్తుల ఉత్వానికి ఇత్వాన్ని రావటం.

**సూత్రార్థం**: ఇకారానికి పరమైన 'కు, ను, వు' అనే ప్రత్యయాల ఉత్వానికి, సమాపక క్రియావిభక్తి ప్రత్యయాల ('డుజ్, రు, వు, ను, ము'ల) ఉత్వానికి ఇత్వం వస్తుంది. ఇక్కడ 'ఇకారం' అనడం చేత 'ఇ, ఈ'లు రెండింటినీ గ్రహించాలి.

ఉదా॥ హరిని, హరికిని; శ్రీని, శ్రీకిని; వారిని, వారికిని.

ఉదా॥ హరి + ను > హరిని,

హరి + కును > హరికి + ను > హరికిని,

వారు అనే సర్వనామరూపం యొక్క ద్వితీయాది విభక్త్యంగం 'వారి'. వారి + ను > వారిని. వారి + కును > వారి + కిను > వారికిని.

దీర్ఘమైన 'ఈ' మీది ఉత్వం ఇత్వం అవడానికి

ఉదా॥ శ్రీ + ను > శ్రీని. శ్రీ + కును > శ్రీకిని.

వ్యాఖ్య: "ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు, నంతాగమంబులు ప్రాయికంబుగ నగు" (కారక-33), "ఈ యాగమంబులు పరంబులగునపు దుత్వంబున కత్వంబగు" (కారక-34) చేత 'వు, ను'లు విశేషణాలపై అంతాగమాలుగా చేరుతాయి. ఈ సూత్రం చేత మీద 'వి', 'ని'లుగా మారతాయి.

(నీవు) సుకృతి + వు > (నీవు) సుకృతివి. (నేను) సుకృతి + ను (నేను) సుకృతిని

పైన ఉదాహరించిన 'ను, కు, వు, ను'లను సూత్రంలో 'కు, ను, వు' లుగా కూర్చడం జరిగింది.

క్రియా విభక్తులకు ఉదా॥। వచ్చి + రు > వచ్చిరి. వచ్చితి + రు > వచ్చితిరి. ఇలాగే వచ్చితివి, మొదలైనవి. 'ఐ'కారం 'ఈ' తుల్యం కనుక (65) రై + ను > రైని, రై + కు > రైకి.

ఈ వ్యాకరణ కార్యం స్వరాకర్షణ లేక స్వరసమతకు ఉదాహరణం (Vowel harmony or Vowel Assimilation) సన్నిహితంగా ఉన్న రెండు అచ్చులలో ఒకటి మరి ఒక దానిని ప్రభావితం చేసి తన లక్షణాన్ని దానికి ఆపాదించడంవల్ల భిన్నాచ్చులు సమానాచ్చులుగా మారుతాయి. ఉచ్చారణ సౌలభ్యం కారణంగా భాషలో జరిగే మార్పులలో ఇది ఒకటి. ఈ విధంగా భిన్నమైన హల్లులు సమాన లక్షణం గల హల్లులుగా మారడాన్ని వర్ణసమీకరణం (Assimilation) అంటారు.

**24) అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు (తత్సమ-38)**

**సూత్రాంశం**: విభక్తి లకారానికి రేఫం రావటం.

**సూత్రార్థం**: హ్రస్వమైన అకారం చివర ఉండి, లకారం ఉపధగా ఉంటే దానికి పూర్వంమందు దీర్ఘాన్ని కలిగి ఉన్న నామం మహద్వాచకమైనప్పుడు దాని మీది విభక్తి లకారానికి రవర్ణం ఆదేశంగా వస్తుందని అర్థం.

బాలురు, బాలురను, బాలురచేతను, నృపాలురు, నృపాలురను, నృపాలురచేతను. దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి, దయాళురు దయాళురను, దయాళురచేతను.

వ్యాఖ్య: శబ్దానికి చివర హ్రస్వ అకారం ఉండడం, చివరి వర్ణానికి ముందు లకారం ఉండి దానికి పూర్వం దీర్ఘాచ్చు ఉండడం మహద్వాచకం కావడం అనే లక్షణం ఉంటే ఆ తత్సమ శబ్దం మీది విభక్తి లకారానికి రేఫ ఆదేశం అవుతుంది.

ఉదా॥ బాల: బాల్ + అ - ఇది అదంతం. బ్ +ఆల్ +అ - లకారం ఉపధగా గలది, బ్+ఆల్+అ - ఉపధ అయిన లకారానికి ముందు దీర్ఘాచ్చు ఉంది. బాల = బాలుడు, మహత్తు తత్సమం. ఇలాటి శబ్దంలో విభక్తి లకారానికి ఈ సూత్రం చేత రేఫా దేశం రావాలి గనుక ప్రథమా బహువచనంలో 'లు' 'రు' అవుతుంది, ద్వితీయాదులలో 'ల' 'ర' అవుతుంది.

బాల + లు > బాల + ర్ +ఉ = బాల + రు > (21) బాలు + రు = బాలురు. ద్వితీయ; బాల + ల + ను > (ఈ సూత్రం చేత) బాల + ర్ + అను = బాల + రను > (21) బాలురను ఇలాగే నృపాల + లు > నృపాలురు, నృపాల + ను > నృపాలురను.

విభక్తి లకారానికి రేఫాదేశం రావడానికి 1) ఆ శబ్దం అదంతమై ఉండాలి. ఉదాహరణకు 'బుద్ధిశాలి' 'బుద్ధిశాలురు' కాదు. అదంతం కాదు కాబట్టి 'బుద్ధిశాలులు' అనే ఉంటుంది.

2) దీర్ఘ పూర్వమై ల ఉపధగా ఉండాలి. 'నల' హ్రస్వ పూర్వము ల ఉపధగా ఉంది కాబట్టి, కనుక 'నలలు' 'నలురు' కావాలి కాబట్టి దీర్ఘం పూర్వంలో లేనందున 'నలురు' కాదు.

3. మహద్వాచకమై ఉండాలి. 'బాల' మహతి వాచకం, బాల శబ్దం ల ఉపధగా కలిగివుంది. దీర్ఘపూర్వం అయింది. అయినప్పటికి మహద్వాచకం కానందున 'బాలరు' కాదు.

ఈ విధంగా సూత్రంలో చెప్పిన దళాలన్నీ సార్థకాలు.

ప్రాతిపదిక 'దయాళు' శబ్దం దీర్ఘపూర్వలోపధం అయిన మహత్తుగాదు. ఇక్కడ 'ళ' ఉపధగా ఉంది. అదంతంకాదు. కాబట్టి పై సూత్రం (తత్సమ-38) ప్రవర్తించదు. కానీ 'దయాళు' శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి' అనే సూరి వివరణ వాక్యంచే దీని మీద వచ్చే బహువచనలకారానికి కూడా రేఫం వస్తుంది.

ఉదా॥ దయాళురు : దయాళు ప్రాతి. తత్సమ-12 దయాళు + లు > ఈ వివరణ వాక్యంచే 'లు' కి రేఫ వచ్చి దయాళు రు అయింది. అలాగే ద్వితీయ రూపం దయాళురను తృతీయ రూపం దయాళురచేతను పై వివరణ వాక్యం చేతనే వీటిని సాధించుకోవచ్చు.

**25) అమహన్నపుంసకముల కదంతంబులకు ము వర్ణకంబగు (తత్సమ-39)**

వృక్షము, ఋక్షము, దైవము, కళత్రము, అపత్యము; క్లీబంబులు మిత్రాదులను సూత్రంబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాది శబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది.

ఉదా॥ మిత్రుఁడు, మిత్రము, శరణుఁడు శరణము

**సూత్రాంశం**: అమహత్ శబ్దాలకు, నపుంసలింగ శబ్దాలకు, అదంత శబ్దాలకు 'ము' వర్ణకం చేరడం.

**సూత్రార్థం**: అమహత్ నపుంసకములకు = అమహత్తులకు, నపుంసకలింగ శబ్దములకు; అదంతంబులకు = హ్రస్వ అకారం అంతమందుండే వాటికి, ముపర్ణకంబు - అగు = 'ము' అనే ప్రత్యయం చేరుతుందని అర్థం.

**వ్యాఖ్య**: హ్రస్వ అకారం చివరన ఉండే (1) అమహద్వాచకాలకు (2) నపుంసకాలకు 'ము' ప్రత్యయం చేరుతుంది. ఇది డుమువులలోని 'ము' వర్ణకమే.

ఉదా॥ వృక్షము : వృక్ష ప్రాతిపదికము. ఇది హ్రస్వ అకారం (అత్తు) చివరన ఉండే అమహత్తు. జడవాచకం. అంటే అచేతనాన్ని తెలిపేది. పై సూత్రముచేత 'ము' చేరి 'వృక్షము', ఇలాగే ఋక్ష > ఋక్షము

ఇలాగే నపుంసకలింగాలు అదంతాలు అయిన దైవ అపత్య అనే అదంత ప్రాతిపదికలకు పై సూత్రం చేత 'ము' చేరి 'దైవము, కళత్రము' అనే తత్సమాలు ఏర్పడతాయి.

**26) రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు. (తత్సమ-47)**

**సూత్రాంశం**: బహువచనం చేరేటపుడు ప్రాతిపదికలో కలిగే మార్పులు.

**సూత్రార్థం**: రలడ ఉపధ = 'రలడ' లు ఉపధగా ఉండేవి. నవ-అర్థాదుల: 'నవ' అర్థం ఉండేవి మొదలైన వాటి ఉపోత్తమ ఇత్వంబునకు = ఉపోత్తమ ఇత్వానికి, ఉత్వంబు గలుగదు = ఉత్వం ఆదేశం కాదు. ఆచ్ఛికాలైన ఉకారాంత శబ్దాల ఉపోత్తమేత్వానికి బహువచనం పరమైనప్పుడు ఇత్వం ఉత్వంగా మారాలి. కాని ఇదంతమే అయినప్పటికి ఉపధగా రలడ అనే వర్ణాలలో దేనిని కలిగిఉన్నప్పటికి ఆ శబ్దం యొక్క ఉపోత్తమేత్వానికి ఉత్వం కలగదు. అలాగే తొమ్మిది మొదలైన పదాల ఉపోత్తమేత్వానికి ఉత్వం రాదు.

ఉదా॥ పందిరి-పందిరులు

పిడికిలి – పిడికిళులు

రాపిడి – రాపిడులు

తొమ్మిది-తొమ్మిదులు

**వ్యాఖ్య:** బహువచనం పరమైనపుడు 1) రలడలు ఉపధలుగా ఉండే ఇకారాంత వికృతి శబ్దాలలోని ఉపోత్తమ ఇత్వానికి ఉత్వం రాదు. ఉదా॥ పందిరి. ఇది వికృతి శబ్దం. 'ర' ఉపధగా ఉంది. తుదివర్ణానికి ముందలి వర్ణం ఉపధ – తుది వర్ణం 'ఇ', దాని ముందున్న వర్ణం రేఫ. పందిరి + లు > "ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు" (తత్సమ-45) పందిరు + లు, "వికృతియందికారంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనంము పరంబగునపు దుత్వంబగు" (తత్సమ-46) ఈ సూత్రం ప్రకారం ఉపోత్తమ ఇత్వం 'ది' లో ఉంది. అది ఉత్వం కావాలి. కానీ 'ర' ఉపధగా ఉండే వికృతి శబ్దం కాబట్టి తత్సమ-47 సూత్రం ప్రకారం 'పందిరులు' అనే రూపం ఉంటుంది కానీ 'పందురులు' అని రూపం ఉండదు.

పిడికిళులు. పిడికిలి: 'ల' ఉపధగా ఉంటే వికృతి శబ్దం. దీనిలో 'కి' లోని 'ఇ' ఉపోత్తమ ఇత్వం. తత్సమ-12 పిడికిలి + లు > తత్సమ-45 పిడికిలు + లు తత్సమ-46 చే 'కి' లోని ఇత్వానికి ఉత్వం వస్తుంటే తత్సమ-47 నిషేధిస్తుంది. పిడికిలు + లు > ఆచ్ఛిక-13 పిడికిళులు (ల > ళ)

రాపిడులు: రాపిడి: వికృతి శబ్దం 'డ' ఉపధగా ఉంది. 'పి'లోని 'ఇ' ఉపోత్తమ ఇత్వం తత్సమ-12 రాపిడి + లు > తత్సమ-45 రాపిడులు తత్సమ-46 చే 'పి' లోని ఇత్వానికి ఉత్వం వస్తుంటే తత్సమ-47 నిషేధిస్తుంది. రాపిడులు.

తొమ్మిది : తొమ్మిదులు: తొమ్మిది: 'నవ' అనే సంఖ్యను సూచించేది. ఇకారాంతం అయిన వికృతి శబ్దం. తత్సమ-12 తొమ్మిది + లు తత్సమ-45 తొమ్మిదు + లు 'మ్మి'లోని ఇతారం ఉపోత్తమ ఇత్వం. నవార్థమైన 'తొమ్మిది'కి తత్సమ-46తో 'మ్మి'లోని ఇత్వానికి ఉత్వం రావాలి. కాని తత్సమ-47లోని 'నవార్థాదుల...' అనే భాగం దీన్ని నిషేధిస్తోంది. తొమ్మిదులు అంటే 'తొమ్ముదులు' అనే రూపం రాదు.

**27) ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు (తత్సమ-48)**

**సూత్రాంశం**: సంస్కృతంలో ఉకారంతమైన శబ్దాలకు గో శబ్దానికి ప్రథమలో 'వు' ప్రత్యయం చేరడం

**సూత్రార్థం**: ఉకారాంత = ఉకారాంతాలకు, గో శబ్దంబులకు = గో -అనే శబ్దానికి, అంతట = అన్ని చోట్ల 'వు' వర్ణకంబు. ఉకారాంత శబ్దాలకు, గో శబ్దానికి ప్రథమైక వచనంలో ఉ వర్ణకం కలుగుతుందని సూత్రార్థం.

ఉదా॥ తరువు, ధేనువు, మధువు, గోవు

వ్యాఖ్య : ఉకారాంత శబ్దములకును, గో శబ్దమునకును 'అంతట' వు ప్రత్యయమగును.

తరువు: తరు – ప్రాతిపదికము. ఇది ఉకారాంతము. కాన పై సూత్రముచే తరువు అవుతుంది.

అలాగే మధు = మధువు. ధేనువు : ధేను – ప్రాతిపదికము. (తత్సమ–48) ధేనువు అవుతుంది.

ఇది స్త్రీలింగము కాబట్టి "స్త్రీలంగంబుల ప్రథమైనకవచనంబునకు లోపంబగు" (తత్సమ–57) సూత్రం చేత ప్రథమైకవచన లోపం వస్తుంది. అంతట వువర్ణకంబగు నని సూత్రంలో చెప్పబడింది. 'అంతట' అని అనటం చేత స్త్రీలింగ ప్రథమైకవచన లోప బాధనార్థమని వివరింపబడింది. కాబట్టి 57చేఁ బ్రాప్తించు ప్రథమైకవచన లోపం 'అంతట' అనటంచేత ఇక్కడ వర్తించదు. ధేనువు – అనురూపమే సిద్ధించును. ఇట్లే, గో– అను స్త్రీలింగశబ్దము నుండి 'గోవు' అనే రూపాన్ని సాధించుకోవాలి. కాగా ప్రథమైకవచన లోపాన్ని నిషేధించటం కోసం సూత్రంలో 'అంతట' అని వాడబడినది.

### 28) స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు (తత్సమ–57)

**సూత్రాంశం**: స్త్రీలింగ శబ్దాలకు ప్రథమైక వచన లోపాన్ని చెప్పటం

**సూత్రార్థం**: స్త్రీ లింగ శబ్దాల యొక్క ప్రథమైక వచనానికి లోపం కలుగుతుందని సూత్రార్థం.

ఉదా॥ రమ, క్షమ, వనిత, ఘనత, విద్య, దేవత, మీననేత్ర

వ్యాఖ్య: స్త్రీలింగ శబ్దముల ప్రథమైకవచనమునకు లోపమగును. రమ – మొదలైనవి.

రమా– ప్రాతిపదికము. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" (తత్సమ–54) చే రమ. తత్సమ–39చే రమ + ము కావాలి. కాని పై సూత్రంచే – మువర్ణకము లోపించి, రమ –అను ప్రథమైకవచన మేర్పడుతుంది.

ఇలాగే క్షమా, వనితా, ఘనతా, విద్యా, మీననేత్రా అను వానినుండి క్షమ, వనిత, ఘనత, విద్య, మీననేత్ర – అనే రూపాలు ఏర్పడతాయి. మీననేత్రా – అనునది సమాసానికి ఉదాహరణ.

దేవత: దేవతా – ప్రాతిపదిక. తత్సమ–54చే – దేవత. ఇది పుంలింగం కకపోవటం చేత ఉత్వడుజ్ఞులు రావు (తత్సమ–21, 22). అనుక్తన్యాయంతో 'ను' ప్రత్యయం చేరి, దేవత + ను – దేవతను అవుతుంది. ఇది స్త్రీలింగ శబ్దం కాబట్టి ఈ పై సూత్రం చేత 'ను' లోపించి దేవత–అనే ప్రథమైకవచన రూపం సిద్ధిస్తుంది.

### 29) దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు (తత్సమ–61)

**సూత్రాంశం**: దూతాది శబ్దాలకు స్త్రీత్వాన్ని విధించటం.

**సూత్రార్థం**: దూతాదులకు = దూత మొదలైన ప్రాతిపదికలకు, స్త్రీత్వంబు = స్త్రీ లింగ తుల్యత, బహుళంబుగాన్ – అగు = బహుళంగా వస్తుంది. దూత, యోధ, శుంఠ శబ్దాలకు బహుళంగా స్త్రీత్వం కలుగుతుందని అర్థం.

ఉదా॥ దూత, దూతుఁడు; యోధ, యోధుఁడు; శుంఠ, శుంఠుఁడు. బహుళ గ్రహణముచే నమహత్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబు దూతయగు జంబుకంబు.

**వ్యాఖ్య**: సంస్కృతంలో పుంలింగాలైన 'దూత' మొదలైన ప్రాతిపదికలకు స్త్రీలింగత్వం బహుళంగా వస్తుంది.

ఉదా॥ దూత / దూతుఁడు

దూత – అకారాంతం – పులింగం. అది మహద్వాచకమైనప్పుడు ఉత్వడుజ్ఞులు కలిగి దూతుడు అనే రూపం ఏర్పడాలి. కాని ఈ సూత్ర్ చేత స్త్రీత్వం వికల్పంగా కలిగి ప్రథమైకవచనం లోపిస్తుంది. అత్వానికి కలిగే ఉత్వం కూడా రాదు. అప్పుడు దూత అనే రూపమే ఏర్పడుతుంది. ఉదా॥ "రామునికి హనుమంతుడు దూతుడు" అని కాకుండా "రామునికి హనుమంతుడు దూత" అనే రూపం ఏర్పడుతుంది. అలాగే యోధ, శుంఠ శబ్దాలు కూడా

రామదూత, మహాయోధ, మహాశుంఠ వంటి శబ్దాల వంటి సమాసంలో స్త్రీత్వం కలిగి ప్రవర్తించటాన్ని గమనించవచ్చు.

సూత్రంలో 'బహుళం' అని చెప్పినందువల్ల అమహత్తుల్లో నిత్యంగా స్త్రీత్వం విధించబడింది. ఇది బహుళంలోని 'అప్రవృత్తి'కి ఉదా॥ సింగంబు దూతయగు జంబుకంబు : జంబుకంబు విశేష్యం –అమహత్తు దీని విశేషణమైన 'దూత' శబ్దం కూడా కారక 19చే అమహత్తుకావాలి. తత్సమ–39 తో దూత + ము 'బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు అనే వివరణ వాక్యం ప్రవర్తించి 'దూత' కు స్త్రీత్వం విధిస్తే తత్సమ–57తో ములోపం: 'దూత' అనే తత్సమం ఉ ంటుంది. అమహత్వంలో 'దూతము' అనే రూపం ఉండదు. 'దూతుఁడు' అనే మహద్రూపం రాదు. దూతాదులకు మహత్తులైనప్పుడు రెండు రూపాలు అమహత్తులైనప్పుడు స్త్రీ తుల్యమైన ఒక్క రూపమే ఉంటుందని తాత్పర్యం. మహతీ వాచకమైనప్పుడు స్త్రీ తుల్యమైన రూపం ఒక్కటే ఉంటుంది.

### 30) విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు (తత్సమ-75)

**సూత్రాంశం**: హలంతమైన విశ్వకర్మన్ మొదలైన శబ్దాలకు స్త్రీలింగత్వాన్ని ఆరోపించటం.

**సూత్రార్థం**: విశ్వకర్మన్ మొదలైన నకారాంతాలైన పుంలింగ శబ్దాలకు ఉత్వదుజ్లులు రావని సూత్రార్థం.

ఉదా॥ స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వదుజ్లులు లేవని యెఱుంగునది. విశ్వకర్మ, కృష్ణవర్త్మ, అశ్వత్థామ, యువ, యజ్వ ఇత్యాదులు.

వ్యాఖ్య: విశ్వకర్మన్ మొదలైన పుంలింగ శబ్దాలకు స్త్రీత్వం వచ్చి, ఉత్వదుజ్లులు రావు. విశ్వకర్మాదులు నకారంత శబ్దాలు కావటం చేత 'శ్వ' శబ్దంబు తప్ప నకారాంతంబులెల్లన్ ప్రథమైకవచన తుల్యంబులే యగునని ఎఱుంగునది." అనే విధిని బట్టి విశ్వకర్మా, కృష్ణవర్త్మా, అశ్వత్థామా, యువా, యజ్వా అనే దీర్ఘాంతాలైన ప్రథమైకవచన తుల్యరూపాలనే ప్రాతిపదికలుగా గ్రహించాలి. ఆ తరువాత నామంబుల తుది దీర్ఘానికి హ్రస్వం వచ్చి విశ్వకర్మ, కృష్ణవర్త్మ, అశ్వత్థామ, యువ, యజ్వ వంటి రూపాలు ఏర్పడతాయి. ప్రస్తుత సూత్రం చేత ప్రథమైకవచన లోపాలు జరిగి అశ్వత్థామ వంటి రూపాలే ఉంటాయి.

### 31) మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు (తత్సమ-78)

రాజు, ఖగరాజు, అమహత్త్వంబునందు రాజము, వృక్షరాజము, ఉపసర్జనత్వంబునందు హతరాజుఁడు పరశురాముఁడు.

**సూత్రాంశం**: మహద్వాచకమైన రాజు శబ్దాన్ని గురించి

**సూత్రార్థం**: మహద్వాచకమై స్వార్థ ప్రధానమైనప్పుడు రాజశబ్దం ప్రథమైకవచనంలో రాజు అవుతుందని సూత్రార్థం.

**వ్యాఖ్య**: రాజశబ్దము స్వార్థపరమై మహత్త్వ బోధకమైనప్పుడు 'రాజు' అనే రూపం నిపాతగా సిద్ధిస్తుంది. స్వార్థపరమైనప్పుడు అంటే ఆత్మార్థానికి ప్రాధాన్యం కలిగిఉండటం. ప్రాధాన్యము అంటే వాక్యంలోక్రియతో అన్వయం కలిగి ఉండటం.

సంస్కృతంలో రాజ శబ్దము ప్రథమైకవచనము 'రాజా' అని ఉంటుంది. దీర్ఘానికి హ్రస్వం వచ్చి ఉత్వము డుజ్ చేరి రాజుఁడు అనే అనిష్టరూపం ఏర్పడుతుంది. దానిని పరిహరించటం కోసమే ఈ సూత్రాన్ని చెప్పాడు.

రాజ శబ్దము మహద్వాచకమై స్వార్థప్రాధాన్యం కలిగివున్నప్పుడు రాజు అనే నిపాతరూపం ఏర్పడుతుంది. అంటే ఇది ప్రథమైకవచనాంతంతో సమానమైన తత్సమరూపం. కాబట్టి ప్రథమైకవచనంలో రాజు అని ఇతర విభక్తులలో రాజులు, రాజును, రాజుచే, రాజులచే మొదలైన విధంగా ఉంటుంది. 'రాజు కప్పముగొనెను' – రాజుచే రక్షింపబడెను.

ఈ స్వార్థపరమైనప్పుడు రాజ శబ్దానికి ఉదాహరణలుగా ఇవి కనిపిస్తాయి. సమాసంలో కూడ మునిరాజు, ఖగరాజు, మహారాజు వంటి రూపాలు కనిపిస్తాయి.

స్వార్థపరమైనప్పటికి అమహత్వమై ఉన్నప్పుడు రాజశబ్దంపై ము వర్ణకం చేరి వృక్షరాజము, పర్వతరాజము వంటి రూపాలు ఏర్పడతాయి. ఉపసర్జనత్వము అంటే అప్రధానత్వము అని అర్థము. ఇటువంటి అప్రధానత్వము సాధారణంగా బహువ్రీహి సమాసాంతర్గతమైన రాజ శబ్దానికి కలుగుతుంది. హతరాజుఁడు పరశురాముఁడు వచ్చెను అనే ఈ వాక్యంలో హతరాజుఁడు అనేది పరశురాముఁడు అనే శబ్దానికి విశేషణం. దానికి క్రియతో అన్వయం లేదు. కాబట్టి అది విశేష్యంలాగానే లింగ విభక్తి వచనాలను పొందుతుంది. కాబట్టి హతరాజ అనునది ఉత్వదుజ్‌లను పొంది హతరాజుడు అవుతుంది. 'చంపబడిన రాజులను కలగిన పరశురాముఁడు వచ్చెన్' అని అనటం చేత ఇక్కడ రాజ శబ్దము అప్రధానమైనది.

### 32) భవచ్ఛత్రాదుల కిందు బ్రయోగంబు లేదు (తత్సమ-87)

భవదాదులగు హలంత సర్వనామంబులకును, శతృరేఫాంతాదులకును దెనుఁగు భాషయందు వ్యవహారంబు లేదని యర్థము. సమాసంబులందొలుతంగదిసి యిందుం బ్రయుక్తంబులగు: భవద్గుణంబులు, త్వదాశ్రయము, మత్పుణ్యము, లసద్రూపము భవిష్యత్కాలము, ధూర్వహము. ఇత్యాదులెఱుంగునది.

**సూత్రాంశం**: తెలుగులో వ్యస్తంగా ఉండని తత్సమ శబ్దాలను గురించి.

**సూత్రార్థం**: భవత్ + శతృ + ఆదులకు = భవత్, శతృ, మొదలైన శబ్దాలకు. ఇందు = తెలుగులో తత్సమాలుగా, ప్రయోగంబు లేదు = ప్రయోగించరు.

**వ్యాఖ్య:** (1) భవత్, త్వత్, యుష్మత్, మత్, అస్మత్, తత్, ఏతత్ – మొదలైనవి భవదాదులు.

(2) లసత్, భవిష్యత్, మొదలైనవి శత్రాదులు

(3) ధూర్, గీర్, దోర్ మొదలైనవి రేఫాంతాలు.

ఈ భవదాదులకు, శత్రాదులకు, రేఫాంతాలకు తెలుగులో ప్రయోగంలేదని సూత్రార్థము. సమాసంలో పూర్వశబ్దాలుగా ప్రయోగించటానికి ఆక్షేపణ లేదు.

భవత్, త్వత్, మత్ అనేవి హలంత సర్వనామాలు. ఇవి వ్యస్తంగా తత్సమాలు కావు. సమాసంలో పూర్వపదాలుగా ఉంటాయి. భవత్ + గుణంబులు > భవద్గుణంబులు, త్వత్ + ఆశ్రయము > త్వదాశ్రయము, మత్ + పుణ్యము = మత్పుణ్యము.

లసత్ (ఒప్పుతున్న) భవిష్యత్ (రాగల) అనేవి ధాతువుల 'శత్రంతరూపాలు' ఇవి తత్సమాలుగా రావు. సమాసాల్లో పూర్వపదాలుగా వస్తాయి. లసత్ + రూపము > లసద్రూపము; భవిష్యత్ + కాలము > భవిష్యత్కాలము. (వ్యవహారంలో 'భవిష్యత్తు' అనే రూపం ఉంది.)

ధూర్–రేపాంతం వ్యస్తంగా తెలుగులోకి రాదు. సమాసంలో పూర్వపదంగా వస్తుంది. ధూర్ + వహము > ధూర్వహము.

### 33) బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు (ఆచ్ఛిక–3)

**సూత్రాంశం**: సంస్కృతంలోని రామాది శబ్దాలవలె ఉత్వదుజ్ఞులు చేరతాయని చెప్పటం సూత్రంలోని అంశం.

**సూత్రార్థం**: బల్లిద – ఆదులు = బల్లిద మొ॥న ఆచ్ఛిక శబ్దాలు, సంస్కృత తుల్యంబులు = సంస్కృత శబ్దాలతో సమానాలు. బల్లిద మొదలైన ఆచ్ఛిక శబ్దాలు విభక్తిని వివక్షించేటప్పుడు సంస్కృత ప్రాతిపదికలతో సమానంగా గ్రహించి ప్రక్రియలు జరపాలని చెప్పటం సూత్రార్థం.

మహత్త్వంబున వీని కుత్వదుజాదులు నమహత్త్వంబున ముపర్ణకాదులును, స్త్రీత్వంబునం దాలు శబ్దము తోడ సమాసంబునుం గలుగునని యెఱుంగునది.

ఉదా॥ బల్లిదుఁడు, బల్లిదము, బల్లిదురాలు,

బల్లిద, అక్కజ కావల, బెట్టిద, బడిద, మిసిమింత, మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు.

వ్యాఖ్య: రామ మొదలైన సంస్కృత ప్రాతిపదికలు ఉత్వదుజ్ఞులు కలుగుతాయి. "పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వంబగు" (తత్సమ–21)చేత రాము అవుతుంది. "పులింగమగు మహద్వాచకమునకు డుజ్ఞగు" (తత్సమ–22) అనే సూత్రం చేత డు వర్ణం కలిగి 'రాముఁడు' అని అవుతుంది. అలాగే 'బల్లిద' మొదలైన తెలుగు ప్రాతిపదికలను కూడా సంస్కృత తుల్యమైనవాటిగా పరిగణించబడటం చేత బల్లిదుడు వంటి రూపాలు ఉత్వదుజ్ఞులతో కలసి ఏర్పడతాయి. వృత్తిలో మహత్వంబున అని అనటంలో మహత్తులను బోధించునప్పుడు అని అర్థం. "స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు" (తత్సమ–17) అనే సూత్రం ప్రకారం స్త్రీ వాచకాలు, తిర్యక్ వాచకాలు, జడవాచకాలు కానివి వాటి విశేషణాలు మహత్తులవుతాయి. అటువంటి మహత్తులకు ఉత్తదుజ్ఞులు కలిగి బల్లిదుడు, అక్కజుడు, కావలుడు, బెట్టిదుడు వంటి రూపాలు ఏర్పడతాయి.

అహత్వంబున అంటే అమహత్తులను బోధించేటప్పుడు అని అర్థం. వృక్ష మొదలైన సంస్కృత నామాలకు తెలుగులో "అమహన్న పుంసకముల కదంతంబులకు ముపర్ణకంబగు" (తత్సమ–39) అనే సూత్రం చేత 'ము' అనే ప్రత్యయం కలిగి వృక్షము అనే రూపం ఏర్పడుతుంది. సంస్కృత తుల్యత్వం చేత బల్లిద మొదలైన తెలుగు నామాలకు కూడా అమహత్తువల్ల ముపర్ణకం కలిగి బల్లిదము, అక్కజము, కావలము, బెట్టిదము వంటి రూపాలు ఏర్పడతాయి.

స్త్రీత్వంబునందు అని అంటే మహతీవాచకమయినప్పుడని అర్థం. స్త్రీని గురించి చెప్పేటప్పుడు బల్లిద మొదలైన నామాలకు ఆలు శబ్దాన్ని చేర్చి సమాసాన్ని చేయాలి.

బల్లిద + ఆలు ఈ సూత్రం చేత సంస్కృత తుల్యంత్వాన్ని పొందిన కారణంగా 'తత్సమంబులకు ఆలు శబ్దము పరమగునపుడు అత్వంబునకుత్వంబును రుగాగమంబునగు' అనే విధినసురించి రేఫ ఆగమంగా వచ్చి బల్లిదు + ర్ + ఆలు = బల్లిదురాలు – అవుతుంది. అలాగే అక్కజురాలు, కావలిరాలు, బెట్టిదురాలు వంటి మహతీ వాచకరూపాలు ఏర్పడతాయి.

ఇలా మూడు వాచకాలలోను రూపాలను కలిగివుండటం వల్లనే బల్లిదాదులు సంస్కృత తుల్యాలుగా పరిగణించబడ్డాయి.

### 34) పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు (ఆచ్ఛిక-5)

**సూత్రాంశం**: ఆచ్చిక శబ్దాల బహువచన రూపాలలో కలిగే మార్పు.

**సూత్రార్థం**: పగత – ఆదుల = పగత మొదలైన శబ్దాల బహువచన లకారంబునకు = బహువచనలకారానికి , రేఫంబు – అగు = రేఫం ఆదేశం అవుతుంది. పగత మొదలైన తెలుగు శబ్దాలకు బహువచనంలో లకారానికి బదులుగా రేఫాదేశం అవుతుందని సూత్రార్థం.

ఉదా॥ పగతురు, అల్లురు, నెయ్యురు, బలియురు, మార్తురు

వ్యాఖ్య: 'పగత' మొదలైన ఆచ్ఛిక శబ్దాల బహువచన లకారానికి రేఫ ఆదేశంగా వస్తుంది.

ఉదా॥ పగతురు: పగత – ప్రాతిపదిక.

"ఆచ్ఛిక శబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీ సమంబులు, గ్లీబసమంబులయి యుండు" (ఆచ్ఛిక-2) అనే సూత్రం చేత పుంలింగతుల్యత వచ్చి "పులంగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వంబగు (తత్సమ-21) అనే సూత్రం చేత పగతు అవుతుంది "లువర్ణంబు బహువచనంబు" (తత్సమ-12) అనే సూత్రం చేత పగతులు అవుతుంది. పగతు + లు > "పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు" (ఆచ్ఛిక-5) అనే సూత్రం చేత 'పగతురు'. అనే రూపం ఏర్పడుతుంది. ఇలాగే అల్లులు > అల్లురు; బలియులు > బలియురు; మార్తులు > మార్తురు.

### 35) కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు (ఆచ్ఛిక-9)

**సూత్రాంశం**: కూఁతురు శబ్ద రూపనిష్పత్తిని చెప్పటం.

**సూత్రార్థం**: కూఁతు శబ్దము. 'కూఁతు' అనే శబ్దం యొక్క ప్రథమా ఏకవచనంబునకు = ప్రథమా ఏకవచన ప్రత్యయానికి రువర్ణంబు అగు = రు అనే వర్ణం వస్తుందని అర్థం. కూఁతు శబ్దానికి ప్రథమైకవచనంలో రు వర్ణం అదనంగా చేరుతుంది.

**వ్యాఖ్య**: 'కూఁతు శబ్దం ప్రథమైకవచనానికి 'రు' వర్ణం అధికంగా వచ్చి చేరుతుంది. ఆచ్ఛిక పరిచ్ఛేదంలోనే చిన్నయసూరి వివిధ శబ్దాల బహువచన రూపనిష్పత్తులను అధికంగా చెప్పటం కనిపిస్తుంది. ఈ సూత్రంలో ఏకవచన రూపాన్ని చెప్పటం కనిపిస్తుంది. చిన్నయసూరి కూఁతు అనే శబ్దాన్ని ప్రాతిపదికగా గ్రహించటం వలన బహువచనంలో లు వర్ణం చేరి రూపాన్ని సాధించుకోవచ్చు అని చెప్పినట్లయింది.

ఉదా॥ కూఁతులు, కూఁతులను

కూఁతు శబ్దానికి ప్రథమైకవచనంలో 'రు' వర్ణాన్ని చెప్పటాన్ని ఈ సూత్రంలో వివరించారు.

కూఁతురు : కూఁతు ప్రాతిపదిక. "ఉకారాంత గోశబ్దంబుల కంతటవువర్ణకంబగు" (తత్సమ-48) చే కూఁతు + వు పై సూత్రంచేత ప్రథమైకవచన 'వు' ప్రత్యయానికి బదులు 'రు' ఆదేశం అవుతుంది. కూతు + రు > కూఁతురు.

కూఁతులు: కూఁతు ప్రాతిపదిక. "లువర్ణంబు బహువనంబు" (తత్సమ-12) చేత కూతు + లు > కూఁతులు.

కూతురులు: 'కూఁతురు' ప్రథమైకవచన రూపం. ఇందులో 'రు' అనే ప్రత్యయం చేరి ఉంది. దీనిమీద బహువచన ప్రత్యయమైన లు చేరి కూఁతురు+లు అనే రూపం ఏర్పడాలి. కూఁతురులు అనే రూపం వ్యవహారంలో ఉన్నా కావ్యభాషలో అది అసాధురూపం. లక్షణ విరుద్ధమైనది కాబట్టి గ్రామ్యంగా చిన్నయసూరి పేర్కొన్నాడు.

కూతుళ్లు: 'కూఁతురు' అనే ప్రథమైకవచన రూపం మీద బహువచన 'లు' చేరి ఏర్పడిన రూపం. ప్రత్యయం ఇప్పటికే కలిగి ఉన్న రూపం కాబట్టి 'లు' చేరడం లక్షణ విరుద్ధం అవుతుంది. అంటే 'కూఁతుళ్లు' గ్రామ్యం అన్నమాట. దీని సాధురూపం కూఁతు + లు > కూఁతులు అనేది.

కూఁతురిని: 'కూఁతురు' అనే ప్రథమైకవచన రూపం మీద ద్వితీయ 'ను' చేరి 'కూఁతురుని' అనే రూపం ఏర్పడటం లక్షణ విరుద్ధం. కాబట్టి అది గ్రామ్యం.

### 36) ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వక దకారంబు నగు (ఆచ్ఛిక-11)

**సూత్రాంశం**: ఆలు మొదలైన శబ్దాల బహువచన రూపాల్ని వివరించటం.

**సూత్రార్థం**: ఆలు మొదలైన శబ్దాల బహువచన లకారానికి రేఫ వస్తుంది. దానికి ముందున్న 'లు' వర్ణానికి బిందుపూర్వక డకారం వస్తుందని అర్థం.

**ఉదా॥** ఆండ్రు – ఆండ్రను; ఆలు – చెలియలు – చెల్లెలు – కోడలు, మఱఁదలు ఇవి యాల్వాదులు.

**వ్యాఖ్య:** ఆలు మొదలైన శబ్దాల బహువచన లకారానికి రేఫ వస్తుంది. దానికి పూర్వమందున్న శబ్దగతమైన లు వర్ణానికి బిందుపూర్వక డకారము (ండ్) వస్తుంది. ఉదా॥ ఆలు + లు అని ఉండగా సూత్రంలో చెప్పిన వ్యాకరణ కార్యం ప్రకారం ఆ–ండ్+రు = ఆండ్రు అని అవుతుంది.

ఇలాగే చెలియండ్రు – చెల్లెండ్రు, కోడండ్రు, మఱఁదండ్రు వంటి రూపాలు ఏర్పడతాయి.

వీటికి ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు ఆండ్రను – చెలియండ్రను – చెల్లెండ్రను – కోడండ్రను – మఱఁదండ్రను మొదలైన విభిన్న రూపాలు ఉంటాయి.

సూరి సూత్రంలో 'బిందుపూర్వక డకారము' అని మాత్రమే చెప్పాడు. కాబట్టి అర్ధబిందువు వాడితే తప్పేమిటి? అనే ప్రశ్న కలగవచ్చు. డకార రకార సంయోగము (డ్రు) పరమందున్నది కాబట్టి "సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు" (ఆచ్ఛిక–15) అనే సూత్రాన్ని బట్టి అర్ధబిందువు కూడ పూర్ణబిందువుగా మారుతుంది. కాబట్టి పరిణామరూపంగా డకారమునకు ముందు నిండుసున్నయే నిలుస్తుంది. కాబట్టి సూత్రంలో చెప్పిన పూర్ణ బిందువు సార్థకం.

**37) సమానపదంబునందు సంయోగంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు (ఆచ్ఛిక–15)**

**సూత్రాంశం**: ఆచ్ఛిక పదాల బహువచన రూప నిష్పత్తిని చెప్పటం.

**సూత్రార్థం**: సమాన పదంబునందు – అంటే ఏకపదంలో అని అర్థం. సంయోగము పరమైనప్పుడు అంటే రెండు పొల్లుహల్లుల యొక్క రూపం పరమైనప్పుడు, ఖండబిందునకుం అంటే అరసున్నకు, బూర్ణంబగు అంటే పూర్ణ బిందువు వస్తుందని సూత్రార్థం.

ఉదా॥ అనఁటులు – అనంట్లు; పనఁటులు – పనంట్లు; గోఁటులు – గోంట్లు; తేఁటులు – తేంట్లు; ఏఁడులు – ఏండ్లు; కాఁడులు – కాండ్లు. ఏండ్లు, కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి; తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబు కాదు.

వ్యాఖ్య: సమానపదము అని అంటే అఖండ మైన ఒకే పదమని అర్థం. భిన్న భిన్న పదాలు కూడి ఏకపదమై సమానము అని యనిపించుకొంటుంది. అందులో భిన్న భిన్న పదాలను వేరు వేరుగా నిరూపించవచ్చు. అలా భిన్న భిన్న పదాలుగా వేరుచేయటానికి వీలులేని అఖండపదాన్నే సమానపదమని అంటారు. ఇటువంటి సమానపదంలోని ఖండబిందువునకు బహువచన లకారంతో సంయుక్తమైన వర్ణం పరమైనప్పుడు అన్ని చోట్ల పూర్ణబిందు వస్తుందని సూత్ర తాత్పర్యం.

'ఎల్లచో' అని అంటే అన్ని సందర్భాలలో అని అర్థం. హ్రస్వముమీది ఖండబిందువునకు పూర్ణబిందువు విభాషగా రావటానికి ఆక్షేపం లేదు కాని, దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు. ప్రస్తుతసూత్రం వలన "ఎల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు'' అని చెప్పటం చేత దీర్ఘము మీద సైతము పూర్ణబిందువు వస్తుందని అర్థము.

అనఁటులు – "బహువచనంబు పరంబగునపుడు డ–ల–ట–రల యుత్వంబునకుం లోపంబు బహుళంబుగానగు'' అనే సూత్రం చేత ఉత్వం లోపించి 'అనఁట్లు' అని అవుతుంది. ప్రస్తుత సూత్రం చేత సంయోగానికి ముందున్న ఖండబిందువు పూర్ణబిందువు కావాలి. అప్పుడు 'అనంట్లు' అనే రూపం సిద్ధిస్తుంది. ఉత్వలోపవిధి బహుళమని చెప్పటం చేత ఉత్వలోపం రాకపోతే అనఁటులు, అనంటులు – అనే ఖండాఖండబిందువులతో కూడిన రూపాలు రెండూ ఉండవచ్చు.

ఏఁడు+లు అని అన్నప్పుడు, డకారము మీది ఉత్వానికి లోపం రావాలి. వస్తే 'ఏండ్లు' అని అవుతుంది. "బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు" (ఆచ్ఛిక–14) అనే సూత్రంచేత డకారానికి ళకారం రావాలి. దాని ప్రకారం 'ఏఁళ్ళు' అనే రూపం ఏర్పడాలి. కాని తెలుగులో పరుషసరళాలకు ముందే బిందువు కనిపిస్తుంది అనే నియమం ప్రకారం స్థిరవర్ణమైన ళకారానికి ముందు బిందువు అంగీకరించటం సమంజసం కాదని సూరి ఉ

ద్దేశం. శబ్దంలో సహజంగానే బిందువున్నది. కాబట్టి డకారానికి ళకారాన్ని అంగీకరించకపోతే ఏ ఇబ్బంది ఉండదు. కాబట్టి ఏఁడ్లు – కాఁడ్లు అని యేర్పడిన రూపములలోని అర్ధబిందువులకు పిమ్మట సంయోగ మున్నది. కావున ప్రస్తుత సూత్రంచేత పూర్ణబిందువు చేరగా ఏండ్లు, కాండ్లు – అనే రూపములేర్పడును. ఉత్వలోపం కానియెడల ఏఁడులు, కాఁడులు – అనే ఉంటాయి. దీర్ఘము మీదివి కాబట్టి ఇచ్చట ఖండబిందువులకు పూర్ణబిందువులు రావు.

**38) కలన్వాదుల నువర్ణంబు కుఙ్గు బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు (ఆచ్ఛిక-18)**

**సూత్రాంశం**: ఆచ్ఛిక పదాల బహువచన పదాల రూపనిష్పత్తిని వివరించటం.

**సూత్రార్థం**: కలను మొదలైన శబ్దాల చివరి నువర్ణానికి బదులుగా కుఙ్గు అనే వర్ణంలో ఏకవచనంలో వికల్పంగా, బహువచనంలో నిత్యంగా వస్తుందని సూత్రార్థము, కుఙ్గు అని అంటే బిందుపూర్వకమయిన కువర్ణమని అర్థము.

ఉదా॥ కలఁకు – కలను – కలఁకులు; కలను – కెలను – కొఱను – కొలను – గవను – నెఱను – మ్రాను – వరను – ఇవి కలన్వాదులు.

**వ్యాఖ్య**: కలను, కలఁకు – అనే రెండు రూపాలు ఏకవచనంలో ఉండవచ్చు. బహువచనంలో కుఙ్గు నిత్యమని చెప్పటం వలన 'కలఁకులు' అనే ఒక్కరూపమే ఉంటుంది. హ్రస్వము మీది అర్థానుస్వారానికి వికల్పంగా పూర్ణబిందువు వచ్చి కలంకు, కలంకులు – వంటి రూపాలు ఏర్పడతాయి. దీర్ఘము మీది సాధ్యపూర్ణము లేనందువలన 'మ్రాను, మ్రాఁకు' – వంటి ఏకవచనంలో, 'మ్రాఁకులు' అని బహువచనంలో రూపాలుంటాయి.

**39) బహువచనంబు పరంబగు నపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు (ఆచ్ఛిక-22)**

**సూత్రాంశం**: ఆవు మొదలైన శబ్దాల బహువచన రూపనిష్పత్తిని వివరించటం

**సూత్రార్థం**: ఆవు, జాము, చుట్టము, మీసము – అనే నాలుగు శబ్దములయొక్క తుదియక్షరానికి లువర్ణంగాని ఆగమలకారంగాని పరమైనప్పుడు లోపం విభాషగా వస్తుందని సూత్రార్థము.

ఉదా॥ ఆవు – ఆలు – ఆవులు; జాము–జాలు–జాములు; చుట్టము–చుట్టలు–చుట్టములు; మీసము – మీసలు–మీసములు.

**వ్యాఖ్య**: బహువచనం పరమైనప్పుడు ఆవు మొదలైన శబ్దాల తుది అక్షరానికి లోపం విభాషగా వస్తుంది.

ఆవు + లు – కడపటి 'వు' వర్ణానికి లోపం రాగా 'ఆలు' అని అవుతుంది. లోపం విభాష కాబట్టి లోపం రానప్పుడు 'ఆవులు' అనే రూపమే ఉంటుంది. అలాగే చుట్టము శబ్దానికి చుట్టలు, చుట్టములు – అని, మీసము శబ్దానికి మీసలు, మీసములు – అనే రెండేసి రూపాలు బహువచనంలో ఉంటాయి. జాము శబ్దానికి జాలు, జాములు – అనే రెండు రూపాలుంటాయి.

**40) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు (ఆచ్ఛిక-23)**

**సూత్రాంశం**: ఆచ్ఛిక శబ్దాలలో నామం చివర జరిగే మార్పును చెప్పటం.

**సూత్రార్థం**: ఇయకు మాఱుగా = 'ఇయ'కు బదులుగా నామాంతంబునకు = నామం చివరనున్న దానికి, ఎత్వంబు = ఎకారం, బహుళంబుగాన్ – అగు = బహుళంగా ఆదేశం అవుతుంది. ఆచ్ఛిక నామం చివర 'ఇయ' అనే రెండక్షరాలకు బదులుగా ఎత్వం బహుళంగా వస్తుందని సూత్రార్థం.

ఉదా॥ కన్నియ–కన్నె; జన్నియ–జన్నె; వన్నియ–వన్నె; కొంచియము – కొంచెము; కొండియము–కొండెము;

బహుళ గ్రహణముచే సందియము, కాఱియ మొదలగు శబ్దములందెత్వము లేదు.

జయ శబ్దంబునం దికార లోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబు లందు మృగ్యంబు. ముత్తియ శబ్దంబునందు మాత్రమిత్వలోపంబు గానంబడియెడి. ముత్తియము: ముత్తెము, ముత్యము.

వ్యాఖ్య: ఆచ్ఛిక ప్రాతిపదిక చివరన ఉండే 'ఇయ'కు ఎత్వం (ఎ) ఆదేశం బహుళంగా వస్తుంది.

ఉదా॥ కన్నియె – కన్నె:

కన్నియ ప్రాతిపదిక. దీని చివర 'ఇయ' ఉంది (కనన్ –ఇయ) ఈ సూత్రం చేత 'ఇయ' కు 'ఎ' దేశం బహుళంగా వస్తే కన్న్–ఎ > కన్నె. 'ఇయ' కు 'ఎ' ఆదేశం రాకపోతే 'కన్నియ' అనే రూపమే ఉంటుంది.

ఇలాగే జన్నియ > జన్నె/ జన్నియ; వన్నియ > వన్నె/వన్నియ;

కొంచియము: కొంచియ ప్రాతిపదిక. పై సూత్రం చేత కొంచె > "అమహన్న పుంసకములకదంతంబులకు ముర్ణకంబగు" (తత్సమ-39) అనే సూత్రం చేత కొంచెము అవుతుంది. లేనపుడు 'కొంచియము' అనే ఉంటుంది.

కొండియము: కొండియ ప్రాతి. పై సూత్రం చేత కొండె > తత్సమ-39చే కొండెము. 'ఇయ' కు 'ఎ' రాకపోతే కొండియము. బహుళంలోని విభాషకు ఉదా॥ 'సందియము, కాతియ' మొ॥న శబ్దాలలోని 'ఇయ'కు ఎత్వం లేదని చిన్నయసూరి వివరణ వాక్యం రచించాడు. అంటే ఇది బహుళంలోని 'అప్రవృత్తి' కి ఉదా॥ (చెప్పిన వ్యాకరణ కార్యం జరగకపోవడం అప్రవృత్తి)

'ఇయ' శబ్దంలో 'ఇ' లోపిస్తుందని కొందరు (అధర్వణాచార్యులు, అహోబిల పండితుడు) తెలిపాడు. అలాటిది కావ్యాలలో మృగ్యం- వెదగతగినది అని చిన్నయసూరి వివరించాడు. 'ముత్తియ' శబ్దంబు నందమాత్ర 'మిత్వలోపంబు గానంబడియెడి' అని సూరి వివరణ.

ముత్తియము > ముత్యము: ముత్త్ఇయ-ము 'ఇయ' లోని 'ఇ' లోపిస్తే ముత్త్యము ద్విత్వం మీద మరో హల్లు చేరి సంయుక్తం ఏర్పడేటపుడు ద్విత్వంలోని ఒక హల్లు లోపించడం పద్ధతి: ముత్యము > ముత్యము.

### 41) సంఖ్యకుం బూరణార్థమునం దవగాగమంబగు (ఆచ్ఛిక-25)

రెండవవాఁడు - రెండవది - మూఁడవవాఁడు - మూఁడవది

**సూత్రాంశం**: సంఖ్యకు పూరణార్థంగా చేరే దానిని గురించి.

**సూత్రార్థం**: సంఖ్యావాచకానికి పూరణార్థంలో 'అవక్' అనేది ఆగమంగా చేరుతుందని సూత్రార్థం.

**వ్యాఖ్య**: పూర్వపదానికి ఉత్తరపదానికి నడుమఖాళీ లేకుండా చేయటమే పూరణం. ఇది పూర్వపదానికి ఉత్తరపదానికి సంబంధాన్ని తెలియజేస్తుంది.

ఉదా॥ 'రెండు + వాఁడు' అని ఉన్నప్పుడు ఈ రెండు పదాలకు మధ్య సంబంధాన్ని బోధిస్తు 'అవ' అనేది అదనంగా చేరుతుంది. రెండు + అవ + వాఁడు = రెండవవాఁడు. ఇటువంటివే రెండవది, మూఁడవవాఁడు, మూఁడవది - మొదలైన రూపాలు.

**మాదిరి ప్రశ్నలు**

**1) ఈ క్రిందివానిలో నాలుగు సూత్రాలను సోదాహరణంగా వ్యాఖ్యానించండి.**

1) దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు
2) లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు
3) ఇఁకాదులకు దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు
4) అన్యంబులసహితమిక్కార్యంబు సహితం గానంబడియెడి
5) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బులింగ తుల్యంబులు
6) దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు
7) కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు
8) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబాగా నగు